అంతర భారతీయ పుస్తకమాల

# ఆకాశం సొంతం


రచన

రాజేంద్ర యాదవ్

అనువాదం

నిఖిలేశ్వర్





నేషనల్ బుక్ ట్రస్ట్, ఇండియా

# పరిచయం

రాజేంద్ర యాదవ్ నవల "సారా ఆకాశ్"ను పాఠకులు ఆదరించారు. సృజనాత్మక ఔన్నత్యంతోపాటు జనరంజకత్వాన్ని పొందిన రచనలు తక్కువే వుంటాయి. సృజనాత్మక ఔన్నత్యం దృష్ట్యా ఎన్నో నవలలను పేర్కొనవచ్చు. కానీ ఎక్కువ ముద్రణలు పొందినవి తక్కువే! ఆకారంలో చిన్నదైన ఈ నవల సినిమాగా రావడం కూడా జనరంజకత్వానికి కొంత కారణం!

"నయీకహానీ" ఉద్యమపరంగా బాగా పేరు తెచ్చుకున్న కథా రచయితలు 'భావుకత' (రొమాంటిసిజమ్)కు వ్యతిరేకంగా నినదించినా, భావుకతాపూర్ణమైన కథలు రచించారు. చాలా చిన్న వయసులో రాజేంద్ర యాదవ్ "సారా ఆకాశ్" లాంటి ఒక పరిపక్వమైన నవలను రచించడం ఆశ్చర్యమే! ఈ సందర్భంలో ఒక అంశాన్ని గుర్తు పెట్టుకోవాలి - "సారా ఆకాశ్"లోని నాయిక-నాయకులు (ముఖ్యమైన పాత్రలు) కూడ అపరిపక్వ ఆలోచనా స్థాయిలోని భావుకులే! కౌమారావస్థలోని భావుకులైన వ్యక్తులను సహజంగా చిత్రించాలంటే పరిపక్వమైన రచనా సామర్థ్యం వుండాలి. అయితే అపరిపక్వ వయస్సులోనే రాజేంద్ర యాదవ్ ఈ సామర్థ్యాన్ని సాధించడం ఆశ్చర్యం బహుశా సంవేదనా తీవ్రత వల్ల ఇది సాధ్యమై వుంటుంది. తీవ్రమైన సంవేదన పదును తేరినపుడు రచనా క్రమానికి ఆలోచనల తీవ్రత కూడా సమకూరుతుంది. అంతర్గతంగా సంబంధాలను సక్రమంగా పోషిస్తూ పోగలిగితే, నవలలోని ఆ తీవ్రత మిగులుతుంది. అందువల్ల పాత్రల సంఖ్య ముఖ్యంకాదు, వాటి పరస్పర సంబంధాలకే ప్రాముఖ్యత వుంటుంది. ఆ పాత్రల సమన్వయం, వాటి కోరికలు, ప్రవర్తనలతో పాటు అనుకూల-ప్రతికూల భావాల చిత్రణ జరగాలి. ఇదే ఆ పాత్రల సంబంధాల ద్వంద్వాత్మకత. దీని స్వాభావిక చిత్రణ రచనకు ఒక సరైన దిశను కలిగిస్తుంది. "సారా ఆకాశ్"ను పరిశీలిస్తుంటే అనేక అంశాలవైపు దృష్టి వెడుతుంది. వాటిలో కొన్నింటిని ఇక్కడ చర్చించుకోవచ్చు.

"సారా ఆకాశ్" రచయిత, ఈ నవల 'ప్రధానంగా నిమ్నమధ్య తరగతి

యువకుడి అస్తిత్వ సంఘర్షణకు సంబంధించిన కథ' అని సక్రమంగానే పేర్కొన్నాడు. ఈ నవల మొదటిసారి 1952లో "ప్రేత్‌బోల్తే హై" (దయ్యాలు మాట్లాడుతాయి) అనే పేరుతో వెలువడింది. 1960లో "సారా ఆకాశ్" పేరుతో ప్రచురించారు. 1952 నాటి హిందీ నవలల నేపథ్యాన్ని పరిశీలిస్తే, ఈ నవలకున్న చారిత్రక ప్రాధాన్యతను అర్థం చేసుకోగలము. ఆ రోజుల్లో - రాజకీయ కథా రచయితగా యశ్‌పాల్, మనో వైజ్ఞానిక కథా రచయితగా ఇలా చంద్రజోషి, అజ్ఞేయ్ మొ॥గు వారు ప్రసిద్ధులు. శిఖరాగ్రం అందుకున్న జైనేంద్ర క మార్ ఖ్యాతి తగ్గిపోతోంది. భగవతీ చరణ్ వర్మ నవల - "చిత్రలేఖ," పండిత్ హజారీ ప్రసాద్ ద్వివేదీ కృతి - "బాణభట్ట్‌కీ ఆత్మ కథ" మొదలగు చారిత్రక నవలలుగా ఒక కొత్త వరవడిని సృష్టించే దిశలో వున్నాయి. ఇక జైనేంద్ర తర్వాత బాగా పేరు తెచ్చుకున్న ప్రసిద్ధ నవలాకారులు యశ్‌పాల్, అమృత్‌లాల్ నాగర్, భగవతీ చరణ్ వర్మ. ప్రేమ ఇతివృత్తంగా ధర్మవీర్ భారతి నవల - "గునాహోం కా దేవతా," రామేశ్వర శుక్లా ఆంచల్ రచన - "చఢ్‌తీ ధూప్" కౌమారావస్థలోని పాఠకులను బాగా ఆకర్షించాయి. ఈ నవలల్లో టీనేజర్స్‌లోని చౌకరకమైన భావుకత్వం వున్నా, నిజమైన ప్రేమ ఎదుర్కొనే జటిలమైన సమస్యల చిత్రణ అసలే లేదు. ఈ నేపథ్యంలో పరిశీలించినపుడు "సారా ఆకాశ్" నవల మామూలు ఇంట్లోని రోజువారి జీవితంలోని ఇరుకైన పరిస్థితుల్లో వుండే ప్రేమను చిత్రించింది. ఆ కాలంలో అసలు ప్రేమకు - ఇంటి వ్యవహారాలకు సంబంధమే వుండేది కాదు రచనల్లో!

కానీ "సారా ఆకాశ్"లోని నవలా శిల్పం, సంవేదన సాధించిన అతి ముఖ్యమైన ఫలితం కుటుంబాన్ని ప్రేమను జోడించి చూపడం! ఆ కుటుంబం కూడా ఏదో ఆదర్శపూరితమైనదేమీ కాదు. ఒక నిమ్న మధ్య తరగతి కుటుంబం ఎదుర్కొనే ఆర్థిక సమస్యల నిరంతరవలయం. ఈ వలయంలోంచి పుట్టిన మంచి - చెడు మనో వికారాలు, ఆ కుటుంబ సభ్యుల ఆదర్శాలతో పాటు, నీచత్వాన్ని అందులోని కుటుంబాల నిండు యదార్థాన్ని చిత్రించడం!!

సమస్యాభరితమైన ఇతివృత్తం వున్న ఈ నవల ముఖ్యపాత్ర (నాయకుడు) సమర్ ఒక మూస నాయకుడేమీ కాదు. ఆ పాత్ర ఆ రోజుల్లో వచ్చిన హిందీ నవలా సాహిత్యంలో ఒక విభిన్న మైన కొత్త తరహా నాయకుడి పాత్ర! చాలా వరకు ఆ పాత్రను "యాంటీ హీరో" (Anti-hero)గా భావించవచ్చు. ఆ పాత్ర స్వభావరీత్యా అనేక వైరుధ్యాల పుట్ట. స్థిమితం లేకుండా, పరస్పర విరుద్ధ

మైన ప్రవర్తనలతో బతికేవాడు. ఒక మంచి నాయకుడికి వుండే గుణాలేవీ లేవు. అభద్రతా భావంతో, నిరుద్యోగిగా అందువల్లనే అస్థిరంగా బలహీనంగా ఊగిసలాడే వాడు. ఈ కొత్త రకమైన పాత్రచిత్రణ, ఆ పాత్రలోని అసందిగ్ధత, స్థిరత్వం "సారా ఆకాశ్" నవలా చట్రంలో పూర్తిగా ఇమిడి వుంది. అందువల్లనే ముఖ్యపాత్రతో పాటు ఇతివృత్తానికి సంబంధించిన అస్థిరత్వం ఈ నవలలో ఉన్నా సంవేదనతో శిల్పరీత్యా పరస్పరమైన అనుకూల అంశాలు కళాత్మకంగా ఒక పూర్ణత్వాన్ని అంతర్లీనం చేసుకోగలిగాయి.

"ఆశలకు - ఆకాంక్షలకు మధ్య, ఆర్థిక - సాంఘిక, సంస్కారపు హద్దులకు నడుమ జరిగే ఘర్షణ, గెలుపు - ఓటమిల అలసట, ప్రత్యామ్నాయాన్ని వెతికే ఆరాటమే ఈ నవల" (మరికొంత - 25 సం॥ల తర్వాత).

"సారా ఆకాశ్" (ఆకాశం సొంతం) నిండైన ఒక ప్రేమ కథ. ఆధునిక సాహిత్యంలో ప్రేమ పేరు మీద వచ్చిన కథా (నవల) - సాహిత్యమంతా సాధారణంగా ఏకపక్షంగా, అసంపూర్ణంగా మిగిలిపోయింది. దాంపత్య ప్రేమ గురించి రాసిన ఈ నవల దాంపత్య ప్రేమలేని కథలకంటే ఎంత ఆకర్షణీయంగా, ఆసక్తి కరంగా - గంభీరంగాను వుంది. కావలసినంత రస పోషణ - పరిపూర్ణతలను వ్యక్తం చేసే రచనాత్మక పరాకాష్ఠ ఇందులోనే ఇమిడి వుంది. ప్రేమ అంటే ఏదో ఒక వ్యాపారాన్ని వెలిగించే కాకరవత్తి వెలుగు కాదు. అది మానవీయమైన, సామాజిక బాధ్యతతో కూడిన ఆచరణ. "సారా ఆకాశ్" చదివితే ఇది అర్థమవుతుంది. అసలు ఒక నవల రచించడమంటే మానవీయతను, సాంఘిక, వైయక్తిక బాధ్యతను అన్వేషించే ప్రక్రియ. ఈ ప్రక్రియ ఎంత వైయక్తికమైనా, స్త్రీ-పురుషుల వ్యవహారమైనా చివరికి అది ఒక కుటుంబ పరమైన, సామాజికమైన ప్రక్రియగా మారక తప్పదు. దాంపత్య ప్రేమను గేలి చేసేవాళ్లు, ఏదో పాతకాలం నాటి గొడవ అని భావించేవాళ్లు వాస్తవంగా దాంపత్య జీవితంలోని ఎగుడు-దిగుడులను, ఆ దారిలో వుండే బాధలను అర్థం చేసుకోలేరు.

నిమ్న మధ్య తరగతి కుటుంబాలలో దాంపత్య ప్రేమ కఠినమైన అనుభవాల ద్వారానే లభిస్తుంది కాని అంత సులువుగా స్వంతంకాదు. జీవితాంతం ఇలా స్వంతం చేసుకోలేని వాళ్ళ సంఖ్య తక్కువేమీ కాదు! సంస్కారపరంగా సాంప్రదాయానుసారంగా, గుడ్డి నమ్మకాల జడత్వమే ఈ దాంపత్య ప్రేమ వైఫల్యానికి కారణం. "సారా ఆకాశ్" రచయిత రాజేంద్ర యాదవ్‌కు ఆ

సంస్కారమేమిటో బాగా తెలుసు. విలువైన అంశమేమిటంటే ఆ అమానవీయ సంస్కారాలను, సాంప్రదాయాలను, గుడ్డి నమ్మకాలను రాంజేంద్ర యాదవ్ తీవ్రంగా అసహ్యించుకుంటున్నారు. అందువల్లే ఈ నవలకు తొలుత ఆయన "ప్రేత్ బోల్తె హై" (దయ్యాలు మాట్లాడుతాయి) అని పేరు పెట్టి తన అస హ్యాన్ని వ్యక్తం చేసుకున్నారు. యాదవ్‌లో ఇప్పటికీ అసహ్యం కొనసాగు తూనే వుందని ఆయన మిత్రులకు పాఠకులకు బాగా తెలుసు. ఇప్పటికీ "హంస్" పత్రికా సంపాదకీయాలలో రాజేంద్ర యాదవ్ స్త్రీలు, దళితుల సమస్యలపై ఎంత తీవ్రంగా ఆవేదనతో ప్రతిస్పందిస్తున్నారో మనకు తెలు సు. ఆ ఆవేదనకు మూలం "సారా ఆకాశ్"లో వుంది. ఈ నవల స్త్రీవాద రచన కాదు - కానీ స్త్రీవాదాన్ని తర్కించే రచనగా తీసుకోక తప్పదు.

ఈ నవలలోని అసలు ప్రేమ కథ - పరిస్థితులు ఇందులోని పాత్రలకు ప్రేమించుకునే అవకాశాన్ని ఇవ్వవు, పైగా ప్రేమకు వ్యతిరేక దిశలోకి నెట్టే ప్రయత్నం చేస్తాయి. ప్రేమను పాషాణంలాంటి పరిస్థితుల మధ్య పెట్టడమే ఈ నవలలోని శిల్పం సాధించిన చాతుర్యం. ఆ ప్రేమ అనే బీజాంకురంపై కొండలోని రాతి పలకలు వున్నాయి. వాటిని ఛేదించుకుని అది మొలకెత్తాలి. ఈ నవలలో చాలా దూరందాకా అసలు ప్రేమ వ్యవహారమే కనపడదు. ఏమైనా కనపడుతున్నదంటే వ్యతిరేక దిశలోకి తీసుకెళ్ళిపోయే పరిస్థితులు, కొండరాతి పలకలు, సమర్ మొండి పట్టుదల, కోపం, చిరాకు, ఆరాటమే! వీటిలోనే ఆ ప్రేమదాగిపోయి మిగిలివుంటుంది, వికసిస్తూపోతుంది. "సారా ఆకాశ్"లోని ప్రేమ భావం వాస్తవికమైనది. అది అనుకూలమైన పరిస్థితుల కంటే ప్రతికూల పరిస్థితుల్లోనే సురక్షితంగా వుంటుంది. ఎంతగా అణచిపె డితే అంతగా అది వికసిస్తూ అంతిమంగా వ్యక్తమవుతుంది.

ఒక దిగువ మధ్య తరగతికి చెందిన నిండు కుటుంబంలో బి.ఏ. చదు వుతూ, నిరుద్యోగిగా వున్న సమర్ అనే యువకుడికి వివాహం జరిగింది. అతని దాంపత్య ప్రేమే ఇతివృత్తం ఈ నవలకు! సమర్ రాష్ట్రీయ స్వయం సేవక్ సంఘ్ (ఆర్.ఎస్.ఎస్.) సభ్యుడి పురాతన ఆదర్శాలను మొండిగా నమ్మి, బహుశా బ్రహ్మచారిగా జీవితాంతం గడపాలనే ఒక ఆదర్శ యువ కుడి కథ. అతను దేశం కోసం సర్వస్వం త్యాగం చేయాలనుకుంటాడు. బల వంతంగా అతనికి ప్రభ అనే అమ్మాయితో వివాహం జరిగిపోతుంది. ఆ పెద్ద కుటుంబంలో వున్న ఇతర వ్యక్తులు - రిటైర్‌కాగా, నెలసరి ఇరవై ఐదు రూపాయిల

పెన్షన్ పొందుతున్న తండ్రి ఇంకా తల్లి, క్లర్కుగా పనిచేస్తున్న అన్న, వదిన, వాళ్ల పిల్లలు, భర్త పీడితురాలైన చెల్లెలు మున్నీ! ఈ "సారా ఆకాశ్" నవలలో మున్నీ (భర్తచేత హింసించబడిన యువతి) పాత్ర ఈ కథకు ఒక గాఢమైన అంతరార్థాన్ని కలిగించింది. నిమ్న మధ్య తరగతి హిందూ కుటుంబంలో వుండే పుచ్చిపోయిన డాంబికాలు, మర్యాదల భేషజాలను అనేక పార్శ్వాలలో బహిర్గతపరుస్తూ ఈ నవల ఆ కుటుంబంలోని వ్యక్తుల దయనీయతను, మూర్ఖ వివశత్వాన్ని చిత్రించింది. ఇలాంటి కుటుంబంలో వుంటూ ఆజన్మ బ్రహ్మచారిగా వుంటానని శపథం చేసిన సమర్‌కు ప్రభతో వివాహం జరిగిపోయింది.

కొత్తగా పెళ్లి చేసుకున్న కౌమారావస్థలోని ఆ భార్యభర్తలు, సహజంగానే పరస్పరం ప్రేమించుకోవడం, సమర్పించుకోడం న్యాయం. కానీ ఆ ప్రేమ వాళ్ళకు లభించదు. అలా ఎందుకో ప్రేమ వంచితులవుతారు వాళ్ళు? ఆ కారణాలను అన్వేషిస్తూ చిత్రించే క్రమం "సారా ఆకాశ్"లో వుంది కాబట్టి అంతగా జనరంజకం కాగలిగింది.

సమర్ అసలు వివాహం చేసుకోకుండా, చదువు కొనసాగించాలనుకుంటాడు. బ్రహ్మచారిగానే జీవితాన్ని గడపాలని కోరిక -"ఈ కుర్రాడికి ఆ రోజు శోభనం అనే విషయం ప్రపంచానికంతా తెలిసిపోయింది. 'దేశానికి సాహసవంతులు, కర్మవీరులైన యువకుల అవసరం వుందని' నినాదం ఇచ్చిన ఆ యువకుడే మంచంగా మారిపోయాడు. గాలి వానకూడా అడ్డు పెట్టలేకపోయిన సమర్ గత రెండు వారాల నుంచి 'శాఖ'కు హాజరు కాలేదంటే ఎవరైనా నమ్ముతారా?" సమర్ వివాహం ఒక ఆటంకమని భావిస్తాడు. అతను హనుమంతుడు, భీష్మపితామహ మార్గంలో పయనించాలనుకుంటాడు. ద్వైదీభావ మానసిక స్థితిలోనే అతను శోభనం రాత్రి తన సంకల్పం ఏమిట్లో తిరిగి చెప్పుకుంటాడు. "అవును, ఈ ఆటంకాలను - కష్టాలను తొక్కుతు వెళ్ళిపోతాను. ఆజన్మ బ్రహ్మచారిగా వుండాలనే ప్రతిజ్ఞను నేను ఈ రోజున కూడా దృఢంగా పాటిస్తాను."

దిగువ మధ్య తరగతితో పాటు అసలు మధ్య తరగతికి చెందిన హిందూ యువకులు తెలివిరాగానే బ్రహ్మ చర్య సంకల్పాన్ని పొందే ఆనవాయితి ఆ రోజుల్లో వుండేది. బ్రహ్మచర్యమనే ఉపద్రవం చాలా కాలం దాకా కొంత అతి వ్యాప్తిలోనే వుండేది. గాంధీగారు కూడా ఆరుసార్లు బ్రహ్మచర్య సంకల్పాన్ని భగ్నం చేసుకున్నారని కస్తూర్‌బానే చెప్పింది. ఈ నవల అలాంటి ఒక బ్రహ్మ

చారి శోభసం రాత్రితో మొదలవుతుంది. వయస్కుడైన బ్రహ్మచారి రాత్రంతా తనతో పోరాడుతాడు - దినమంతా ఇతరులతో...!

కుర్ర చేష్టతో కూడిన ద్వైదీభావాన్ని రాజేంద్ర యాదవ్ సహజంగా చిత్రించాడు. సమర్ మొండితనంలోని మనస్సుకు వున్న బలహీనతలు మధ్య మధ్యలో తళుక్కున మెరుస్తాయి. ఈ బలహీనత సమర్ పక్షాన ఉపయోగపడేదే! ఇదే అతని సహజమైన వ్యక్తిత్వాన్ని వికసింపచేస్తుంది. అతని అతివాదాన్ని, అంగవైకల్యంలాంటి వ్యక్తిత్వాన్ని చక్కదిద్దుతూ వుంటుంది. అతని కుర్రతనపు మొండి వ్యవహారాన్ని, ప్రభ సమక్షంలో కలిగే వొత్తిడిని, రాజేంద్ర యాదవ్ ఈ నవలలో నాటకీయ స్వగతం, సంభాషణ (సంవాదం)ల శైలీ రూపంలో ఎంతో సిద్ధహస్తుడిగా తీర్చిదిద్దాడు. ఒక విధంగా తీవ్ర ద్వంద్వాత్మ కతను వ్యక్తం చేసే స్వగతం, రెండు పాత్రల మధ్య సాగే సామాన్యమైన సంవాదానికంటే తరచుగా ఎక్కువ ప్రభావాన్ని కలిగిస్తుంది.

"సారా ఆకాశ్"లోని ఈ స్వగతం ఏకాలాపం కాదు, ఒకే వ్యక్తిలోని రెండు మానసిక స్థితుల-సంవాదం. అందులోని ప్రత్యేకత, ఒక బలం ఏమిటంటే - కుటుంబపరమైన, సామాజికమైన, ఆర్థిక పరిస్థితులు అల్లుకునిపోడం...! ఒక మనస్సు దృఢంగా ఇలా అంటుంది - "నేను ఈ రోజు కూడా దృఢంగానే వున్నాను. ఆ జన్మ బ్రహ్మచారిగా వుండాలనే ప్రతిజ్ఞను తప్పలేదు." రెండో మనస్సు అంటుంది - "ఏమిటండీ, భార్య ఎప్పటికీ ఆటంకంగా వుంటుందా? రాముడి శక్తిని సీత నుంచి విడదీయగలమా? రాజస్థాన్‌లోని క్షాత్రాణులు స్వయంగానే తమ భర్తలను యుద్ధ రంగానికి పంపించలేదా?" అయితే ఇది ఆర్.ఎస్.ఎస్. సభ్యుడైన ఆ కిషోరావస్థలోని యువకుడు ద్వైదీభావం. భ్రమ వశాత్తు ఏదో అదంతా ఒక బలాహీనతగా భావించే సహజమైన మానసిక ప్రవృత్తి కాదు. అదే ఒక విధంగా జీవితాన్ని సార్థకం చేసే రాగాత్మక సారాంశం. ఈ సారాంశమే మౌనంగా వుంటూ, కథా ఇతివృత్తాన్ని సమర్ చేతనపై వ్యాపించిన అంశాన్ని జోడిస్తూ నడిపించింది. చివరికి సరైన స్థానానికే చేరవేసింది.

"ప్రభ ఆకుపచ్చ గాజుల చేయి" అనే ఈ వర్ణన మొట్టమొదట కథలో అసలు ఎలాంటి ప్రాముఖ్యత లేని విధంగా ప్రవేశిస్తుంది. ఉపేక్షించగలిగే ప్రతీకలా అనిపిస్తుంది. సరిగ్గా పాణిగ్రహణం నాటి ప్రతీక - వివాహ మండపం లోంచి పారిపోవాలనుకునే సమర్‌కు, ఆ జ్ఞాపకమే వెంటాడుతూ పోవడం.

బంధించి వేయాలనే ప్రయత్నాలనుంచి రక్షించు కోవాలనే ఉపాయం, - "నా కాళ్ళకు రాళ్లు కట్టి వేయవద్దు - తన పిడికిలిలో పిండివేయబడుతున్న ఆకుపచ్చ గాజుల ఆ చెయ్యి - పిండి ముద్దను అదే చేతిలో పట్టు కొని, మాట్లాడకుండా కూచున్న అతనిలోంచి అప్పుడప్పుడు వస్తున్న ఆ రెండు చప్పుళ్ళను వింటున్నాడు... ఇప్పటికీ సమయం వుంది, లే... పారిపో!"

కుటుంబమంటే ఏమిటి? ఒక కారాగారం. అందులో చిక్కుకున్న వాళ్లు నేరస్థుల్లా జీవితాన్ని గడుపుతున్నారు. అది వాళ్ళ నేరం కాదు. ఆ వర్గంలో పుట్టడమే వాళ్లు చేసిన నేరం. గుడ్డి నమ్మకాలు, పనికిరాని ఆచారాలు, డాంబికాలు వాళ్ళను మరింతగా బిగిస్తాయి. ఆ కారాగారంలో నుంచి వచ్చేసే మార్గమేది లేదు. వాళ్ళంతా నిరపరాధులే. నిమ్న మధ్య తరగతి పరిస్థితులే వాళ్ళ శారీరక, మానసిక ఆరోగ్యాన్ని కబళించివేసాయి. వాళ్ళందరూ పర స్పరం ఏదరించు కుంటారు. కొట్లాడుతారు, తిట్టుకుంటారు. అప్పుడప్పుడు అపరాధ భావానికి బలైపోతారు. సాంప్రదాయాల గుడ్డి ఆచారాలను మోస్తూ వుంటారు. వాటిని విదిలించుకొని పారేసి బరువును దించుకోవాలనుకోరు!

ఈ కుటుంబంలోనే సమర్ చెల్లెలు మున్నీ ఒక వివాహితగా. ఏదో కరుణా పూరిత అపస్వరంలా వుంటున్నది. ప్రభకు సానుభూతి చూపే పాత్ర రూపంలో మున్నీని రాజేంద్ర యాదవ్ ఎంతో ఆర్ద్రతతో చిత్రించాడు. ఆమె పరిస్థితి ప్రభ కంటే ఎన్నో విధాలా అధ్వాన్నమైంది. ఆమె (మున్నీ) భర్త జులాయిగా తిరుగుతూ, తిరుగుతూ జూదమాడుతూ. మున్నీనీ అనేక విధాలా హింసించేవాడు. అందువల్ల ఆమె తల్లిగారింట్లోనే వుండిపోయింది. కొంత కాలానికి భర్త వచ్చి మున్నీని రమ్మంటాడు. కానీ మున్నీ వెళ్ళనంటుంది. సమీర్ తండ్రి తన పరువు ప్రతిష్ఠల సమస్యగా భావించి మున్నీని ఆ రాక్షసుడైన భర్తతో పంపించేస్తాడు. మున్నీ వీడ్కోలు దృశ్యం - ఆవును కసాయివాడికి అప్పగించే దృశ్యం. అంతకంటే దయనీయమైనదేమిటంటే, ఆవుకు తన భవిష్యత్తు ఏమిటో తెలియకపోవడం! ఆ కసాయి భర్త జీవితాంతం ఇక ముందు పీడించడని, ప్రేమగా చూసుకొని, భద్రత కలిగిస్తాడని మున్నీ తల్లితండ్రులాశిస్తారు. కానీ కసాయివాడి నుంచి అలాంటి దయను ఆవును అమ్మేవాడెవడూ ఆశించడు.

ఇక్కడే మరో వైరుధ్యాన్ని అర్థం చేసుకోవాలి. మున్నీ తల్లిగారిల్లు ఆమె భర్త నీచత్వం వల్ల ఎంతగానో దుఃఖిస్తూ వుంది. అదే ప్రభకు అత్తవారి ఇల్లు.

తమ కూతురుపై జరుగుతున్న దౌర్జన్యాన్ని భరించే కుటుంబమే, మరొకరి కూతురైన ప్రభపట్ల దౌర్జన్యంగా ప్రవర్తిస్తుంది. క్రూరుడికి బలైపోయేవాడు దౌర్జన్యాన్ని అసహ్యించుకోడు. పైగా తానే స్వయంగా క్రూరుడిగా మారిపోతాడు. ఇది కూడా ఒక అనవాయితి.

"సారా ఆకాశ్"లోని ప్రధానమైన రచనాత్మక శక్తి నిమ్న మధ్య తరగతి కుటుంబం చుట్టూ అల్లిన చిత్రణ. తండ్రి ఎంత కోపిష్ఠిగా కనపడతాడో అంతే బాధను అనుభవిస్తూ వుంటాడు. ఆయన సాంప్రదాయం (పరంపర) ఆచారమనే పేరుమీద తన పిల్లలకు అపకారమే చేస్తాడు. కానీ ఆయనే ఆ కుటుంబంలో మరీ నిస్సహాయుడు, అందరికంటే బాధాతప్తుడు. సమర్‌ను తాను కొట్టినపుడు ఆయన ఎంత అసహాయుడో వ్యక్తమవుతుంది. సమర్ అన్న జీవితం నీరసంగా, యాంత్రికంగా సాగిపోయేది. దానికి ప్రతీక ఆయన పాత సైకిలు. సమర్ తల్లి అత్తగా, ఒకనాటి కోడలుగా తన పరిధిని దాటి రాలేదు. ఇక ఈ నవలలో కాస్త ఆసక్తిని కలిగించే పాత్ర సమర్ వదిన. ఆర్థికంగా ఎన్నో ఇబ్బందుల్లో సాగే ఆ కుటుంబంలో ఆమె చిన్న చిన్న మోసాలు, కుట్రలు పన్ని, తగాదాలు పెట్టి తమాషా చూస్తూ వుంటుంది. ఇందులో అందరూ అసహాయులే - వదిన మరీ దయనీయమైన వ్యక్తి - ఎవరూ చెడ్డవారు కాదు. ఈ విషాధగాధలో ఎవ్వరూ విలన్‌లు కాదు. ఈ వ్యవస్థ - పనికిరాని ఆచారాలు మాత్రమే విలన్‌లు. వరకట్న సమస్య, నిరుద్యోగం, సెక్స్ పరమైన భయాలు, స్త్రీలను పీడించడం - ఒకే వ్యక్తి అబ్బాయి తండ్రిగా పరపీడకుడిగా కనపడితే, అతనే అమ్మాయి తండ్రిగా పీడితుడు. పీడించేవాడు - పీడితుడు ఒకే యాతనకు లోనవుతూ ఆత్మముగ్ధులు కావడం ఇందులో ప్రత్యేకత! శాశ్వతమనుకుంటున్న సనాతన ఆచార వ్యవహారాల పట్ల వాళ్ళకు నమ్మకం - ఇదే క్రమంగా వాళ్ళను పతనంవైపు నెట్టడం తప్ప ఉద్ధరించుకునే అవకాశం కనపడదు. ప్రభ, సమీర్ ఈ చీకటి గుయ్యారంలోంచి బయటపడాలని ప్రయత్నిస్తారు. ఒక విధంగా వాళ్ల మొండితనం కూడా ఈ వ్యవస్థ ఇచ్చినదే! ప్రతికూల పరిస్థితులను అధిగమించే దాంపత్య సంవేదనకు అపారమైన విశ్వాసాన్ని కలిగించే లక్షణం - ఈ నవలలో వుంది. అదే రాజేంద్ర యాదవ్ ప్రతిభ. పరిస్థితులు ఎంత ఘోరంగా వున్నా, మానవీయ సంబంధాలు వాటితో పోరాడే సవాలును స్వీకరించగలవు!

దాంపత్య సంబంధాలను గుర్తించి, చిత్రించే ఆ నవలా ప్రక్రియలో

ఎలాంటి తొందరపాటు లేదు. ఈ రచనలోని నడకలో సహజత్వం వుంది. కావాలని ఆదర్శవాదాన్నో లేదా సంస్కరణవాదాన్నో చొప్పించే ప్రయత్నం ఎక్కడా లేదు.

**"ఆకాశం సొంతం"** (సారా ఆకాశ్) మొదటి అధ్యాయంలోని చివరి అంశం ఎంతో హృదయస్పర్శిగా సాగింది. హృదయాన్ని కదిలించే ఆ ఘట్టాన్ని ఎంతో క్లిష్టంగా రూపొందించడం జరిగింది. అంతకు పూర్వమే వున్న పరిస్థితుల ఘర్షణ వల్లనే ఆ విధమైన ఆర్ద్రత రాగలిగింది. మానసికమైన, బాహ్యమైన అనేక బాధలను - పరిస్థితులను అధిగమించి ఆ సన్నివేశానికి చేరుకొంది. అందువల్లే అది విశ్వసనీయమైనది - ఆర్ద్రమైనది. ప్రభపట్ల సమర్ మొండి ప్రవర్తన ఒక రకమైన క్రూరచేష్ట! గత చరిత్ర పట్ల ప్రేమ, మహా పురుషుల పట్ల అతి శ్రద్ధాభక్తులు అతని అపరిపక్వమైన ఆదర్శవాదానికి గుర్తు! కౌమారావస్థలోని భావకత్వంతో ఏదో చేయాలని ఒక ఆదుర్దా - ఆవేశం వాస్తవ పరిస్థితులు ఎదురు దెబ్బలు తింటూ హాస్యాస్పదమైన దయనీయ స్థితికి వస్తుంది. సమర్ - ప్రభల పరస్పర ఆకర్షణాభావం ప్రచ్ఛన్న రూపంలో వుంది. అది బహుశా సాంప్రదాయబద్ధమైన మర్యాద. భార్యాభర్తల పరస్పర సమర్పిత భావంపై ఆధారపడి వుండొచ్చు. ఎంతో మొండితనం, పురుష క్రూరత్వం వున్నా ప్రభ తనదేననే భావం సమర్‌లో వుంది. శీలానికి సంబంధించిన ఎలాంటి దోషం సమర్‌లో లేకపోవడం కూడా చాలా ముఖ్యమైన అంశం. అందువల్లనే "సారా ఆకాశ్"లో, సమర్-ప్రభల సంబంధాల పర్యవసనానికి తొలుతనే బీజాలు వున్నాయి. ఆ విధంగా ఈ నవల హేతుబద్ధంగా ఒక స్వయం ప్రతిపత్తితో - అంతర్ నిర్మాణంతో సాగింది. బాహ్య కారణాలపై ఈ రచనా వికాసం ఆధారపడిలేదు. సమర్-ప్రభలకు తమ అహంకారం - మొండితనం వల్లనే పరస్పరం నిర్లక్ష్యం చేసుకుంటున్నామనే తెలుసు. ఆ నిర్లక్ష్యం లేదా ఉపేక్షాభావం, మొండి తనంలోనే ఆత్మీయత ఇమిడి వుంది. సమర్‌ను ప్రభ మెచ్చుకోవడం, తాను తప్పు చేసాననే గ్రహింపు సమర్‌లో వుండడం - ఈ నవలలోని ఇతివృత్తంలో ఒక అతి ముఖ్యమైన గమ్యం. మూర్ఖత్వాన్ని గ్రహించడమంటే సమర్ మాటల్లోనే - "అసలు నా ప్రవర్తనంతా పొరబాటే కాదు మూర్ఖత్వమే!"

సమర్ -ప్రభల వివాహం మధ్యవర్తుల ద్వారానే కుదిరింది. ఇలాంటి వివాహాల్లో అపరిచితులైన ఇద్దరు వ్యక్తులు భార్యాభర్తలుగా కలవగానే, వారి

ధరి వ్యక్తిత్వాల మేకులు గుచ్చుకోవడం ప్రారంభిస్తాయి. నిరాలా (ప్రఖ్యాత హిందీకవి) తన రచన "కుల్లీ భాట్"లో తన శోభనం నాటి రాత్రిని ఎంతో మనోరంజకంగా వర్ణించారు. దాదాపు సమర్-ప్రభల కలయిక కూడా అలాం టిదే! అబ్బాయి పెళ్ళికూతురును స్వీకరించాలకుంటూనే తన అహంకారాన్ని నిలుపుకోవాలని చూస్తాడు. అమ్మాయి పెళ్ళి కొడుకుకు సమర్పించుకోవాల నుకుంటుంది కానీ అందులో ఆమె ఆత్మ గౌరవాన్ని - వ్యక్తిత్వాన్ని అబ్బాయి గమనించాలి. పెళ్ళి కొడుకు తనను బుజ్జగించి, తియ్యతియ్యని మాటలు చెప్పాలి. కానీ ఇదంతా మొండి పట్టుదల - నటన - అహంకారాలతో సాధ్య మయ్యేది కాదు. ప్రభ సమర్పించుకోవాలనుకున్న సమర్ ఎదుట మోకరిల్లి కాదు. తనను తాను సమర్‌పై రుద్దాలనుకోదు. సమర్ చదువు కోవాలను కుంటే తాను అతని దారిలో ఆటంకం కాదలుచుకోలేదు. ప్రభ వ్యక్తిత్వాన్ని సమర్, అహంకారంగా అర్థం చేసుకుంటాడు. అతను స్త్రీ సహజమైన ఆత్మ గౌరవాన్ని పట్టించుకోడు. ఈ ఆత్మగౌరవం అనేది సమర్పించుకోవాలనే కోరి కున్నా, ఒక నిగ్రహం లాంటిది. ఇక సమర్‌లోని మొండిపట్టుదల (అహం) అవాస్తవమైనది. ప్రభ పట్ల వున్న ఆత్మీయతయే అతని వాస్తవికత.

ఒక విధంగా అవాస్తవిక - వాస్తవికతల మధ్య వున్న ద్వంద్వమే (వైరు ధ్యమే) "సారా ఆకాశ్" కథ ఇతివృత్తం అని చెప్పాలి. ఈ రకమైన ద్వంద్వమే ఈ నవలలో సమయోచితంగా చోటుచేసుకున్నది. ఈ అవాస్తవికత, యథా ర్థంలోకి పరిణమించే క్రమంలోనే నిమ్న మధ్య తరగతికి సంబంధించిన ఆర్థిక, సాంస్కృతిక, సాంఘిక స్థితిగతులను అల్లడం జరిగింది. ఒక ప్రేమ గాథలో జీవితంలోని విషమ పరిస్థితులను ఏ విధంగా సహజంగా అల్లవ చ్చునో ఈ "సారా ఆకాశ్" స్వాతంత్ర్య అనంతర కథా సాహిత్యానికి నిదర్శనం.

"సారా ఆకాశ్"లోని మరో ప్రత్యేకతను పేర్కొనడం కూడా అవసరం. అవగాహన చేసుకునే క్రమాన్ని ఇంత శక్తి వంతంగా చిత్రించే నవలల సంఖ్య చాలా తక్కువే! అహంకరించడం, తన గొప్పదనాన్ని చాటుకోవడం, నిర్లక్ష్యం చేయడం, ఆత్మ క్షోభ మొదలగునవి అన్నీ సమర్ మాటల్లోనే చెప్పాలంటే "మూర్ఖత్వం" మాత్రమే! అదే క్రమక్రమంగా అర్థం చేసుకోవడంలో ప్రస్ఫు టితమవుతుంది. ఈ అవగాహన కుదరగానే నవదంపతుల ఆత్మీయత, అన్యోన్యత పరస్పర సమర్పణలోకి పరిణమిస్తుంది.

-విశ్వనాథ్ త్రిపాఠి

# ఒకటి

తాళ-లయలేవీ లేకుండా 'ధమాధమ్' వాయిస్తున్న ఢోలక్, పాడుతున్న ఆడ వాళ్లకీచు గొంతులు హఠాత్తుగా ఆగిపోయాయి. ఏమైందీ? ఏమైందీ? అంటూ ఆడ వాళ్లు-పిల్లలందరూ వీధుల్లోంచి ఇళ్ల కిటికీల దగ్గర - ముందు భాగాల్లో గుమికూడారు. కింద గేటు దగ్గర నడుం ఊపుతూ, చప్పట్లు చరుస్తున్న కొజ్జాలు "అయే...జియో...జియోరే లాలా" అనే ఆలాపన మానేసి, నోళ్ళు తెరచి తలల్ని నిక్కించి పైకి చూస్తున్నారు.

వీధి చివర, సరిగ్గా మా ఇంటికెదురుగా వున్న సామ్యేల్ కోడలు కిరస నాయిలు చల్లుకొని, నిప్పంటించుకొని తన గదిలో చచ్చిపోయింది... పొగ సుళ్ళు తిరుగుతుంటే జనం రక్షించాలని పరిగెత్తారు కానీ మూసి వున్న కిటి కీలను విరగ్గొట్టేలోగా, ఆమె ప్రాణాలు గాలిలో కలసి పోయాయి. అయ్యో! ఇలాంటి శుభ ఘడియలో ఇదంతా జరగాలా? ఏదో అరిష్టం జరుగుతుందనే అనుమానంతో అందరి గుండెలు కొట్టుకోసాగాయి. కేకలు - అరుపులు, అటు ఇటూ పరిగెత్తుతున్న చప్పుడు వింటూవుంటే భూకంపం వచ్చినట్టు అనిపించింది.

నన్ను నేను లక్షసార్లు నమ్మించుకోవాలని ప్రయత్నించాను; అయినా ఈ రోజే నా శోభనం రాత్రి అని నమ్మలేకపోతున్నాను.

కుళ్లిన చెత్తాచెదారంతో మురికి - ఇరుకైన ఆ సందులో ఆడవాళ్ల ఏడ్పు లు-పెడ బొబ్బలు చాలా సేపు నా వెనకాలే వినపడుతూ వుండిపోయాయి. ఆ గందర గోళం లోంచి తప్పించుకొని పారిపోయొచ్చాను. నా వెనకాల వినపడుతున్న స్వరాలు అసలు ఆనందంతో పాడుతున్న పెళ్ళిపాటలా లేదా ఎవరో కాలి చచ్చిన వాళ్ల గురించి ఏడ్పులా అనే తేడాను గమనించే స్థితిలో నేను లేను... బహుశా ఆ తేడాను గమనించే తీరిక కూడా లేదు నాకు...

ఈ రోజే నా శోభనం రాత్రి అని లోకమంతా తెలుసుకొంది. "దేశానికి సాహసవంతులైన, కర్మ వీరులైన యువకులు కావాలి" - అని నినాదం ఇచ్చే ఈ యువకుడు కూడా ఇప్పుడు నాలుగు కాళ్ల జంతువైపోయాడు.

పెద్ద గాలి - వానలో కూడా ఆగనివాడు. ఆ సమర్ రెండు వారాల

నుంచి 'శాఖ'కు వెళ్లకుండా, తన స్నేహితుల కళ్లు కప్పి తప్పించుకు తిరు గుతున్నాడంటే, ఎవరైనా నమ్ముతారా? ఈ వేళ అతిధుల్ని, మిత్రుల్ని, పరిచితులు, అపరిచితుల్ని - అందరినీ, వేలెత్తి చూపుతున్న ఆ కళ్లని తప్పించుకుంటూ - తప్పు కుంటూ ఆ చిన్నచిన్న సందుల గుండా దేవాలయానికి వెడుతున్నా డంటే నమ్ముతారా? కొన్ని క్షణాలైనా ప్రశాంతంగా కూచుని, జరిగిన ఇంత పెద్ద మార్పు గురించి ఆలోచించే చోటు ఇదేగా, ఆ తర్వాత ఆలస్యంగా రాత్రికే ఇంటికే వెడతాడు. అప్పటికి ఆ ఏడ్పులు - అరుపులన్నీ సద్దుమణు గుతాయి. అయినా ఆ మాటలు వెంటాడుతూనే వున్నాయి.

" అరే తీసుకోండి... తీసుకోండి... మరొకటి తాగండి ఠాకూర్ సాబ్! మీ రెండో కొడుకు పెళ్లి - మీరేమో ఇంత బద్ధకంగా వున్నారేమిటి? కాని మిత్ర మా, మీ వియ్యంకుడు మాత్రం అదోలా ... అయితే ఠాకూర్ సాబ్, మీ ఇళ్లల్లో జరిగే పెళ్లికి దేశీ సరుకేనా తాగించేది? ఈ దినమైనా ఫారిన్..."

భగ్గున మండుతున్న ముఖం ... మెతకబడిన కళ్లు ... ఆవిరి నిండిన సారాయి శ్వాస ... కింద కూచున్న నాన్నగారు తలపాగ సర్దుకుంటూ గర్జిస్తు న్నారు, "మాకు మోసం జరిగింది...!"

"లేవండీ ... లేవండీ ... సప్తపది జరగబోతోంది. పడుకోవాలని వుంటే వెళ్ళి విడిది ఇంట్లో పడుకోండి ... ఇక్కడే పడి వున్నారేమిటి? శరీరంపై స్పృహ లేదు, దుస్తులపై ధ్యాస లేదు... ఏమనుకుంటారు ఇలాంటి పెళ్లి వాళ్లను తీసుకొచ్చారని ... లేవండి ... లేవండి..."

"చూడు ... చూడు ... దాన్ని చూసావా, అమ్మాయి తల్లి వెనకాలే వుంది చూడు ... పెద్ద కొప్పు కట్టింది... చెవులకు తెల్లటి పూవులాటి రాళ్లు. మిత్రమా - ఏమి కళ్లు అవి - నా శవాన్ని ఇక్కడి నుంచి మోయాల్సిందే!"

"హాఁ చెప్పు, బావి ధర్మ సత్రం ఏది కట్టించినా నీ సలహా ప్రకారమే కట్టిస్తాను - ఆ తర్వాత అమ్మాయి ప్రమాణం చేస్తూ..."

'తూ - తూ - తూ...' శహనాయి. 'కిడింగ్ - కిడింగ్' నగాడా. మేలతాళా లతో మారుమోగింది.

పారిపో - పారిపో... ఈ జంజాటం నుంచి దూరంగా పారిపో - నా లోపల నుంచి ఎవరో ఒకటే గోల. అక్కడెవరో తెలిసిన కుర్రాడిలా వున్నాడు. ముఖం చాటేసుకుని పారిపో - కనపడితే రెండు గంటలదాకా వదలడు. వెధవ జోక్స్ వేస్తాడు. "పెళ్ళాం ఎలా వుంది?" మిఠాయి తినిపించు... 'పెళ్ళికి

తీసుకెళ్ళ లేదేమిటి?'... పారిపో!

ఏమిటిలా మొదలైంది భారంగా జీవితం! అన్నీ వదిలేసి దూరంగా తెలియని చోటికి పారిపోవాలనిపిస్తున్నది. మరుసటి రోజు పత్రికలో ప్రకటన వెలువడుతుంది - 'కొడుకా, మీ అమ్మ ఆరోగ్యం బాగుండలేదు. నీ పట్ల ఎలాంటి ఫిర్యాదు లేదు.' చుట్టుపక్కల ఎక్కడా సందడి లేదు. ఏదో భారీ ట్రక్ వచ్చి మెత్తని ఇసుక వున్న చోట దిగబడిపోయినట్టు అనిపిస్తున్నది. - ఇంజన్ ధూధూ అని చప్పుడు చేస్తున్నా, చక్రాలు గర్ర్ గర్ర్‌మంటూ అక్కడే తిరుగుతున్నా ట్రక్ మాత్రం అక్కడే నిలుచుంది. కొండల్లాంటి కొంగలు ఆకాశమంతా పరుచుకున్నాయి. ఏమీ కనపడదు, దిక్కులన్నీ తప్పిపోయాయి. శక్తి ఉడిగిపోయింది. ఊపిరి ఆడని స్థితి గుండె గాబరా గాబరాగా - వాతావరణం నిండా వ్యాపించిన దుమ్ము - ధూళి - కదలని దుమ్ము...!

గోధూళి వేళ గడచిపోగానే నలువైపులా పొగమంచు వ్యాపించి పోయింది. దేవాలయ స్తంభానికి తల అనించి కూచున్నాను - తలంతా ఎంతో భారంగా! పాలరాతి తెలుపు నలుపు ముక్కలతో చదరంగం ఆవరణ నిండా, మూల విగ్రహానికి ఎదురుగా వున్న ముఖ ద్వారందాకా నిలుచున్న స్తంభాలు - వాటిపై ఆనిన విశాలమైన బరువైన హాలు - నట్ట నడుమ విగ్రహానికి ఎదురుగా మంజీరా, మృదంగం, హార్మోనియం, సితార్ మొదలైన వాటిని వాయిస్తూ పాడుతున్న భక్తులు - 'మేరే తో గిరిధర్ గోపాల్...! మేరే తో గిరిధర్ గోపాల్ అంటూ ఆలపిస్తున్న కంఠాలు - చుట్టూ మరికొంత మంది భక్తుల జేజేలు - జై బన్సూరివాలేకీ - నంద్‌కీ లాలేకీ - నమామి భక్తవత్సలమ్ -' ప్రతిధ్వనిస్తున్న సంధ్యా సమయం. గుగ్గిలం - అగరవత్తుల సుగంధం - మసక వెలుతురు ఎవరైనా చెప్పండి, నేనేం చెయ్యాలి?

స్తంభానికి ఆనుకొని బయటి మెట్లపై కూచున్నాను. నాలో పారిపోయే ధైర్యమన్నా లేదు. అప్పుడే పదిహేను రోజుల పాటు ఏ కలకత్తా - బొంబాయి, పూనా - హరిద్వార్‌కో - మరెక్కడికో పారిపోయి వుంటే ఇదంతా జరిగి వుండేదా? అప్పుడేమో అలా ఏడుస్తూ భయపడుతూ వుండిపోయాను - 'నా కాళ్లకు విస్కురాళ్లు కట్టకండి? (సమానార్థకం - ముందు కాళ్లకు బంధాలు వేయకండి) - పిడికిట్లో నలిపేస్తున్న ఆకుపచ్చ గాజులున్న చేయి, పిండిముద్దను పట్టుకొని మౌనంగా కూచుని, లోపలి నుంచి క్రమంగా వస్తున్న రెండు పిలుపులు వింటూ వుండిపోయాను... 'ఇంకా సమయం వుంది. లే - పారిపో!'-

'ఓ భగవంతుడా, ఎవ్వరినో నా గొంతుకు కట్టేస్తున్నారు...!' మసక మసగ్గా వున్న మంటల చుట్టూ తడబడే కాళ్లతో సప్తపదిని కొలిచిన తర్వాత... పురోహితుడు ఏవో మంత్రాలు చెబుతున్నాడు... జ్ఞాపకం వస్తున్నాయి - ఇదే విధంగా పురోహితుడు అని వుంటాడు - 'జాగ్రత్త...' అప్పుడే బహుశా ఆ మాటని హెచ్చరికగా భావించి సమర్థ గురు రామదాసు మండపాన్ని వదిలేసి లేచి పారిపోయి వుంటాడు!

'ఇప్పుడిక కోడలు రావలసిందే ... పెద్దబ్బాయి పెళ్లి జరిగి ఎనిమిది సంవత్సరాలు గడచిపోయాయి.' చుట్టాలు పక్కాలు అనేవాళ్లు ఇక అమ్మ రోజూ నచ్చ చెబుతుండేది, 'చిన్న కోడలు ఈ ఇంటి గడపపై కాలు మోపే రోజు ఎప్పుడొస్తుందో!' నాన్నగారు అందుకొనేవారు - 'ఈ మున్నీ పెళ్లికి ఏడెనిమిది వేల అప్పు చేసాను. ఇక అబ్బాయిలే ఏమైనా ప్రయత్నిస్తే సాధ్యమవుతుంది - నాకు చేతనయ్యే పని మాత్రం కాదు ...' తమ సుఖం, తమ స్వార్థం, తమ సంతోషం, ఇవే మా కుటుంబానికి కావాలి. ఎదుటివాడు చచ్చినా - మునిగినా వాళ్లకు పోయేదేముంది! ఇతరులకు కోరికలు వుండవు - ప్రాణం వుండదు. పెద్ద వాళ్లు ముసలివాళ్ళు తమ కాలంనాటి ప్రపంచం ఏమీ మారకుండా సాగిపోవాలనుకుంటారు- లేదో ఇక రసాతలానికి చేరిపోడమే! 'ఏమిటండీ, కుర్రాడికి కూడా స్వంత ఇష్టాలా? ఏమనుకుంటున్నారేమిటి? మేం ప్రపంచం చూసాము.' కాని నిజం చెప్పాలంటే వీళ్లకు ముక్కుసూటిగా మరేమీ కనపడదు. పిల్లవాడికేం కావాలి పెళ్లి జరిగితే చాలదూ? కోడలు రావాలి, పిల్లలు కావాలి, వాడేమో క్లర్కు ఉద్యోగానికి ఎదిగి తమ తర్వాత 'హుంక్కా' గొట్టాన్ని పీల్చగలిగితే చాలు...! ఏం చెయ్యను? నా ఆశయాలు, ఏదో సాధించాలనే కలలు, అవన్నీ ఇప్పుడిక మట్టి కొట్టుక పోవలసిందేనా ఎన్నో రాత్రుళ్లు అలా మేల్కొని, నెత్తురు కార్చి పెంచు కున్న ఆ భవిష్యత్ ఇప్పుడిక నేలమట్టం కావలసిందే!

అసలు ఉదయం నేనేమి ఆలోచించానో, అది నేను కాదు మీరెవ్వరో ఆలోచించి వుంటారు. ఇప్పుడంతా నకిలీ అనిపిస్తున్నది. నేను డైరీలో ఇలా రాసుకొన్నాను. నేను ఇంత త్వరగా ఎందువల్ల ధైర్యాన్ని కోల్పోతాను? నా ఆశలనీ నేలఅణగారిపోయాయని ఇప్పుడే ఎందుకనుకోవాలి? బంగారం నిప్పులో తపించినపుడే కదా తాపి అబ్బుతుంది - అందరి జీవితాల్లో పరీక్షా క్షణాలు వస్తాయి ఇది నా అగ్ని పరీక్షా క్షణం. కష్టాల్లో ఇలా ఇంత త్వరగా గాబరాపడి

పోవడం మంచి అలవాటు కాదు. ఇలాంటి క్లిష్ట పరిస్థితుల్లోనే నేను నిల దొక్కు కోవాలి. గొప్పవాడు కావాలంటే ఇదే గీటురాయి - ఆపదలోనే మన స్సును ప్రశాంతంగా వుంచాలి. నెపోలియన్ యుద్ధ మైదానంలోనే ఉత్త రాలు రాసేవాడు. నేను ఏదో గొప్పను సాధించాలనే విషయాన్ని విస్మరించ కూడదు. ఏదో ఒకటి సాధించి గొప్పవాడినవుతే లోకం నా ముందు తలవం చుతుంది. ఒక్కమాట అనగానే ఆజ్ఞాపించినట్టు దేశమంతా వినేట్టు, విదేశీ మ్లేచ్ఛుల పిడికిటి నుంచి భారతమాతను విముక్తం చేయగలిగే ఆ గొంతుగా మారాలి. భారతదేశం మహా పురుషుల దేశం. నా ధమనుల్లో రాణా ప్రతాప్, శివాజీ రక్తం ప్రవహిస్తున్నది, ఆ రక్తాన్ని సిగ్గుపడేలా చేయకూడదు. వారి వారసత్వాన్ని, సంస్కృతిని రక్షించే ఆ ప్రవాహాన్ని మనమే నడిపించాలి,సజీవంగా వుండాలి. మనం యువకులం. ఈ నాటికీ మనలోనే వున్న వేలాది భగవాన్ బుద్ధులు, మహా వీర్‌స్వామీ, భగవాన్ కృష్ణుడు, భగవాన్ రాముడు - వీళ్లంద రిని మనలోంచి మేల్కొల్పి ముందుకు తేవాలి. మన శక్తులే ఈ రోజు హను మాన్. భీముడు, భీష్మ పితామహాను పుట్టించగలవు. నా ఎదుట పరీక్షా కాలం - ఇది శాశ్వతం కాదు - ఈ అగాధాలను, అడ్డంకులను అధిగమించిన పుడే కదా - వాటికి మరో వైపు మహనీయత, గౌరవ సత్కారాల సౌరభాలు వున్నాయి, అమరత్వం పొందిన దేశం వుంది. ఈ 'హర్డల్-రేస్' అక్కడికి చేరుకునే ముందు ఒక సవాలు. మన శక్తియుక్తుల్ని సానబెట్టాలనే భగవం తుడు ఈ అడ్డంకుల్ని కల్పించాడు. ఈ అడ్డంకులపై, కష్టాలపై కాలు మోపి పురోగమిస్తాం. ఆ జన్మ బ్రహ్మచారిగా వుండాలనే నా ప్రతినపై ఈ నాటికీ దృఢంగానే ఉన్నాను...

ఇదంతా నేను ఉదయాన్నే రాసుకొన్న డైరీ! కాని ఇప్పుడు ఏదో ఒక తీవ్రమైన ప్రవాహం వేగవంతంగా తనతో లాక్కెళ్లిపోతోంది. ఎక్కడ వదలి పెడుతుందో తెలియదు? మరి ఇప్పుడే వర్తమానాన్ని ఏం చేయాలి? - మధ్యలో వచ్చిన ఈ మాయాజాలంలో - మోహినిలో నన్ను నేను బంధించు కోనా లేక ఈ పొదల్లోంచి తప్పించుకొని పారిపోవాలా? సాధ్యమైనంత వరకు ఇందులో నేను ఇరుక్కోను, ఇదే నా నిశ్చయం. ఓ, భగవంతుడా, ఈ పరీక్షా సమయంలో నా ఆత్మకు బలాన్ని ఇవ్వు. నేను లొంగిపోకుండా, వోడి పోకుండా నాకు దృఢత్వాన్ని ప్రసాదించు.

ఏమైతేనేం, వివాహం మాత్రం జరిగిపోయింది. కాని ఈ రోజు కూడా

నేను మానసికంగా నేనే! నేను ఈ రంగుల వలలో, ఈ జంజాటంలో ఇరుక్కోను. బహుశా చాలా పెద్ద కార్యాన్ని తల పెట్టానేమో ప్రాణప్రదంగా దీన్ని నిర్వహించాలి. నేను రూపొందే సమయమిది, నా నిర్మాణ కాలమిది.

ప్రభ పదో తరగతి ప్యాసైందని ఎవరో అన్నారు. నేను ఆమె చేయిని తప్ప మరేమీ చూడనే లేదు. నా ముందు నడుస్తున్నప్పుడు ఆమె పాదాలు చూసాను - పారాణి పెట్టిన పాదాలు కాని ఏమైతేనేం ... వాటితో నాకేం సంబంధం! నేను ఆమెతో మాట్లాడను. ఒకవేళ మాట్లాడవలసి వస్తే ఏవో రెండు-మూడు మాటలు మాత్రమే - అంతే. ఇప్పుడైతే ఆమెను తల్లిగారింటికి పంపించివేసే ప్రయత్నం చేస్తాను. అందరూ తమ స్వార్థాన్ని చూసుకుంటూ వుంటే నేను మాత్రం ఎందుకు చూసుకోకూడదు? ఎవరు ప్రలోభపెట్టినా, ఎవరికీ లొంగను. వొత్తిడిచేస్తేనే కదా ఈ పెళ్లి చేసుకొన్నాను. అదే చాలు - పది వేలు! మీకు ఏమి ప్రయోజనం చేకూరిందో నా కనవసరం. నా స్వీయ నిర్మాణాన్ని సాగించాలి. దీక్షతో - మనస్సుతో, ప్రాణప్రదంగా చదువుకోవాలి - మరో నాలుగేళ్లు - ఎమ్.ఎ. పూర్తి చేయగలుగుతాను. ఆమె అంతవరకు ఏం చేస్తుంది? ఎక్కడ వుంటుంది? నాకేం తెలుసు. అయినా తెలుసుకుని ప్రయోజనమేమిటి? ఏ దారిగుండా వెళ్లడం లేదో, అక్కడి మైలు రాళ్లు లెక్క పెట్టి ఏం లాభం? అడ్డంకులు ఇలా అప్పుడప్పుడు అందమైన రూపాన్ని ధరించి వస్తాయి. వాటి భ్రమలో పడక పోవడమే బుద్ధిమంతుల లక్షణం. భార్య తన ఇష్టానుసారం చేసుకునే - మేం పరస్పరం అడ్డంకుల్ని ఎందుకు సృష్టించుకోవాలి.

ఎవరో అన్నారు, బాగా చదువుకున్నదని, అర్థం చేసుకోగలదని. నా దృక్పథాన్ని ఆవిడకు విడమర్చి చెప్పుకోవచ్చుగా? ఒకవేళ భవిష్యత్తులో గృహస్థ జీవితాన్ని గడపాలంటే ఈ కాలాన్ని మలచుకోవచ్చుగా! కనీసం నేను ఆవిడ ముఖమైనా చూడవలసింది. -ముఖంపై మసకమసగగా స్ఫోటకపు గుర్తులున్నాయని వదిన చెప్పింది. ముక్కు మొగం ఎలా వుందో నాకేమీ తెలియదు, ఈ రోజు ఏమేమి చేయాలో ఏమిటో? ఎలా చేయాలో!

సరే, ఏమైనా కానీ! వీటితో నాకేం పని? నేను ఈ రోజు నిశ్చయించుకోక తప్పదు - పరీక్షలో అన్నింటిని మించిన కఠినమైన పేపర్ ఈ రోజే! ఒకవేళ ఈ రోజు జారిపోయానో ఈ లోకంలో నన్ను ఏ శక్తి ఉద్ధరించలేదు - ఇందులోంచి బయటపడ్డానో ఒకేసారి తలనొప్పి సొంతం వదిలిపెడుతుంది.

అసలు ఏమి మాట్లాడకుండా వుండాలంటే సాధ్యం కాకపోవచ్చు. ఆమెతో ఇలా అంటాను - చూడండి, తల్లితండ్రులు ఎలా వున్నా, తమకు తోచిన దేమో చేసారు. అయితే మన వెనకా ముందేమిటో మనమే చూసుకోవాలి. అన్నింటికంటే మొదలు మన చదువు పూర్తి చేసుకోవాలి... ఇదంతా విన్నాక, ఆవిడ ఏడ్పు ప్రారంభిస్తే - ఆమె ఉప్పు కన్నీళ్లు నా దృఢత్వపు నేలను కరిగించివేస్తే...? లేదు, లేదు, లేదు... బుద్ధ భగవాన్‌ను యశోధర సౌందర్యం బంధించగలిగిందా, గోపికల ప్రేమ కృష్ణ పరమాత్మను యోగిపుంగవుడిగా మారకుండా ఆపిందా!

అదిసరే, ఏమిటండీ, భార్య ఎప్పటికీ అడ్డంకిగానే వుంటుందా? రాముడి శక్తిని సీత నుంచి వేరు చేయగలమా? రాజస్థానీ క్షాత్రాణీలు స్వయంగా తమ పతి దేవుళ్లను యుద్ధానికి పంపించలేదా? కాని నేను... నేను మాత్రం చాలా బలహీనుణ్ణి. నన్ను నేను ఆ రూపంలో మలచుకుంటే తప్ప ఇది అసాధ్యమవుతుంది. అప్పటిదాకా నిర్లక్ష్యమే నా ఆయుధం, ఉదాసీనత నా ఢాలు... కన్నీళ్ల వాసనామయమైన ఈ ఊబిలో ఎంతో జాగ్రత్తగా పాదాలు మోపుతూ నడవాలి ఈ భగవత్ విగ్రహమే ఇక సాక్షి!

ఓ, భగవంతుడా, నాకు శక్తినివ్వు, నిగ్రహాన్ని ఇవ్వు, సుబుద్ధినివ్వు. నన్ను సరైన మార్గంలో నడుచుకోనివ్వు. నాతోడుగా వున్న వారే వుంటారు నా వెనకాలే ఆగిపోయిన వాళ్ల వ్యామోహంలో నేను ఆగిపోనుగాక - నేను నాలో నేను 'ఆ శక్తి మాకివ్వు దయానిధే, కర్తవ్య మార్గంలో సాగిపోతాం...'

అప్పుడే ఉలిక్కిపడి చూసాను, భజన ముగిసి కీర్తన మొదలైంది.

## రెండు

ఆ నవ్వులు, కేరింతలు, కిలకిలారావాలు - హాస్యాలు, వాయిద్యాలను ఎదురెదురుగా ముఖాల ముందు పెట్టి ఊదేస్తున్న షహనాయి వాయిద్యకారులు - కాని నాకేమో ఏదో తుఫాన్‌ను గుంబద్ లాంటి గోళాకార నిర్మాణంలో బంధించగానే, అది అలా చుట్టూ తిరిగేస్తూ, ఇటు నుంచి అటు బుసలు కొడుతూ తిరుగుతున్నట్టు, బయటికి వెళ్ళే దారి దొరకనట్టు...

అసలు ఇంతకు, మంచి జరిగిందో చెడు జరిగిందో - నాకు తెలియదు.

శోభనపు రాత్రి వచ్చింది, పోయింది. నేను నిజంగానే ఆమెతో మాట్లాడలేదు. ఇదంతా భగవంతుడు నా ప్రార్థనలను ఆమోదించి చేసిన మేలు అనుకోవాలా లేదా దురదృష్టానికి ప్రారంభమనుకోవాలా ఏమీ తేల్చుకోలేక పోతున్నాను. నేను ఎంతో భావుకుణ్ణి, ఎంతో బలహీనుణ్ణి. ఆవేశాల్లో, బలహీనతల ఉప్పెనలో నేను అతి త్వరగా తప్పిపోతాను - అప్పుడు నాకెలాంటి దరి దొరకదు.

వదిన వెనకాల నుంచి మెల్లగా నెట్టి, తలుపు మూసివేసేసరికి నేను గదిలోకి వచ్చేసాను. అప్పుడు ప్రభ, కిటికీకి తల ఆనించి నిలుచుని వుంది. అలా నిలుచుని నిద్ర పోతున్నట్లే వుంది. కాసేపు అలానే నిలుచుని, ఆ తర్వాత మెల్లగా వెళ్ళి మంచం చివర ఏదో భయపడుతున్న వాడిలా నిలుచున్నాను. చడిచప్పుడు కాకుండా అలా వెళ్ళి మంచంపై పడుకోవాలనుకున్నాను... అసలు ఎపుడు నిద్రపోయానో తెల్లవారిగాని మెలుకువ రాలేదు. అపుడు నా గుండె వేగంగా కొట్టుకుంటుంది, నాలోని శక్తివంతమైన కొండలు డైనమైట్ పేల్చివేతకు సిద్ధంగా వున్నట్లు అనిపించింది. నా ఆత్మ విశ్వాసాన్ని, దృఢత్వాన్ని మరింతగా పుంజు కోవాలని ప్రయత్నించాను. నా మిత్రులు కుర్రాళ్ళు ఏవేవో చెప్పాలని ఉబలాట పడ్డారు - మూర్ఖులు! వాళ్ళంతా నన్ను వేలల్లో, లక్షల్లో వుండే ఒక మామూలు వ్యక్తిలా భావిస్తున్నారు. ఆ వ్యక్తులకు స్త్రీ లేదా అలా నడిచి వెళ్ళే ఏదో అమ్మాయి ఏదో స్వర్గంలోంచి ఊడిపడిన పువ్వులా కనపడి, ఆ అమ్మాయి కోసం యుగాలుగా వాళ్ళ ఆత్మలు తపించినట్టు ప్రవర్తిస్తారు. గుర్రపుబండిలో వెళ్ళే అమ్మాయిలను ఏదో... చూసి 'దర్శన సుఖం' పొందాలనే తాము వెడుతున్న దారి వదలి మైళ్ళ కొద్ది వెనకాలే వెళ్ళిపోతారు. నేను వాళ్ళలాంటి వాణ్ణి కాను, నా దారి వాళ్ళదారికాదు.

మనస్సులో ఎన్నోసార్లు... స్త్రీ చీకటి, స్త్రీ వ్యామోహం, స్త్రీ ఒక మాయ. దైవత్వం వైపు వెడుతున్న మనిషిని స్త్రీ బంధించి రాక్షసత్వమనే చీకటి అగాధాల్లోకి విసిరేస్తుంది. స్త్రీ పురుషుడికి అన్నింటిని మించిన బలహీనత.

నా దారి వేలు - లక్షల కుర్రాళ్లు వెళ్లే దారి కాదు. పైకి నేను ఎలా కనపడినా, నేను వాళ్ల కంటే అన్ని రకాలుగా భిన్నమైన వాడిని. నా భవిష్యత్తు నా చేతులలో వుంది. నేను ప్రతిక్షణం కత్తి అంచుపై నడుస్తున్న వాణ్ణి. నేను ఇంకొంచెం స్థిరపడాలి. ఊగిసలాడకూడదు. నేను ఈ వేళ వాళ్ళందర్ని మించి ఎంతో ఉన్నతస్థాయికి ఎదిగిపోయినట్టుగా భావిస్తున్నాను.

ప్రతి పెళ్ళిలో జరిగినట్లే, ప్రభ సిగ్గుపడుతూ కొత్త పెళ్ళి కూతురులా ముడుచుకుపోయి, అదే అలంకరణలో నాకు స్వాగతం చెప్పడానికి సిద్ధంగా వుంటుందని నేను ఈ గదిలోకి వచ్చేముందు అనుకున్నాను. అసలు అదే క్షణాన ఎంతో జాగ్రత్తగా నిలదొక్కుకోవాలి. కాని అపుడు ఆమెను చూసి బిత్త రపోయాను... వివాహాల్లో ధరించే రంగురంగుల దుస్తులే వేసుకుంది ఆమె, కాని నేను మంచంపై కూచున్న తర్వాత కూడా ఆ కిటికీ దగ్గర నుంచి ఆమె కదలనే లేదు. నన్ను లోనికి పంపించే ముందు, వదినతో పాటు పొరుగింటి ఆడవాళ్లు, బంధువులు ఇంకెవరో తమలో తాము గుసగుసలాడుతూ ఏవేవో మాట్లాడుతూ, నవ్వుతూండి పోయారు. నేను ఏమి విన్లేదు. ఈ వేళ ఆ గది లోని నిశ్శబ్దాని చీలుస్తూ స్టూలుపై వున్న ఫ్యాన్ చప్పుడు ప్రతిధ్వనిస్తు న్నది. ఫ్యాన్ రెక్క తీగకు తగిలినపుడల్లా కిర్రుమని ధ్వనించేది. ఈ వివాహం కోసమే పొరుగింటిలోంచి కరెంటుని అరువుగా తెచ్చుకున్నాం. నేను ఎంతో నిర్లక్ష్యంగా ఏవి పట్టనట్టు వుండిపోయాను. నా భావాలు నిర్మలత్వం వల్ల, ఔన్నత్యం వల్ల నా ముఖం జ్యోతిర్వలయంతో ధగ ధగ మెరుస్తున్నట్టు ఊహిం చుకున్నాను. ఆమె నిజంగానే నిద్రపోయిందేమోనని కాసేపు ఆగి అటు చూసాను. కాని ఆమె మాత్రం నేను మంచంపై కూచోగానే అలా కాస్త తలపైకెత్తి చూసి, ఆ తర్వాత ఏమీ జరగనట్టు అటువైపే తన తలను ఆనించిపెట్టుకుంది.

నేను దద్దమ్మలా అలా కూచుని ఫ్యాన్‌ను చూస్తుండిపోయాను. ఇపుడు ఏం చేయాలి? మెల్లిగా మంచంపై అడ్డంగా పడుకున్నాను. తలను గోడకు ఆనించి పైకి లేపాను. క్షణాలు దొర్లిపోతున్నాయ్. నా కాఠిన్యం మూలంగా ఆవిడ వెక్కి వెక్కి ఏడుస్తుందని నాకు అనుమానం కలిగింది... రెండు చేతుల్తో నా పాదాలను పట్టుకుని అభయం ఇమ్మన్నట్టుగా కన్నీట తడిసిన మొఖంతో అలా వేడుకుంటుంది అని అనుకున్నాను. "నా స్వామీ! చెప్పండి, ఈ దాసి వల్ల ఏ అపరాధం జరిగింది." అప్పుడిక పాదాలపై తలబాదుకుంటు వేల సార్లు మన్నించమని కోరు కుంటుంది. ఆ క్షణం బహుశా నాకు నిభాయించు కోవడం కష్టమే అవుతుంది. అలా క్షణక్షణం గడిచిపోతుంది. ఈ నాటకమేగా సాగిపోయేది...

కాని అప్పటికే చాలా ఆలస్యమై పోయిందనిపించింది. ఆ అర్ధరాత్రి స్తబ్ధత అప్పుడప్పుడు కొన్ని గాజుల గలగలలతో పాటు మా మధ్య విషపూ రితమైన పొగలా వ్యాపిస్తూనే వుంది. అప్పుడు నాకు హఠాత్తుగా అనిపిం

చింది - అనుమానాల, భావుకత సాగరంలోని స్పాంజిలా ఉబ్బుతూ అణిగి పోతూ నా గుండె ఇపుడు గడ్డ కట్టిపోయి ఒక రాయిలా మారిపోయింది. ఎవరో నా లోపలి నుండి అడిగారు "నే నిక్కడికి ఎందుకొచ్చాను! మాటలు లేవు, స్వాగతం లేదు - ఇది నన్ను అవమానించడం కాదా?" ఏదో సాధించాలనే ఆకాంక్ష, ఎన్నో ఆశలు, నిస్ప్రాణమైన ఈ దృఢత్వపు మంచు దుప్పటి కింద వేడి సరస్సు గలగలలను నేను అనుభవిస్తున్నానని అంగీకరిస్తున్నాను. ఎక్కడో మనస్సు చీకటి కొనలో బహుశా ఈ విషయం గురించి ఎంతో వుంది. బహుశా కుతూహలం, తెలుసుకోవాలనే తపన... బహుశా ఏదో తీయదనం. నాలో ఈ ఉపరితలపు దృఢత్వంతో పాటు ఒక భయం కూడా వుంది. నాలోన ప్రవహిస్తున్న ఆ వెచ్చటి నెత్తుటి ప్రవహం ఒక ప్రచండమైన గ్లేషియర్‌లాగా విరుచుకు పడుతుందేమోనని, నేనందులో కొట్టుకుపోతానేమోనని భయంగావుంది.

ధనస్సులోంచి దూసుకొచ్చిన బాణం తన లక్ష్యాన్ని ఛేధించినట్టు నా లోపల ఏదో వస్తువు విలవిలలాడి కొట్టుకున్నట్టు నాకు అనిపించింది - అవమానం! ఇది నాకు అవమానం. లోపల ప్రవహిస్తున్న నెత్తుటి ధార మరుక్షణంలోనే గడ్డకట్టి మంచుగా మారిపోయింది. నేను అసలు ఇక్కడి కెందుకొచ్చాను? ఈ రోజు నేను ఇంకెక్కడికి వెళ్ళలేక - వచ్చేసాను. మహా అయితే ఏమయ్యేది ఇంట్లోని వాళ్ళంతా కాసేపు హైరానా పడేవారేమో! మా ఇంటి వాళ్ళంతా చదువురాని వాళ్ళు, ఇక ఈమె మెట్రిక్ దాకా చదివింది. బహుశా ఈవిడకు అదే అహంకార మేమో? నిజంగానే ఆవిడ తన గురించి గొప్పగా భావించు కుంటున్నది. ఆమె అలానే నిలుచుని వుంది. నేనేమో కోపంగా లేచి కూర్చు న్నాను. సిగ్గులేనిది! ఇదేనా ఈనాటి చదువు ? ఎవ్వర్ని లక్ష్యపెట్టక పోవడం. సిగ్గనేది లేకపోవడం. మిగతా కుర్రాళ్ళలాగా నేనామెకు నచ్చజెప్పి, వేడు కుంటానని అనుకుంటున్నట్టు వుంది? సరే చూద్దాం. ఇదెప్పుడైనా లెక్కలోకి వచ్చేదే. ఇక ఆ అవకాశం ప్రళయం వచ్చేవరకు రాదేమో. మొదట్లో నేను ఫరవాలేదు మేము చదువుకున్న వాళ్ళం, బుద్ధిమంతులం అనుకున్నాను. పరస్పరం మాట్లాడుకుని, ఒకరికి ఒకరం మరింత యోగ్యులుగా మార్చుకోవా లనే ఆశ. కాని అది కాని పని. ఆమెకి ఇదే ఇష్టమైతే అలాగే కానిద్దాం. అసలు నేను లొంగిపోను, ఈ రోజు లొంగిపోయానో జీవితం సొంతం మతిలేని వాడి కిందే జమ. ఈ రోజైతే దీని అంతేమిటో నేనే తేల్చుకోవాలి. అలా నిల్చొని ఆమె బహుశా నేనే ముందుకు వచ్చి ఇలా అడుగుతానని అనుకుంటున్న

దేమో: "నడవండి, ఎందుకు నిలుచున్నారు. కూచొండి." అప్పుడిక ఆమె సిగ్గుపడి, నయగారాలు పోయి ఏదో అలిగినట్టు నటిస్తుంది. అప్పుడే మొదటి సారి నాకు ఆవిడకు కనీసం మర్యాద లేదని అనిపించింది. నేను లోపలికి రాగానే కనీసం నమస్కారమైనా చేయలేదు. అసలు నా పాదాలపై ఆవిడ వంగిపోగానే నేను ఆవిడ రెండు భుజాల్ని పట్టుకుని పైకి లేపాలని అనుకున్నాను. ఆమె ఇంటివాళ్ళు నేర్పించిన సభ్యత మర్యాద ఇదేనా? పెళ్ళి చూపుల పుడు వాళ్ళు మహా గర్వంగా చెప్పారు. మా అమ్మాయి మెట్రిక్ దాకా చదివిందని!

అలా కొన్ని క్షణాలు కూచొని, కూచొని గడచిన తర్వాత ఒక ఉదుటున లేచినిలుచున్నాను. తలంతా గిర్రున తిరిగిపోతున్నది. గది అంతా అవమానాల సంకేతాలతో నన్ను చూసి అట్టహాసంగా నవ్వుతున్నది. అప్పటికి ఎక్కడో ఒక మూల నాలో ఒక ఆశ - నేను వెళ్ళిపోతుంటే ఆమె నా వెనకాలే వచ్చి నా చేయి పట్టుకుని, లేదా షర్టు చివర పట్టుకుని ఆపుతుందని... అప్పుడిక కాస్సేపు ఆగి, ఆమెను క్షమించే విషయం గురించి ఆలోచిస్తానేమో! కాని నేనెప్పుడైతే నిలుచుని రెండు మూడు అడుగులు తలుపు వైపు వేయగానే ఆమెలో అలాంటి భావమేది కనబడలేదు. అప్పుడిక నా స్వాభిమానం పెట్రోలు జ్వాలలా ప్రజ్వరిల్లిపోయింది. అప్పుడే నేను నిశ్చయించుకున్నాను - ఆమె ఒక వేళ నన్ను ఆపినా నేను వెనక్కి తిరిగి చూడకుండా వెళ్ళిపోతాను. బుద్ధిలేనిది!

ఢఢాలున నేను తలుపు తెరవగానే ఆమె వులిక్కిపడి తలపైకెత్తినట్టు అనిపించింది. అప్పటికే నేను బయటికి వచ్చేసాను. ఎందుకో నేను ఒక క్షణం బయటే ఆగిపోయాను. ఆ తర్వాత మెట్లు ఎక్కి మిద్దెపై భాగానికి వచ్చేసాను. అక్కడ అందరూ మంచాలపై లేదా కింద పడుకుని వున్నారు. వెన్నెల కురుస్తున్నది. రాత్రి రాణి చంద్రుడు గొడుగు పట్టుకుని నిహారికల మార్గంలో నడిచిపోతున్నది. నేను ఏమీ చూడకుండా, ఒక మూల నేలపై పడిపోయి నాతో నేను యుద్ధం చేస్తూ వుండిపోయాను.

వుఫ్, ఈ వ్యవహారాన్ని నేను జీవితాంతం మరిచిపోగలనా? లేదు లేదు. విద్యోత్తమ వ్యవహరించిన ఈ తీరు వల్లె ఒక వజ్ర మూర్ఖుడు కవితా రాజకుమారుడుగా - కాళిదాసుగా మారిపోయాడు. ఇప్పుడిక ఈ అవమానానికి నేను ఏ రూపంలో ప్రతీకారం తీర్చుకుంటానో ఇక చూడాలి. కాని ...

అసలు నేనక్కడికి ఎందుకు వెళ్ళాలి? నాలో అది ఒక బలహీనత కాదా? పథభ్రష్టుడనైనందుకు దేవుడిలా శిక్షిస్తున్నాడేమో? నన్ను సంభాలించే ఎదురు దెబ్బనేమో ఇది. ఎక్కడో చదివాను "మనిషిలోని నిజమైన ఆత్మను బయటికి లాగాలంటే ప్రపంచంలో అవమానాన్ని మించిన శక్తి మరొటి లేదు" నా ఆత్మలో ఎంత శక్తి దాగి వుందో నేను చూసుకోవాలిక! జ్ఞాపకం వుంటుంది. ఇది శోభనపు నాటి కానుక. జరిగిపోయిందేమిటో, ఒకందుకు మంచికే జరిగింది. అసలు ఆ దారి నాదైతే కదా!

నా అదృష్టం వెళుతున్న దిశను స్పష్టంగా చూడగలుగుతున్నాను. అటూ-ఇటూ వెళ్ళే దారులన్ని మూసివేస్తూ ఒక నిశ్చితమైన మార్గాన్ని తెరుస్తున్నది. నిశ్చయంగా ఈ మార్గం ఔన్నత్యానికి మార్గం, మానవత మార్గం.

ఈ మానసికాందోళనలోనే నా కళ్ళు చెమర్చి అనాయాసంగానే కన్నీళ్లతో నిండిపోయాయి. ఎంత ప్రయత్నించినా నన్ను నేను సంభాలించుకోలేక పోయాను. రెప్పవాల్చకుండా కళ్ళు ఆకాశాన్ని చూస్తూ నిశ్శబ్దంగా కన్నీళ్లు కార్చేస్తున్నాయి. భగవంతుడా! నా మెడలో ఏమిటిది కట్టేసావు! ఎక్కడికి తీసుకొచ్చి పడేసావు! ఈ క్షణంలో అదే భావం - మాటి మాటికి నా మనస్సులోంచి ఉప్పెనలా ఈ కంటకావృతమైన మార్గంలో నేను ఏకాకిని - మరీ ఒక్కణ్ణే! ఎవ్వరూ వెంటలేరు. నా అలసటను, చెమటను తుడ్చి, తనను వోదార్పు మాటలతో చుట్టేసే వాళ్ళు ఎవ్వరూ లేరు. నా నైరాశ్యపు కన్నీళ్లు తుడిచి ఇలా అనగలిగే వాళ్ళు లేరు - 'నడూ, నేను నీతోనే వున్నాను.' ఇలాంటి అమ్మాయిని తీసుకొచ్చి నాకో గుదిబండలా తగిలించారు. ఈ జీవితం ఇక ఎలా సాగనుందో...? మళ్ళీ అనిపించింది - ఏదో ఒక అజ్ఞాతశక్తి నా శరీరంలోని అణువణువు నుంచి నీళ్లు పిండేస్తూ కళ్ళ దారి గుండా పారబోస్తున్నదని...

అప్పుడే లేచి, ఎవ్వరికి చెప్పకుండా ఎక్కడికో వెళ్లిపోతే ఎలా వుంటుందని నా మనస్సు అగాధాల్లో ఆలోచిస్తు వుండి పోయాను. ఎక్కడికైనా వెళ్ళిపోతాను - కలకత్తా, బొంబాయి లేదా హరిద్వార్ పారిపో... పారిపో...

పొగ, నిప్పులు - ఆవిరి కుంపటిపై నేను రాత్రంతా వేగిపోతూ, ఉడికిపోతూ వుండిపోయాను.

# మూడు

అరణ్యంలో రగులుకున్న భయంకరమైన అగ్నిలా సమర్, ప్రభతో మాట్లాడనే లేదు అనే విషయం ఇల్లంతా వ్యాపించి పోయింది.

రెండు చేతులతో తల పట్టుకుని మోచేతులను మోకాళ్ళపై ఆనించుకుని నేను నా గది గడపపై అలానే కూచుని చాలా సేపట్నుంచి ఏమిటేమిటో ఆలోచిస్తు వుండిపోయాను. ఇప్పుడిప్పుడే అంత్యక్రియలు జరిపి వచ్చినట్లు మనస్సంతా ఉదాసీనత వ్యాపించింది. సాయంకాలపు నీడలు మూలల్లోకి సందుల్లోకి అప్పుడప్పుడే చొచ్చుకపోతున్నాయి. ఎదురుగా ఒక మహాశూన్యంతో నిండిన ఒక గుడ్డి సముద్రం పరవళ్ళు తొక్కుతున్నట్లు అనిపించింది - ఇప్పుడు నేను ఏం చేయాలి?

ఉదయం నుంచి ఎంతో మంది అడిగారు. బహుశా ప్రభను కూడా అడిగారేమో - కాని ఇద్దరు కూడా అయిష్టంగా ఏమీ చెప్పక పోయేసరికి మళ్ళీ ఎవరు కూడా అడగాలని సాహసించలేదు. మొదట వదిన వ్యంగ్యంగానే ప్రశ్నించింది. ఆ తర్వాత కొంచెం గంభీరంగానే తెలుసుకోవాలనుకున్నది. అమ్మ కూడా అడిగింది. కాని నేను అందరిని తప్పించుకున్నాను. దినమంతా మొఖం చాటు చేసుకుంటూ ఇటు అటు తిరుగుతూ వుండిపోయాను. నేను నా భార్య అనబడే ఆవిడ పట్ల కోపంగానే వున్నాను. కాని ఆమె నాకు విరుద్ధంగా ఏవేవి చెప్పిందో వినాలని కూడా అనిపించింది. ఇంతవరకైతే ఆ విషయం ఏదీ వినలేదు. అది నాకు చాలా ఆశ్చర్యం కలిగించింది. ఆమె ఇంటివాళ్ళు కూడా ఆమె నుంచి ఏమీ లాగలేక పోయారనే అనుకున్నాను. వాళ్ళు ఏమి కోరుకున్నా అది నా ప్రవర్తన గురించే! ఇదంతా నన్ను మంచి చేసుకోడానికి జరుగుతున్నదేమోనని ఉలిక్కిపడేవాణ్ణి. కాని నాలో ఇప్పుడు ఒక తటస్థమైన నిర్లిప్తభావం చోటుచేసుకుంది. ఈ ఇంట్లో ఎవ్వరూ నాకిపుడు ఏమీ కారు! ఆమె ఒకవేళ అందరికి ఏవైనా చెప్పివున్నా, అప్పుడుకూడా బహుశా నాకు అదేమి కొత్తగా వుండేది కాదేమో.

నాన్నగారు ఏదో నిగూఢ రహస్యాన్ని తెలుసుకోవాలనే ధోరణిలో అడిగారు. ప్రత్యేకించి ఏవైనా జరిగిపోయిందా? నేను ఏమీ మాట్లాడలేదు. మళ్ళీ ఆయనే అడిగారు. ఏవైనా మాటామాటా అనుకుని తగాదా పడలేదు కదా?

మున్నీ వచ్చి 'నాన్నగారు పిలుస్తున్నారు' అనే సరికి నా ధైర్యం ఊగిస లాడింది. నాన్నగారెందుకు పిలిచారు? కాళ్ళీడ్చుకుంటు అక్కడికి వెళ్ళాను. నాన్నగారి ఎదుటి పడాలంటె నేనెప్పుడు భయపడుతుండేవాణ్ణి. ఇటీవల మూడ్నాలుగు సంవత్సారాల నుంచి నాపై చేయి చేసుకోకపోయినా గతంలో శరీరంపై పడిన దెబ్బల గుర్తులు ఇప్పటికి జ్ఞాపకమొస్తాయి. ఈ జ్ఞాపకాలే ఆయనంటే కలిగేభయాన్ని నాలుగింతలు పెంచేసింది. ఆయన ఎప్పుడు ఏం చేసేస్తారో ఏం చెప్పలేం! నన్ను ఆయన కొడుతుండే రోజుల్లో నేను మొండికేసే వాణ్ణి - మహా అయితే కొడతారు అంతకంటే ఏం చేయగలరని! హాకీ, ఫుట్‌బాల్ ఆడినప్పుడు తగిలే దెబ్బలను సహించమా. కాని ఆయన వ్యవహరించే తీరు నాలో రహస్యమయమైన భయాన్ని సృష్టించింది. నేనే దైనా తప్పు చేసినపుడు ఆయన చీవాట్లు పెడతారనే అనుమానం కలిగినా కొడతారనుకున్నా, అవేవి జరగకపోయే సరికి నా ఖాతాలో ఎంతో దండన జమ కిందికి వచ్చేసిందని అనుకునే వాణ్ణి. ఫలితంగా ఆయన్ని తప్పించుకో వడం, భయపడటం నా స్వభావంగా మారిపోయింది. నాలో నేను ఎంత వ్యతిరేకించినా, తిరగబడినా, ఆయన సమక్షంలో నోరు మెదపలేనంత భయం నా నరనరాన పాకిపోయింది. అందువల్ల ఆయనేమి చెప్పినా లోలోపల గొణు క్కుంటూనే నేను చేస్తూవుండేవాణ్ణి.

ఎంతో భయపడుతూనే ఆయన అడిగిన వాటికి జవాబుగా ఒక ఉపన్యా సాన్ని తయారు చేసుకున్నాను. ఆయన అలా నిశ్శబ్దంగా హుక్కా తాగుతూ ఎంతో గంభీరంగా తాత్వికుడి ముద్రలో కూచుని పెదాల్ని వంకర టింకరగా తిప్పుతూ పొగ వదులుతున్నారు. పక్కనే వున్న ఖాళీ కుర్చీల వైపు చూసి బహుశా ఇప్పుడిప్పుడే కొంత మంది ఇక్కడ కూచుని వెళ్ళి వుంటారని అనుకున్నాను. ఆయన నన్ను కూర్చోమని కనురెప్పలతో సైగ చేయగానే నా సాహసమంతా పొగలా ఎగిరిపోయింది. ఏదో విధంగా కుర్చి అంచున కూర్చున్నాను.

ఏమిటి సంగతి, కోడలు నీకు నచ్చలేదా? ఎంతో మృదువుగా ఆయన అడిగారు. ఆయన మాటల మృదుత్వాన్ని చూసి నేను ఉలిక్కిపడి భయపడి పోయాను. నా ఉపన్యాసంలోని ఒక్కొక్కపదం రాలిపోసాగాయి.

నేనేమీ మాట్లాడక పోయేసరికి ఆయన హుక్కాలో ఒక పెద్ద దమ్ము లాగి, పొగను మెల్లిగా వదిలితూ అడిగారు "స్పష్టంగా చెప్పేయ్, ఇందులో

సంకోచించవలసిన పని ఏమిటి? నువ్వసలు ఆమెతో మాట్లాడనే లేదని విన్నాను?"

నేను నిశ్శబ్దంగా నా అరచేతుల్ని చాచుకుని చేతిరేఖల్ని చూస్తూ వుండి పోయాను. అనుకున్న ప్రశ్నలు జవాబులన్నీ మెదడ్లోంచి జారిపోయాయి. మనస్సులో ఒక ఆర్ద్రమైన ఉచ్ఛ్వాసం చుట్టుకుంది.

నాన్నగారు హుంకరిస్తు ఇలా అన్నారు పాపం ఆ పరాయి అమ్మాయి, ఎవరి ఆసరా చూసుకుని వచ్చిందో ఆలోచించావా? ఈ ఇంటికి కోడలిగా వచ్చిన ఆవిడతో ఇలాగేనా ప్రవర్తించేది? తల్లిగారింటికి వెళ్ళి ఏం చెప్పు కుంటుంది? నీకు పెళ్ళంటే ఇష్టం లేదని తెలుసనుకో, కాని అబ్బాయ్, ఇదంతా లోకంలో జరిగేదే! ఇక ఏం జరిగిందో దానినైతే నిభాయించుకోవాలి కదా సరే అనుకో...

అకస్మాత్తుగా నేను వెక్కి వెక్కి ఏడుస్తూ వుండే సరికి ఆయన మాట మధ్యలోనే ఆగిపోయింది. నిజం చెప్పాలంటే అలా జరుగుతుందని నేను కూడా అనుకోలేదు. కాని నాన్నగారి ఆ మాటలు వినగానే ఎందుకనో నన్ను నేను ఆపుకోలేక పోయాను. చిన్న పిల్లాడిలా నన్ను నేను సంభాలించు కుంటూ, పిడికిళ్ళతో కళ్ళను ముక్కును రాసుకుంటూ వుండిపోయాను. అప్పు డాయన నచ్చచెపుతూ ఇలా అన్నారు. "వెళ్ళు, ఏమిటా మరీ పిల్లాడిలా" అప్పుడు నేను మారు మాటాడకుండా లేచి వచ్చేసాను.

నేను నా చదువుకునే గది గడపపై కూచుని ఏమీ తోచకుండా ఏవేవో ఏటో ఆలోచిస్తూ వుండిపోయాను. తల తోకా లేని ఆలోచనలన్నీ - ఈ వ్యవ హారంలో నా తప్పునేది నాకేదీ కనపడలేదు. ఈ పెళ్ళి నా పున్నతమైన ఆద ర్శాలకు, ఆకాంక్షలకు విషం లాంటిది. ఆ అమ్మాయి చదువుకున్నదని, తెలి వైనదని తెలిసి ఏదో అనుకున్నాను. మేం పరస్పరం అర్థం చేసుకునే ప్రయత్నం చేయుగలమని, చక్కదిద్దుకోడానికి సహాయపడగలమని అనుకున్నాను. నా శోభనపు రాత్రి, నేను కావాలనుకుంటె ఆమెను లాక్కొచ్చి మంచంపై పడే సేవాణ్ణి, గుడ్డిగా ఆమె అందాన్ని అభివర్ణించేవాణ్ణి లేదా మరీ మూర్ఖుడిలా ఏదో ఒక చిలుకనో, పిల్లినో చంక బెట్టుకుని వెళ్ళి ఆ సమయానికి దాన్ని చంపేసి జీవితాంతం నా బడాయిని అలా ప్రదర్శించే వాణ్ణి. కాని ఒక చదు వుకున్న వాడిలా సభ్యత మర్యాద తెలిసిన మనిషిలా నేను ఇవేమీ చేయ కుండా మొట్టమొదట ఆవిడకు నన్ను పరిచయం చేసుకుని ఆమె పరిచయాన్ని

అడగాలని అనుకున్నాను. ఆ తర్వాత ఆమెకు నా కలలు, ఆకాంక్షలు గురించి చెప్పి, జీవితం - ప్రపంచం గురించి నా అభిప్రాయాలేమిటో నచ్చజెప్పాల నుకున్నాను. ఇవన్నీ నచ్చజెప్పిన తర్వాత నమ్రతగా అలా అడుగుతాను. "ఇప్పుడు చెప్పండి. వీటిలో మీరు ఏ రకంగా నాకు సహాయం చేయగలరు?" కాని ఆమె ఆ ప్రవర్తన మూలంగా వాటికి ఆస్కారమే లేకుండా పోయింది. నేనా మాటలన్నీ చెప్పుకునే అవకాశమెక్కడుందని? లేదు. వీటన్నింటిలో నా నేరమే లేదు. నాన్నగారు అనవసరంగా ఈ నేరాన్నంతా నా తలపై రుద్దుతున్నారు.

నాలోన హఠాత్తుగా ఎవరో అడిగారు - నేను ఆమెతో మాట్లాడలేదు సరే, ఈ మాట నాన్నగారికెలా తెలిసింది? నేను వులిక్కిపడ్డాను. అవును నిజమే మరి ఆయనకా విషయం ఎవరు చెప్పారు? అసలు నేను ఈ విషయాన్ని ఎవరితోను ప్రస్తావించనే లేదే! ఆమే చెప్పి వుంటుంది. ఆమె ఇంతటి ముఖ్యమైన విషయాన్ని ఏదో ఉత్త మామూలు వ్యవహారంగా కొట్టి పారేయడం నాకు ఉదయం నుంచి ఆశ్చర్యాన్ని కలిగించింది. ఆమె అసలు ఈ విషయాన్ని ఎవరికైనా ఎందుకు చెప్పలేదు? అయినా ఆమె చెప్పకుండా ఈ విషయం ఇతరులకు తెలియదు. ఎంత చేసినా ఆడది కదా, అమ్మతో చెప్పకపోయినా, కనీసం మున్నీతో లేదా వదినతో తప్పకుండా చెప్పి వుంటుంది. మున్నీని లేదా వదినను అడిగితే? లేదు, అలా అడగడం నా బలహీనతను తెలియజేస్తుంది. వాళ్ళు వెంటనే వెళ్ళి ఆమె చెవిలో ఇదంతా ఊదేస్తారు. అప్పుడామె నన్ను ఎంతో బలహీనుడిగా భావిస్తుంది. బలహీనుణ్ణా? ఇంతకు ఆమె నా బలానికి సంబంధించిన ఒక దృశ్యం మాత్రమే చూసింది.

"లాలాజీ, అంతగా మునిగిపోయి ఏమిటీ ఆలోచిస్తున్నారు? అప్పుడే ఎటునుంచో వచ్చిన వదిన అన్నది, నీ పెళ్ళి ఏమైందేమో కాని ప్రపంచంలోని చింతలు బరువంతా నీ పైకె వచ్చినట్లుంది. అలా తల పట్టుకుని కూచున్నా వేమిటి? తలనొప్పా? ఎవరైనా చూస్తే నువ్వు ఏ కొడుకో, కూతురో పెళ్ళి చేయలేక బాధల్లో వున్నావని అనుకుంటారు."

నేను కంగారు పడ్డాను. దొంగతనం చేస్తుండగా పట్టుబడినట్లు భావించాను. నా చింతలను, బాధలను ఇలా చూపించడం కూడా నా లోపలి బలహీనతే. సంభాలించుకుని అన్నాను. "ఏమీ లేదు వదినా, ఆలోచన, గీలోచన ఏమీ లేవు - ఊరికే కూర్చున్నాను. అంతే." అసలు ఇంట్లోని ప్రతీ ఒక్కరూ లేదా

నన్ను కలిసే ప్రతివాడు తన మాటలతో లేదా చర్యలతో ఆ విషయాన్నే ఎత్తి చూపుతున్నట్టు వుండేది. అలా ఎత్తి చూపడం గుచ్చుకోగానే లేదా సమాధానం ఇవ్వాలనుకోగానే నాకు మహా చెడ్డ భయంగా వుండేది.

"లాలాజీ, నటించకు, అందరికి తెలుస్తూనే వుంది. చీకటి పడుతున్నా - తినాలని గాని తాగాలని గాని ధ్యాస లేదు." ఆ తర్వాత ఆమె నన్ను ఏడిపించాలనే ధోరణిలో చిరునవ్వు నవ్వి అన్నది "ఏమిటి అసలు వ్యవహారం పొసగ లేదా?"

ఆమె హాస్యాన్ని అర్థం చేసుకుంటూ గంభీరంగానే సమాధానమిచ్చాను. "వదినా పొసిగే అవకాశం కూడా లేదు. అసలు నేను నాకెంతో ఆత్మీయులైన వాళ్ళ అహంకారాన్ని కూడా సహించలేను. వాళ్ళెంత అందంగా వున్నా చదువుకున్నా లెక్కచేయను. ఇలాంటి అహంకారాన్ని కాలిగోటితో సమానంగా చూస్తాను." ఇంతకు నేను అంత పరుషంగా చెప్పిన మాటలు నాన్నగారికి జవాబుగా ఇచ్చినవా, ఇంట్లో ఎక్కడో కూర్చున్న ప్రభకు వినిపించాలనా? లేదా వదినకు మాత్రమే చెప్పాలనా - అనేది ఈ నాటికి కూడా చెప్పలేక పోతున్నాను,

"ఇంతకు నాకు కూడా అలానే అనిపిస్తున్నది లాలాజీ" వదిన అటూ ఇటూ అనుమానంగా చూసి మెల్లిగా గుసగుసలాడుతూ అన్నది "ప్రభలో ఆమె చదువు, అందం పట్ల గర్వం వుంది. నన్నడిగితే, పెద్ద దేవకన్యేమీ కాదు కదా! వయస్సులో ఎవరైనా అందంగానే వుంటారు. అప్పట్లో నేను లేనా - అమ్మగారులేరా?" అలా అంటూనే ఆవిడ సిగ్గుపడింది.

నేను నిర్లక్ష్యంగా తల ఆడిస్తు అన్నాను. "ఈ మాత్రం అందానికే ఇంత ఎగిరిపీగుతుంటే నిజంగానే అందంగా వుంటె ఆవిడ తల ఎక్కడుండేదో?" ఆవిడ కూడా వినాలని నేను చాలా పెద్దగానే అన్నాను.

వదిన నా మాటను అర్థం చేసుకుంది..నన్ను బుజ్జగిస్తు అంది. "బాబూ, నీకుదండం పెడతాను. కొంచెం మెల్లిగా మాట్లాడు, లేకపోతే నేనేదో నీకు అన్ని నేర్పుతున్నాననుకుంటారు."

"ఇందులో నేర్పించేదేముంది వదినా? నేను అర్థం చేసుకోలేనా, గుడ్డి వాణ్ణి కాదు కదా. అప్పుడే చెప్పాను నన్ని బావిలో అస్సలు పడేయొద్దని. కాని అప్పుడు నువ్వు కూడా మొండికెత్తి నా గొంతుకు ఉరితాడు బిగించాలనే కదా ఇదంతా చేసింది. చెప్పు ఇప్పుడు ఏం చెయ్యాలి?"

సరే లాలాజీ, ఇలా చిన్న చిన్న వాటికి తల బాదుకోడమెందుకు! ఎంతో స్నేహంగా, ఆత్మీయంగా వదిన అన్నది.

"నడు భోంచేద్దువు కాని. మెల్లి మెల్లిగా అన్ని సర్దుకుంటాయి. నీది వేడి నెత్తురు. మరి ఆమె ఇప్పటికి పిల్లనే కదా. నేను ఆమెకు నచ్చ చెబుతానులే. ఏదైనా ఆమె ఇలా ప్రవర్తించవలసింది కాదు. అసలు ఆవిడ తనను తాను ఏమనుకుంటుందో? కనీసం నాతో మాట్లాడనుకూడ మాట్లాడదు. వచ్చే వాళ్లు పోయేవాళ్ళు అని గమనించి తలపై కొంగువేసుకోడం అనేది కూడా లేదు. తల్లిగారింటి నుంచి ఏదో పుస్తకం తెచ్చుకుంది. అది చదువుతూ కూర్చుంటుంది అంతే. మరింకేమీ తెలియదు. వున్నదేమో కనబడుతూనే వుంది. చదువుకున్నాననే గర్వం మహా ఎక్కువ. సరే, లాలాజీ ఈ గొడవలన్ని ఇప్పుడెందుకు నీకు. వీటితో నీ చదువెందుకు పాడు చేసుకుంటావు" ఆ తర్వాత వదిన కాసేపు ఏం మాట్లాడ లేదు. ఏదో ఆలోచిస్తు అన్నది. "రేప్పొద్దున ఆవిడే వంట చేస్తుంది. మీ అన్నగారు ఏమన్నారో తెలుసా. ఆవిడ వంట అమృతమట! తింటే వ్రేళ్ళు నాకినా తృప్తివుండదట."

"ఆయనకెలా తెలుసు?" నేను వెంటనే అడిగాను.

వదిన కొంచెం ఇరకాటంలో పడింది ఆ తర్వాత ఏదో మామూలు విషయమే అన్నట్టు చెప్పింది. "చూడ్డానికి వెళ్ళినపుడు ఆయన తిని వుంటారు. అప్పటి నుంచి మెచ్చుకుంటు ఇంటిల్లిపాదికి చెప్పారు. రేపు నువ్వే చూస్తావు కదా!" వెళ్ళిపోతూ - "సరే ఇక వచ్చేయ్ నా మీద ఒట్టు. రెండు రొట్టెలు తిను. నేను వెళ్ళి వడ్డిస్తున్నాను."

ఉదయం నుంచి ఇంటి వాతావరణమంతా మహా భారంగా ఊపిరి ఆడనివ్వకుండా విసిగించినట్టు వుంది. అలాంటప్పుడు భోంచెయ్యాలన్నా, నీళ్ళు తాగాలన్నా మనస్కరించలేదు. కాని ఇపుడు వదినతో మాట్లాడగానే మనసు తేలికపడి పోయింది. ఏమీ మాట్లాడకుండా వెళ్ళి వంటగదిలో కూర్చున్నాను.

రాత్రి మళ్ళీ అమ్మ, నాన్నగారు పరోక్షంగాను, మున్నీ ఇంకా వదిన స్పష్టంగాను నాకు నచ్చజెప్పారు. ఇలా జరుగుతూనే వుంటుంది. ఇలాటి వాటికి జీవితమంతా కొట్లాడుతుంటామా - ఏడడుగులు నడిచి ఎవరినైతే తెచ్చావో ఆవిడతో సర్దుకు పోవలసిందే కదా! పాపం ఆవిడైనా ఏం చేయగలదు? ఆవిడే తప్పుచేసినా ఈ పరిస్థితుల్లో క్షమించడం మంచిది. రెండ్రోజులు కాగానే ఆవిడ అన్నలు ఆమెను తీసుకెళ్ళడానికి వస్తారు. మన గురిం

ఆవిడ తల్లిగారింట్లో ఏం చెబుతుంది? చుట్ట పక్కాల్లో అపఖ్యాతి పాలవుతాం. సంబంధాలు చెడిపోతాయ్. ఇప్పుడు ఆమె క్షమాపణ కోరుకుంటుంది. కాని ఈ వాతావరణం మూలంగా నాలో మొండి పట్టుదల పెరిగింది. నేను కూడా మున్నీతో స్పష్టంగా చెప్పాను. "మీరు ఈ రాత్రికి నన్ను ఇక్కడ పడుకోనిస్తే పడుకోనివ్వండి. లేదా దివాకర్ దగ్గరో మరే స్నేహితుడింటికో వెళ్ళి పడుకుంటాను."

"లాలాజీ, పట్టుదల పెరిగితే మరీ మొండికెత్తుతావ్. ఎవరి మాటా వినవ్. అయినా ఎందుకీ పట్టుదల కనీసం అప్పుడప్పుడు పెద్ద వాళ్ళు చెప్పినట్టు వినాలి."

"లేదు వదినా లేదు, ఆ మాటలు వినే కదా ఇంతగా సుఖపడి పోయాను. ఇప్పుడైనా నా వెంట పడకండి."

వాళ్ళ మాటల మూలంగా నాలో పట్టుదల మరింత పెరిగిపోయింది. నిన్నటి సంఘటన ఎన్నో రెట్లు పెరిగి ముందుకు రాసాగింది.

అప్పుడే నేను చూసాను, తలుపు దగ్గర ఏదో ఒక నీడ. ఆమె తలుపు దగ్గర వచ్చి నిలుచుంది. వదిన చూడగానే వెళ్ళి గుమ్మానికి చెవి ఆనించి అడిగింది. "ఏం తెచ్చావ్? పాలా? అరే నువ్వెందుకు తెచ్చావ్? ఇంకెవరూ లేరా? ఈ మున్నీ కూడా భలే మనిషే. కొత్త కోడలిని రెండ్రోజులు కూర్చో నివ్వవచ్చు కదా. అప్పుడే పాలు చేతికిచ్చి పంపించేయడమా! ఆమె స్వయంగా వస్తె పోయేదిగా. సరే ఇందాకా ఎలాగూ తెచ్చావు కదా. వచ్చి ఇవ్వు సిగ్గు దేనికి?" అప్పుడే లోపలి నుంచి కేక వినపడింది: "వదినా అమ్మ పిలుస్తు న్నది. పొద్దుటికి పప్పు ఎంత నాన బెట్టాలి, చూపించి వెళ్ళు మున్నీ అడు గుతోంది."

"ఇదిగో వస్తున్నాను. నా వైపు రహస్యంగా చిరునవ్వు విసిరి వదిన వెళ్ళి పోయింది." ఆమెతో మెల్లిగా చెబుతూ మరీ వెళ్లింది. "క్షమాపణ కోరుకో, ఇలాంటి వాటితో లాభమేమిటి, నువ్వే కాస్త వెనక్కి తగ్గాలి."

మళ్ళీ రాత్రి అదేగది - ఎర్రని తాడుకు వ్రేలాడుతూ నీలం బల్బు గోడ మీద వెలుగుతోంది. విచిత్రమైన కలలాంటి వాతావరణం. ఆ బల్బు వైపు తదే కంగా చూస్తు ఈలోకాన్నంతా మరిచి ఏదో గంభీరమైన ఆలోచనలో మునిగి పోయినట్లు నిశ్శబ్దంగా కూర్చున్నాను. కాని నా ధ్యాసమాత్రం తలుపు వైపె ముడుచుకుపోయింది. చేతిలో గ్లాసుతో పట్టుచీరలోనే సగం శరీరం కనపడు

తున్నది. ఆవిడ వచ్చి నాతో క్షమాపణ కోరుకుంటుందని, పాలుతాగమని బతి లాడుతుందని నేనెంతో ఉత్కంఠతో ఎదురుచూస్తున్నాను. ఇప్పుడు నేనా మెను క్షమించేస్తాను. తల్లిగారింటి కెళ్ళి మా యింటి గురించి ఏదో చెబితే ఏం బావుంటుంది. ఈ మనిషి ఎంత మంకుపట్టుదలతో వుంటాడో ఆమెకు అర్థమై వుంటుంది.

ఒక నిముషం... రెండు నిముషాలు... అయిదు నిముషాలు... పది నిము షాలు... ఎంతో సేపు గడిచిపోయింది. అలానే కూర్చోడం పరమ చిరాగ్గా వుంది. ఏదో ఆలోచిస్తూ, ఏదో జ్ఞాపకమొచ్చిన వాడిలా తిన్నగా కూర్చుండి పోయాను. ఏదో వులిక్కిపడినట్లు నా మోకాళ్ళపై చేతులానించి ఇక లేచి వెడదామని కూచున్నాను. లేచి నిలుచుని అక్కడెవరో నిలుచున్నారనే ధ్యాస లేకుండా ద్వారం వైపు నడిచిపోతున్నాను. ఎంతో నిర్లక్ష్యంగా ఆమెను తాక కుండా గడపబైటికొచ్చేసాను. ఆమె పాలు పట్టుకుని అలానే నిశ్శబ్దంగా నిలు చుని వుంది. నేను బయటికి వస్తుండగా ఆమె గొంతులోంచి సంకోచిస్తు వచ్చిన మాట విన్నాను. "వినండి" కాని నేను మాత్రం ఏమీ వినకుండా ఎవరి ఫరవా లేనట్లు గబగబా బయటికి వచ్చేసాను. ఈరోజు మళ్ళీ మిద్దెపై విశా లమైన ఆకాశం పరుచుకుని వుంది.

ఆరాత్రి నేను రెండు నిర్ణయాలు చేసుకున్నాను. ఒకటేమిటంటే ఆమె మాట్లాడినా, మాట్లాడకపోయినా నేను మాత్రం మాట్లాడను. ఎలాంటి సంబంధం పెట్టుకోను. ఎలాంటి ప్రలోభానికి గురికాను. రెండోది శ్రద్ధగా చదువుకుం టాను. అసలేమీ జరుగనట్టు తిరిగి నాపాత కార్యక్రమాలన్నీసాగిస్తాను. ఏదో ఒక చెడ్డకల చూసాననుకుంటాను.

ఉదయమే వంట అయిపోయింది. ఏమీ మాట్లాడ కూడదనే నిర్ణయం అలానే వుంది. కాని ఆవిడతో ఎలాంటి సంబంధం పెట్టుకోకూడదు అనే నా గత రాత్రి నిర్ణయం నాకే ఎబ్బెట్టుగా అనిపించింది. నేనెలాంటి లొంగుబాటు చూపించక పోవడం, మాట్లడకపోవడం ఇంతవరకు బాగానే వుంది కాని ఆమె చేతి వంట కనీసం ఒక్కసారైనా రుచి చూడకపోతే ఎలా? తింటే తప్పే మిటి? అయితే ఎవరైనావచ్చి బతిమిలాడితేనే వెడతాను. ఆమె బతిమిలాడ కుండా వుంటుందా? చూద్దాం...

ఆమె చేతి వంటను మొదట తినవలసిన వాణ్ణి నేనే. ఇంట్లో వివాహానికి సంబంధించిన తంతును నేనేమీ పట్టించుకోలేదు ప్రతిరోజు చుట్టుపక్కలున్న

ఆడవాళ్ళ సైన్యం వచ్చి మూడు గంటల నుంచి రాత్రి పదకొండు గంటల దాకా ఇష్టంవచ్చినట్టు ఢోలక్ వాయిస్తు కూచునేవారు. ఆ తర్వాత గుప్పిట్లతో బూందీలడ్లు తియ్యటి బూరెలు పంచిపెట్టేవాళ్ళు. పాటలు పాడి పాడి మున్నీ కంఠం జీరపోయింది. వదిన ముసలివాళ్ళ పాదాలు తాకుతూ తాకుతూ వాళ్ళకు తమలపాకులు చుడుతూ ఎంతో విసుగ్గా గొణుగుతూ వుంది. అప్పుడు తన గదిలో కూచుని ప్రభ ఒక్కతె ఏదో పుస్తకం చదువుకుంటు లేదా సమవయస్కులైన అమ్మాయిలు ఆమెను చూడాలని వస్తే వాళ్ళతో మాట్లాడుతూ వుండేది. వదిన ఆమె దగ్గరికి వచ్చి ఆకులు పోకలు పెట్టి వెళ్ళేది. ఎవరైనా చిన్న కోడలు పెద్దావిడ కంటె ఎక్కువ అందంగా వుందని, సభ్యత తెలిసిందని పైకి అనుకునే మాటల్ని వినగానే వదిన ప్రభ దగ్గరికివచ్చి తనలోతాను మాట్లాడుకుంటూపోయేది. ఇంతవరకు నువ్వు ఆకులే చుట్టలేదా? అక్కడేమో చిన్నమ్మ, అత్తయ్య, నా ప్రాణాలు తోడేస్తున్నారు. తొందరగా. ఆకులివ్వు. ఇటుతే నేనే త్వరత్వరగా ఆకులు కట్టెస్తా. నువ్వు కొత్తకోడలివిగా సిగ్గుపడుతున్నావు. ఆ తర్వాత అక్కడే సిద్ధంగావున్న ఆకుల్ని తీసుకుని వెళ్ళిపోయేది. పొరుగింటి ఆడవాళ్ళతో కబుర్లు చెబుతూ ఈ పెళ్ళిలో తమకు ఎంత తక్కువ పెట్టుపోతలొచ్చాయో మరీ చెప్పేది.

అసలు నేను ఆమె చేతి వంటే కాదు, ఆవిడ చేత్తో ఏదిచ్చినా తిననని వదినతో అప్పుడే చెప్పాను. ఆవిడ ఏ మంటుందోనని చూడాలని అనుకున్నాను అప్పుడు చివరికి అమ్మ మొదటిసారి ఇలా అంది. అలా కుదరద బ్బాయ్, ఇది మన ఇంటి ఆచారం. అన్న దేవతను ఎవరైనా అవమానిస్తారా? ఈ వ్యవహారంలో అమ్మ తాను మొదటిసారి నాకు నచ్చచెప్పింది. ఆమె నన్ను చీవాట్లు ఎందుకు పెట్టలేదో నాకు ఆశ్చర్యంగావుంది. మా ఇంటి వాళ్ళు ఈ విషయంలో ఎంతో నింపాదిగా ప్రవర్తిస్తున్న తీరు చూస్తుంటె అసలు నేనేం చేస్తున్నానో వాళ్ళకు నచ్చినట్టె వుంది. అయితే ప్రతిమాటకు చీవాట్లు వేసే అమ్మ ఏమీ మాట్లాడలేదు. ఎప్పుడైనా పిన్నితో చాలా మెల్లిగా అనేది. "ఏం చెప్పమంటావ్ పూనో, పెళ్ళి చేసిన సంబరమేదైనా మిగిలితేనా?" ఒక పెద్ద నిట్టూర్పు వదిలి మాటలు సగంలోనే మింగేసేది.

నన్ను భోజనానికి పిలిచినపుడు వంటగదిలో మున్నీ, అమ్మ, వదిన ఇంకా అమర్ మొదలైన వాళ్ళంతా వున్నారు. వంటగదిలో వంట చేసే చోటుకు భోంచేసే చోటుకి నడుమ ఛాతీ అంత ఎత్తున ఇటుకల గోడని కట్టడం జరిగింది.

పెద్దవాళ్ళముందు అది తెరగా కూడా ఉపయోగపడుతుంది. అప్పుడామె ఆగోడ వెనకాలే కూచుంది. ఆమె ఎలాకూచుని వంట చేస్తుందో నేను చూడ లేకపోతున్నాను, కాని పళ్ళెంలో వడ్డిస్తు గిన్నెలు సర్దుతూ వుంటె ఆమె చేతులు కనపడుతున్నాయ్. ఒకవిధంగా మొదటిసారి అంత దగ్గరగా చూసా నేమో ఆమె చేతులు ఎర్రగా అర చేతులపై గోళ్ళపై గోరింటాకు కనపడింది. రెండు వ్రేళ్ళకు పొడవాటి డిజైన్‌లో బంగారు ఉంగరాలు ఒక చేతికి, ఒక చేతికి గాజుల మధ్య ఒక బంగారు గాజు మరోచేతికేమో నల్లని పట్టు స్ట్రాప్‌తో వున్న రిస్టువాచీ వుంది. నాకు ఆమె చేతులు ఎంతో అందంగా, వేళ్ళు సన్నగా నాజుగ్గా కనపడ్డాయి. మొదటిసారి ఆవిడ మొఖాన్ని తదేకంగా చూడా లనుకున్నాను. అయితే వెంటనే నా అవలక్షణపు నటన పట్ల నాకే కోపమొచ్చింది.

వణుకుతున్న రెండు చేతులు పళ్ళాన్నిముందుకు తోయగానే వదిన జాగ్రత్తగా పట్టుకుని ముందుకు జరిపింది. నేనేదో మంత్రం చేస్తున్నానేమోన న్నట్టు అక్కడున్న వాళ్ళంతా నలువైపులనుంచి అలా వంగి చూస్తున్నారు. పళ్ళెంలో రెండు మడతలు పెట్టిన సనసన్నని రెండు రొట్టెలు మూడు కూరలు ఒకపప్పు, పెరుగు పచ్చడి, మరోరెండు చట్నీలు, అప్పడం, పచ్చడి వున్నాయి. చూడగానే నా ఆకలి వల్ల నోట్లో నీళ్ళూరాయి. చిరునవ్వుతో ఊరిన నీళ్ళను పక్కకు నెట్టి పళ్ళాన్ని నావైపు లాక్కున్నాను. ఎంతో నాజుగ్గా ఒక రొట్టె ముక్కను తీసి పప్పులో ముంచాను. నేను ఆమె వంటను ఎంత మెచ్చుకుం టానో అని అందరూ కుతూహలంగా చూస్తున్నారు. కాని ఆ రొట్టెముక్క నోట్లో పెట్టుకోగానే నోరంతామండిపోయి 'బాబోయ్ అంటూ బయటికి పరిగెత్తాను. బయట నోట్లో వున్న ముద్దను ఉమ్మేసాను. కళ్ళల్లో బాగా నీళ్ళు తిరిగాయి.

"ఏమైంది, ఏమైంది" అందరూ అడుగుతూ నావైపు అర్థం కాకుండా చూస్తుండిపోయారు. అటుప్రభ చేతిలో వున్న అప్పడాల కర్ర కింద పడినట్టువుంది.

ఏమైందేమిటి, నాతల! పప్పు మొత్తం చేదు విషం. ఈ పంచ భక్షపర మాన్నాలు నాకక్కరలేదు. నేను ఒక అమర వీరుడిలా వంగి ఒక రొట్టెముక్క తుంచి తలకానించి ఆ తర్వాత లాగి పళ్ళాన్నితన్ని ఎగురుతున్న గిన్నెల్ని కూడా వెనక్కి తిరిగి చూడకుండా బయటికి వెళ్ళిపోయాను. ఏడుస్తున్నట్టు ఆమె మాట వినపడింది. నేను పప్పును రుచిచూసానే.

ఎంత రాద్ధాంతం జరిగిపోయింది. "కోడలికి వంట చేయడం రాదు. ఇది కూడా నేర్పించాలా?" వదిన వ్యంగ్యంగా అంది. "పెళ్ళి చూపులపుడు

వంట ఎవరి చేతితో చేసి పెట్టారో ఎలా తెలుస్తుంది? పెద్ద రిస్ట్ వాచ్ పెట్టు కుని వంట చేయాలా! అయినా పొయ్యి దగ్గర వాచీతో ఏం పని. ధ్యాసనైనా చెయ్యాలి లేదా పనైనా చేసుకోవాలి. కనీసం మొదటిసారైనా జాగ్రత్తగా వండి తినిపించకూడదా? ఇపుడు అమృతం వండి పెట్టినా అప్పటి మాట వస్తుందా?" మరో వైపు నుంచి అమ్మ కేకలు వేస్తున్నది. "మహావచ్చింది పప్పు మొదటే రుచి చూసిందట పైగా! మీ వైపు ఉప్పువిషం తింటారేమో, మాకేంటటా ఒరిగేది? కొంచెం తక్కువేస్తే సొమ్మేం పోయేది. తక్కువుంటె మళ్ళీ అడిగితె సిగ్గుపోతుందా. అయ్యో చివరికి ఇది కూడా నేర్పించాలా? ఈ పెళ్ళిలో మాకేం దొరికిందని. చివరికి అమ్మాయి కూడా ఇంతే..." మున్నీ ఏమాత్రం మాట్లాడకుండా కూచుంది. మరుసటిరోజు ఆమె అన్నలు రాగానే వాళ్ళతోపాటు వెళ్ళిపోయింది. జీవితంలో కొంచెం సంచలనం కలిగింది. చర్చ జరిగింది, మళ్ళీ పూర్వస్థితిలోకి వచ్చేసాము, మరుసటిరోజునుంచి వంటగదిలోంచి నెయ్యి వంటకాల వాసన మాయమైపోయింది.

# నాలుగు

"సమర్ అన్నయ్యా! కిందికి, కొంచెం ఇటు చూడు" కింది నుంచి తమ్ముడు అమర్ పిలుపు వినపడింది. వాడు కింద అన్నయ్య సైకిల్ తుడుస్తూవు న్నాడు. తొంగిచూస్తే కింద గడపదగ్గర ఇద్దరు "స్వయంసేవక్‌లు నిలుచునివు న్నారు. కిందికి వెళ్ళాను."

"మీరు చాలా రోజులనుంచి రావడంలేదు. మీ ఆరోగ్యమేమైనా..." అని వాళ్ళు అడిగారు.

ఇంతకుపూర్వం రోజూ ఉదయం "వ్యాయామం" కోసం, సాయంత్రం బౌద్ధిక్ సమావేశాలకు వెడుతుండే వాణ్ణి, ఇప్పుడు ఈ వివాహం, మానసిక అశాంతి మూలాన వెళ్లడం మానేసాను. ఎంతో కష్టం మీద వారిని పంపించే సాను. విచారంగా కాళ్లు ఈడ్చుకొంటూ తిరిగొచ్చేసాను. వాళ్ళు మళ్లీవస్తా రేమో ననే అనుమానం భయపెట్టసాగింది.

ఆవిడ నిజంగానే ఒక తుఫానులా వచ్చి, కెరటంలా వెళ్లిపోయింది. కానీ ఇంట్లోని ఒక స్వాభావికమైన జీవనవిధానాన్ని ఎవరో పట్టుకొని తీవ్రంగా

ఊపినట్టు కనపడింది. ఏదో ఒక పెద్ద ప్రమాదం జరిగి పోయినట్టు - దాని నిజమైన ప్రభావాన్ని అంచనా వేయాలంటే మనస్సు సిద్ధంగా లేనట్టు అనిపించింది. ఏదో పీడవచ్చి వెళ్లి పోయినట్టుగా భావిస్తున్నాను. ఎవరో నిజంగానే సెలవిచ్చారు దూరంనుంచి ఎంతో భయంకరంగా కనపడే కష్టాల పర్వతం ఎంత విశాలమైనా విస్తృతమైనా చివరికి దాని మధ్యనే పిల్లదారులు, మార్గాలు పుట్టుకొస్తాయ్!

ఒకసారి అమ్మ ఎవరితోనే అంటూవుంటే - "మా అబ్బాయిలకు అమ్మాయిలు కరువా? మేము సమర్‌కు రెండో పెళ్లి చేస్తాం!" నేను విని, బహుశా నా జీవితంలో మొదటిసారి లేదా రెండోసారి అంత తీవ్రంగా మందలించాను - "ఒక పెళ్లి మహా వెలగబెట్టింది చాలదా! ఇక నా చదువు సాగనివ్వండి." ఆ తర్వాత అమ్మ ఏమీ అనలేదు. లోలోపల ఎక్కడో అనిపిస్తున్నది. ఈ రోజు కాక పోతే రెన్నెళ్లకు, నాలుగునెలలకు సంవత్సారానికి లేదా రెండు సంవత్సరాలకు మాట్లాడుకోకపోయినా ఆమె నా భార్యనేకదా! మా ఇద్దరి భాగ్యరేఖలను ఒకే చోట ముడివేసాక, దాన్ని నిభాయించుకోవలసిందే!

నా మొండితనం మూలంగా మొదట ఏలాంటి బేరసారాలు సాగనేలేదు. ఆశించనంత రానేలేదు, అందువల్ల అమ్మ తరుచుగా అంటూ వుండేది. "ఏం చెప్పమంటావ్ చందన్, ఈ పెళ్ళిపై పెట్టుకున్న ఆశలన్నీ ఎప్పుడో నీరు కారిపోయాయి." చందన్ నా మేనమామ పేరు, ఆయనే ఈ పెళ్ళి సంబంధం కుదిర్చాడు. అందువల్ల అమ్మ ఆయనతో ఫిర్యాదు చేస్తుండేది. "చదువుకున్న అమ్మాయి అనే కానీ, నీకింకేం కనపడింది?"

పెళ్ళిరోజుల్లో పైకి చూపించే ఆడంబరాలన్ని ముగిసిపోయాయి. ఇప్పుడు మళ్ళీ అదే చేదువాస్తవం మిగిలింది. చక్కెర కొట్టు వాడికి, గోధుమల కొట్టువాడికి ఇంకా ఇతరులకు చెల్లించ వలసిన బాకీల విషయంలో ప్రతిరోజు ఇంట్లో మహాభారతం జరుగుతుండేది. ఏ కారణం లేకుండానే నాన్నగారు అమ్మా, అన్నయ్యలతో తరచుగా అంటుండేవారు. "ఇక ముందు ఏమి జరుగవలసివుందో దాని గురించి ఆలోచించారా?" ఆయనకు ఇరవై అయిదు రూపాయల పెన్షన్ దొరికేది. అన్నగారికేమో కరువు భత్యంతో కలుపుకుని తొంబైతొమ్మిది రూపాయల జీతం. ఆయన పెళ్ళిలో పెట్టిన సైకిల్‌నే రోజూ లాగుతున్నాడు. జబ్బు మూలంగా శిధిలమైపోయిన శరీరంతో సాధారణంగా అమ్మ మంచంపైనే కూచుని జపమాల తిప్పుతు ఏదో గొణుగుతూ వుండేది. ఇద్దరు

ముగ్గురు పిల్లలు చదువుకుంటున్నారు. అమర్ మెట్రిక్ కడతాడు, అందరి కంటె చిన్నవాడు కువర్ ఆరో తరగతిలో వున్నాడు. అందరిని చదివించాలి. మున్నీ వుండనే వుంది. ఈ సారి నేను ఇంటర్ పాసైపోవలసిందే.

మా యింట్లో అందరికంటె అభాగ్యురాలు మున్నీ. నాకంటె రెండు సంవత్సరాలు చిన్నది. రెండు మూడేళ్ళ క్రితం దాని పదహారు, పదిహేడవ యేట చదువుమానిపించి పెళ్ళిచేసారు. ఆపెళ్ళిలో ఎదురుదెబ్బలు తట్టుకుంటు గత్యంతరంలేక ఇంట్లోని కొన్ని వస్తువులు అమ్మి, అన్నగారి పెళ్ళిలో వచ్చిన కొన్ని వస్తువులను కలిపి వరకట్నం ఇచ్చారు. పెళ్ళికి వచ్చిన అబ్బాయి తాలూకా బంధువులు ఎంత విసిగించారని - మాకు ఈ మర్యాదలు చెయ్యండి. అవి కావాలి, ఇవికావాలని... అత్తగారింటి నుంచి మున్నీ కరుణాపూరితమైన ఉత్తరాలు రాసేది. ఇక్కడికి వచ్చినపుడు వెక్కి వెక్కి ఏడ్చేది. అత్తగారు, భర్త కలిసి చేసిన అత్యాచారాలను గురించి ఎవరికైనా చెప్పుకునేది కూడా కాదు. అసలు విషయం మాకు తర్వాత తెలిసింది. మున్నీ భర్త ప్రవర్తన ఏమీ బాగుండలేదు. అతను రాత్రుళ్ళు ఎక్కడెక్కడో తిరిగేవాడు. సంవత్సరంన్నర పాటు ఏడుస్తూ ఎలానో బండిని లాక్కొచ్చింది. కాని అత్తగారు మరణించగానే కష్టాల కొండ విరుచుకుపడింది. అప్పుడిక పతిదేవుడిని అదుపుచేసే వాళ్ళెవరున్నారని అతను ఎవత్తినో తెచ్చుకుని ఇంట్లోనే పెట్టుకున్నాడు. ఎవరో బ్రాహ్మణ కులం దట. తనకు ఆ వుంచుకున్నావిడకు మున్నీతో పని మనిషిలా సేవలు చేయించుకునేవాడు. రెండు, మూడు రోజులపాటు తిండిపెట్టేవాడు కాదు. చెప్పినలవికాని ఇంకెన్ని అత్యాచారాలు చేసాడో మున్నీ ఏమీ చెప్పేదికాదు. రాత్రుళ్ళు మున్నీ రెండు అరచేతులపై మంచం కోళ్ళు పెట్టి తొక్కేవాళ్ళు. తగులబెట్టి చంపేస్తామని బెదిరించి ఆనందించేవాళ్ళు. చివరికొకరోజు బెత్తం దెబ్బలతో వాచిపోయిన శరీరంపై నీలి గుర్తులతో ప్రొద్దున్నే మాయింటికి చేరుకుంది. అంతే అప్పటినుంచి ఇక్కడే వుండి పోయింది. ఇప్పుడు మున్నీని చూస్తుంటె మనస్సంతా వికలమైపోతుంది. దాని భర్తను పట్టుకొచ్చి బజారులో నిలుచోబెట్టి తన్నుతూ కొరడాలతో కొట్టాలనిపిస్తుంది. "రాక్షసుడా! పువ్వులాంటి మా చెల్లిల్ని ఇందుకేనా నీకు కట్ట బెట్టింది. చూడు శరీరంపై దెబ్బలెలా తగులుతాయో." నేను నా మనస్సులోనే పళ్ళు కొరుకుతూ అతన్ని నేను విపరీతంగా కొడుతుంటే అతని నోట్లోంచి నురుగులు కక్కుతున్నట్లు ఊహించుకునే వాణ్ణి. మున్నీ అసలేమి ఆలోచిస్తుందో తెలియదు. మహా అయితే ఏమీ మాట్లా

దకుండా, తటస్థంగా వుండిపోవడం ఆమె స్వభావంగా మారిపోయింది. ఇంట్లో వాళ్ళందరూ కింద వుంటె మున్నీ మిద్దెపై ఒంటరిగా కూర్చుని తదేక దృష్టితో ఎటో చూస్తు వుండిపోయేది. మిద్దెపై నుంచి కిందికి రాగానే తనలోతాను ముడుచుకుపోయి అందరి చూపులను తప్పించుకుంటు తిరిగేది. తాను లోలో పల ఎంత మధన పడుతున్నదో, ఏవేవి ఆలోచిస్తున్నదో: నేను చూస్తుండ గానే పాలిపోయి పసుపు రంగులోకి మారిపోతున్నది. పద్దెనిమిది, పందొ మ్మిది యేళ్ళ వయస్సులో మెరిసే ముత్యంలా వుండవలసింది ముడతలతో దుఃఖంతో వాడిపోయింది. కాని ఏం చేయగలం? బహుశా ఇక జీవితాంతం అది ఇక్కడే వుండిపోవలసిందేనేమో! నాన్నగారు మున్నీ భర్తకు ఎన్నో ఉత్త రాలు రాసారు. మా పట్నంలోని, బంధువర్గంలోని ముఖ్యుల ద్వారా ఎంతో వత్తిడి తెచ్చారు కూడా. కాని ఏమీ జరుగలేదు. తాను స్వయంగా ఏదైనా ఉద్యోగం చేసుకునేంత చదువులేదు. దివారాత్రులు చదువుకుంటె అయిదారే ళ్ళలో ముప్పై, ముప్పై అయిదు జీతం పొందె మాస్టరమ్మ కాగలుగుతుం దేమో. కుట్టుపని నేర్చుకోవాలన్నా రెండేళ్ళు పడుతుంది. అయినా డబ్బు ఒక సమస్య మగపిల్లల చదువు ఖర్చుకే ఎంతో గొడవై పోతుంది. మున్నీ వచ్చినపుడు మొదట్లో అందరు ఆమె పట్ల సానుభూతి చూపేవాళ్ళు. ఆమెకు ధైర్యం చెప్పేవాళ్ళు. ఇపుడు దాదాపు అందరూ మరిచిపోయినట్లే. ఎవరు మర్చిపోయినా తాను మాత్రం ఈ ఇంటిపై స్వయంగా ఒక భారమనే విష యాన్ని మున్నీ మర్చిపోలేదు.

నా వివాహం జరిగినతర్వాత మా యింటి యథార్థ స్థితి ఏవిటో ఇప్పుడు నా కళ్ళ ఎదుట మరింత స్పష్టంగా కనపడుతున్నది. అసలు నాపెళ్ళి జరిగిందా అని అనిపిస్తుంది. అది మరెవరో అయ్యుంటారు. ఇప్పుడైతే ఇంట్లో కొత్త కోడలి విషయం కూడా ఎవరూ ఎత్తడం లేదు. నా అయిష్టాన్ని అవసర మైన దాని కంటె పెద్దది చేసి చూస్తున్నారనిపించింది. ఒక బయటి వ్యక్తిని ఈ యింటి వ్యక్తిగా చూడాలనే విషయాన్ని అందరూ మరిచిపోయారు. అయితే వదిన మాత్రం ప్రసన్నంగా వున్న క్షణాల్లో నవ్వుతూ అనేది. "చూడు లాలాజీ, అన్నీ సర్దు కుంటాయ్. ఆడదాన్ని నొక్కిపెట్టకపోతే చేతికి రాదు. ఇక మొద ట్నుంచి అహంభావం ముదిరి వుంటె ఇక చెప్పనక్కర లేదు! ఆడది కొయ్యతో చేసిన కోతిలాంటిదని మా తాతగారు అనేవారు. మగాడికి వెనకాముందు ఏమీ కనిపించనంతగా ఆడదాన్ని మరీ తల కెక్కించుకోరాదు. ఎంత చది

వినా, ఎంత స్వర్గం నుంచి దిగివచ్చిన దేవకన్య అయినా చేయవలసిన పని ఇదే కదా మగాడికి పనితో ప్రేమగాని వుట్టి చూపులతో కాదు. పుస్తకాలు ఎన్ని చదివితే లాభమేమిటి? వ్యవహారం తెలియకపోతే అంతా బూడిదలో పోసిన పన్నీరే! చూడు లాలాజీ, నన్ను నిద్రలోంచి లేపినా, చూడకుండానే కారం, మసాళాలు అన్ని వేసేయగలను. ఏమాత్రం ఎక్కువ, తక్కువ అయినా ముక్కు కొసేయ్యొచ్చు." ఆతర్వాత తన తల్లిగారి ఇంటి గురించి చెప్పేది. "మా పెద్ద న్నయ్య భార్య కూడా ఇలానే వుండేది. ఎవ్వర్ని లెక్కపెట్టేది కాదు. మరి అన్నయ్య సహించగలడా? రెండు రోజుల్లో ఆమె తలబిరుసును దించేసాడు. ఏదైనా లాలాజీ, కొట్టా తిట్టకుండా దారిలో పెట్టడం కొందరికే చాతనవు తుంది. ఇప్పుడు మా వదిన సంగతి చెప్పక్కరలేదు. అన్నయ్య కనుబొమలు ముడుతపడితేచాలు ఆమె ఆకులా వణికిపోతుంది." మావదిన తన పంజాను వణికించి ఆకు వణుకుతున్నట్టు చూపించింది.

ఎందుకో మా మనస్సంతా మరీ భారంగా రోగగ్రస్తమైనట్టు అనిపిస్తు న్నది. ఇంట్లో ఎప్పుడు చూసినా డబ్బు ఇబ్బంది గొడవే. మాకు సహాయం చెయ్యమని అడిగే సూచనలు ఎప్పుడు కనబడుతుండేవి, నేను మా యింటి వాళ్ళ ఎదుట పడేందుకు భయపడేవాన్ని ఒక రోజడిగాను. "మీరునన్ను ఎఫ్.ఏ. పరీక్ష ఇమ్మంటారా వద్దా?" వెంటనే అన్నయ్య అన్నాడు. "ఎవడు చదువు మానమంటున్నాడు. నేను చెప్పాలనుకున్నాను. అయితే పొద్దస్త మానం ఈ గొణుగుడు మానెయ్యండి చదివిస్తున్నామనే ధ్యాస ఒక వైపు మరేమో చదువుకోనివ్వాలనే ఇష్టం లేదు."

ఇవన్నీ మర్చిపోయి అలా పొద్దస్తమానం చదువులోనే గడిపేయాలని అప్పుడప్పుడు మనస్సులో తపించిపోయేవాణ్ణి ఎవరిష్టమొచ్చినట్లు వాళ్ళు అరుచుకోని. నాలోపల ఒక విచిత్రమైన అనుభవం కలుగుతోంది. పూర్వం ఏమీ లక్ష్యపెట్టని ఒక నిశ్చింత మనస్సంతా నిండిపోయి, ఉజ్వలమైన, ఉన్నత భవిష్యత్తు స్వప్నం నా మనస్సు-శరీరం నిండా ధగధగా మెరిసేవి. ఇప్పుడు అవి ఆరిపోతున్నాయి. నేనేమి చేయాలనుకున్నానో నా కళ్లఎదుటే కనపడుతున్నాయి. ఒక అద్భుతమైన వితృష్ణ విరక్తి ఒక పెద్ద ఇనుప దిమ్మలా కూరుకుపోయింది. దానిపై ఈ అంశాలన్ని గన్ను దెబ్బలా మారుమ్రోగుతున్నాయి. ఒక డొల్లతనపు చప్పుడు నిశ్శబ్దంలోని మెరుపు మూలంగా నా అంతరంగం సొంతం ఆక్రోశంతో పరితపిస్తున్నాది. ఇంట్లో అసలు వుండాలనిపించడం

లేదు. రెండు పూటల తిండి, పడుకోడం తప్పదు కాబట్టి వుంటున్నాను. మొదటి నుండె నేను ఇంట్లో మాట్లాడను, ఇప్పుడు కూడా అంతే. కాని మొదట ఉండే మౌనం ఆత్మసంతృప్తికి సంబంధించినది. అయితే ఇప్పుడు వున్న మౌనం నన్ను లోలోపల రంపంలా కోసివేస్తున్నది. ఏపనిలోను మనసు లగ్నం కావడం లేదు. వేలాడుతున్న డెమోక్లోస్ ఖడ్గంలా బోర్డు పరీక్ష తన నిశ్చితమైన, క్రూరమైన మందగతితో వంగుతున్నది. ఆ ధ్యాస కలగగానే కత్తి కింద మెడవున్న మేకలా నా అస్థిత్వం అంతా వణకిపోతున్నది. కాలేజిలో పీరియడ్లు వున్నా లేకపోయినా పది నుంచి నాలుగుదాక అటూ, ఇటూ తిరిగి గడిపేస్తున్నాను. అప్పుడప్పుడు హాస్టల్‌కి వెళ్ళి ఎవరిదగ్గరో కూర్చోడం, లేదా ఇంకెవరి ఇంటికో వెళ్ళిపోవడం నాలోపలిదేదో తప్పిపోయింది - అర్థం కావడం లేదు. అయితే ఒక మాట మాత్రం నేను అర్థం చేసుకోగల్గుతున్నాను. నేను ఏ పనీపాటా లేకుండా దినమంతా మొఖం వేలాడేసుకుని అలా ఊరికే తిరిగేస్తున్న రకాన్ని అని జనం అనుకుంటున్న విషయాన్ని గమనించాను. ఆమె కళ్లల్లో ఈదుతున్న ధిక్కారం. అనాదర భావం నా మనస్సులోని కోమలత్వంపై ఆసిడ్ తో గీతలు గీస్తున్నది. ఇది సహించలేనప్పుడు బయటికి వెళ్ళి పార్కులో కూర్చుంటాను. అక్కడే మూడు, నాలుగు గంటలపాటు పడి వుంటాను. లేచి రావాలని అనిపించదు. అలా పడుకుని ఏదేదో ఆలోచిస్తుంటాను. ఎన్నో ఆలోచిస్తాను కాబట్టి నాకేమీ జ్ఞాపకంవుండదు. లేదా అసలు నేనేమీ ఆలోచించను. అనవసరంగా ఏ పనిలేకుండా అలా పడివున్నానని అకస్మాత్తుగా ధ్యాస రాగానే కాళ్ళీడ్చుకుంటు ఇంటికి వచ్చేస్తాను. ఇంటి కెవరొచ్చారు, ఎవరు వెళ్ళారు, ఏం జరిగింది ఇవేవి తెలుసుకోవాలనే కోరికే లేదు. ఎంతో చీదరగా వుంటుంది. పూర్వంలా ఏ చింతాలేకుండా వుండాలని తపిస్తాను, కాని ఈ భారం నన్ను వదలదే!

అంతా నిష్ప్రయోజనం, జీవితమంతా వ్యర్థమై పోయింది. ఇంతవరకు నేను జీవించిన రోజులన్ని నిరర్థకమై నిరుద్దేశ్యంగా గడిచిపోయాయి. రానున్న దినాల ఎదుట భయంకరమైన చీకటి గోడ నిలుచునివుంది. అక్కడ మరో దారి కనపడటం లేదు. ఏ పని చేయాలన్న ఒక ప్రశ్న ఎదురౌతున్నది - ఇది చేస్తే ఏమిటి లాభం? దానివల్ల ఏం ఒరుగుతున్నది. ప్రపంచంలోని ప్రతి వస్తువు నిష్ప్రయోజనం అనవసరం అని అనిపిస్తున్నది. జీవనరసం ఎండిన స్పాంజ్‌ను ఎవరో క్రూరమైన పిడికిలితో పిండుతున్నట్లనిపిస్తున్నది.

మనస్సుపై కళ్ళపై పొగ మంచు వ్యాపించి వుంది. మంచులోని గడ్డ కట్టించె గుణం ప్రాణాలను తోడేస్తున్నది.

సాలెగూడులో చిక్కుకున్న ఈగలా నేను ఏదో వలయంలో పడిపోయి నట్లు అనిపిస్తున్నది. ఆ వలయంలో నా జీవనసారాన్ని అపహరించి చుక్కలు, చుక్కలుగా ఎండబెట్టి మిగిలి పోయిన కంకాళాన్ని వదిలివేసినట్లు, నేను స్వయంగా మరణించినట్టు అనుభవిస్తున్నాను. నా కంటివెలుగు, నా పెదా లపై చిరునవ్వు మాయమౌతున్నట్లు, కరిగిపోతున్నట్లు చూస్తున్నాను. అను భూతి చెందుతున్నాను. కాని ఇదంతా ఎలా ఆపగలను. ఇంట్లోని రుసరుసలు నేనేదో తప్పు చేసాననే ఒక అపరాధభావం నన్ను నిరంతరం కాల్చి వేస్తు న్నది - అలా తగులబడిపోతున్న లక్కఇల్లులా.

కాలేజి పిల్లల్ని చూస్తుంటె వాళ్ళు అవసరమున్నా, లేకపోయినా ప్రతి మాటకి ఎలా నవ్వగలుగుతున్నారో, నిర్లక్ష్యంగా వుంటూ ఎవరెవర్నో ఏడి పించడం హాస్యమాడడం వాళ్ళకెలా సాధ్యమౌతుందో అర్థంకావడంలేదు. అసలు వీళ్ళలో ఎవర్ని నేను గుర్తుపట్టనేమోనని అనిపిస్తున్నది. నడిచి వెడు తున్న అమ్మాయిల్ని ఏడిపించడం, సైగలు చేయడం, గుర్రపుబండి వెనకాల పరిగెత్తడం, లేదా ధర్మసత్రాలలో వుంటూ సహాయాన్ని అర్థించే శరణార్థులైన ఆడవాళ్ళతో కట్టుకథలు చెప్పడం, సినిమా నటీనటుల కబుర్లు చెప్పుకోడం, క్రికెట్ ఆటగాళ్ళ గురించి వాదించుకోవడం నాకు ఇవన్నీ కృత్రిమం. అబద్ధం అనిపిస్తాయి. ఇదేకాదు మేధావులైన విద్యార్థులు, రాజకీయాలను చర్చిస్తున్న. కమ్యూనిజం వల్ల భారతీయ సంస్కృతికి వాటిల్లబోయే ముప్పు గురించి మాట్లాడుతున్న. వాటిలో పాల్గోవాలన్న ఆసక్తి వుండేదికాదు. వీళ్ళందరూ జీవితానికి సంబంధించని ఏవో విషయాల గురించి మాట్లాడుతున్నారనిపి స్తుంది. వీళ్ళందరూ ఎందుకు నోరు మూసుకోరో నాకు చికాకు కలుగుతుంది. పొద్దస్తమానం వీళ్ళందరూ ఎందుకు వాగుతారు. పిచ్చివాళ్ళలా ఎందుకు గంతులేస్తారు. ఈ మాటలవల్ల ప్రయోజనమేంటి. ఒరే విన్నావా, మధుబాల ప్రపంచంలో అందరికంటె అందమైన నటి, ఇక అశోక్ కుమార్ సంగతి చెప్పక్కరలేదు. ముసలివాడైనా ఏం నటిస్తాడను కున్నావ్ - ఈ పనికిరాని మాటలతో ఒరిగేదేమిటి. అసలు ఆటకంటె దాని రన్నింగ్ కామెంట్రి లక్షరెట్లు ఆకట్టుకుంటుంది. అని అంగీకరించినా స్టాలిన్ కూతురు చేసిన పెద్ద పెద్ద వస్తువ్ని బయటపడుతున్న. అయితే ఏం అసలింతకు వీళ్ళకేం కావాలె ఈ

బయటి ప్రపంచంలోనే మొత్తం జీవితం విస్తారంగా, విషాదంగా, నిష్ప్ర యోజనంగా కనపడుతున్నది. అయితే నాలోలోపల ఒక్కోసారి కలుక్కుమం టుంది - నేను కూడా వీళ్ళందరిలా అట్టహాసంగా నవ్వుతూ మాట్లాడుతూ, ఎగిరిగంతేసి దారిలో పడివున్న సిగరెట్ డబ్బాను ఎందుకు కిక్కు కొట్టకూ డదు? కాని నేనేం చెయ్యను. మనస్సే స్థంబించి పోయింది. కాలేజిపిల్లలందరూ పొద్దస్తమానం నన్ను ఏడ్పుగొట్టుమొహమా అని అంటూవుంటె నేను మరో ఇరవై ఏళ్ళు పైబడిన ముసలివాడిలా అనిపించేది. ఈ తీవ్రమైన నిరాశ నిస్పృహ కనపడని ఈ విస్తారమైన అలసట నా నరనరాన వ్యాపించిపోయింది.

మబ్బులకు అవల ఎగురుతున్న ఆ కాషాయ ధ్వజం ప్రతిరోజు నా నుంచి దూరంగా వెళ్ళిపోతుంది. సినిమా చూసి ఎన్నో ఏళ్ళైపోయింది. పెళ్ళిరోజుల్లో ఏదో ఒకటి చూసినట్టు జ్ఞాపకం. నా వివాహం జరిగాక అమ్మాను. నాన్నగారిని డబ్బులు అడిగే అధికారాన్ని పోగొట్టుకున్నట్టు నా మనస్సులో ఒక భావం స్థిరమైపోయింది. నిరాశ, నిస్పృహ... నేను ఒంటరివాడినైపోయాను. గీతాపారాయణం చేసినప్పుడల్లా క్షణికమైన శాంతి లభించేది. దేవాలయపు ఏకాంతంలో కూచుని ఆలోచిస్తే సుఖమనిపించేది. అప్పుడే నేను అన్ని మరి చిపోయి వచ్చేసానని అనిపించేది. చెడు ఆలోచనలు, బాధలమూలంగా చిట్లిపోతున్న నా నరాలను ఇక్కడి సుగంధితమైన అగరు వాసనలు జోకొట్టి నిద్రపుచ్చేవి. మళ్ళీ వెనక్కి ఇంటికి వెడుతుంటె తిరిగి ఆ రుసరుసల ప్రపం చంలోకి మనిషిని గానుగెద్దులలాపూర్చేచోటికి వెడుతున్నానని అనిపించేది. అయితే ఒక సంఘటన జరిగిన తర్వాత దేవాలయానికి కూడా వెళ్ళడం మానివేసాను - చొక్కా, పైజామా వేసుకున్న ఒక బలహీనుడైన ఒక పంజాబీ శరణార్థుడు సగం చచ్చి వణికిపోతు, దేవాలయంలోకి చొచ్చుకువచ్చాడు. ప్రసాదం పెట్టమని అర్థిస్తున్నాడు, పూజారి అతన్ని బయటికి తరిమి మర్రి చెట్టు కింద సగం కాలిన కర్రతో కుక్కలా కొట్టి కొట్టి గెంటివేసాడు - ఆ దృశ్యం నా మనస్సులోని ఏదో తీగను తెంచివేసింది. నేనేమి మాట్లాడ కుండా, అలానే చూస్తూ ఏదో ఆరంతస్తుల మేడ పై నుంచి కింది దృశ్యాన్ని చూస్తున్నట్టు ఉండిపోయాను. దేవాలయంలో అదే నా చివరిరోజు.

నన్ను ఒంటరివాడిగా వదిలివేయమని అందరూ కలిసి నాకు విరుద్ధంగా ఏదో కుట్ర పన్నుతున్నట్టు ప్రతీక్షణం సూటిగా నాతో ఏమీ మాట్లాడకుండా, నాపట్ల అవమానకరమైన ఉదాసీనతను చూపించి లేదా ప్రతిది సైగలతో

చెప్పేయడం నన్ను దివారాత్రులు తినివేస్తున్నది. నన్ను ప్రతి మనిషి ద్వేషిస్తున్నాడని, నానుంచి విసిగిపోయాడని అందరి ముఖాలపై నా పట్ల ఒక తీవ్రమైన తిరస్కారభావం. నాకెంతో భయమేసింది. ఇంటివైపు వెడుతుంటె ఒక విచిత్రమైన భయంతో గుండె కొట్టుకునేది. నా వివాహం వల్ల మీ ఆశలు నెరవేరలేదు... ఇది కూడా నేను చేసిన నేరమేనా అప్పుడప్పుడు లోలోపల తీవ్రంగా అనిపించేది, అమ్మ నన్ను పిలిచి ఎందుకని అడగదు? అన్నగారికి నావైపు చూసే తీరిక కూడా లేదు. నాన్నగారి పట్ల నాకున్న భయం రోజురోజుకు ఇలా పెరిగిపోవలసిందేనా?

నేను ప్రభ గురించి ఏ మాత్రం ఆలోచించదలచలేదు. కాని ఇంట్లో మాత్రం ఆమె గురించి ఏదో చెడు నా చెవిన పడినప్పుడల్లా, నా మనసులో కొంచెం వ్యతిరేకత తొంగిచూసేది. వీళ్ళకి మరేం పన్లేదా, నా మెడలో గుదిబండ వేయమని నేను చెప్పానా! ఈ తలబిరుసమ్మాయిని తీసుకువచ్చి నాకంటగట్టారు. ఇప్పుడేమో దోషమంతా నాదేనని అంటున్నారు. నా మనస్సులో ఉన్న ఆవిడ చిత్రాన్ని చూసుకున్నప్పుడల్లా, ఆ మొత్తం వ్యవహారానికి మూలం నిశ్చయంగా ఆవిడ అహంకారమే నని అనిపించింది. కాని తటస్థుడనై ఆలోచించినపుడల్లా నన్ను నేనే అడిగేవాణ్ణి - నా భార్య నా ఇంట్లో నాలుగు రోజులపాటు వుంటె నేను ఒక్కమాట కూడ ఎందుకు మాట్లాడలేదు.

ఇక ఇప్పుడు ఇదంతా సహించలేని స్థితివచ్చేసింది. ఎక్కడో ఏకాంతంలో కూచుని స్పృహ తప్పిపోయేంతగా ఏడ్వాలను కుంటున్నాను. ఆ మూర్ఛలో అలానే వుండిపోతే... అయినా ఇలా కోరుకుంటున్నానేమిటి? ఏమిటీ బలహీనత, ఏడుస్తున్నపుడు దిండు మురికి గలీఫా పెదాలకు రాసుకోవద్దని, తల దేవాలయంలోని చల్లని పాలరాతి స్తంభానికి తాకవద్దని, చెంపలపై లాన్‌లోని ఎండుగడ్డి గుచ్చుకోకూడదని ఎందుకనిపించాలి?... అర్థంకాదు వాటిస్థానంలో ఏమివుంటే నాకు శాంతి లభిస్తుంది...!

## ఐదు

ఒక రోజు మున్నీ నాకు భోజనం పెడుతు అడిగింది. "అన్నయ్యా, నువ్వు ఏమాత్రం మాట్లాడలేదా?"

ఆమె ఉద్దేశ్యాన్ని గ్రహించాలని మున్నీ మొహం వైపు చూసాను. పళ్ళాన్ని

నావైపు లాక్కుంటు ముక్తసరిగా జవాబిచ్చాను. 'లేదు' నా స్వరంలో ఎలాంటి ఉత్సుకత లేదు. అయితే మున్నీకి ఈమాట ఎందుకు తట్టిందో తెలుసుకోవా లనే కుతూహలం కలిగింది.

"రెండో పెళ్ళి చేసుకుంటావా!" పొయ్యి ముందు కూచుని ఒక బొగ్గుని అటూఇటు ఆడిస్తు మున్నీ మళ్ళీ అడిగింది. "అవును, ఒక పెళ్ళి చేసుకుని ఆవిడ్ని ఏడిపిస్తున్నాము. రెండోది ఎవరి పేరుతో ఏడుస్తుంది." అకస్మాత్తుగా నా నోటినుంచి ఆమాటలు వచ్చాయి. అప్పుడే హఠాత్తుగా మొదటిసారి క్షణం లోని ఒక అధిభాజ్యఖండంతో ఈ అంశం నా సమక్షంలో మెరుపులా మెరి సింది. మా ఇంటి వాళ్ళందరి ప్రవర్తన వల్ల ప్రభ ఎంత దుఃఖించిందో ఆమె విషయంలో ఎప్పుడు కూడా ఎవరూ ఆలోచించలేదు. ఇప్పుడైతే అందరూ ఆమె చచ్చిపోయినట్టుగానే మర్చిపోయారు. మళ్ళీ హఠాత్తుగా మనస్సులో ఈ భావం మెదిలింది - ఆమె భరించరాని దుఃఖంలో ఒకవేళ నేను ఆవిడ వల్ల సంతోషంగాలేని పక్షంలో రెండో పెళ్ళి చేసుకొమ్మని మావాళ్ళకి రాసి వుంటుంది కాబోలు. ఇలాంటి అమ్మాయిల గురించి ఎక్కడో చదివినవి, విన్నవి స్ఫురణకు వచ్చాయి. ప్రభ ఏదైనా ఉత్తరం రాసిందా? అని అడగాలనిపిం చింది. నేను మింగిన ముద్ద ఏశక్తివల్లనో మళ్ళీ బయటకి వచ్చేస్తున్నది. నాకు భోజనం రుచించలేదు. ఆకలి చచ్చిపోయింది. లోపలనుంచి తన్నుకు వస్తున్న ఆవేగాన్ని ఒక నీటిగుక్కతో అణిచి అడిగాను. "నీతో ఎవరన్నారు అమ్మేనా?"

"లేదు, నేనే ఊరికే అడిగాను." మున్నీ ఆవిధంగా తప్పించు కుంది. మళ్ళీ ఎందువల్లో నా మొఖంవైపు చూసి అన్నది. "రాత్రి భోజనాలయ్యాక వదిన, అమ్మ కాళ్ళు పడుతున్నపుడు తరుచుగా ఇలాంటి మాటలు దొర్లు తుంటాయి." మున్నీ తన మణికట్టును పైకిలేపి చేతి గాజులను పైకి కిందికి జరుపుతూ వుండిపోయింది.

"మున్నీ, నేను నిజం చెబుతున్నాను. నేను ఇంట్లోంచి పారిపోతాను. జాగ్రత్తగా చదివించడమైతే చాతకాదు, పైగా నాలుగు, నాలుగు పెళ్ళిళ్ళు చేసేయండి?" నేను జీరబోయిన గొంతుతో అన్నాను.

మున్నీ కాసేపు నిశ్శబ్దంగా వుండి మళ్ళీ అన్నది. "సరే అన్నయ్యా, ఒక మాట చెప్పమంటావా?" ఏదో రహస్యం విప్పనున్నట్లు ఆమె కంఠం ధ్వనించింది.

నా మొఖంపై ప్రశ్న ఉలికింది అప్పుడే అకస్మాత్తుగా ద్వారం దగ్గర

వదిన కనబడింది. వంటపూర్తి చేయాలనే తొందరలో స్నానం మాత్రం చేసి వచ్చేసింది. పిండిన బట్టలు ఆమె భుజాలపై కుప్పగా పడి వున్నాయి. చూడగానే అన్నది. "ఓహో, ఈ రోజు మున్నీ వడ్డిస్తున్నదా! అసలు లాలాజీ, ఎవరైనా వడ్డిస్తారేమోనని ఏమీ మాట్లాడకుండా కూచున్నాడేమోనని నేను పరిగెత్తుకొచ్చాను. లేకపోతే ఏమీ తినకుండానే వెళ్ళిపోతాడు. మన లాలా జీకి ఏవై పోయింది? ఆమె నెమ్మదిగా నా ఎదురుగా వున్న గోడకు వీపు ఆనించి కూర్చున్నది. అలసటతో ఆయాసపడుతున్నది. గర్భవతి ఆమె. భుజంపై నుంచి బట్టలన్ని దింపి మున్నీ, "మంచిదానవు కదమ్మ కాస్తవీటిని తీసుకు వెళ్ళి ఆరవేయ్."

"బాగానే వుంది పనిచెప్పడానికి నీకు నేనే దొరికానా? నువ్వే వెళ్ళి ఆరేసుకోవచ్చుగా" మున్నీగారాలుపోతూ అన్నది. "నీ ఒట్టు మున్నీ ఉతికి ఉతికి చేతులన్ని విరిగిపోయాయి. నీ కాలు మొక్కుతానమ్మ తీసుకెళ్ళకూడదు." వదిన ఎంతో అలసిపోయిన స్వరంతో అన్నది. కాస్తవిచిత్రంగా మున్నీ కళ్ళలోకి చూసింది. మళ్ళీ తానే నవ్వి వూరుకుంది. మున్నీ కూడా నవ్వేసి బట్టలు తీసుకుని వెళ్ళిపోయింది.

నేను చిన్న చిన్న రొట్టె ముక్కల్ని నోటిలో పెట్టుకుంటున్నాను. బొత్తిగా తినాలని లేదు. వదిన తలపై చేతులుపెట్టుకుని నావైపు తదేకంగా చూస్తు ఏదో ఆలోచిస్తు వున్నది. మళ్ళీ తనలో తాను మాట్లాడుతున్నట్లు "ఈసారైతే దీపావళి కి పూర్వమే చలిబాగా పెరిగేట్టుంది. లాలాజీ, ఇంతకు దీపావళి ఎన్ని రోజులుంది?"

"పది, పదిహేను రోజులుందేమో, నేను నిర్లక్ష్యంగా జవాబిచ్చాను."

వ్రేళ్ళ చివర లెక్క బెట్టి ఆమె అన్నది. "ఈ దీపావళికి నీ పెళ్ళైపోయి ఆరు నెలలు పూర్తి అవుతాయి."

అప్పుడే ఆరు నెలలు గడిచిపోయాయి. ఒక్కోరోజు ఎంతో కుమిలి పోయి గడిపినా కాలం ఎంతో వేగంగా గడిచిపోయింది. ఈ లోగా ప్రభ ఎలా వుందో? ఒకటి అర ఉత్తరాలువచ్చి వుంటాయి. తర్వాత మున్నీని అడగాలను కున్నాను. ఇంతకు మున్నీఏమి అడగాలను కుంది? ఈరోజు వీళ్ళంతా నాపె ళ్ళిగురించే ఎందుకు మాట్లాడుతున్నారు. ఈ మధ్య నా స్వభావంలో ఉత్సాహం, ఉల్లాసం, అడగారిపోయిన ఒక విచిత్రమైన మార్పు కనపడింది. అదేంటో తెలుసు కోవాలనే కోరిక మనసులో లేచినా, అణిచేసుకున్నాను బహుంశా

ఇంట్లోనే ఏదో ప్రస్తావన వచ్చినట్టు వుందని భావించాను.

"లాలాజీ, నీకు ఏమి పెళ్ళి జరిగిందని" ఎంతో నిరాశగా ఆప్యాయంగా గాఢమైన శ్వాస వదులుతూ వదిన అన్యమనస్కురాలిగా అన్నది. "ఏమేమి అనుకున్నామో అన్ని నీటి బుడగల్లా విచ్చుకుపోయాయి. ఇచ్చిపుచ్చుకోడాల మాట పోనిద్దాం. ఒక రెండు సంవత్సారాలలో వస్తూ వుంటాయ్, పోతూ వుంటాయ్. కాని ఈ మహరాణి జీవితాంతం ముడిపడిపోయింది కదా! వాళ్ళు ఆమెను పంపిస్తామని రాసారు."

ఆమె అంతకుముందన్న మాట విని అన్నాను, "నువ్వే కదా ఎంతో ముచ్చటపడి, ఆవిడ ఇలా ఉంది, అలా వుంది అని మహాచెప్పేదానివి."

"లాలాజీ మాటలు వింటున్నారా? నేనేమైనా కడుపులోచొచ్చి చూసి వచ్చానా విన్న మాటలు చెప్పానంతె." గాఢంగా నిట్టూర్చి మళ్ళీ అంది. "అబ్బో ఎంత అహంకారం. తిన్నగా రాకపోకలే లేవు. పైగా ఇంత అహంకా రమా? ఒట్టు పెట్టుకుని చెబుతున్నాను. ఇంత పెద్దదాన్ని అయ్యానా ఇంతటి తలబిరుసు ఆడదాన్ని నా జీవితంలో చూడలేదు. ఏవైనా అపురూపమైన గుణాలుంటె ఎన్ని వయ్యారాలనయినా సహించవచ్చు. ఒట్టి నఖరాలని ఎవరు భరిస్తారు. అసలు ఏదో ఆవిడ చదువుకుందని, అందమైనదని పోకడతో వచ్చారు ముందుకు, అయినా ఇంద్రుడి అంతఃపురంలోని దేవకన్యనా!" వదిన నా మొఖంపై వస్తున్న భావాన్ని పసిగట్టాలని మాటలు ఆపేసింది. మళ్ళీ ఏం ఆలోచించిందో, "ఆ రాణిగారు చేతికి గడియారం కట్టుకుని వంటగదిలోకి వచ్చినపుడే నాకు నవ్వు ఆగలేదు. నేనైతె ఏమీ అనలేదు కాని ఆమె పప్పు రుచి చూసానే అని అన్నపుడు అత్తగారు ఎంత రాద్ధాంతం చేసారో తెలుసు కదా. నేను అన్నాను. అసలు ముందు ఎవరు తింటారో వాళ్ళు రుచిచూ స్తారు. నువ్వు ఎవరివి రుచి చూసేదానివి."

నేను విసిగిపోయాను. కాలేజికి ఆలస్యమౌతుంది. అప్పుడన్నాను. "వదినా, కాలేజికి ఆలస్యమౌతుంది. నేనిక తినలేను మున్నీ ఎక్కువగా పెట్టేసింది." అని లేచి నిలుచున్నాను.

నావెనకాలే అంటున్నది. "అయ్యో! అసలునువ్వు తిన్నదెంతని లాలాజీ, నా మీద ఒట్టు. ఈ రొట్టె మాత్రం వదిలివేయవద్దు."

"లేదు, వదినా పిరియడ్ అయిపోగానే మళ్ళీ వచ్చి తింటాను."

నేను వెడుతుంటె కృత్రిమంగా నవ్వుతూ ఆమె అన్న మాటలు వినపడ్డాయి.

"అమ్మగారు వస్తున్నారుగా లాలాజీ ఇప్పుడే చెప్తున్నాను అణచిపెట్టకపోతే పశ్చాతాప పడతావ్."

మాయింట్లో మగవాళ్ళ మౌనం, ఆడవాళ్ళ విచిత్ర వ్యవహారం... వీటిని ఎలా అర్థం చేసుకోవాలో బోధపడటంలేదు. ఉదయం నుండే మనసంతా వికలమైపోయింది. ఈ రోజు అకస్మాత్తుగా మనస్సులోని ఔదాసీన్యంలోంచి. ఈ మాట ఊరికే తొంగిచూస్తూనేవుంది. ఆరునెల్ల నుంచి ఆవిడ ఎలావున్నదో? ఆమెనాకు ఒక్క ఉత్తరమైనా రాయకూడదా. బహుశా ఆ ఉత్తరాన్ని చదివి నిర్లక్ష్యంగా చించి పడేసేవాణ్ణేమో! అయినా ఆమె ఒక్క ఉత్తరమైనా రాయకూడదా ఇంత కాలం ఆమె ఎలా వుందో, ఆనాటి ఎదురు దెబ్బ ప్రభావం ఆవిడపై ఎలా వుందో. నా హృదయంలో ఆవిడ గురించి తెలుసు కోవాలని ఎందువల్లనో సంచలనం మొదలైంది. అసలు తల్లిగారి ఇంటికి వెళ్ళి ఏమేం చెప్పిందో!

అప్పుడప్పుడు నేను వణికిపోతూ వుంటాను. ఈ తలబిరుసు అమ్మాయితో జీవితాంతం ఎలా గడపాలో, మా భవిష్యత్తు ఏమైపోతుందో అందులో రెండో పెళ్ళి గురించి తలెత్తుతున్న కొత్తమాట ఏవిటో...? అసలు మున్నీ ఈ విషయం గురించే చెప్పాలను కున్నదేమో?

బోర్డు పరీక్షల ఫీజు కోసం అమ్మ దగ్గరికి వెళ్ళి ఇరవై అయిదు రూపాయలు అడిగాను. ఆమె అలా నోరు వెల్లబెట్టి, "అయ్యో, అన్ని రూపాయలు నాదగ్గ రెక్కడున్నాయయ్యా మీ నాన్నగారిని పోయి అడుగు." నాన్నగారిని అడుగకూడదనే అమ్మ దగ్గరికి వెళ్ళాను. ఇప్పుడు గుండె కొట్టుకుంటున్నది. అన్నగారిని, వదినను అడగాలనిపించింది. కాని వాళ్ళ దగ్గర వుంటాయని నమ్మకమేమిటి ఒక వేళ వున్నా ఏదైనా అనుకోని అవసరం వస్తుందని ఇరవై అయిదు, ముప్పై దాచిపెట్టుకున్నా వాళ్ళు అవి ఇవ్వరు.

"నాన్నగారు రేపు బోర్డు ఫీజు కట్టెయ్యాలి" ఆయన దగ్గరికి వెళ్ళి ఏదో విధంగా నాలోనేను మాట్లాడు కున్నట్టు అడిగాను. మొదట వెళ్ళి నిశ్శబ్దంగా కూచున్నాను. మళ్ళీ తల దించుకుని పీనుగులా కంఠం విప్పి ఏదో సారాయి తాగడం కోసం డబ్బు కావాలంటున్నవాడిలా మాట్లాడాను.

పొద్దుగూకుతున్న వేళ నాన్నగారు మంచం నవారు సరి చేస్తున్నారు. నా వైపు చూడకుండానే గణ గణ మనే కంఠంతో అన్నారు. "ఎంత."

"ఇరవై అయిదు" నా జీవితంలో ఏవో ఇరవై అయిదు శ్వాసలు మిగిలి పోయినట్టు ఆమాటను ఉచ్ఛరించాను.

"హూ" అని హూంకరిస్తు ఆయన మంచం నవారు లాగారు తన మోచే తితో వత్తిపట్టి అన్నారు. "ఈ నా పెన్షన్ ఇరవై అయిదు రూపాయలు వున్నాయి. నువ్వు తీసేసుకో నా సంగతి అంటావా ఇలా జీవితాంతం నీ కోసం సమ స్యల ముడులు విప్పుతూనే వుంటాను. నా ఖర్మ అలానే రాసి పెట్టివుందేమో. మగపిల్లలు ఒంటెలా ఎదిగిపోయినా ఇలా తిండి పెట్టాలని వుంటె పెడుతూ నేవుంటాను. నిన్న, మొన్న అమర్ తన ఫీజు కట్టమని ఏడుస్తు వచ్చాడు. మొన్ననే కదా దీపావళి పోయింది. ఖర్చుమూలంగా కుప్పకూలిపోతున్నాం. సంపాదిస్తున్న వాడు ఒక్కడు ధీరజ్ మాత్రమే వాణ్ణి పీల్చి పిప్పి చేస్తారని స్పష్టంగా కనపడుతూనే వుంది." ఆయన తన షర్టు లోపల చేయి పెట్టి బని యన్ జేబులోంచి నోట్లు తీసి లెక్క పెట్టకుండానే మంచంపై నా ముందు పడవేసారు. "తీసుకో, అలా నిలుచుని నా ముఖాన్నేం చూస్తావ్?"

నా ఎదురుగా వున్న నోట్లను తీసుకోవాలంటె ధైర్యం చాలలేదు. వెంటనే అక్కడి నుంచి వెనక్కి వెళ్ళిపోయి ఈ చదువు, గిదువును తన్నేసి ఎక్కడ్నుం చైనా తీసుకువచ్చి డబ్బును కుప్పగా పోస్తే వీళ్ళకి ఎంతో తృప్తి కలుగు తుందని పించింది. అప్పుడు అంటాను. తీసుకోండి, రూపాయలు, ఎన్ని కావాలో అన్ని తీసుకొండి, రూపాయలే రూపాయలు, రూపాయలు, రూపాయలు...

నేను అలానే నిలిచి వుండటంచూసి నాన్నగారు నావైపు చూసి మళ్ళీ తల కిందికి దించేసి మళ్ళీ మారిన స్వరంతో అన్నారు. "సమర్, ఎన్ని బాధ లున్నాయో తెలుసా నీకు. నువ్వే ఆలోచించు. నా మనస్సుకు తెలుసు. ఏం చెయ్యమంటావో నువ్వే చెప్పు. మళ్ళీ ఉద్యోగం చేయాలంటె ఈ కాళ్ళూ చేతులలో సత్తువ లేదు. అటు ధీరజ్ భార్యకు నెలలు నిండుతున్నాయి... మన ప్రాణాలకు మరో కొత్త సమస్య పెద్ద కోడలికి ఇది మొదటి సంతానం. తక్కువ ఖర్చు అవుతుందను కుంటున్నావా? పిల్లలందరూ స్కూలుకు, కాలే జీకి వెడుతున్నవాళ్ళే. వేళకు వాళ్ళకి తిండి, బట్ట అవసరాలు తీరవలసిందే కదా. మీ అమ్మ ఆరోగ్యం చూస్తూనే వున్నావు కదా. పొయ్యిలో తలదూర్చి, తలదూర్చి ఏ స్థితికి చేరుకుందో తెలుసుకదా! ముసలి తనపు దేహం. పాపం ఆవిడ కూడా ఎంతో చేసుకొచ్చింది. ఇప్పుడావిడతో కాదు. ముప్పై ఏళ్ళ బట్టి ఊపిరి పీల్చుకోకుండా ఒకటే పని చేసుకొస్తున్నదికదా. నీకు సాధ్య మైతె వెళ్ళి నీ భార్యను తీసుకురా. కొంచెమైనా చేదోడుగా వుంటుంది. ఉద్యోగానిక, కాలేజికి వెళ్ళే వాళ్ళకు వేళ కింత తిండి దొరుకుతుంది. మున్నీ

తనవంతు సహాయం చేస్తుంది. ఇప్పుడు మున్నీ కూడా మనతోనే వుండాలి కదా - బంధువులంతా ఉమ్మేస్తున్నారు! అయినా ఏం చేయగలం?ఇదో పీడ!"

పరిస్థితినంతా నాన్నగారి దృష్టితో చూడగానే నాకు నిజంగానే ఆయన నిస్సహాయతపై జాలి కలిగింది. ఆయనలో చీదరింపులు - గొణుగుడు ఎక్కువైపోయాయంటే అది ఆయన తప్పేమికాదు! పాపం! ఆయన ఎంత వరకు లాక్కొనిరాగలరు? నాగొంతులోని గుటకమింగుతూ ధైర్యంగా అన్నాను "నాన్నగారు, అక్కడికి అమర్‌ను పంపించండి, నేను వెళ్లను!"

ఆయన స్వరం హఠాత్తుగా మారిపోయింది. కోపంగా అన్నారు "అమర్ వెడతాడు. కోడలిగురించి చెబితేచాలు నీకు ఊపిరి ఆడదు! తోడేలనుకున్నావా, మింగేయడానికి? ఉమ్మించే సంతానం కలిగింది! ఇంట్లో ప్రతి ఒక్కడూ ఏ దొరగారి కొడుకని అనుకుంటున్నాడో? ఎవ్వడితలలో ఏముందో అర్థం కావడంలేదు. నేను కూడా చూస్తాను నువ్వు ఎంతకాలం మాట్లాడవూ? పరాయి పిల్ల' తల్లి గారింటికి వెళ్లి మనగురించి ఏ చెబుతుందోనని లక్షసార్లు నచ్చచెప్పాను! ఈ ఇంట్లో ఇంకా పెళ్ళి కావలసిన వాళ్లున్నారు. లోకు లందరూ ఎన్నో అంటున్నారు - ఎవ్వరి నోరుని మూయించగలవ్? కాని కొడుకులున్నారే - తాము గురి చూసికొట్టే బాణం ఎదుట ఎవ్వరూ నిలవలేరని అనుకుంటారు. అసలుసిసలు మనిషివైతే జీవితాంతం మాట్లాడకు!"

వదిన చెప్పిన మాట అప్పుడు మెరుపులా మెరిసింది. ఏదో హాస్యమాడుతున్న ధోరణిలో ఒకరోజు ఆమె ఇలా అన్నది - "లాలాజీ, ఈ రోజు మామగారు అత్తయ్యతో ఏమన్నారో తెలుసా?" నేను ఏమీబదులు చెప్పకపోయేసరికి ఆవిడే మళ్ళీ చెప్పింది - "అన్నారు, సమర్‌ను వెళ్లి ఏడాక్టర్‌కో వైద్యుడికోచూపించుకోమను జాగ్రత్తగా చూపించుకోమను, ఎంత ఫీజు అవుతుందోఇచ్చేదాం!" అప్పుడు నేను అర్థంకాక అడిగాను- "ఎందుకు? నాకేమైందని?"నా మాటవిని వదిన నోట్లో పమిటకుక్కుకొంటూ నవ్వుతోంది.నేను కోపంతో చిందులేసాను.

ఇప్పుడు నాన్నగారు మంచం నవారును మరింతలాగుతూ పళ్లు బిగపడుతుంటే, నేను ఆరూపాయలు తీసుకొని ఒక్కక్షణం కూడా ఆగకుండా నిశ్శబ్దంగా వచ్చేసాను. ఛీ! వీళ్లుమరీ ఎక్కడి దాకా ఆలోచిస్తున్నారో? నాన్నగారు అక్కడ ఏదో గొణుగు తూనేవున్నారు - ఆయన మాటలు నాలోని కోపాన్ని రెచ్చగొడుతున్నాయి.

వీళ్లు ఏం చెబితే అది చేయాలి. పెళ్లి చేసుకోమంటే చేసుకోవాలి- వెళ్లి ఆవిడను తీసుకురమ్మంటే తీసుకురావాలి - పంపించిరమ్మంటే పంపించాలి! ఈ జన్మలో ఇలా ఇరవైఅయిదు రూ.లు అడిగినందుకు ఈ మాటలన్నీ వినవలసి వచ్చింది. అప్పుడే కాలేజీలో ప్రయత్నించి నెలసరి ఫీజు మాఫీ చేయించు కున్నాను కాబట్టి సరిపోయింది.లేకపోతే ప్రతి నెలా ఒక మహాభారతం జరిగి పోయేది! సక్రమంగా చదువు చెప్పించలేకపోతే, ఎందుకు పుట్టించారు? పుస్తకాలు నోట్‌బుక్కులు కోసం డబ్బులే అడగను! నా దుస్తులు చినిగిపో తున్నాయి, పాత బట్టలన్నీ బిగుసుకుపోతున్నాయి. వాటితోనే ఈ చలికాల మంతా తంటాలు పడాలి. సినిమాకైనా, ఏమైన కొనితినాలని ఒక పైసా నైనా అడుగుతున్నానా? ఇంత జాగ్రత్తగా వుంటేనే ఇదీ పరిస్థితి అవును మేము గొడ్లలా, ఒంటెల్లా, తయారై పోయాం...

కోడలిని రప్పించుకోవాలనుకుంటే, రప్పించుకొండి, అవసరం లేదను కుంటే జీవితాంతం రప్పించుకోకండి! అన్నీ నన్ను అడిగి చేస్తున్నారా? నా మాట మన్నించివుంటే - అప్పుడే పెళ్లికి ముందే వినివుండేవాళ్లు! అప్పుడేమో "నువ్వింకా కుర్రాడివే! ఇప్పుడు నోరు మూసుకోలేకపోతే బుర్ర బద్దలుకొట్టేస్తాం!" బుర్రబద్దలుకొడతారట? ఇప్పుడు కొట్టుకోండి! ఆమెను తీసుకురావాలంటే ఈ ఇంట్లో నేను ఒక్కడినే మిగిలానా? అమర్ ఎందుకువెళ్లకూడదు? "చిన్న కుర్రాడు-చిన్నకుర్రాడు" అంటూ వాడిని తలకెక్కించు కున్నారు. నేనేకదా జీవితాంతం తలబాదుకొనేది? ఇక చూపిస్తాను జీవితాంతం మాట్లాడుతానో లేదో - అదంతా నా ఇష్టం - మాట్లాడమని ఎలా బలవంతం చేయగలరు? బలవంతంగా చేసేయడానికి ఇదేమైనా వివాహమా? ఇది నా మనస్సు, అసలు మాట్లాడను. బంధువుల్లో చెడ్డపేరు వస్తుందా... హుఁ...!

# ఆరు

కాలేజి నుండి తిరిగివస్తుంటే అమర్ కలిసాడు. రెండు చేతుల్లో ఫుట్‌బాల్‌ను తిప్పుతు ఆడుకోడానికి వెళుతున్నట్టున్నాడు. చూడగానే అన్నాడు "సమర్ అన్నయ్యా, వదినను తీసుకువచ్చేసాను."

తలదించుకుని నడుస్తున్నవాణ్ణి హఠాత్తుగా కంగారు పడ్డాను నా నోటి

నుండి ఆశ్చర్యంగా, "అలాగా!" ఇంటివైపువేస్తున్న అడుగులు వెంటనే ఆగి పోయాయి. కాసేపు వాడి వైపు నిరుద్దేశ్యంగా చూస్తూవుండిపోయాను. మళ్ళీ అన్నాను. "ఏమైనావిశేషమా?"

"విశేషమేమీ లేదు. ఎంతో కష్టం మీద పంపించారు. అన్నయ్యా ఆమె తల్లిగారి ఇంటివాళ్ళు మర్యాద లేని మనుష్యులు. ఇక ముందు అక్కడికి ఎప్పుడూ వెళ్ళనని ఇప్పుడే చెప్తున్నాను."

"ఏం జరిగింది? పట్టుకుని కొట్టారా ఏమిటి?" నేను గొంతులోని మాటని అణచిపెట్టుకుంటూ విషపునవ్వుతో అడిగాను.

"ఏం కొడితేనే మర్యాదలేని వారవుతారా? నేను అక్కడ కూర్చున్నా నిలబడ్డా, మీ పెద్ద వదిన ఇలాంటిదని, అమ్మా, నాన్న అలాంటి వాళ్ళని ఒకటే నస! మనం ఎంత చెడ్డ వాళ్ళమైనా, మన ఇంటివాళ్ళ గురించి అలాంటి మాటలు వినదలుచుకోలేదు." అతనూ నన్ను లెక్కచేయకుండా తలబిరుసుగానే అన్నాడు.

"సమర్ అన్నయ్య ఎలా వున్నాడని అడిగారా?" నేను వెంటనే అడిగాను. నా స్వరంలో అనుకోకుండానే కోమలత్వం ధ్వనించింది. ఆవిడ తన తల్లి గారింట్లో ఏం చెప్పిందో?

"అన్నయ్యా, దేనికదే చెప్పుకోవాలి. అక్కడ నిన్ను అందరూ మెచ్చుకుంటున్న వాళ్ళే."

"మెచ్చుకోడమా?" నేను ఎంతోఆశ్చర్యంగా చూసి, మళ్ళీ అపనమ్మకంతో అన్నాను. "నువ్వు సరిగ్గా అర్థం చేసుకోలేదేమో!"

"అవును అది కూడా నిజమేనేమో," వాడు అంగీకరిస్తూనే "అసలు నీ గురించి ఎక్కువగా మాట్లాడలేదు. ఒకటో, రెండుసార్లు అడిగారు- ఇంక చదువు ఎంత మిగిలిపోయింది, ఇపుడు ప్రభ వస్తే ఆయన చదువుకు నష్టం కాదు కదా? నువ్వు ఎంత చదువుకుంటె వాళ్ళకు అంత ఆనందమని కూడా అన్నారు. అయితే మొదటిసారి స్వయంగా వెళ్ళి అసలు ఆచారం ప్రకారం వదినను నువ్వే తీసుకురావాలట. అలా నువ్వు రానందుకు వాళ్ళు తప్పుపట్టారు. పెళ్ళితో పాటు కార్యం జరిగిపోయిందని నేను నచ్చజెప్పాను. అలాగే మా అన్నయ్య ఇప్పుడు బాగా కష్టపడి చదువుతున్నాడని చెప్పాను."

"సరే మిగాతా అంతా బాగానే వుంది కదా." వాడు తన గొప్పతనాన్ని చాటుకుంటూవుంటె నేను మధ్యలో అడిగాను. మెచ్చుకున్నారు అనే మాటతో

నా కుతూహలం గొంతుదాకా ఎగబాకింది. వీడి ఈ మాటలతో సమాధానం దొరకనే లేదు. నీకు అర్థం కాలేదేమోనని అమర్‌ని రెచ్చ గొట్టి ఇంతకు వాళ్ళ మాటల్లో వ్యంగ్యమేదైనా వుందేమోనని ధృవీకరించుకునే ప్రయత్నం చేసాను. ఇప్పుడు ఇంకేం అడగాలి? పైకి ఎగిసిపడుతున్న కెరటాల్లా ఆమాట నామానసిక ఉద్వేగాన్ని మరింత తీవ్రతరం చేస్తున్నది. నువ్వు నా గురించి ఏమన్నావ్ అని ఎవర్ని అడగాలో అర్థం కాని ఒక తీవ్ర ఆవేశం మనస్సులో కలిగింది. ఆ క్షణాన అప్పుడు నేను ఎంత ఘోరంగా ప్రవర్తించానో గ్రహించగలిగాను. ఒక వేళ న్యాయస్థానంలో నన్ను నిలుచోబెట్టి ఇలా అడిగితే "శోభనం రాత్రి నువ్వు నీ భార్యతో ఎందుకు మాట్లాడలేదు? నిన్ను చూడగానే ముడుచుకొని కూర్చోకుండా అలానే నిలబడినందుకా? లేదా నీ ఆదర్శాలు చాలా పెద్దవి కాబట్టి స్త్రీ నీకు అవాంతరంగా కనపడిందా? వివాహం నీ ఇష్టానికి వ్యతిరేకంగా జరిగిందా?... ఛీ ... మాట్లాడక పోవడానికి ఇవేమైనా ముఖ్య కారణాలా?" నన్ను నేను సమర్థించు కోవడానికి అప్పుడు నేనేమని సమాధానం చెబుతాను? ఒక భావావేశం తప్ప ఈ వ్యవహారానికంతా ఆధారం ఏం చూపించ గలను! నా వ్యవహారం మొత్తం తప్పేకాదు, మూర్ఖత్వంతో నిండింది. మానసిక క్షోభతో నా మనస్సంతా వికలమైపోయింది.

"అంతే మరే విశేషం లేదు. మళ్ళీ తిరిగి ఎప్పుడు పంపుతారు- అని అడిగారు. వదిన ఏదో నీరసంగా వుంది కాబట్టి అవసరమైతే మందులిప్పించండని చెప్పారు." అమర్ చెబుతూ వెళ్ళిపోవడానికి ఉద్యుక్తుడయ్యాడు.

"ఏమిటీ? ఆమె ఆరోగ్యం బావుండడం లేదా" వెంటనే నేనడిగాను. నా బలహీనతపై సిగ్గువేసింది.

"అవును బావుండలేదేమో!" తత్వవేత్తలా చెబుతూ అమర్ ఫుట్‌బాల్‌ను పైకెగరేస్తూ - పట్టుకుంటూ మాయమైపోయాడు.

జాగ్రత్తగా చూసుకొమ్మని చెప్పిపంపించారు. ఇక్కడేమో ఇంట్లో వాళ్ళందరికి ఆమె రాక మూలాన, అందరికీ వేళక్కి భోజనం దొరుకుతుందని, నాన్నగారు అన్నారు. రెండోసారి కోడలు రాగానే ఆమె ద్వారానే పనులు చేయించాలనే ఆలోచన వుంది. మరో రెండు మూడు సార్లు రావడం పోవడం జరిగితే బావుండేది. మా ఇంటి వ్యవహారం కూడా విచిత్రంగా వుంది. ఆమె నన్ను నిజంగానే మెచ్చుకున్నదా? లేదు... లేదు... అమర్ అర్థం చేసుకోలేదనుకుంటా!

సంకోచిస్తూనే ఇంటికి వెడుతున్నాను. అయితే మొన్నటిదాక ఉన్న ఉదా

సీసమైన అగాధం విడిపోయింది. అంతర్గతంగా ఆడుతున్న నిర్మలమైన నీరు పైకి వచ్చింది. ఆవిడ తల్లి గారింటికివెళ్ళి అసలు నా గురించి ఏమీ చెప్పలేదంటె నాకు నమ్మకం కుదరడంలేదు. లేదండి, ఏదో ఒకటి నాగురించి చెప్పే వుంటుంది. అలాకాకుండావుంటుందా? కాని ఆవిడ చెప్పివుంటే అమర్ తో వీళ్ళు అన్న మాటల్లో ఎక్కడో అక్కడ ఎత్తిపొడుపులు వుండేవి. ఎందువల్ల నంటె మిగతా వాళ్ళ గురించి ఎలాగూ అన్నారు కదా! ఆవిడ మొఖాన్ని మన సారా నయినా చూడనందుకు నా ప్రచండమూర్ఖత్వంపై నాకు విపరీతంగా కోపం వస్తున్నది. ఇప్పుడు ఆవిడ ఎదుటికి ఎలా వెళ్ళాలోనని ఆలోచిస్తు ప్రాణాలు బిగపట్టుకున్నాను. అసలు మాట్లాడ కూడదు అనుకునే ఆ కట్టుబాటుని పెంచుకోవడంలో అర్ధంమేముంది. అప్పుడే మనసులో అనిపించింది - నాపట్ల జరిగిపోయిన అపరాధాన్ని నవ్వుతూ పట్టించుకోవద్దు. లేదా ఆ ధ్యాసే వుంచు కోకూడదు. ఇంతటి స్వచ్ఛత ఇలాంటి సరళత్వం నాలో ఎక్కడ దాక్కుందో నని నా పైనాకే ఆశ్చర్యమేసింది.

గంభీరంగా మొఖం పెట్టి ఎంతో సహజంగా నేను ఇంట్లోకి ప్రవేశించాను. అసలు నాకు ప్రభ వచ్చిందన్న విషయంకాని అమర్ నాతో మాట్లాడినట్టు గాని ఏమీ తెలియనట్టే వుండిపోయాను. నీరసంగా అలసిపోయన మొహం ఎండిపోయిన పెదాలు. నన్ను చూడగానే మున్నీ దూరం నుంచి అరచింది. "సమర న్నయ్యా, వదిన వచ్చేసింది."

"వస్తే నన్నేంచేయమంటావ్?" అనుకోకుండానే నా నోట్లోంచి వెలువడింది. అప్పుడే డాక్టర్‌కు చూపించుకోమని చెప్పిన మాట మేధస్సులో మెరిసింది. మనస్సు ఆ కారణంగానే చికాకు పడిపోయింది. కాలేజి నుంచి ఎంతో కష్టపడి వచ్చిన వాడిలా నా పుస్తకాలను పెట్టే యాలనే తొందర ఉన్నవాడిలా నా గదివైపు నడిచాను. ఆవేళ నన్ను నేను ఎలా నిగ్రహించుకున్నానో నాకే తెలియాలి.

తెరచిన కిటికీ ఎదుటే గదిలో ఆమె ట్రంకుపెట్టె కనపడింది. మనస్సు పులకించిపోయింది. గదిలోకి ఇంకా ఏమేమి కొత్త వస్తువులు వచ్చాయో చూడాలనే ఉత్సుకత కలిగింది. ప్రభ నా గదిలో తప్ప మరోచోట వుండే అవకాశం లేదనే విషయం గుర్తు వచ్చి సంతోషించాను. పెళ్లి జరిగిన రోజుల్లో మాకు ఇచ్చిన గదిని తిరిగి అన్నగారు ఆక్రమించేసుకున్నారు. ఇప్పుడైతే ఆవిడ ఎలాగైనా మాట్లాడవలసిందే - ఆలస్యంగానో లేక మెల్లగానో నేను

కూడా ఇప్పుడు అలా మొండికెత్తను. గోడకు ఆనుకుని మరోవైపు ప్లాస్టిక్ చెప్పులు వున్నాయి. ట్రంకుపెట్టె పక్కనే వెదురు బుట్ట వుంది. అందులో ప్రయాణానికి సంబంధించిన వస్తువులు వున్నాయి. అటూ ఇంటూ పరికించి నేను మెల్లగా టవల్‌ను తొలగించాను గుండ్రంగా మడిచిపెట్టిన "మాయా" పత్రిక కనపడింది. రైల్వే బుక్‌స్టాల్ నుంచి కొని వుంటుంది. ఒక పుటను తిర గవేసాను. స్పష్టంగా ముత్యాల్లాంటి అక్షరాల్లో రాసి వుంది. ప్రభ... పక్కనే నా పేరు కూడా రాయాలి అని పించింది మళ్ళీ వెంటనే నిశ్శబ్దంగా వాటిని సర్దేసాను. ఒకవేళ ఆమె చూస్తే ఏమనుకుంటుంది.

సాయంత్రం కాగానే నేను నెమ్మదిగా మాట్లాడకుండా వదిన, మున్నీ చూపులనుంచి కావాలని తప్పించుకుంటూ, బయటికి వచ్చేసాను. ఎవరి ఎదుటికి వెళ్ళాలని అనిపించలేదు. అందరూ హస్యమాడుతారు. ఎక్కడికి వెళ్ళాలి? లాన్‌లోకి వెళ్ళి పడుకోవాలని అనిపించలేదు. ఇక దేవాలయాని కంటే ఆ సంఘటన జరిగిన తర్వాత వెళ్ళడమే మానివేసాను. దివాకర్ దగ్గరకి వెళ్ళాలని అనిపించింది. కాని మానుకున్నాను. ఎంత సేపయ్యిందో అలారోడ్లపైన తిరుగుతూ వుండిపోయాను. పంజాబీ శరణార్థులు సబ్బులు, కూరగాయల్ను, తోపుడు బళ్ళపై పెట్టుకుని అమ్ముతున్నారు. మగపిల్లలు వేరుశనక్కాయలు, శెనగలు అమ్ముతున్నారు. కొందరేమో ఫుట్‌పాత్ లపై చెక్క దుకాణాల్లో బట్టలమ్ముతున్నారు. వాళ్ళందరు ఎంతో సాహసంగా పట్టు దలతో తమ జీవితాలను స్థిరపరుచుకోవడానికి చేస్తున్న ప్రయత్నాలను ఒప్పు కోవలసిందే! అన్ని భయంకరమైన కష్టాల తర్వాత, అంతటి ప్రళయాన్ని దాటి వచ్చిన తర్వాత మనమైతే బిచ్చ మెత్తుతు వుండే వాళ్ళమే. వాళ్ళు ఎన్నెన్ని కష్టాలు సహించ లేదని. ఏమేం చూడలేదని? తమను విడిపోయిన వైభవాన్ని, వైదొలిగిన భూమిని జ్ఞాపకం చేసుకుంటు మళ్ళీ తిరిగి జీవనపో రాటాన్ని సాగిస్తున్నారు. ఆడవాళ్ళు రాత్రనక పగలనక కొళాయిల కింద కూచుని బట్టలు ఉతుకుతుంటారు. సంఘ్ నిర్వహించే "బౌద్ధిక్" తరగతు లకు చాలా రోజులనుంచి వెళ్ళనేలేదని జ్ఞాపకం వచ్చింది. అక్కడికే వెడితే, కాని ఇన్నిరోజులనుంచి ఎందుకు రాలేదని అడిగితే ఏం కారణం చెప్పాలి. ఇరకాటంలో పడతాను. ఈరోజు కాదు. మళ్ళీ ఇంకెప్పుడైన వెడతాను.

వెనకటి విషాదమంతా, చింతలన్నీ ఎటుపోయాయో నాకే ఆశ్చర్యంగా వుంది. నిన్న ఇదే సమయానికి ఇదే వంతెన దగ్గరనుంచి వెడుతుంటే మానసిక

వత్తిడితో నరాలు చిట్లిపోతున్నాయని అనిపించింది. ఈ ప్రభ నిజంగానే ఎంతో నిగూఢమైన తెలివైన అమ్మాయి. మరో అమ్మాయి అయితే తన తల్లి గారింటికి వెళ్ళినపుడు నా గురించి చెడుగానే చెప్పేది. అపుడు మొఖం చూపించే ధైర్యం ఉండేది కాదు. నేను చదువులో నిమగ్నమై వున్నానని పరీక్షలు దగ్గరికి వస్తున్నాయని చెప్పివుంటుంది. ఒక చదువుకున్న అమ్మాయికి చదువు రానిదానికి మధ్య తేడా ఇదే. ఆరోజు కాస్త ఉప్పు ఎక్కువ వేసిందని మా వాళ్ళు ఎంత గొడవ చేసారు. మనిషే కదా కొంచెం ఉప్పు ఎక్కువపడితే మునిగిపోయిందేమిటి?అయితే ఇక ఆమెను జీవితాంతం క్షమించలేమా? పాపం కొత్త కోడలు గాభరా కొద్ది కొత్తచోటు కొత్తమనుషుల మధ్య అందులో అమ్మా, వదిన లాంటి భయంకరమైన విమర్శకులు వుంటే సరే పాపం బెంబేలెత్తిపో యింది. నన్ను క్లాసులో నిలబడి ఒక పేజి చదువమంటేనే ఒక్క లైను కూడా సక్రమంగా చదువలేనేమో, అలా నిలుచుని తత్తరపాటుతో శరీరం సొంతం చమటలు కక్కుకోనా?

అసలు నేను మొదటినుంచి చాలా తొందరపాటు మనిషిని - ఏదో కాస్త కనపడేసరికి వెంటనే ఒక అభిప్రాయం ఏర్పరుచుకుంటాను. ఇదే నా పెద్ద బలహీనత. దీని నుంచి నేను తప్పించు కోవాలి. ఈ సంఘటన మొత్తంలో అసలు తప్పంతా నాదే ఆవిడ తప్పేలేదు. ఈ సమయాన నేను ఈ వంతెన గోడకు ఆనుకుని అలా నిలుచుని దూరంగా కిందుగా సాగిపోయిన రైలు పట్టాలను చూస్తు చూస్తు ఎంతో ఆశ్చర్యపడుతు అనుకున్నాను. ఆరోజున దేవాలయంతో కూర్చుని ఏ దురాలోచనల మూలంగా నేను అలా వెక్కివెక్కి ఏడ్చాను. ఇంతకూ అలా కూర్చుని గంటల తరబడి తలబాదుకోవలసిన, అలా ఏడ్వవలసిన విషయమేనా అది. ఆరోజున ఆమె నిర్లక్ష్యంగా ప్రవర్తిం చిన తీరు, ఉత్తరాలు అసలు రాయకుండా చేసిన తప్పు, ఇవన్నీ మర్చిపోయాను.

ఎంతోసేపటికి నేను తిరిగి ఇంటికి వెళ్ళగానే ఎక్కడి నుంచో వదిన గబగబా వచ్చి అన్నది. "లాలాజీ, భోజనం చేసేది లేదా, కోడలి పిల్ల ఆక లితో అలానే వుంది. నువ్వు ఎప్పుడువస్తావోనని దారి చూస్తు చూస్తు రెప్పలు వాచిపోయాయి. ఇప్పుడొచ్చాప్ అన్నమాట. ఉదయం నుంచి లాలాజీ దర్శనం అయితే కదా - ఈరోజు పొద్దున వెళ్ళి ఇప్పుడేగా రావడం. కాలేజి వదిలిన తర్వాత కూడా తిన్నగా ఇంటికి రాలేదనే అనుకోవాలి కదా?" ఆమె ప్రతిమా టలో పరిహాసం పొంగిపోతున్నది.

ఈ మధ్య నేను అనవసర విషయాలను పట్టించుకోడం మానివేసాను. కేవలం అవసరమైన వాటికే సమాధానం ఇస్తున్నాను. తరుచుగా వదిన పరిహాసానికి గొంతు దించి ఏదో జవాబు చెప్పి ముగించేవాణ్ణి. ఎవరితోను మాట్లాడాలని అనిపించేది కాదు. ఆ వ్యవహారాన్ని ఇప్పటికి కొనసాగించి నాలో ఈ ఆకస్మికమైన మార్పును ఎవరూ పసిగట్టవద్దని అనుకున్నాను. నేను ఎంతో నెమ్మదిగా అన్నాను. "అవును వదినా ఏదో కొంచెం పనుంది..."

"ప్రభ వచ్చిన సంగతి కూడా తెలియదా?" అని వదిన అడిగింది.

నాకేమీ అర్థం కాలేదన్నట్టు నేను ఆమె మొఖంవైపు చూసాను. వెంటనే ఏదో తొందర వున్నట్టు అన్నాను. "నాకేమీ తెలియదు. ముందు అన్నం పెట్టు. ఆకలివేస్తున్నది. తరువాత కూచుని చదువుకోవాలి."

"తరువాతనే అన్నం. మొదట మిఠాయి తినిపించాలి." ఎక్కడో దూరం లోతులోంచి మున్నీ మాట వినపడింది.

జవాబుగా వదిన నవ్వేసింది. "ఈయనే మిఠాయి తినిపించాలిక. అత్తవారింటి మిఠాయిలు తినడానికి మాత్రం వెంటనే ఎగబడతాడు." ఆమె నవ్వుతుంటే ఎంతో అందంగా ఉంటుంది. "మిఠాయి, గిఠాయి గొడవెందు కొదిన! నాకు ఎండిన రొట్టెఇచ్చెయ్. అదే చాలు. ఆ మిఠాయిలు నీకు, అత్తవారింటికే చెల్లుగాక." నేను ఎంతో పని వున్న వాడిలా అన్నాను. "భోంచేసిన వెంటనే చదువుకోడానికి కూచోవాలి. బోర్డు పరీక్షలున్నాయి."

ఆ సమయాన వదిన ఎంతో ప్రసన్నంగా కనపడింది.

భోంచేయగానే లాంతరు ఎదురుగా పెట్టుకుని నేను చదువు ప్రారంభించాను. చలి అప్పుడే మొదలయ్యింది. కాని అంత తీవ్రంగా ఏమీలేదు. చదువుతుంటె త్వరగా నిద్రొస్తుంది. ఎక్కువగా కష్టపడలేక పోతున్నాను. అందువల్ల నేల పైనే పక్క వేసుకున్నాను. మంచం ఒకవైపు పెట్టి వుంది. దానిపై నేను కప్పుకునే ఎంతో మురికైపోయిన రగ్గులు కుప్పలుగా పడివున్నాయి. రోజా నేను అర్ధరాత్రి పన్నెండు, ఒకటి వరకు చదివి పొద్దునే నాలుగున్నర, అయిదు గంటలకి లేచి చదవాలని తీర్మానించుకున్నప్పటికి ఆ కార్యక్రమం సాగనే లేదు. ఇంట్లో నేను అందరికంటె పెద్ద క్లాసు చదువుతున్న వాడిని కాబట్టి విడిగా ఒక లాంతరు ఉపయోగించే అధికారం యిచ్చారు. మిగతా యిద్దరు తమ్ముళ్ళు ఒకే లాంతరు కింద చదువుకునేవాళ్ళు. అయితే మిగిలిపోయిన ఒక్క లాంతరుతో మొత్తం ఇంటికి ఎలా సర్దుకొగలమని ప్రతిరోజు గొడవ

జరుగుతుండేది. ముఖ్యంగా ఏరోజైనా వెలుగుతున్న లాంతరును అలానే వది లేసి నిద్రపోతున్న నన్ను అన్నయ్య చూసాడంటే ఇక ఆరోజు కిరసనాయిలు దుబారా గురించి జరిగే హంగామా వర్ణించ వీలుకాదు.

లాంతర్ ఎదుట పుస్తకంలోకి కళ్ళు చొప్పించి తల వంచుకుని కూర్చు న్నాను. మాథ్యూ అర్నాల్డ్ కావ్యం "షోరాబ్ అండ్ రుస్తుం" పుస్తకమది. కానీ చదవాలని ప్రయత్నించినా చదువలేకపోతున్నాను. ఇక లాభం లేదనుకొని ఆ ప్రయత్నం మానుకున్నాను. అలానే కూచుని ఎదురుచూస్తున్నాను. ధ్యాస మళ్ళినప్పుడల్లా పేజి తిరగేస్తున్నాను. ఇంతకు ఆవిడ ఏంచేస్తున్నదో చూడా లనుకున్నాను. ఇంటిపని సాంతం ముగించిన తర్వాత అన్ని విషయాలు మాట్లాడుకుని, మున్నీ ఇంకా వదినతో ఇంటి విషయాలన్ని తెలుసుకుని గాని ఆమె రాదని నాకు తెలుసు, ఆమె ఇంతకు ఎంతగా మాట్లాడి వస్తుందోనని నిరీక్షిస్తున్నాను.

అడుగుల చప్పుడు వినపడింది. ఎవరో వస్తున్నారు. ఇంతవరకు కింద నుంచి వినబడిన మాటలు ఇప్పుడు వినపడటం లేదు. ఈ మధ్య అమ్మ నిశ్శబ్దంగా వుంటున్నది. ఆమె స్పష్టంగానే ఉపేక్షను చూపుతున్నది. ఆమె చలినితట్టుకోలేదు కాబట్టి రగ్గు కప్పుకుని చేతిలో జపమాల తిప్పుతూ మన స్సులో లెక్కపెట్టుకుంటు వుండవచ్చునని నేను ఇక్కడ కూర్చుని అంచనా వేసుకున్నాను. అసలు కాసేపు బయటికివెళ్ళి కిందికి తొంగి చూసి రావాలని అనిపించింది. కాని అన్నయ్య ఒక వేళ తనగదిలో కూర్చుని ఉంటే నన్ను చూస్తాడు. పైగా మిద్దెపై నుంచి అమ్మ కూచునే గది కనపడదు. అలానే నేను భయపడుతు, భయపడుతూ అసపసరంగానే బయటి డాబాపై ఒక మూల వున్న మోరీ దాకా వెళ్ళివచ్చాను. మున్నీ ముక్కుదాక రగ్గులాక్కొని తన మంచంపై పడుకుని వుంటుందని ఊహించుకున్నాను. ఇక వదిన అమ్మ కాళ్ళు పడుతూ వుంటుంది. మున్నీ మంచానికి ఆనుకుని ఒదిగి, ఒంగి కూర్చున్న ప్రభ వింటూ వుంటుంది. వాళ్ళు మాటలు తొందరగా ముగిస్తే వెళ్ళిపోయి రోజంతా పడిన శ్రమను ఉపశమించే విశ్రాంతి పొందవచ్చని అనుకుంటూ వుంటుంది.

తలుపుదగ్గర ఎవరోవచ్చి నిశ్శబ్దంగా నిలుచున్నారని అనిపించింది. నీడను చూసి ఆవిడే అనుకున్నాను. నేను చదువుతుండగా అలాగే చూస్తూ లోపలికి రావడానికి సంకోచిస్తున్నట్లున్నది కాసేపటికి మెల్లిగా, భయంగా లోపలికి

వచ్చి ఆమె ఏమాత్రం చప్పుడుకాకుండా తన ట్రంకుపెట్టె తెరిచింది.

సరసరమనే శబ్దం వింటే బట్టలు ఏవోతీస్తున్నట్టు అనిపించింది. కొంచెం సేపు అలానే కూచుని ఆలోచిస్తు వుండిపోయింది. ఆతర్వాత మోకాళ్ళపై చేతులు ఆనించి నిలబడి బయటికి వెళ్ళిపోయింది. అలసిపోయింది. బహుశా దుస్తులు మార్చుకోడానికి బయటికి వెళ్ళి వుంటుంది. నా ఇంద్రియాల చైత న్యమంతా చెవుల్లో కేంద్రీకరించుకుపోయింది. గాజుల సవ్వడి, దుస్తుల సర సరమని చప్పుడు ఆరోగ్యకరమైన యవ్వనవతి శరీరపు విచిత్రమైన సుంగధం తెమ్మెర గదిలోకి వచ్చి వెళ్ళిపోయింది. మనస్సంతా కదిలిపోయి తీగలు ఝుంకారంలా నా శరీరంలోని నరాలన్ని కంపించిపోయాయి. నాలోపల వ్యాపి స్తున్న ఈ విచిత్రమైన ఉల్లాసపు వేడిని నేను అర్థం చేసుకోలేకపోతున్నాను. కాని ఈ వేడి లేదా ఉష్ణము నా నరనరాన విస్తరించి నారోమాల్లో లీనమైపో యింది. గతంలో జరిగిన వన్ని మెదడులోంచి ఎగిరిపోయాయి. సుఖమయ మైన దాంపత్య జీవనపు కాంతివంతమైన భావి చిత్రాలు తళతళమెరుస్తు కదులుతున్నాయి. సినిమాల్లో కథల్లో చూసిన, చదివిన దృశ్యాలు, శృంగార క్రీడలు మనస్సులో మెదిలాయి. మేము ఎలా ఆడుకుంటామో పరస్పరం ఎలా ఏడిపించుకుంటామో గిలిగింతలు పెట్టుకుంటామో, అలిగి నపుడు ఎలా నచ్చజెప్పుకుంటామో అన్నీ ఊహించుకుంటున్నాను. ప్రభ కొంటెతనంతో నా పుస్తకాన్ని లాక్కుని పారిపోతుంది. నేను చదువు ఆపి ఆమెతో మాట్లాడా లని గొడవ చేస్తే, నేనేమో కోపం నటిస్తు ఆమె వెనకాలే పరిగెడతాను. ఆ హాస్య వినోదమంతా విద్యుత్తులా నర్తించే కేలింతలు మబ్బుల్లా వర్షించే ఉల్లా సాన్ని నేను స్పష్టంగా నా కళ్ళ ఎదుట చూస్తున్నాను.

మెల్లిమెల్లిగా లేస్తూ నడుస్తున్న ఆమె అడుగుల వెనకాలే నా దృష్టి తలు పుదాకా వెళ్ళింది. పాదాలపై గోరింటాకు ఉన్నది. తెల్లని మడిమలపై వెండి తొడుగులు అడుగుపెట్టగానే చీర అంచుతో మూసుకుపోయి, అడుగు లేపగానే తళుక్కుమంటున్నాయి. ఆమె మరో అడుగు వేసి గడపదాటి పోగానే నాలోంచి గొంతుదాకా ధ్వని తరంగం లేస్తున్నది. - "ప్రభ, విను" ఎంతో కోమలంగా, ఎంతో మధురంగా ఆమెను పిలువాలనే కోరికను ఎలా ఆపుకున్నానో ఆనాటి వరకు తెలియదు. ఆమె దుస్తులు మార్చుకోడానికి వెళ్ళిందని ఇప్పుడే వచ్చే స్తుందని ఎంతో కష్టంపై నన్ను నేను నచ్చజెప్పుకున్నాను. పుస్తకం, కాగితం, చదువు, ఇవన్నీ నా సమక్షంలోంచి వెళ్ళిపోయాయి. ఆశయాల తుఫానులో

మునిగి నా ఇంటిలోంచి అధికారాన్ని జారవిడుచు కుంటున్న నేను మాత్రమే అక్కడ మిగిలిపోయాను. నేను కూర్చున్న భూమి మరోపక్కకి క్రుంగిపోతున్నట్టు అనిపించింది.

అప్పుడే డాబాపై మరో కొసనుంచి బహుశా గదిలోంచి వదిన మాటలు మెల్లిగా వినపడ్డాయి. "లేదు ప్రభ నువ్వు అక్కడే పడుకో మంచం లేకపోతే నేను వేస్తాను. ఇక్కడికి మీ బావగారు వచ్చేస్తారేమో."

ఆమె నెమ్మదిగా ఏమి జవాబు చెప్పిందో, దానికి సమాధానంగా వదిన హెచ్చిన స్వరం వినపడింది. "ఇంతకు నువ్వు అక్కడ ఎందుకు పడుకోవు?" ఆమె స్వరంలో నాకు ఆరోజున ఆమె చెప్పిన డాక్టర్‌కు చూపించుకునే విషయం స్ఫురణకువచ్చింది, ఎందువల్లనంటె ఆ తర్వాతే ఆవిడ నెమ్మదిగా ఏదో హాస్యమాడింది. ఆహాస్యం నచ్చలేదేమో ప్రభ గొణుగుడు పెరిగింది. కాసేపు నిశ్శబ్దం ఆవరించింది. ఆ తర్వాత వదిన నచ్చజెపుతున్న ధోరణిలో అన్నది, "చూడు ప్రభ, నేను చెప్పింది విను. నువ్వు కొత్త కోడలివి మొదట్లోనే నువ్వు ఇలా చేస్తే ఆపై ఇంకెలా సాగుతుంది? నువ్వు జీవితం అంతా గడపాలి కదా. ఇలాంటివన్నీ జరుగుతూనే ఉంటాయి."

ఆమెకు జవాబుగా మళ్ళీ ప్రభ కంఠాన్ని హెచ్చించి తీక్షణంగా, దృఢంగా, మొండిగానే ఆమె మాటలు వినపడ్డాయి."బలవంతంగా వెళ్ళి అక్కడ పడుకోనా, నాతో ఆ పనికాదు అక్కయ్యా ఒకవైపు ఈసడించు కుంటుంటే తోక ఆడించడం, తన్నుతూ వుంటే అడుగులకు మడుగులొత్తటం నాకు చాత కాదు. ఆయనకు బోర్డు పరీక్షలున్నాయి. నేనెందుకు ఇబ్బంది పెట్టాలి. ఏవైనా జరిగితే తర్వాత అందరూ నన్నే విమర్శిస్తారు. నేనిక్కడికి రావడం ఆయన చూసికూడ వూరు కున్నారు. నువ్వేమో నన్నక్కడికే వెళ్లమంటున్నావు."

ఆమె ప్రతీమాట విషం పూసిన బాణంలా అహంకారంతో దూసుకువస్తు న్నది. తుపాకి గుండులా ఏదోవస్తువు మెదడు నరాలను చీలుస్తు వెళ్ళిపోయింది. ఉన్నత శిఖరంపై నుంచి ఎవరో నిర్దయగా కాలితో తన్ని తోసినట్టు అని పించింది. నేను వెంటనే నిటారుగా కూర్చున్నాను. నా రెండు కనుబొమలు ముడివడి పోయాయి. తీవ్రంగా దెబ్బతినగానే కోపంలోంచి వెలువడిన హుంకా రంతో ముక్కులోంచి శ్వాస వెలువడగానే రెండు ముక్కు రంధ్రాలు వ్యాకోచం చెంది ఎర్ర బడ్డాయి. "అయితే ఇదా సంగతి!" నేను మరింత తీక్షణమైన దృష్టితో పేజిలోని నిర్జీవమైన అక్షరాల్ని ఎగాదిగా చూస్తుండిపోయాను బంధిం

పబడిన బలమైన పులి అటు ఇటూ పచార్లు చేస్తున్నట్లు ఈ వాక్యమే గుండెలో అటు ఇటూ ప్రచండమైన వేగంతో ఢీకొంటూ మాటిమాటికి ప్రతి ధ్వనిస్తున్నది, "అయితే ఇదా సంగతి!"

అమ్మయ్యో! వెంట్రుకవాసిలో తప్పిపోయాను! ఎంత ప్రమాదం జరిగిపోయేది? పిలవాలనుకోడంలో ఏమి తగ్గిందని? మాటలన్నీ నాలుకపైకి వచ్చేసాయే! మొత్తం వాక్యాన్ని ఆలోచించానే! ఎంతటి భ్రమలో, ఎలాంటి భావుకత్వంలో కొట్టుకపోయానో నేను? అప్పుడే ఆమెను పిలిచివుంటే జీవితాంతం నా చూపులు కిందికే వాలివుండేవి!

అబ్బో! ఎంత అహంకారం! ఒక్కొక్క మాటలో యాసిడ్ నింపినట్టు బహుశా ఇలా రెండో సారి ఇంత స్పష్టంగా ఆమె స్వరాన్ని విన్నాను. ఎంత నిర్లక్ష్య మైన మాట తీరు! కత్తి పదును లాంటి ఆమె వాణి సమక్షంలో లొంగిపోయే వాణ్ణి నేను? ఆమె ఎదుటే? ఎలాంటి మంచి సమయంలో భగవంతుడు రక్షించాడు నన్ను. జీవితాంతం ఏడుస్తూ ఉండే వాణ్ణి. ఈ అహంకారాన్ని నేను అర్థం చేసుకోవాలి! కొంచెం ఏం చదువుకుందో గాని తనను తాను దేవుడిగా భావిస్తున్నది. ఏం చదివిందో ఒట్టి బూడిద! వదిన చెప్పింది నిజమే - ఆమెకు తన చదువు పట్ల, తన రూపాన్ని చూసుకుని ఎంత గర్వమో! ఏదైనా లక్ష చెప్పండి, ఒక స్త్రీ మాత్రమే మరో స్త్రీని అర్థం చేసుకోగలదు. పురుషుడేమైనా అర్థం చేసుకోగలడా! ఆమె సరిగ్గానే చెప్పింది భార్యని అణిచి పెట్టాలని.

అప్పుడే తిన్నగా అక్కడికి వెళ్ళి నాలుగు తన్ని, గుద్దితే తలబిరుసుతనం అంతా దిగిపోతుందని నా బాహువుల కదలిక వల్ల నాకనిపించింది. అప్పుడప్పుడు అన్నయ్య వదినను లాగి చెంపదెబ్బ కొడుతుంటారు. అది చూసి ఎంతో సేపు నా మనసంతా పాడై పోతూ వుంటుంది. కాని ఆయన సరిగ్గానే ప్రవర్తించే వాడని ఈ క్షణాన నాకనిపించింది. మనం లక్షరెట్లు ఆదర్శ వాదులమయినా, ఆడవాళ్ళ గురించి తులసిదాస్ ఏమి రాసాడో, అదంతా వేలాదిసంవత్సరాల అనుభవ సారమని అర్థమవు తున్నది. స్త్రీ...? స్త్రీ పెద్ద పెద్ద వాళ్ళని వేళ్ళపై ఆడించింది. కానీ ఈ కోతి మాత్రం కర్ర ఎదుట ఆడేది మాత్రమే.

నేను ఇందాకే ఎంత మూర్ఖంగా ఆలోచించానో! భవిష్యత్తులోని దాంపత్య సుఖం గురించి, క్రీడ, పులకించే నవ్వుల గురించి.. అదికూడా ఈ ఆడదాని

తోనా? లేదు, లేదు ఆ స్త్రీతో నాకెలాంటి సంబంధం ఉండదని ఎప్పటికీ రాజీ కుదరదని, ఈ రోజు దేవతలందరితో పాటు స్వయంగా భగవంతుడి సాక్షిగా ప్రమాణం చేస్తున్నాను. ఈ లోకంలో తనను తాను అతి తెలివైన దానిగా భావించే దానితో ఎలా నెగ్గుకురాగలం...? ఎప్పటికీ కాదు... ఎప్పటికీకాదు.

నిజం చెప్పాలంటే నాలాంటి మూర్ఖుడు దొరకడం కూడా కష్టమే! అమర్ ఏదో కాస్త చెప్పగానే (అది నిజమో, అబద్ధమో ఎవరికి తెలుసు) భూమ్యాకాశాలని కొలవడం ప్రారంభించాను. అయినా వాడికి వ్యంగ్యం అర్థం అవుతుందా! అబ్బా! ఈ లోకం ఎంత భయంకరం! ఎంత జారుడో! అజాగ్రత్తగా ఉన్నామో ఇక పోయినట్టే లెక్క. ఆ వేగవంతమయిన ప్రవాహంలో మళ్ళీ కాలు నిలదొక్కుకోవడం అసంభవం... అందువల్లనే మనవాళ్ళు ఇదంతా మాయ, భ్రమ అన్నారు.

అప్పుడే మళ్ళీ మెల్లిగా అడుగుల చప్పుడు, గలగల ఇంకా సరసరమనే చప్పుడు 'ఎవరో వస్తున్న అలికిడి'... నా ఆలోచన ఆగిపోయింది. ఎవరై వుంటారు? ఆ రాణిగారే కాబోలు... లేదా వాదించి ఆతరువాత నాకు నచ్చజెప్పాలనే ఉత్సాహంలో, బహుశా వదిన వస్తున్నదేమో! ఒక వేళ వదిన అయితే మూడు గంటల పాటు వాదోప వాదాలు మొదలై పోతాయి. ఎన్నో సార్లు దృఢ స్వరంతో ఇలా అన్నాను... ఈ రోజు బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులు ప్రపంచంలోని ఏశక్తి వచ్చినా మాకు రాజీ కుదరదు, కుదరదు, కుదరనే కుదరదు. ఆవిడ లొంగదని నాకు బాగా తెలుసు. ఆమె అహంకారం ఆవిడని లొంగనివ్వదు. ఇక్కడ నేనేమి పనికిరాని మట్టితో తయారయిన వాణ్ణేమీ కాదు. ఈ ఉక్కుతో ఆ ఇనుము ఘర్షణ పడవలసి వుంది. చూద్దాం ఎవరు విరుగుతారో?

అప్పటికే ఆమె ద్వారం దగ్గరికి వచ్చేసింది - వదిన కాదు, ఆవిడే. ఎలాంటి సంకోచం లేకుండా గడపదాటి, అటు ఇటు చూడకుండా తిన్నగా తన సామాను వైపు వెళ్ళింది. నేను ఏమీ తెలియనివాడిలా నిక్కి కూర్చున్నాను. పెట్టె తెరుచుకుంది. అందులోంచి ఏమేమి తీసుకుందో, పెట్టిందో, పెట్టెను మూసివేసింది. నేనిదంతా కనుకొలుకలలోంచి చూస్తూనే వున్నాను. చప్పుడు విని అంచనా వేసుకుంటున్నాను. గదిలో ఒకమూల గోడకి ఆనించి వున్న మంచం పక్కనే నేలపై ఏదో పరుచుకుని, ఏదో ఒక పాత చీరను గుండ్రంగా వుండచుట్టి తలకింద పెట్టుకుని నా వైపు వీపు తిప్పి ఆమె పడుకుంది.

అలాగే పడుకో...! నాదేం పోతుంది. ఉపేక్షా భావంతో తలపంచుకుని

నేను మళ్ళీ సొరాబ్ అండ్ రుస్తుం ఖండకావ్యం లో మనస్సు లగ్నం చేసుకునే ప్రయత్నం చేస్తున్నాను. ఇంతకు ఈవిడ తననుతాను ఏమని భావిస్తున్నది. స్వర్గంలోని అప్సర లేదా సరస్వతి అవతారమా? అసలు అర్థం చేసుకునే ప్రయత్నమే లేదు. ఎవరి పాల పడిందో అమ్మాయికిపుడు తెలిసివచ్చింది. కొంచెం వేడికే కరిగిపోయే మైనం అనుకుంది కాబోలు కాకపోతే శోభనం రాత్రినాడే ఎంత దృఢంగా నిగ్రహంగా ఎవరైనా వుండగలరేమో చెప్పగలరా అహంకారమంతా అదే రోజు ఊడ్చుకుని పోయివుంటుంది. భర్తను పెంపుడు కుక్కలాగా అణచిపెడితె ఏదో తోకాడిస్తానని అనుకుంది కాబోలు. ఆ ఆటలె పుడైతే సాగలేదో రెండు మూడు రోజులాగి నేనే పరిగెత్తుకుని వస్తానని అనుకుంది, కాబోలు, కాని నేను మాత్రం...? ఈ జీవితం ఇలాగే గడిపేస్తానని నేను చెబుతున్నాగా. కొంచెం ఏం చదువుకుందో గాని తనను తాను మహా పొడిచేసే దానిగా భావించు కుంటున్నది. ఎలా పడుకుందో నిక్కినీలుగుతూ... పడుకో, రాత్రంతా అలానే పడుకో, జీవితాంతం అలానే పడుకో, ఎందుకు పడుకున్నావో ఇక్కడ ఎవరూ అడగరు. చచ్చిపోతే ఎత్తి పారవేస్తారు. మా అయ్యే అహంకారాన్నే నేను సహించను. మరి నువ్వోలెక్క?

నిజం చెప్పాలంటె అసలు నీ అవసరం ఇక్కడ ఎవరికుందని. మా యింటివాళ్ళు ఇందులో ఇరికించిపెట్టారు కాని, లేకపోతే ఈ గొడవంతా జరిగేదా, నీ ఇంట్లో నువ్వుహాయిగా వుండేదానివి. ఏదో అర్థం చేసుకునే మనిషి అనుకున్నాను - అర్థం చేసుకోడమా? అసలు తన జీవితంలో అర్థం చేసుకోవడం ఏవిటో తెలిస్తేకదా. బండినితన బలంతోనే లాక్కొస్తున్నానని కుక్క అనుకుంటుంది... ఈ ఊబిలో ఇలా ఇరుక్కుపోయాను, నాన్నగారు అనవసరంగా నన్ను... లేకపోతే హాయిగా ఆడుతూ పాడుతూ వుండేవాణ్ణి సరే, ఇప్పుడు ఇది చూస్తాను. ఎలాసాగుతుందో?

రాత్రి మరింత గాఢమవుతున్నది. పరిసరాల్లో దూరంగా సత్రుమంటున్న చప్పుడు వీధుల్లోంచి బజారుల్లోంచి అప్పుడప్పుడు కాపలాదారు దీర్ఘంగా లయాత్మకంగా వేస్తున్న కేక ఊగుతున్న జెండాలా ఒక కొసనుంచి మరో కొసకు వెళ్ళిపోతున్నది... దానితో మారుమ్రోగుతున్న ప్రతిధ్వనులు అటు ఇటు ఊగుతూ మునుగుతున్నట్టు ఉన్నాయి. అప్పుడప్పుడు ఎక్కడో దూరంగా రైలింజన్ వేస్తున్న విచిత్రమైన కేకలు భయంకరమైన రాక్షసుడిలా లేచి నిలుచున్నప్పుడల్లా కుక్కల మొరుగుడు నునుపైన ఇనుపస్తంభాల దగ్గర

ఎలుకల గంతుల్లా కుర్ర చేష్టల్లా అనిపించేవి. అప్పుడప్పుడు గుర్రపుబండ్లు భారంగా కఢ్ కఢ్ మంటు గుర్రాల మెడల్లోని గంటలు వాతావరణంలో మారు మ్రోగుతుండగా వెళ్ళిపోతున్న చప్పుడు మళ్ళీ ఆ గాఢమైన స్తబ్దతలో చుట్టు కుని, చూట్టూ అంతా ఒత్తిగిలి నిద్రపోతుంది. మరో ధ్యాస ఏదీ లేకుండా నా ఎదుట ప్రభ కాల్పనిక విగ్రహాన్ని ఊహించుకుని ఉత్సాహంతో ఆవిడతో ఏవేవో ప్రశ్నించి జవాబు రాబట్టు కుంటున్నాను. ఉపన్యసించాలనే ధోరణి ఆవహించింది. గతంలో అనుకున్న వాటిని ఒక్కొక్క మాటని మళ్ళీ మళ్ళీ కోపంగా అడు గుతూ రెండింతల ఆవేశంతో వాటికి సమాధానమిస్తూ, ఆ వ్యర్థమైన ప్రేలా పనతో పనికిరాని కోపంతో పళ్ళునూరుతూ అనేవాణ్ణి. "ప్రభాజీ, మీ అదృ ష్టంఎవరి సమక్షంలోకి తీసుకొచ్చి నిలబెట్టిందో ఇంకా అర్థం చేసుకోలేరు. అర్థం చేసుకున్నప్పుడు నేను ఎలాంటి మనిషినో నువ్వు తెలుసుకుంటావ్." ఈ సందర్భానికి అనుకూలంగానే రాసారు అన్నట్టు మళ్ళీ నేను "సౌరభ్ అండ్ రుస్తుం" పంక్తులను ఎంతో ఆత్మ విశ్వాసంతో వల్లెవేస్తున్నాను, ఈ పంక్తుల్లోనే రుస్తుంను సవాలు చేస్తు సౌరభ్ అంటాడు. "వేలాది యుద్ధరం గాల్లో నేను పోరాడాను. కాని ఈనాటి వరకు యుద్ధరంగాన్ని నేను వదిలి వెళ్ళలేదు లేదా నా శత్రువు సజీవంగా మిగలలేదు." ప్రభాజీ జ్ఞాపకం వుండనీ, 'నెవర్ ద ఫీల్డ్ వాస్ లాస్ట్, నాట్ ద ఫో' సేవ్డ్ ...!

ఇంతకు నా మొదటి రోజు ప్రవర్తన బాగానే వుంది. అందులో అనౌ చిత్యం ఏమీ లేదు. ఇలాంటి వ్యక్తితో అలానే జరగాలి. ఈనాటి నుంచి ఈమెను అవమానపర్చడమే నా మొదటి లక్ష్యం.

రాత్రి కొండలు, లోయల్లోంచి నల్లని చీకటి జలపాతం నెమ్మదిగా జారుతు న్నది. అలలు అలలుగా క్షణాలు గడిచిపోతున్నాయి... రాత్రి సాగిపోతున్నది రాత్రంతా చాలసేపు కాలుతున్నందువల్ల లాంతరు లోని వత్తి ఒకవైపు బాగా కాలిపోయింది. నేను నిశ్శబ్దంగా కూర్చుని ఆలోచిస్తున్నాను. ఆవేళ పడుకో వాలనే ధ్యాసేలేదు. ఎదురుగా ముడుచుకుని పడుకున్న ప్రభను అసహ్యంగా చూసేవాణ్ణి ఆ తర్వాత మళ్ళీ నాలోనేను తప్పిపోయేవాణ్ణి. వెక్కిరింతగా మొఖం తిప్పుతు "నేను అక్కడికి వెళ్ళను" అయితే ఇప్పుడు ఎందుకు వచ్చినట్టు? అలాంటిదానివైతె ఎక్కడో మునిగి చావాల్సింది.

వత్తి బాగా మాడిపోతున్నది. దాంతో పొగ పెరిగింది. లాంతరు పైన పొగచుట్ట చుట్టుకుంది. తెల్లని అద్దమంతా పొగ పొరలు పొరలుగా అల్లుకుంటున్నది.

# ఏడు

నేను ఎప్పుడో చేసుకున్న పుణ్యం వల్ల ఏదో భారీ దుర్ఘటన నుంచి వెంట్రుక వాసిలో తప్పించుకున్నట్టు లేదా నేనేదో భయంకరమైన నేరం చేయకుండా ఆగిపోయినట్టు నాకు మరుసటి రోజు అనిపించి - ఎంతో ఆనందాన్ని అనుభవించాను. ఆ కొంచెం భావావేశం మూలంగా ఎంతటి పెద్ద తప్పునుంచి అనుకోకుండా తప్పించుకున్నానో గ్రహించి నన్ను ధన్యుడిగా భావించుకున్నాను. ఏదో దైవ కృపవల్ల అలా జరిగిపోయింది. లేకపోతే ఇక ఏం మిగిలిపోయేదని? ఇప్పుడు ఇక ఇదేసరి. ఈ శ్రీమతిగారి సంగతేమిటో తేల్చుకోవాలి... ప్రభ మాట జ్ఞాపకం రాగానే యాదృచ్ఛికంగానే పళ్ళు బిగపట్టేవాణ్ణి. ఏదో మొదటిసారి ఆ నిజం తెలిసివచ్చినట్టు ఆశ్చర్యంగా మళ్ళీ అవే మాటలు అనుకునే వాణ్ణి. "ఇంత అహంకారమా? అన్నం పెట్టేప్పుడు వదినతో బోర్డు పరీక్షలు గురించి ఎందుకు ప్రస్తావించాలి. ఆరకంగా చురక వేయడమే కదా." సరే చూద్దాం. నిన్న జరిగిందంతా ఈరోజు నెమరేసుకుంటు వుంటె నేనేదో కలలో చనిపోతు చనిపోతూ బతికినట్టు అదే అనుమానంతో గుండె దక్ దక్ మని కొట్టు కుంటున్నది.

భోంచేసేప్పుడు వదినతో అన్నాను. "వదినా, నేను పాసు కావాలనుకుంటున్నావా లేదా?"

వదిన ఉబ్బిన రొట్టెను చిమ్మటతో బయటికి తీసి కింద పీటపై బాదేసరికి వచ్చిన ఆవిరిని చూస్తూవుంది. నా మాటతో ఉలిక్కిపడి నన్ను చూసింది. "ఏమిటి, నే నేం చేసాను, లాలా?"

"చాలింకా - నువ్వు చేస్తేనే కదా ఇదంతా జరిగింది. అసలు మీరంతా ఏమనుకుంటున్నారు?"

"ఏం జరిగిందో సరిగ్గా చెబితె జవాబిస్తాను. చిక్కుముడులు విప్పుతు కూచోకు." వదిన పిసికిన పిండిని చిన్నముద్దగా తెంపుతూ తల దించుకునే అన్నది. నేను దేని గురించి అంటున్నానో ఆమె బహుశా అర్థం చేసుకునేవుంటుంది.

"ఏంచెప్పమంటావ్, నీకు ఏమీ తెలియనట్టే! నన్ను ఈ గొడవలో ఇరికించొద్దని నేను మొదటే చెప్పాను. కాని అపుడేమో అందరిది ఒకటే పాట! ఇపుడు ఫెయిల్ అయిపోతే ఈనాటి కుర్రళ్ళంతా ఇంతేలే అని ఏడుస్తారు.

పైగా ఏదో చదువుకోడానికి విడిగా ఒక గదిని శుభ్రం చేసుకున్నాను. అందులోకి కూడ ఎవరెవర్నో, లోకాన్నంతా దూర్చే ప్రయత్నం చేస్తే అక్కడ ఎవరైనా ఎలా చదువుకోగలరు? మూడు నెలల మాటేగా నువ్వు ఆగలేకపోయావు." నేను తీవ్రంగానే అన్నాను. ప్రభ ఆ పరిసరాల్లోనే వుంటుందనే ధ్యాస నాకు వుంది. అప్పుడు అనిపించలేదు. కాని ఆ తర్వాత ఆలోచిస్తుంటే గతరాత్రి ఆమె మాట్లాడిన తీరుకు ఇపుడు ధీటైన జవాబిచ్చానని సంతోషించాను.

"ఆగవలసిన మాటే లాలాజీ!" వదిన ముసలావిడ ధోరణిలో అన్నది - "నా వశమవుతే నీకంటే ఎక్కువేమిటి? నీకు సుఖం కలిగించని పనిని మేమెందుకు చేస్తాం? కానీ, ఇపుడు నా అవస్థ చూస్తూనే వున్నావు కదా! సాగినన్ని రోజులు అలా జరిగి పోవడమే మంచిది. లేదంటావా స్కూలుకి కాలేజికి వెళ్ళే మీ అందరికీ ఆలస్యమవుతూ వుంటుంది. ఇపుడయితే మున్నీ సాధ్యమైనంతగా ఈ పనిని సంబాళించుక వెడుతుంది. మహారాణి గారి నుంచి నాకేమీ ఆశలు లేవు, ఆమె సక్రమంగా పని చేస్తే ప్రసాదం పంచి పెడతాను" మళ్ళీ కాస్సేపు నిశ్శబ్దంగా పిండిని సాగదీస్తూ వుండి పోయింది. "చూద్దాం! ఎలా వండి పెట్టి తినిపించగలదో!"

"నువ్వు చెబుతున్నదంతా అందరికీ సంబంధించిన పనేగా! ఇందులో నేనెందుకు నలిగి పోవాలి? దీని వల్ల బాగా నష్టపోయేది నాచదువేగా!" కనుబొమ్మలు పైకెగరేస్తూ నేనన్నాను.

"అత్తగారేమైనా సంతోషంగా వున్నారా? ఈవిడ తల్లి గారింటికి వెళ్ళి ఏమేమి చెప్పిందో, వాటి నన్నింటిని అమర్ లాలాజీ వచ్చి తెలియజేసాడు. డబ్బుకు ముఖం వాచి వున్నారని, ఇలాంటివారు అలాంటి వారని... ఇంకెన్ని చెప్పిందో! అయినా ఈ ఇల్లు తనదయి పోయింతరువాత ఆ ఇంటి గురించే ఏవేవో చెప్పేస్తే. ఎవరికి చెడుపేరు? ఇక డబ్బు విషయమా! ఎవరికవసరం ఉండదని! ఆమె నాన్నగారికి లేదా! ఈమె ఒక్కతే గారాల కూతురు. అయినా వాళ్ళు సరిగ్గా పెట్టు పోతలు ఏం పాటించారని? అలాంటి డబ్బు తగలబడి పోనీ! అయినా, ఎవరయినా డబ్బును తనతో పాటు తీసుకెళతారా? లాలాజీ! ఈ లోకం లోంచి ఎవరైనా ఖాళీ చేతుల్తో పోయేవాళ్ళేగా! పెళ్ళి పేరంటాల్లో మనస్ఫూర్తిగా మనిషి ఖర్చు పెట్టక పోతే ఆ డబ్బు వల్ల ప్రయోజనం ఏమిటి? ఇవే కదా ఖర్చు పెట్టే అవకాశాలు!" ఈ రెండు మూడు అవకాశాల ప్రసక్తి రాగానే వదిన వెంటనే నిశ్శబ్దంగా ఉండి పోయింది. వదినకు కొడుకు

పుడితే ఆమె తల్లిగారి ఇంటినుంచి వచ్చేవి ఏమిటి అని ఇంట్లో చర్చ జరుగుతుండేది. ఇపుడు ఆ విషయాన్ని గమనించి ఆమె ఏం మాట్లాడాలో తోచక ఊరుకుందని నేను అర్థం చేసుకున్నాను. ఆమె రొట్టెలు వత్తడంలో నిమగ్నమయిపోయింది. నేను తింటున్నాను. ఈ ఆడవాళ్ళ మాటల్లో నాకు మొదటి నుంచే ఎలాంటి ఆసక్తి లేదు. కాసేపు ఆగి అన్నాను-"వదినా! అంతా బాగానే వుంది. కానీ, ఇపుడు నేనేం చేయాలో చెప్పు."

"అయితే లాలాజీ! ఇంకా చోటు ఎక్కడుందో నువ్వే చెప్పు అవే మూడో నాలుగో గదులు తప్ప!"

"అయితే అందరూ మునిగి చావండి! నా మానాన నన్ను చదువు కోనివ్వండి!" నేను చిరాకుతో అన్నాను.

"అదేమిటి లాలాజీ! అలా మాట్లాడుతావేంటి? ఆమె రెండో సారే కదా వచ్చింది. ఏమిటా మాటలు!" వదిన సానుభూతితో అన్నది.

"మొదటి సారో, రెండో సారో! ఎప్పుడొస్తే నాకేం? ఆవిడతో నాకెలాంటి పనే లేనప్పుడు, ఎందుకు నేను తలనొప్పి కొనితెచ్చుకోవాలి?"

"అయ్యో! లాలాజీ! మరీ అంత పెద్దగా మాట్లాడితే ఎలా? నేనేదో నీకు నేర్పిస్తున్నానని మున్నీ ఇప్పటికే అంటూ వుంది" వదిన మాట్లాడకుండా వుండిపోయింది. ఆతరువాత మెత్తగా, ఆత్మీయమైన స్వరంతో అన్నది "ఇంతకూ నీకు ఆమె అంటే ఎందుకంత కోపం?"

"చెప్పమంటావా?" నేను నిస్సంకోచంగా చెప్పాను - "అసలు మొదటి సంగతి ఏమిటంటే, ఈ పెళ్ళి నేను ఇపుడే చేసుకోవలసింది కాదు. బలవంతంగా నా మెళ్ళో ఈ గుదిబండ వేళ్ళాడ దీసారు. పైగా ఆమె ముఖం చూస్తేనే నాకసహ్యం. ఇతరులు చెబితే నేను ఆవిడ్ని ఇష్టపడాలని ఎక్కడైనా బలవంతమా? నాకేమి చాతనవుతుందో అది చేస్తాను. నా తరఫున మీరెవ్వరు వకాల్తా పుచ్చుకోవడానికి!"

"నీకు ఏమి ఇష్టమో మాకు తెలియదు. మున్నీ, అత్తగారు కొంచెం కోపంగా ఉన్నా, వచ్చిన కోడలు చాలా అందమయిందని చెప్తుంటారు."

"అందంగా ఉందేమో! నాకు మాత్రం ఏమీ ప్రత్యేకత కనిపించలేదు."

"ఆమె నాన్నగారు ఆవిడ చదువుకోసం ఇరవై వేలు ఖర్చుపెట్టానని, సంగీతం నేర్పించానని, కుట్టు పని నేర్పించానని అనేవారు. కట్నం ఇవ్వక పోతేఏం? ఇక చూద్దాం, ఇక్కడ ఏ ఆఫీసును వెలగపెడుతుందో." తిరిగి

ఆమె పరిహాసంగా అంది. "కాకపోతే ఒక డ్యూటీ తగిలించేసేయ్ ఉదయం లేవగానే హార్మోనియం చేతికిచ్చి పాటపడమను జాగో మోహను ప్యారే..." ఆమె మాటలపై ఆమేను పెద్దగా నవ్వసాగింది.

గ్లాసులోని నీళ్ళన్నీ ఒకే గుక్కలో తాగేసి నేను అన్నాను. "హాస్యమా దొద్దు నీకు చేతులు జోడిస్తాను, నన్ను కాస్త చదువుకోనివ్వు."

"లాలాజీ! అత్తగారిని అడుగుతాను నీకు మరోగది కావాలంటే. ఏది కన పడటం లేదు."

"అమ్మతో చెప్పు లేదా అన్నయ్యతోనైన చెప్పు. నాకు మాత్రం శాంతి కావాలి."

పుస్తకాలు తీసుకుని కాలేజికి వెడుతుంటె మనసులో ఒకమాట మెది లింది. ప్రభ అందమైనదని అందరూ అంటున్నారు, ఒక్కసారైనా ఆమె ముఖాన్ని జాగ్రత్తగా చూడాలి. కాని ఇంతలో నా లోపలి నుంచి ఎవరో హెచ్చరించారు "లేదు, ఎప్పటికీ అలా కుదరదు." ఎలాంటి బలహీనతకైనా నేను చోటిచ్చానో మనస్సుడీలా పడిపోయిందో, అప్పుడిక నేను దిగజారిపోయినట్టే! ఏదైనా అంతా మంచికే జరిగిందనే భావం దినమంతా మనసులో వ్యాపించి వుంది. అనవసరపు గొడవనుంచి తప్పించు కోకపోతే ఇక సమయమంతా ఈ ప్రాణా నికి ఒక పీడ దాపురించి వుండేది. ఇక ఇపుడు నిశ్చింతగా చదువుకోగలను. నా ఆత్మ నిర్మాణానికి ఇదేగా అదను. లోకంలో ఎవరు ఎవరికోసం చచ్చారని ప్రతీ ఒక్కరూ తమ తమ దారి చూసుకుంటారు. నా దారి మామూలు మనుష్యుల దారి కాదని నేను ప్రతిక్షణం గుర్తుంచుకోవాలి. నా దారి ఏదైనా కాగలిగే, ఏదైన చేయగలిగే దారి. అన్నీ మరచిపోయి బాగా చదువుకుంటాను, బాగా కష్టపడతాను. లోకం ఎటుపోతే నాకేం.

ఈరోజు మనస్సంతా చాలా హాయిగా ఉంది. కాని లోలోపలే ఏదోగుచ్చు కుంటున్నది ఏమిటా ఉపేక్ష! ఇంతవరకు నేను ఎవరి ఉపేక్షను సహించలేదు.

రాత్రి ఆవిడ నా గదిలో పడుకోలేదు. మున్నీ దగ్గరో, వదిన దగ్గరో మరె క్కడ పడుకుందో తెలియదు. నేను అసలు పట్టించుకోలేదు. మున్నీ తటస్థ వైఖరి, అమ్మ మౌనం నన్ను ఆశ్చర్యంలో పడేసింది. అయినా మున్నీ సాను భూతి ప్రభ పట్లనే వుందని నా కనిపిస్తున్నది. బహుశా మున్నీ దగ్గరే పడు కుని వుంటుంది. ఆవిడకు ఏదో గుణపాఠం నేర్పేంచే మార్గాలను గురించి చాలా సేపటివరకు ఆలోచిస్తు వుండిపోయాను. వీలు చిక్కగానే ఆవిడను

అవమానపరచాలని, బాహాటంగానే ఉపేక్షించాలని నేను సిద్ధమౌతున్నాను. ఆమె పట్ల నిర్లక్ష్యాన్ని, ఉదాసీన వైఖరిని చూపించడం సబబు కాదేమోననిని ఆలోచించిన తర్వాత నాకు అనిపించింది. అసలు ఆమె ఏ తప్పుకు శిక్షక్ష అనుభవిస్తున్నదో ఆమెకు తెలుసా! నేనైతే అహంకారాన్ని చూసాను. అందుయ వల్ల నేను చప్పట్లు చరిచి మైదానంలో దిగాను.

నేను స్నానం కాగానే వదినతో అన్నాను. "వదినా, అనవసరంగా నువ్వువ్వ ఎంత కాలం రెక్కలు ముక్కలు చేసుకుంటావు. ఇది విశ్రాంతి తీసుకోవలల సిన సమయం. ఇంట్లో మున్నీ ఉంది. ఇంకా ఇతర్ములు వుండనే వున్నారు. నువ్వు ఒక్కదానివే లేవు కదా. తినేహక్కు అందరికి ఉన్నపుడు పనిచేయడాశా నికి బయటి వాళ్ళని పిలుచుకుని వస్తామా?"

రాత్రికి ఎంగిలిపాత్రల కుప్పదగ్గర కూర్చుని ప్రభ ఒక్కొక్క పాత్రనిని తోముతున్న దృశ్యాన్ని నేను చూసాను. పాత్రలు కాలుతున్నట్టు ఆవిడ వాటినిని తాకుతున్నది. ఒక్కగానొక్క కూతురు అని నేను లోలోపలే ఒక క్రూరమైనన ఆనందాన్ని అనుభవించాను. గతంలో ఈ పాత్రల్ని ఆమె అసలు తాకేదా! ఇప్పుడు తెలిస్తున్నది తధాకా.

ఆ తర్వాత ఇంటి వాళ్ళందరికి రెండు పూటలా వండి పెట్టే పనినిని ఆమెకు అప్పగించేసారు. వదిన ఈ అవకాశం కోసమే ఎదురుచూస్తున్నది. మున్నీ అవి, ఇవి ఏవోకొన్ని పనులు రెండు రోజులపాటు చేసింది. తర్వాతత తప్పించుకోసాగింది. అసలు ఒంటరిగా కూర్చుని ఏడుస్తు ఆలోచిస్తు వుండటమేమే మున్నీకి బావుంటుంది. అయితే మాట వరుసకిమాత్రం ఎప్పుడు ప్రభపట్లట్ల సానుభూతి చూపుతుంది రొట్టెలు లేదా అన్నం విషయంలో ఎవరైనా ఫిర్యాదుయ చేస్తే ఆమె ప్రభ పక్షాన్నే వహించి ఇలా అనేది "దినమంతా రొట్టెలు చేస్తూనేనే గడిచిపోతుంది. ఆఖరికి ఆమె కూడా మనిషి ప్రాణమే కదా, పైగా అందరూూ ఏదో తప్పు వెదికేవాళ్ళే." ఒకటిరెండుసార్లు నేను మున్నీతో ఘర్షణపడుతూూ అన్నాను. "అలా అయితే నువ్వు కూడా ఆమెతోపాటు పనులు చేయుస వచ్చుకదా?"

"వదినా, బాబుపుడితే బట్టలన్ని తీసేసుకుంటాను. ఆ తర్వాత ఏదోో సాకుతో ఎగ్గొడతానంటే ఊరుకోను. మొదలే చెప్పేస్తున్నాను." నేను అటుఱ నుండి వెడుతుండగా మున్నీ అంటున్నది నన్ను చూసి మళ్ళీ అన్నది. "నేనుఱ వదినతో పందెంకాసాను." నన్ను చూడగానే వదిన ఎర్రబడింది. ఆమె మొహాూ

మంతా పాలిపోయి వుంది. కాని ఒక విచిత్రమైన గంభీర సౌందర్యం కనపడు తున్నది. వదిన నాకు ఎప్పుడు ఇంత బాగా కనపడలేదు.

ఆమె మున్నీని పక్కకు నెడుతూ సిగ్గు నటించింది "ఇక చాలులే మున్నీ నీకెప్పుడు ఇలాంటి మాటలే. మగాళ్ళముందు ఇవన్నీ మాట్లాడ కూడదు. ఇప్పుడైనా అర్థం చేసుకో."

ఇంట్లో విచిత్రమైన వాతావరణం వుంది. పాకీ పనిమనిషి మొదటే చీర, రవిక తీసుకుంటానని ప్రకటించేసింది. ఎవరు వచ్చినా పుట్టబోయే పాప గురించే మాట్లాడేవారు. అబ్బాయి పుట్టాలని అందరూ కోరుకుంటున్నారు. అందువల్లనే కాబోలు అబ్బాయి గురించే మాట్లాడుతుండేవారు. కాని వది నతో లేదా అమ్మతో ఈ విషయాన్ని ప్రస్తావిస్తే ఆ మధురమైన ఊహకు ఎక్కడ దృష్టి దోషం తగులుతుందోనని వాళ్ళిద్దరు కావాలని ఇలా అనేవారు. "అంతా భగవంతుడి చేతుల్లో వుంది. అమ్మాయి పుడితే ఆపగలమా?" అమ్మాయి పుడుతుందేమో ననే మాట చెప్పుకుని నిజంగానే అమ్మాయి పుడుతుందేమోననే అనుమానానికి అలవాటుపడి బాధ కలుగకుండా చూసు కుంటున్నారు. అయితే వీళ్ళకు మాత్రం అబ్బాయే కలుగుతాడని పదహారణాల నమ్మకం మొదటిసారి ఈ ఇంట్లోకి మనవడు వస్తాడని అమ్మ నాన్నగారు అందరూ ఆనందంగానే వున్నారు. కాని ఖర్చుని ఊహించుకుని అనేవారు. "ఏమవుతుందో భగవంతుడికే తెలియాలి." ఎందువల్ల నంటె ప్రసవం జరి గిన తర్వాత బోలెడంత ఖర్చు. ఇంటి ఆర్థికదుస్థితి చూస్తే భయం వేస్తున్నది. పెద్ద విందు చేయకతప్పదు. అబ్బాయి లేదా అమ్మాయి ఎవరా అనే నమ్మ కము అపనమ్మకాల మధ్య రోజులు గడిచిపోతున్నాయి. వదులైన దుస్తులు వేసుకున్న వదిన చాలా తక్కువ నడిచేది, తిరిగేది. తనలో తాను ఏవేవో ఆలోచించుకుంటూ చిరునవ్వులు విసిరేది.

చివరికి ఒకరాత్రి పన్నెండు గంటలకు ఎంతో ఉరుకులు, పరుగుల తర్వాత అన్నయ్య ఒక అమ్మాయికి తండ్రి అయ్యాడు. అమ్మ చేయితో తలబాదుకుని "అయ్యో, ఇంట్లోకి మొదలు భవానీ వచ్చేసిందీ!" ఊహించిన ఆనందమంతా జావకారిపోయింది, అయినా అందరూ సంతోషంగా వుండే ప్రయత్నం చేస్తు న్నారు. ఏదో దొరుకుతుందేమోనని ఆశపడిన ఆయా మొహంపాలిపోయింది. నర్సు గంభీరంగా పాపకు స్నానం చేయిస్తున్నది. ప్రసవం కష్టం అవుతున్న దని ఆయాకు సాధ్యం కాలేదని, నర్సును పిలిపించడం జరిగింది. గది అంతా

కార్బాలిక్ వాసనతో నిండి పోయింది. ఆరాత్రంతా ఇంటిల్లిపాది అటు ఇటు పరుగులు తీస్తు పనులు చేస్తున్నారు. నీళ్ళు వేడి చేస్తు ఏవేవో కావాలంటు...! మేమంతా మేల్కొనేవున్నాం. వదినకు ఎలా అనిపించిందో కాని నాన్నగారు మాత్రం లోలోపల ఆనందంగానే ఖర్చు తప్పిందని నెమ్మదిగా నిట్టూర్చేరు. ఎవరైనా అడిగితే అమ్మాయి పుడితే మిఠాయిలు పంచుతారా, విందుచేస్తారా అని దబాయించి ఇలా అనొచ్చు. "ఇదో ఇంటిపైకి మొదలే డిక్రీ వచ్చేసింది."

మున్నీ నన్ను వెక్కిరించింది. "స్వీట్సు ఇప్పుడైనా తినిపించు. అంద రికంటె పెద్ద బాబాయివి." బాబాయినై పోయాననే ఆనందం నాకు కలిగిందో లేదో కాని ఇప్పుడు ఇంట్లో పనిబాగా పెరుగుతుందని మాత్రం ఎంతో ఆనందం కలిగింది. ప్రభ తప్ప ఆ పనంతా ఎవరు చేస్తారు. వదిన సేవాశుశ్రూషలు చేయడానికి విడిగా ఒక మనిషి కావలసిందే. అమ్మకు తన వయస్సు అనా రోగ్యం మూలాన ఏమీ చాతకాదు. మాల జపిస్తు మున్నీ ద్వారా ఇంట్లో ఏమేం జరుగుతుందో ఎప్పటికప్పుడు తెలుసుకునేది. లేదా మంగలావిడకు ఆదేశా లిస్తుండేది. వదిన దగ్గర పై పనులు చేసిపెట్టడానికి మంగలావిడ అయిదారు రోజులుంటుంది. ఇంతకుముందు వంటంతా చేసి వదిన స్వయంగా అమ్మ కాళ్ళు పట్టేది. అప్పుడే ఇంటి రిపోర్టు ఇచ్చి రామాయణం విప్పేవాళ్ళు. ఇప్పుడు అమ్మా, నాన్న ఆనవాయితీ ప్రకారం తమ కూతురు మున్నీ చేతి వంట ఎలాగూ తినలేరు. కాబట్టి ఆ పనంతా ప్రభనే చేయవలసి వుంటుంది.

ప్రభ ఉదయం ఎప్పుడోలేచి వదినకు అవసరమైన వాటిని తయారు చేస్తూ కూర్చునేది. పొద్దున ఆరు గంటలకే ఆమె పనులన్ని పూర్తయ్యేవి. రాత్రి మిగిలిపోయిన పాచిపనంతా పూర్తి చేసుకుని వంట గది శుభ్రం కాగానే స్నానం వగైరా ముగించుకుని వంట ప్రారంభించేది. కాలేజికి వెళ్ళడం ఆలస్యం కాకూడదని అన్నయ్య భోంచేయకుండా వెళ్ళకూడదని ప్రభ చురుకుగా పని చేస్తుండేది. మధ్యాహ్నం పన్నెండు గంటలదాక, వంట పూర్తికాగానే వెంటనే పాత్రలను శుభ్రం చేయడం జరిగిపోయేది. ఆ తర్వాత ఒకటి రెండు గంటలు పప్పులో లేదా గోధుమలో రాళ్ళు ఏరుతూ అమర్, కువర్ దుస్తులను వదిన దగ్గరే కూర్చుని కుడుతుండేది. నామకరణం రోజు తక్కువలో తక్కువ ముప్పై లేదా నలభై మంది దాకా భోజనాలకు వస్తారు. సత్యనారాయణ వ్రతం జరు గుతుంది. మసాలాలు, పప్పులు సిద్ధం చేయడం జరుగుతున్నది. సాయంత్రం మూడుగం.కు మళ్ళీ పొయ్యిలోంచి పొగవచ్చేది కొంగుతో కళ్లు అద్దుకుంటూ

ప్రభ వంగి కర్రల్లోకి ఊదుతువుండేది. ముఖమంతా ఎర్రబడిపోయేది. రాత్రి ఎనిమిది తొమ్మిది దాకా ఇదే క్రమం సాగిపోయేది. ఆ తర్వాత వదిన పనులు పూర్తి చేసేది. నేను దివాకర్ ఇంటి నుంచి తిరిగి వచ్చినపుడు అమ్మ కాళ్లు పడుతూవుండేది. ఇలానే పనులన్నీ ముగిసేటప్పటికి బహుశా రాత్రి ఏ పన్నెండో అయిపోయేది!

ప్రభ ఆ పనులన్నీ ఎంతో సులువుగా మౌనంగా అలా చేస్తూ పోతూ వుంటే ఆమె ఒక యంత్రంలా కనపించేది, అసలు ఆవిడకి ఈ పనుల వల్ల ఎలాంటి కష్టం కలగడం లేదనిపించేది! ప్రతి కొత్త పనిని ఎంతో స్వాభావికంగా, సహజంగా గ్రహిస్తూవుండేది. ఆమెకు ఎక్కడ అయిష్టం కాని లేశమంతైన అలసట కాని వున్నట్టు అనిపించేది కాదు. ఇదంతా చూసి నాకు చిరాకువేసేది. ఆవిడలో అయిష్టత లేదా అలసట మూలంగా కష్టం కలిగితే చూసి నాకు ఆనందించాలని వుండేది. మనసులో అనుకోవాలనిపించేది. "ఇప్పుడు తెలుసొచ్చిందా అమ్మాయ్, ఎలా వుంది?"

అయితే మొదట్లో ప్రభ అలా తలవంచుకుని పని చేస్తూవుంటె ఒక విషయాన్ని ఎవరూ అంతగా పట్టించుకోలేదు. ఇప్పుడు మాత్రం ఆవిషయం అందరికి స్పష్టమై పోయింది. ప్రభ పరదా పాటించదని! నాన్నగారైతె ప్రత్యేకించి పొడిదగ్గుతో లోపలికి వస్తారు. ఒకటి, రెండుసార్లు ఎదురుగా ప్రభ ముఖం కనపడగానే, బహుశా తనను ఆమె గమనించ లేదని ఆయన అనుకున్నారు. కాని తనని చూడగానే ముఖంపైకి పైటలాక్కొని "పరదా" పాటించకుండా కేవలం మరోపక్కకి ముఖం తిప్పుకుంటున్నదని నాన్నగారు గమనించారు. అందువల్లనే ఆయన ఒక సందర్భంలో అమ్మతో అన్నారు. "ఇంతకు కూతురు - కోడలుమధ్య తేడా ఏం మిగిలిపోయిందని? కూతురు ఎదురుగా నోరు తెరచి, కురులు విరబోసుకొని తిరుగుతుంది. ఇక కోడలికేమో పైటఎటు జారి పోతుందో తెలియదు!"

ఈ విషయమై మొదట్లో ఎంతో గొడవ జరిగి పోయింది. వదిన అవకాశం వచ్చినప్పుడల్లా ఊరికే దెప్పి పొడుస్తూ వుండేది. అమ్మ జపమాలను తిప్పడం మానేసి ఎంతో చికాకుతో అనేది - "ఇదో కోడలా! విన్నావా! మీ వైపు పరదా ఆచారం లేకపోతే మానే! కానీ మా ఇంటిలోని ఆచారాన్ని మాత్రం కాపాడు. మా నుంచి పరదా చేయక పోతే పోనీ గాని ఇంట్లో పెద్ద వాళ్ళున్నారన్న సంగతి మర్చిపోకు. సిగ్గు, బిడియం అనేవి ఉండాలి. నేనెక్కడా వినలేదమ్మ!

లోకం గుడ్డిదై పోయిందను కున్నావా? బంధువులంతా మన గురించే మాట్లాడుతున్నారు. చూసేవాళ్ళంతా మన ఖర్మపై ఉమ్మేస్తారు. నామకరణమప్పుడు ఎన్నో రకాల వాళ్ళొస్తారు. చూసి వెళ్ళి ఏమనుకుంటారు? చూడమ్మాయ్! మీ వైపు నగ్నంగా నాట్యం చేయనీ! దాంతో మాకేం ఒరుగుతుంది."

అన్నయ్య ఒకటి రెండుసార్లు నన్ను కూడా చీవాట్లు వేసాడు - "ఏరా సమర్! నీ భార్యకు చెప్పలేవా? చూడు! అమ్మ, నాన్నగారు అందరు ఎంత చెడుగా తీసుకుంటున్నారో? కనీసం వాళ్ళున్నంత కాలం వాళ్ళగౌరవాన్ని కాపాడుదాం. పరదా పాటించడం మంచిదని నేను కూడా ఒప్పుకోను. కానీ, మనింట్లో అది ఒక ఆచారం కదా! మరి నీ భార్య ఏ పదార్థంతో తయారయిందో కాని మాట వినదేమిటి! అమ్మ అంతగా తిడుతున్నా చీవాట్లు వేస్తున్నా, ఆమెకు ఎవరైన చూస్తున్నారనే ధ్యాస లేకపోతే ఎలా!"

ఆ మాట నిజం కూడా, ఇంతకూ ప్రభ ఏమీ అనలేదు. అంత మంది చీవాట్లు వేసినా ఆమె పరదా పాటించనే లేదు. అసలు ఏమీ విననట్లే ఉండేది. అందువల్ల తన మాటకైనా కనీసం ఎలాంటి ప్రతిస్పందన రాకపోయే సరికి అమ్మ మరింతగా గొణుగుతుండేది. కానీ, ఆమె మాత్రం ఈ విషయంలో రాయిగా మారిపోయేది. ఇక అమ్మ ప్రతిసారీ అనేది - "కోడలా! ఆ మాత్రం సిగ్గు లేకపోతే ఎలా? తలపైకి కొంగు లాక్కుంటే నీదేం పోతుంది. నీకు తెలుసా! ఇంత వరకు ఈ ఇంట్లో ముఖం చాటు చేసుకునే కొంగు గదవ దాటి పైకి రాలేదు తెలుసా!"

సైద్ధాంతికంగా నేను ఈ పరదా పద్ధతికి వ్యతిరేకిని! మహ్మదీయులు ఈ దేశానికి వచ్చిన తర్వాతే ఈ 'పరదా' అనేది ఎక్కువగా అలావాటైపోయిందని చరిత్ర విద్యార్థిగా నాకు కారణం తెలుసు. అయితే మా ఇంట్లో వ్యవహారరీత్యా చూస్తే నాకెందుకో ఆదృశ్యంకాస్తా విచిత్రంగానే కనపడింది. అమ్మ, నాన్నగారి ఎదుట ప్రభ అలా కొంగు చాటు చేసుకోకుండా నడచిపోడం కొత్త-కొత్తగానేవుంది. అత్తా, మామలు, ఇతర పెద్దల పట్ల గౌరవాన్ని చాటుకోవాలంటె మరో పద్ధతి ఏముందని? తలదించుకుని నడుస్తు కళ్ళు దించేసినంత మాత్రాన గౌరవం చూపినట్టు కాదు.. ఇంతకూ ఆవిడతో నేను ఎలా చెప్పాలి? రెండు, మూడు సార్లు మున్నీతో పెద్దగానే చెప్పాను. "మున్నీ నీ ఈ వదినకు ఏమీ మర్యాద తెలిసినట్టులేదు. ఎవరూ శిష్టాచారాన్ని నేర్పించలేదా?" కాని ఆమె ఈ చెవితో విని ఆ చెవితో వదిలివేసింది. ఇంట్లో ఎంతో

గొడవజరిగిన తర్వాత ఈ విషయంలో అందరూ రాజీ ధోరణి అవలంబించక తప్పలేదు. ఇప్పుడు బయటివాళ్ళు ఎవరైనా వస్తే తప్ప ఆ విషయం స్ఫురణకు రావడం లేదు. ఆ సమయంలో ప్రభను ఇతరత్రా పనుల్లో పెట్టేసేది. ఎందువల్ల నంటె బయటివాళ్ళముందు ఆమె ఏమీ అనలేదు కాబట్టి.

మొదట్లో కొన్ని రోజులదాక ప్రభ ఒక్కతే అన్ని పనులు తానే చేసుకుంటూ వెడుతుంటె అందరూ ఆశ్చర్యపడేవారు. కాని ఇపుడు ఆమె పనుల్లో ఏవో లోపాలు వెదకడం ప్రారంభించారు. మున్నీ కూడా అప్యాయంగా అనేది. "వదినా, నెయ్యి మరీ ఎక్కువపెట్టకు తర్వాత తక్కువ పడుతుంది." ఇంట్లోకి పాప అనే కొత్తప్రాణి రాగానే ఇంటి ఆర్థిక నిర్మాణము మరింత ఊగిసలాడ సాగింది. నాన్నగారు తలపై చేతితో రాసుకుంటు తరచుగా అమ్మ మంచం పక్కన పచార్లు చేస్తు "ధీరజ్ అమ్మా, ఖర్చు బాగా పెరిగిపోయింది. పాపం, ధీరజ్ మాత్రం ఏం చేయగలడు. చచ్చేంత పని చేస్తున్నాడు. వాడి తప్పేమిటి. కుటుంబం చిన్నదా ఏమైనా! ఇప్పుడిక సమర్ ఎలాగో ఇంటర్ పాసైపోయి ఏదైనా ఉద్యోగంలో చేరితే పాపం వాడు కాస్త గాలి పీల్చుకోగలడు. పెద్దవాడ్ని చూస్తుంటె నా గుండె తరుక్కుపోతుంది. పనితో చింతతో వాడు ఎండి ఎముకల గూడైపోయాడు. ఏమీ మాట్లాడడు. చివరికి మిత్రుల దగ్గరికి కూడా వెళ్ళడు. ఆఖరికి శరీరమైన ఎందాక సహకరిస్తుంది. హాయిగా సరదాగా గడపవలసిన రోజులు ఇబ్బందుల్లోంచి లాగ వలసివస్తున్నది. ఏం కాలమొచ్చేసింది. ఎప్పుడైనా అనుకున్నానా ఇలా జరుగుతుందని. ఇటు మున్నీ మన గుండెలపై భారంగా. అయినా అమ్మాయి పోవలసిందే కదా. బంధువులతో చెప్పి పంపించాను. కొంచెం ఆశాజనకంగానే వుంది. కాని ఎవ్వర్ని కదిలించినా సూటిగా మాట్లాడితే కదా. ప్రతి మనిషి బదులుగా మొదటే ఏదో ఒకటి ఆశిస్తున్నాడు." ప్రభను చూసి స్వయంగా మరో వైపు మొహం తిప్పుకుని బొంగురు గొంతుకుతో అనేవారు.

"అమ్మాయ్, కాస్తమరింత జాగ్రత్తగా సరుకులు వాడుతూవుండు... ఈ ఇంట్లో ఒకప్పుడు సంచుల నిండా రూపాయలు నిండి వుండేవి. నాలుగైదు డబ్బాలనెయ్యి ఖర్చయ్యేది. కాని ఇప్పుడు మిగిలిందేమిటి!"

ఇంత గందరగోళం సాగిపోతున్నా నాపనులన్నీ నిరాటంకంగా జరిగిపోతున్నాయి. నేను కాలేజికో లేదా బయటికి ఎక్కడికైనా వెళ్ళి తిరిగి వచ్చేసరికి నా గది పరిశుభ్రంగా వుండేది. చెల్లాచెదురుగా ఉన్న వస్తువులన్నీ సర్దేసి

వుండేవి. లాంతరు ధగధగ మెరుస్తూ ఉండేది. ఇదంతా చూసి నాలోపల స్వల్పమైన వేదన కలిగేది. చదువు మూలంగా కలిగిన అలసట అనుకునేవాణ్ణి.

అప్పుడప్పుడు నాపై నాకే చికాకు కలిగేది. ఏమిటీ దివారాత్రులు ప్రభా, ప్రభా! ఏమి తింటుంది. ఎక్కడుంటుంది, ఎలా పనిచేస్తున్నది, కొంచెమైన ఎక్కడా విశ్రాంతి తీసుకోదు. ఎంతో రుచిగా వండిన పప్పులు, కూరలు, సందర్భం లేకపోయినా ఉప్పు, కారం ఎక్కువనో తక్కువనో లోపాలు వెతికే వాణ్ణి. అవసరమున్నా లేకపోయినా అమ్మా, మున్నీ, వదినతో ఏదో చెప్పి ఎత్తిపొడి చేవాణ్ణి. ఆరకంగా ఏదో రూపంలో ఆమె ధ్యాసేవుండేది. లోకంలో నాకు మరో పని లేనట్టు అనిపించేది. నేను చదువుకోవాలి. అదే దృష్టి ఇటు వైపు ఎందుకు కేంద్రీకరించను? ఒకవేళ ఈ సారి ఫెయిలై పోతే లోకంలోని అపఖ్యాతి అంతా నా మీదికే. పైగా భావి మార్గాలన్నీ మూసుకుపోతాయి. అసలు ఆమె ధ్యాసే వుండనవసరం లేనపుడు ఆమె గురించే నిరంతరం ఏదో ఒకటి ఆలోచించడంలో అంతరార్థం ఏమిటి? ఆమె చేస్తున్న పనులన్నింటిని లెక్కపెడుతూ కూర్చోడమే నా స్వభావంగా మారిపోయినట్టు అనిపించింది. ఆమెను అంతగా నేను పట్టించుకోవలసిన అవసరమేముంది. ఇంట్లో ఎన్నో కుక్కలు, పిల్లులు ఉన్నాయి. అందులో ఆమె ఒకటి అనుకుంటాను. ఆమె గురించి అతితక్కువగా ఆలోచించాలని నేను అనేకసార్లు నిశ్చయించుకుంటాను. కాని ఏదైనా ఒక వస్తువుకు సంబంధించిన ఆలోచన చివరికి ఆమె దగ్గరికే చేరుకొనేది. ఉదాహరణకి మురికి బనియన్ తసంతతానే ఉతకబడింది. దానిని బయట తాడుపై ఆరేయగా సాయంత్రమే చూసాను. ఆ తర్వాత ఇంటికి తిరిగి రాగానే అది కూడా గదిలో ఒక పక్కన వుందని గమనించడం, ఏమైనా చదువు ఎలానో వుంది. అయితే ఇపుడు ప్రభ విషయం కూడా ఆలోచిస్తున్నాను.

ఇపుడు మరో మార్పు ఒకటి కనపడుతున్నది. మొదలు ఏదైనా, ఒక కష్టమైన కొత్తపని ప్రభ మీదికి రాగానే ఆవిడకి దాంతో బాగా ఇబ్బంది అవుతున్నదని ఆలోచించి నాకెంతో ఆనందం వేసేది. ఆవిడలో ఎలాంటి ప్రతిస్పందన కలుగుతుందో నేను కుతూహలంగా ఎదురు చూస్తుండేవాడిని. ఆమె ఈ కష్టాల మూలంగా బాగా బాధపడిపోయి ఎప్పుడైనా ఎక్కడైనా కంటతడి పెడుతుందేమోనని నా అంతస్సులో మహాకోరికగా వుండేది. అప్పుడే ఆమెను పట్టుకుని మొఖం మీద అనాలనే వుండేది. రాత్రి పూట లేదా ఉదయం చలి మూలంగా శరీరం అంతా రోమాలు నిక్కబొడుచుకున్నపుడు ఆసమయంలో

ప్రభ పరిస్థితి ఎలా ఉందో చూడాలని వుండేది. ఆ మూల కూచుని పాత్రలు కడగడమో వంటిల్లు శుభ్రంచేయడమో చేస్తుంది. కాబోలు, కాని ఎలాంటి ప్రతిస్పందన లేకుండా వ్యతిరేకత లేకుండా ఎంతో సహజంగా అన్ని పనులని స్వీకరిస్తున్న ఆమెను చూస్తుంటె, రావలసిన పరిణామాల గురించి మెల్లి మెల్లిగా నా ఉత్సుకత తగ్గిపోయింది. ఇక ఆ మొదటితృప్తి స్థానంలో ఒక విచిత్రమైన అలజడి, విక్షోభం మనసులోపల తిరగసాగింది. ఒక ఆయుధం వ్యర్థమైపోగానే ఇక ఇప్పుడు ఏమిటీ అని, ఇక ముందు ఏం చేయాలి అనే ప్రశ్న ఉదయిస్తుంది. ఏదిఏమైనా ఈ రకంగా ఓటమిని ఒప్పుకోకూడదు.

భోజనాలప్పుడు ఒక్కోసారి అన్నయ్య కూడా అనేవాడు. "ప్రభా! ఎప్పుడైనా కాస్సేపు ఆమె దగ్గర కూచుంటూవుండూ - ఒక్కతే, ఏమీ పాలుపోతుందని? ఏమైనా అవసరం సరొచ్చుకూడా..." ప్రభ ఎప్పుడు అన్నయ్య, నాన్నగారి సమక్షంలో పరదా పాటించక పోయినా, వారిద్దరితో అసలు మాట్లాడేదు, తల దించుకొని తనమానాన తాను పని చేసుకొంటూ వుండేది. ప్రతిరోజు పగటిపూట ప్రభతాను వదిన దగ్గర కూచుంటున్నానని చెప్పాలని పెదాలు కదిలినా చెప్పలేక పోయేది! ఏదో చెప్పాలని వెంటనే తలపైకెత్తి చూసేది, కాని మళ్లీ తల దించుకొనేది.

ఆ రోజు నామకరణ ఉత్సవం. సాయంత్రం ఇంటికి రాగానే అంతా సందడిగావుంది. అమ్మ కేకలు పెడుతూ చెబుతున్నది. "ఏమీ చెప్పకుండవుంటే తలపైకి ఎక్కికూచుంటుంది. లోకమంతా నీ ఇష్టానుసారమే నడుస్తుందా? మాదొలెక్కా పత్రమా! మేమంతా మహామూర్ఖులమా? నువ్వు ఒక దానివే ఉగ్గుపాలతో జ్ఞానమంతా తాగినట్టున్నావ్; మంచి రోజులు ముహూర్తాలు అనేవి వున్నాయని మరచిపోతేఎలా? ఇంత అనర్థం జరిగిపోతే మాకు కనీసం తెలియకుండాపోయిందా?"

బిక్కు బిక్కు మంటూ అందరూ నిలుచున్నారు. గదిలో తన మంచంపై పడుకుని, వదిన వెక్కి వెక్కి ఏడుస్తున్నది. "ఆ చదువు తగలబడిపోను! ఇతరుల ప్రాణాలు తీయడానికేనా ఈ చదువు? అయ్యోరామ, ఇప్పుడేమవుతుందో ఇక!" మరో వైపు మున్నీ నిశ్శబ్దంగా నిలుచుని చూస్తూవుంది. మొత్తంపై ఏదో గొడవ జరిగివుంటుందని గ్రహించాను. భయంభయంగా మరోవైపు నిలుచున్న ప్రభను చూస్తుంటే, తానే నేరం చేసినట్టు కసపడుతున్నది. కొంచెం ధైర్యాన్నిపుంజుకుని బొంగురు గొంతుతోప్రభ అన్నది - "అత్తయ్యా, నాకు

తెలిస్తే, ఎప్పుడూ అలా చేసేదాన్ని కాదు! ఏదో మామూలు మట్టి ముద్ద అనుకున్నాను నేను."

"అవును అదిమామూలు మట్టి ముద్దే!" అమ్మ మరింత కోపంగా "పెద్దమ్మ పైగా ఎదురు చెబుతున్నది. అసలు నువ్వు ఏమనుకొంటున్నావ్? నీ తలరాత ఎలానూ చెడిపోయింది. గుడ్డి దానివా? దానికి నూలుకండెను కట్టివుంచారని కనపడ లేదా? మాట మాటకి ఎదురు చెబుతున్నావ్, ఒక్కమాటైనా పోరుపోనిస్తున్నావా? నీ తల్లితండ్రులు పెద్దవాళ్లను ఎదిరించమని బాగానే నేర్పించారు. పైగా అలానోరు తెరచుకొని వయ్యారాలుపోతూ నడుస్తుంటావ్ ఎవరైనా వస్తూపోతున్నారనే చింతవుంలేకదా? నోరు చూస్తే కత్తెరలా ఆడుతుంటుంది. అదే నా కూతురైతే ఇలా ఎదురుమాట్లాడితే నాలుక చీరేసి బొందితోపాతేసేదాన్ని." తీవ్రమైన స్వరంతో, అమ్మ అరుస్తూనే ఎదురు చెప్పి తనను అవమానపర్చిందని ఆమె ఏడ్వడం ప్రారంభించింది.

అసలు నాకేమి అర్థం కాలేదు. అయినా మున్నీతో తీవ్రమైన స్వరంతో అడిగాను. "మున్నీ ఏం జరిగింది?" నాఆవేశాన్ని చూసి మున్నీ బదులు ఇవ్వలేదు. అప్పుడు కువర్ చెప్పాడు. "పొద్దున పురోహితుడు పూజ చేసిన గణపతిని, వదిన మామూలు పచ్చి మట్టి అనుకుని ఎంగిలి పాత్రలు తోమేసింది." వెంటనే వదిన మరింత పెద్దగా ఏడ్చింది. ఆవిడకు మళ్ళీ మొత్తం జ్ఞాపకం వచ్చినట్లుంది నా గుండె ఢక్కుమన్నది. అమ్మ వెక్కిళ్ళు వినిపిస్తూనే వున్నాయి. వదిన అంటున్నది. "ఏమైనా జరిగితె ఆవిడదేం పోతుంది. ఆమె తన చేయి జాడించుకుని వేరైపోతుంది. ఓ భగవంతుడా నువ్వే చూస్తున్నావుగా. అందర్ని అర్థం చేసుకో లోకం ఎంత కుళ్ళుబోతుదనంగా వుందో అయ్యో రామా!"

నేను శ్వాస ఎగబట్టి పళ్ళు బిగపట్టి గబగబా ప్రభ ముందుకు వెళ్ళి రెప్పవాల్చకుండా తీక్షణంగా చూసాను. పిల్లి ఎలుకపై దాడి చేయబోతున్న దృశ్యమది. కుడి చేతిని అలా వదులుగాసాచి ఒక్కసారిగా తూచి లాగి కొట్టాను, ఎంతో బలంగా పడిన చెంపదెబ్బకు అయిదువేళ్ళు ప్రభ కుడి చెంపపై ప్రస్ఫుటమైపోయాయి. ఆమె ఒకవైపుతూలి పడబోతు సంభాళించుకుని దబ్బున కింద కూచుంది నేను అన్నాను. "పిచ్చిముండా, ఇక్కడ ఉండాలని ఉంటె జాగ్రత్తగా వుండు. లేకపోతే నీకు నచ్చినచోటికి వెళ్ళిపో! మహానాస్తికురాలు వచ్చేసింది."

నేనేమో ఫుట్‌బాల్ ఆటలో గోల్ కొట్టేసిన ఆటగాడి ధోరణిలో మెడను పక్కకు వంచి ఆమెను తీక్షణంగా చూస్తూ మళ్ళీ నా చోటికి వచ్చి నిలుచు న్నాను. అంతా స్తబ్ధత అమ్మ కోపము కన్నీళ్ళు అంతా ఒకేసారి ఎగిరిపో యాయి. వదిన నోరుమూసుకుంది.

కాని చెంపదెబ్బ కొట్టేటప్పుడు నాలోపల ఆత్మక్షోభ ఎంత ప్రచం డంగా ఎదురు కొట్టిందంటె నేనక్కడ నిలుచోలేకపోయాను, గబగబా వెనకకి తిరిగి వచ్చేసాను. చెంపదెబ్బ కొట్టినపుడు ఎవరు ఏమన్నారో, అసలు ఆవిడ ఏడ్చిందో లేదో, అక్కడే అలానే కూర్చున్నదో లేదా ఆవిడను లోపలికి పంపిం చారో నాకు తెలియదు. లాగి కొట్టిన ఆ చెంపదెబ్బకు నా అయిదువేళ్ళు జల్లు మన్న సంగతి మాత్రం జ్ఞాపకం ఉంది.

గడపదాటి గదిలోకి అడుగుపెట్టగానే నాలోపలి నుంచి ఎవరో మాటిమా టికి అంటున్నారు. "నేను చేసిన పనేమిటి? నాకేమై పోయింది. జీవితంలో మొదటిసారి ఒకస్త్రీపై చేయి చేసుకున్నాను. ఆ చెయ్యి నిష్ప్రాణమైపోయి కరిగిపోతున్నట్టు అనిపించింది. వదినను అన్నయ్య కొట్టినపుడు నేను ఎంత తీవ్రంగా విమర్శించానో నాకు తెలుసు. ఒక్కొక్కటె జ్ఞాపకం వస్తున్నాయి. నేను ఏ ఆవేశంలో గ్రుడ్డి వాణ్ణి అయిపోయానో. ఏడెనిమిది నెలల తర్వాత మొదటిసారి మాట్లాడాను. అదికూడా తిట్టుతో మొదటిసారి మాట్లాడాను అది కూడ చెంపదెబ్బతో చివరికి ఇలా జరిగి పోయిందేమిటని నాకు చాలా సేపటి వరకు అర్థం కాలేదు."

అప్పుడు నాలోపలినుంచి ఎవరో విషపూరితమైన ద్వేషంతో అన్నారు. "నీచుడా, పిరికిపంద, అసమర్థుడా, ఇదేనా ఆదర్శవాదం. ఇదేనా గొప్పవా డినవుతాననే కల. ఇంటర్ చదువుతూ లోకానికంతా నీతులు చెబుతావా?" ఇంకా ఏమీ ఆలోచించనవసరం లేకుండా నాలోపల ఎప్పుడో గూడు కట్టుకున్న ఏడుపు ఒకేసారి బద్దలు కావడానికి తన్నుకులాడుతున్నది, ఏమిటా తుఫాను నేనెందు కలా కొట్టుకుపోయాను! అప్పుడిక దీనంగా ఏడ్చేసాను. అలా ఏడుస్తు ఏడుస్తూ నా అస్తిత్వం సొంతం కన్నీటిలో కరిగిపోవాలని కోరుకున్నాను. నారెండు చెంపలపై ఇష్టంవచ్చినట్టు లాగిలాగి చేతివేళ్ళుతేలేలా కొట్టుకోవాలని నాలో పలి బాధ కోరుకుంటున్నది.

# ఎనిమిది

మున్నీ అడిగింది. "అన్నయ్యా, నీ పరీక్షలెప్పుడు?" "పరీక్షలా?" నేను మెడగోక్కున్నాను. పరీక్షలెప్పటినుంచి వున్నాయో నాకు జ్ఞాపకమే రాలేదు. నా పరీక్ష తేదీ దాని ప్రాముఖ్యత గురించి రోజూ అనుకునేవాణ్ణి. ఇప్పుడా ధ్యాసేలేదు. మున్నీ ఏమన్నదో దాని అర్థమేమిటో నాకు తలకెక్కలేదు. ఇదైనా కాస్త నయం. అసలు మొదట్లో నా యెదుట ఎవరు మాట్లాడుతున్నారో నేను గుర్తించలేదు. పరీక్షల విషయం జ్ఞాపకం రాగానే వాటి గురించే ఆలోచించసాగాను. మున్నీ అక్కడ వున్న సంగతి ఆమె అడిగిన విషయం అన్నీ మరచిపోయాను.

నేను మెల్ల మెల్లగా పిచ్చివాడిని అవుతున్నానా? ఈ మాట స్ఫురణకు రాగానే పలుమార్లు ఇలా అనుకున్నాను. కాదు, కాదు. నేను ఎలాంటి అసంగతమైన వ్యవహారంలోకి దిగను. నా ఆలోచనలో ఒక క్రమబద్ధత వుంది. ఎలా వుండాలో నాకు బాగాతెలుసు. నేను ఎంతగానైతె పిచ్చివాణ్ణి కాదనుకుని సమర్థించుకుంటున్నానో, అంతగానే లో లోపల నాకు నిశ్చయంగా పిచ్చెక్కుతున్నదనే నమ్మకం వేళ్ళూనుతున్నది. ఒకవేళ అదే నిజమైతే, దాని ప్రారంభం ఎప్పుడు జరిగినట్టు?

ఎంతో శక్తివంతంగా పడిన చెంపదెబ్బ, మరోవైపు వాలి గోడకు ఢీకొన్న తల, ఊగిసలాడిన శరీరం అకారణంగానే అప్పుడప్పుడు మెరుపులా ఆదృశ్యం నా కళ్ళ ముందు మెరిసి గుండె మబ్బులా బద్దలైపోయేది. నేను అలా చేయవలసింది కాదని మాటమాటికి పశ్చాత్తాపం, ఆవేదనా తన వాడి గోళ్ళతో నా హృదయాన్ని చీలుస్తూవుండేది. ఆవిడపైకి నా చెయ్యి ఎలా లేచింది. నేనెలా ఒకపశువులా ప్రవర్తించ గలిగాను. అసలు ఆ సంఘటన నిజంగా జరిగిందా? అదంతా నా కల్పనా, లేక స్వప్నం కాదు కదా!

అయినా ప్రభ కూడా అలా చేయవలసింది కాదు. మట్టి ముద్దకు, గణపతికి మధ్య తేడా కనపడలేదా. ఎవరి ఇంట్లోనైనా అలాంటి నమ్మకాలు ఉన్నపుడు వాటిని అవమానించే అధికారం ఆమెకు ఎవరిచ్చారు. చదువుకోవడమంటె అర్థం ఇదేనా. నేను కూడా చదువుకున్నాను కదా! వెయ్యి మాటలు ఎందుకు ఒక్కమాటలో చెప్పాలంటె మన సంస్కృతిని, ఆరాధ్య దేవతలను

ఎలాంటి పరిస్థితులలోను ధిక్కరించలేము. మంచిదే జరిగింది! ఓ గుణపాఠం లభించింది. ఈ విధంగా ఆవిడ చేసిన నేరాన్ని మరింత పెద్దదిగా చేసి నేను వ్యవహరించిన తీరు సక్రమమైనదేనని సమర్థించుకునే ప్రయత్నం చేసాను. అనుకోకుండా. రేపేదైనా అశుభం జరిగితే దానికి ఎవరు బాధ్యులు? సత్యార్థ ప్రకాశ లాంటి పుస్తకాలు చదవడం వల్ల లోకంలోని దేవీదేవతలపై నుంచి నా విశ్వాసం ఎగిరిపోయింది. కాని ఇతరుల విశ్వాసాన్ని నేను అర్థం చేసుకునే వాణ్ణి ఎవర్ని పూజించకపోయినా ఎందుకు అవమానించాలి? అని అనుకు న్నాను. నాకు నేనే నచ్చజెప్పుకున్నాను. కాని లోపలినుంచి ఎవరో అంటూనే వున్నారు. "చెయ్యి చేసుకు మంచి పని చేయలేదు."

ఆ సంఘటన జరిగిన రెండు రోజులు బయటికి రావాలంటె ధైర్యం చాలలేదు. పడుకుని లేవగానే ఎప్పటికి నేను రోగగ్రస్తుడనైనట్టు అనిపించింది. నా నరనరానా జివ్వున నొప్పి ఇతరుల కళ్ళలోకి సూటిగా చూడగలనా! ఇంత పెద్ద అపరాధం చేసిన తర్వాత బయట వెలుగులోకి ఎలా వెళ్ళ గలను. ఒక వేళ ఆవిడ నా ఎదుట పడితే ఆమె చెంపపై గుర్తులు కనపడితె ఆదృశ్యాన్ని ఎలా సహించగలను. ఈ సంఘర్షణలోంచి నేను ఒక దొంగలా బయటికి వచ్చేసాను. దినమంతా నిర్లక్ష్యంగా ఉద్దేశరహితంగా ఎక్కడెక్కడో తిరుగుతూ వుండిపోయాను. పార్కులో చెట్టు కింద కూర్చుని నన్ను నేనే అడి గాను. ఇలా దినమంతా నాలోనేను మునిగి వుండడం ప్రతిమాటకు చిరాకు పడిపోవడం, ఇతరులకు కష్టం కలిగించి ఆనందించడం నిగ్రహాన్ని కోల్పోయి తన్నుకోడానికి సిద్ధం కావడం కోట్లాడడం ఏడ్వడం - ఇదంతా ఏమిటి అసలు నాకేం జరుగుతున్నాది. నన్ను నేను ఏమని అనుకున్నా, కాని నా బాహ్యాచే ష్టల్ని చూసి నిజంగానే నాకు పిచ్చి లేచిందని అనుకోనా? ఏమి పెళ్ళి జరి గిందో కానీ అసలు నాకేమి అయిపోయింది ఇలా?

చాలారోజుల తర్వాత నేను మళ్ళీ దేవాలయంవైపు (లోపలికికాదు) వెళ్ళి నా స్థలంలో దినమంతా కూర్చున్నాను... ఊఫ్, నాతో ఎంత ఘోర మైన పని జరిగిపోయింది! ఓ భగవంతుడా నేను ఏం చేయాలి?

అనవసరంగా తలనొప్పిని కొని తెచ్చుకున్నానేమిటా అని తరచుగా నాపై నాకే చికాకు కలుగుతున్నది. ఎప్పుడు "ప్రభ" లేదా ప్రభ పట్ల నేను ప్రవర్తించిన తీరును నెమరువేసు కోడంతోనే సరిపోతున్నది. వీటన్నింటి మూలంగా నేను ఎంత నష్టపోతున్నాను. లోకంలో చివరికి ఈ పనే మిగిలిపోయిందా.

క్లాసులోకి వెడితే నిశ్శబ్దంగా కూచోడం, మళ్ళీ మౌనంగా మొఖం వేళాడేసు కుని వచ్చేయడం ఇరవై నాలుగు గంటలు అవేమాటలు పడుకున్నా, మేలు కున్నా అదే చర్చ... గత ఎనిమిది పదిమాసాల నుంచి మనసు విప్పిమాట్లా డడం, నవ్వుతూ తుళ్ళుతూ గడిపేయడం, అన్నీ మరిచిపోయాను.

జరిగిపోయిందేదో జరిగిపోయింది అని నేను ఆరోజు మళ్ళీ సంకల్పించు కున్నాను. ఇప్పుడిక ఇంటా బయట అందర్నీ మరిచిపోయి కేవలం నా పరీక్ష గురించి మాత్రమే ఆలోచిస్తాను. మరో ధ్యాసనే వుండదు. ఏమి జరిగిపో యిందో దాని గురించి దివారాత్రులు నా మెదడును పాడుచేసుకోవడం అన వసరం. ఈ ప్రపంచంలో ఎవరితో నాకు ప్రమేయం లేదు. ఎవ్వరు నా బంధు వులు కారు. ఎవ్వరి పట్ల నేను తప్పు చేయలేదు. బాధ్యతలేదు. అందరూ తమ తమ అదృష్టంతోపాటు వస్తారు. తమతమ దారులను వెతుక్కుంటారు. ఓ భగవంతుడా నువ్వు సాక్షిగా వుండాలి. ఇప్పటివరకు నేను చేసిన తప్పులని మన్నించాలి. ఇప్పుడిక నేను నా వరకే ఉంటాను, కేవలం చదువుకుంటాను.

ఇక ఆ రోజు నుంచి నిజంగానే నాలో ఒక విచిత్రమైన మార్పు కనపడ సాగింది. మొదట్లో ఇంటా, బయట నన్ను ఇబ్బంది పెట్టిన అంశాలు లేదా గంటల తరబడి నా మానసిక శాంతి పాడైపోవడం మొదలైన వాటి గురించి పట్టించు కోవడం మానేసాను. నా చదువు గురించి పరీక్షల గురించి మాత్రమే ఆలోచిస్తున్నాను. చదువు అనే భూతాన్ని నా ఎదుట పెట్టుకుని దివారాత్రులు దానితోనే కొట్లాడుతున్నాను. ఇంట్లో వుంటే అనవసరంగా మనస్సు మళ్ళడం వల్ల తరచుగా బయటే ఉంటున్నాను. ఇక్కడ ఏదో ఒకటి జరుగుతూనే వుంటుంది. వస్తూ, పోతు ఏదో ఒక దుకాణందగ్గర నిలుచుని పేపరు చదివేవాణ్ణి. ఆ తర్వాత ఎక్కువ కాలం దివాకర్ తో గడిచిపోయేది. కబుర్లు చెప్పుకునే అవ కాశం తక్కువే. అతను ఏదైనా మాట మొదలుపెడితె దాని కొనసాగింపుగా మరికొన్ని మాటలు సాగిపోయేవి. అతను తన ఎవరో శిరీష్ అన్నయ్య గురించి ఎంతో శ్రద్ధాభక్తులతో చెప్పేవాడు. ఆయన వస్తే తప్పకుండా పరిచయం చేస్తానని అనేవాడు. నాకేమో పెద్ద ఉత్సుకత ఏమీలేదు. ఆయన వస్తే కలుస్తాను. నన్ను చదువు అనేమత్తు ఆవహించిందని అందరికి ఆశ్చర్యంగా ఉంది.

ఆ రోజు జరిగిపోయిన సంఘటన గురించి ఎవ్వరూ ఏమీ మాట్లాడలేదు. నాన్నగారు అన్నయ్య అందరూ విన్నారు, మరి వదినేమో ఎంతో సంతోషిం చింది. నిజంగానే నన్ను చూస్తే భయంకరుడిగా అనిపిస్తున్నదేమో నా చిన్న

తమ్ముడు భయం భయంగా నన్ను తప్పించుకునేవాడు. అంతేనేమో నేను తల విదిలించుకుని నాపనిలో మునిగిపోయేవాణ్ణి, ఒక విధంగా అందరూ తమ తమ పనుల్లో నిమగ్నమై వుండేవారు. వదిన ఈ మధ్య అంతగా ఎదురు పడటంలేదు. నేను ఇంటికి వెళ్ళినప్పుడల్లా ఆమె ఎక్కడో ఏకాంతంలో కూర్చుని తన పాప ధ్యాసలోవుండేది. పాలుతాగిస్తూనో లేదా నూనె రాస్తు వేడినీళ్ళతో స్నానం చేయిస్తూ వుండేది. ప్రసవించిన తర్వాత ఆమె ఇంటి పని మొత్తం మానుకుంది. మున్నీది ఇక ఇష్టా రాజ్యమే, వదిన పాపను ఆడి స్తూనో లేదా అలా మౌనంగా కూచునో వుండేది. ఇంటి పనంతా ఇప్పుడు ప్రభనే చేస్తున్నది. దాని గురించి పట్టించుకోవడం గాని లేదా ఆశ్చర్యంగాని ఏమీ కనిపించడంలేదు. ఎప్పుడు తింటుందో ఎప్పుడు విశ్రాంతి తీసుకుం టుందో నేను ఎప్పుడో ఆలోచించడం మానివేసాను. ఆమె తల్లిగారి నుంచి ఏదైనా ఉత్తరం వస్తే మాలో ఎవరో ఒకరు తప్పకుండా తెరచి చదివిన తర్వాత ఆమెకు ఇచ్చేవాళ్ళం. ఆమె జవాబు రాసి పోస్టు చేయడానికి ఇవ్వ గానే తప్పకుండా ఒకసారి చదివేవాళ్ళం. కవరును నీటితో తడిపి విప్పడం జరిగేది. మా యింటి గురించి లేని పోనివి కల్పించి రాస్తుందేమోనని? అయినా ఆవిడ ఉత్తరాలు రాయడమే మానేసింది దాదాపుగా.

ఒకరోజు అమ్మ అంటూ ఉండగా విన్నాను, "కోడలు పిల్లా, నువ్వు ఉత్త రాలేమి రాయవా. ఈయన గారికి, మీ నాన్నగారి ఉత్తరం వచ్చింది. నువ్వు ఏదైనా జబ్బు పడ్డావేమోనని రాసారు."

"ఏం రాయమంటారు అత్తయ్యా, మీరు చూస్తూనే వున్నారుగా అంతా బాగానే ఉంది" చెట్నీ నూరుతున్న పని ఆపి ప్రభ అన్నది.

"మేము చూస్తూనే వున్నాం లే! అయినా అమ్మాయ్ అప్పుడప్పుడు రెండు ముక్కలు రాసిపడేయ్. అమ్మా, నాన్నల మనసు ఊరుకోదుకదా! వాళ్ళు అయిదారు ఉత్తరాలు వేసామని రాసారు. నువ్వు ఒక్కదానికి కూడా జవాబు రాయలేదు." ఎన్నో రోజుల తర్వాత ప్రభ అత్తగారి మెత్తని స్వరాన్ని విన్నది.

నేను రేషన్ కోసం గాను సంచి ఖాళీ చేస్తుండగా చూసాను. ఆమె కళ్ళల్లో నీళ్ళు తిరుగుతున్నాయి. కాసేపు ఊరుకుని మళ్ళీ ఏదో నూరుతూ మెల్లగా అన్నది. "రాస్తాసు అత్తయ్యా."

నేను ఎవరివైపు చూడకుండా అక్కడ నుంచి వెళ్ళిపోయాను. ఆ తర్వాత

ఆ విషయం గురించి ఏం మాట్లాడుకున్నారో నాకు తెలియదు. అదే విషయం మాటిమాటికి స్ఫురించినా నేను మాత్రం చదువులోనే మునిగిపోయాను. అసలు నిజం చెప్పాలంటె నా సంవేదనశీలత్వం అనుభూతి చెందేశక్తిని మెల్లి మెల్లిగా కోల్పోతున్నానని అనిపించింది. ఏదైనా ఒకదాన్ని గురించి ఆలోచించాలనే ధ్యాస నాకు లేదు. ఉదాహరణకు నా పనులన్ని ఆమె చేసి పెడుతున్నది. కాని నేను మాత్రం తటస్థంగానే ఉంటున్నాను. రాత్రిపూట చెంబుతో నీళ్ళు పెట్టి వెళ్ళిపోయేది. ఎప్పుడైనా అన్నయ్య, నాన్నగారు, లేదా అమ్మ కోరిక మీద బెల్లంచాయ్ తయారుచేసేది. అప్పుడు గ్లాసు లేదా గిన్నెలోనో ఆచాయ్‌ని మాట్లాడకుండా నా దగ్గర పెట్టి వెళ్ళిపోయేది. ఎవరు తెచ్చారో చూడకుండానే నేను ఆచాయ్‌ని తాగేవాణ్ణి. చాలా వరకు ఆమె వంటగదిలోనే ఉండేది. అందువల్ల మొదట్లో అక్కడ భోంచేయడం ఇబ్బంది గానే ఉండేది. రొట్టెలు మొదలైనవి కావాలంటె మున్నీని పిలిచేవాణ్ణి. ఇప్పుడిక మెల్లి మెల్లిగా ఆమె స్వయంగా వడ్డిస్తున్నది. పళ్ళాన్ని దగ్గరికిలాక్కొని దేవుడికి కొంచెం నైవేద్యం పెట్టి తినడం ప్రారంభించేవాణ్ణి. మరికొన్ని రొట్టెలు అవసరమైతె పళ్ళాన్ని నేను ఆమె వైపుజరిపేవాణ్ణి. పళ్ళెంలో ఏదైనా తక్కువ ఉంటె వాటిని వడ్డించేది. మొదట ఇదంతా విచిత్రంగా ఉండేది. లోలోపల నవ్వు కూడా వచ్చేది. కాని ఇప్పుడు అందులో కొత్త ఏమీ కనపడడం లేదు, ఇప్పుడైతె ఎలాంటి సంకోచం లేదు జీవితాంతం ఇలానే జరిపించుకోవచ్చని అనిపించేది. ఏదో యంత్రంతో పని తీసుకున్నట్టు కొళాయి నుంచి నీళ్ళు తీసుకు వెళ్ళినట్టు నా పని పూర్తికాగానే మళ్ళీ నాలో నేను మునిగిపోయేవాణ్ణి. నిజం చెప్పాలంటె మాట్లాడడం తప్ప అన్ని పనులు జరిగిపోతూనే ఉన్నాయి. ప్రభ కూడా కదులుతున్న ఒక సంవేదనశీలమైన జీవి అనే అంశాన్ని నేను దాదాపుగా మరిచిపోయాను. ఇప్పుడు నేను ప్రతిమాటను నాకు దూరంగా ఉందని లేదా సంబంధించింది కాదని పట్టించుకునేవాన్ని కాదు. ఆ ప్రకారం నేను అన్నీ మరచిపోతున్నాను.

ఈ మరిచిపోయే క్రమం ఎంత వేగంగా వెడుతున్నదంటె నాకే స్వయంగా భయం వేయసాగింది. ఇదంతా పిచ్చివాడిగా మారిపోవడానికి భూమిక కాదు కదా! గడిచిపోయిన ప్రతిరోజు నాకు ఒక కలలా మసకమసకగా ఇంకా అబద్ధంగా అనిపించేది. రాసున్న ప్రతి అంశం గురించి ఎలాంటి ఉత్సాహం లేకుండా జడత్వం వ్యాపించి ఉండేది. ఈ ప్రపంచాన్నే కాకుండా నాపరిసరాలను

చివరికి నన్ను నేనే మరిచిపోయేదశకు చేరుకున్నాను. స్నానం, భోజనం ఏటి ధ్యాసే ఉండేది కాదు. సందర్భం లేకుండానే ఒక వెర్రి ఆవహించగానే అన్నీ వదిలేసి గీత చదువుకుంటు కూర్చునేవాణ్ణి. నా దుస్తులు ఇతర వస్తువులు జ్ఞాపకమే ఉండేవికావు. చదువుతు, చదువుతూ పుస్తకాన్ని ఎక్కడో పెట్టి మరచిపోయేవాణ్ణి. ఆ తర్వాత మళ్ళీ దానికోసం గంటలతరబడి వెతికేవాణ్ణి, అదే తరచుగా పుస్తకాల కుప్పలో దొరికేసరికి తలబాదుకునేవాణ్ణి, పెన్నూ, పెన్సిల్ తాళం చెవి ఇంకా డబ్బులు తింటూ ఉండగానో లేదా ఎక్కడో అక్కడ పెట్టి మరిచిపోయే వాణ్ణి. చివరికి ఉదయం చదివిసందంతా సాయంత్రం కాగానే మరిచిపోయే పరిస్థితి ఏర్పడింది. ఏపుస్తకాన్ని తీసి చదివినా అంతా కొత్తగానే ఉండేది. ఎప్పుడు ఏదో పోగొట్టుకున్నట్టు అనిపించేది. నా లోపలి ఒక చైతన్యశక్తి మెల్లి మెల్లిగా అణగారిపోతున్నదని అనిపించేది. లేదా నా అంతరంగమంతా నీటి ఉపరితలంలా ఉద్వేగభరితమై పోవలసింది, ఇప్పుడు మంచులా గడ్డ కట్టుకుపోయి స్పందనలేకుండా నిర్జీవంగా మారిపోతున్నది. ఏ మాట అయిన దానిపై పడగానే చిట్లిపోయి ఏమీ జరుగనట్టు దూరంగా పడిపోయేది.

ఒక్కటి మాత్రం నేను మరిచిపోలేదు. అదే నేను పరీక్షరాయాలనే సంగతి.

కఠినంగా ఉండే రాయిపై ప్రవహించే నీటి ధారలా కాలమంతా దివారాత్రులుగా అలలు అలలుగా పారుతున్నది. నేనేమో చైతన్య రహితుడినై చూస్తున్నాను. ఆరాయి అలానే ఉంది.

పది గంటలు కావస్తున్నది. ఇంకాపప్పు పొంగనే లేదు. ప్రభ గబగబా పిండిపిసుకుతున్నది. నేనేమో ఒకసారి పంటగది దాక వెళ్ళివచ్చాను. ఇక వెళ్ళిపోదామా అని అనుకుంటుండగానే మున్నీ పరిగెత్తుకుని వచ్చింది. "చిన్నొదినా, నువ్వు పెద్ద వదినకు పాలు పంపించలేదు. ఆమెకు కోపం వచ్చి ఏడుస్తున్నది."

ప్రభ పిండిలోనే నిమగ్నమై మార్దవంగా అన్నది "మున్నీ పాలు వేడి చేసి పెట్టాను. నువ్వే చూడు వచ్చి. పప్పు పొంగువస్తున్నదేమో అందరూ తినడానికి వస్తారేమో ఒక్కొక్కరొట్టె వేసి కూర్చొబెట్టడం బాగుండదు. మూడో నాలుగో మొదటే కాల్చి పెట్టుకుంటె సులువు అవుతుంది." మళ్ళీ బుజ్జగించే ధోరణిలో అన్నది, "మున్నీ, మా అమ్మవు కదు. నువ్వే కాస్త ఇచ్చిరారాదు. ఇక్కడే పొయ్యి పక్కనే గిన్నెలో వున్నాయి."

మున్నీ వచ్చి అక్కడ చూసింది. నోరు వెళ్ళబెట్టి "అయ్యో వదినా పాలు ఒలికిపోయాయే. ఇప్పుడెల్లా?"

"ఒలికిపోయాయా" ఆమె మొఖం ఒక్కసారి పాలిపోయింది. చేతిలో వున్న పనిని వదిలేసి అటువెళ్ళింది "నేను సరిగ్గానే పెట్టానే. ఏమైపోయింది."

"ఇక పెద్ద వదిన ఇల్లంతా ఒకటి చేస్తుంది."

అప్పుడే అటునుంచి వినవచ్చింది. అమర్ వెళ్ళి అమ్మతో ఫిర్యాదు చేస్తున్నాడు. "అమ్మా నువ్వే చూడిప్పుడు. పదికావచ్చింది. ఇంతవరకు వంటకాలేదు. ఎప్పుడు అన్నం తినాలి. ఎప్పుడు చదువుకోడానికి వెళ్ళాలి?"

"నీకు ఆలస్యమైన మరేమైనా ఆమె మాత్రం మెలిమెల్లిగానే చేస్తుంది." అమ్మ ఎత్తిపొడుస్తు అన్నది. ఆమె ఇలా అనాలనుకున్నప్పుడల్లా పూజను మధ్యలో ఆపి చివాట్లువేసి మళ్ళీ పూజమొదలు పెడుతుంది. "ఒక్కరోజే పనైతే ఏదో పోనీలే ఆలస్యమైపోయిందను కోవచ్చు. రోజు చేసే పనే సంభాలించుకో చాతకాకపోతే ఎలా?"

అమర్ అటునుంచే అనుకుంటు వంటగదిలోకి వచ్చాడు. "వదిన ఇంకా పిండే పిసుకుతున్నది. పప్పు పొయ్యిమీదే వుంది." అతను వంటగదిలోని పిట్ట గోడపైనుంచి తొంగిచూసి పప్పు అసలు పొయ్యి మీద ఉందో లేదో పరిశీలించాడు. పొగతో అతని కళ్ళలో నీళ్ళు నిండుకున్నాయి. ఒలికిన పాల దగ్గరే మున్నీ నిలుచుని ఉంది. ప్రభ భయంభయంగా పిండి చేతుల్తోనే నేల పైనుంచి ఎత్తుతున్నది. అక్కడ్నుంచె అమర్ అరిచాడు. "ఇక్కడైతె పాలు ఏం ఒలకబోసారో చూడండి."

అమ్మ చేస్తున్న పూజను మరిచిపోయింది. ప్రేలుడుమందులో నిప్పు రగిలింది. "పాలు ఒలకబోసిందా. సరే బాగానే వుంది. ఆమె ముల్లేం పోయింది. ఆమె తండ్రి మంచి పాడి బర్రెను కట్టి వెళ్ళాడుగా. అందుకే రోజు నేలమీద పారబోయడం లేదా పొంగించేయడం. గుడ్డిదెక్కడో మోటుమనిషెక్కడో. నడి చిందంటె ఏదో ఒకటి విరగ్గొడుతుంది. అసలు కాళ్ళుచేతుల్లో బలం ఉందా. మెడపైకిసాచి పనిచేస్తుంది పైగా కొవ్వెక్కింది. తనేమో సేరున్నర తినేస్తుంది. ఇక చూడండి. పాపం అది. పస్తులుండవలసిందేనా, ఒక్కలక్షణం లేదు. ఎన్నని చెప్పాలి. చదువు మండిపోను. ఏదో పదో తరగతి దాకా వెలగబెట్టించట. వంటగదిని ఎంత పాడుచేసి పెట్టిందో. ఇటు పీట. అటు అప్పడాలకర్ర ఎటుచూసినా చెత్త. భోజనానికి కూర్చుంటె వాంతి వస్తుంది. ఓరి

భగవంతుడా. మంచి దానినే మాతలకు అంట గట్టాప్. మేమైతె ఏదో రకంగా ఏడుస్తు తూడుస్తు రోజులు లాక్కొస్తున్నాము. మరి అక్కడేమో ఆకాశంలోంచి వాన వస్తున్నట్టు కనపడుతున్నది..."

ఆ తర్వాత ఏం జరిగిందో ఏమాత్రం ఆలోచించ కుండా నా పుస్తకాలు తీసుకుని చదువుకోడానికి వెళ్ళిపోయాను. పూర్వం లాటి పరిస్థితిలో ఉంటె ఏం చేసేవాడినో లేదా అనేవాణ్ణో నాకే తెలియదు. ఇలాంటి వాటిని పట్టించు కోనవసరం లేదని ఇప్పుడు అనిపించింది. ప్రభ ఏంచేసిందో లేదా ప్రభ ఏం చేస్తున్నదో, అది మంచిదా చెడ్డదా, అదంతా అర్థం చేసుకోవలసిన పనిలేదు. ఏదైతె జరుగుతున్నదో అదేది అసాధారణమైనది కాదు. అప్పుడు అసలు ప్రభతో నాకు ఎలాంటి సంబంధం లేదని అలానే ఇంటివాళ్ళతో కూడ నాకు ఎలాంటి సంబంధం లేదని అనిపిస్తున్నది.

మధ్యలో ఒకటిరెండు పీరియడ్లు ఖాళీ ఉంటె ఇంటికి వచ్చి చూస్తే నా గదిలోనే పళ్ళెం మూత పెట్టబడిఉంది. గబగబా అది కడుపులో వేసేసి ఆ తర్వాత వెనక్కి వెళ్ళిపోయాను. ఇంట్లో నాకేమీ ప్రత్యేకించి కనపడలేదు. అయితే ఇంట్లో వాతావరణాన్ని బట్టి చూస్తే పాలు ఒలికిన గొడవపై మహాభారతమే జరిగినట్టు అనిపించింది. అయినా నాదేం పోయింది. జరిగిందేమో...

ఫిబ్రవరి మొదలైపోయింది. బాగాచలి వేస్తున్నది. మార్చి మొదటివారం లోనే పరీక్షలున్నాయి. అందువల్ల చదువుకోడానికి సెలవులు ఇచ్చేసారు. నేను తరచుగా దివాకర్ ఇంటికి చదువుకోడానికి వెళ్ళి పోయేవాణ్ణి. ఇంట్లో ఏ అంతరాయం లేకుండా మధ్యాహ్నం లేదా సాయంత్రం చదువుకోడానికి అసలు చోటేలేదు. ఏదో గొడవజరుగుతూనే ఉండేది. లేదా ఏదో ఒక పని చెప్పేవారు. "కాస్త వెళ్ళి పిండిపట్టించుకరా అన్నయ్య" మున్నీ అనేది. వదిన అడిగేది "వైద్యుడికి చెప్పి పాప కోసం మంచి ఉగ్గు తీసుకరావా లాలాజీ!" తోడుగా కలసి చదువుకుంటే చదువు బాగాసాగుతుంది. ఏదైనా అర్థంకాకపోతే దివాకర్‌తో పాటు ప్రొఫెసర్ దగ్గరికి వెళ్ళే వాళ్లం! ఒంటరిగా వెళ్ళే ధైర్యం లేదు. దివాకర్ కు విడిగా ఒక గదివుంది. కాబట్టి ఒక్కో రాత్రి అక్కడ పడుకునేవాణ్ణి! నిజం చెప్పాలంటే వాడిదగ్గరే చదువుకోవాలని వుండేవాణ్ణి. మా ఇంటి కంటే ఎంతో ప్రశాంతంగా వుండేది! మా ఇంటికి వెళ్లినప్పుడల్లా, అక్కడ ఏదో ఒక 'కాండ' జరిగిపోయి వుంటుంది లేదా ఏదైన కాండ జరుగుతూవుంటుంది. అప్పుడప్పుడు అమ్మ ఏడుస్తూవుంటుంది లేదా వదిన ఏదో

గొణుగుతూ వుంటుంది. హఁ ఒక్క విషయం మాత్రం అప్పుడప్పుడు నా గుండెపై పిడికిలితో గుద్దినట్టువుండేది - ఏదో రాయితో చేసినట్టు ప్రభ ముఖం నేను చూసినప్పుడల్లా భావరహితంగా మార్పులేకుండా కనపడేది. ఎప్పుడూ గంభీరంగా, కొంతదాకా ఏడ్పుముఖంతో - ఆమె కళ్లకింద నల్లని చారికలు ఏర్పడ్డాయి - చలిమూలానా పెదాలు పొడిపొడిగా, పాదాల చివర మురికి నిండినపగుళ్లు.

ఉదయం దివాకర్ ఇంటి నుంచి తిరిగి రాగానే చూసాను - అమ్మ ప్రభను ప్రేమగా చివాట్లుపెడుతున్నది - "ఎప్పుడు తలంటు పోసుకున్నావూ? అప్పుడప్పుడు కురులుకడుగు పిచ్చిదానా! చూడు ఎట్లా బాకుల్లా నిక్క పొడుచుకున్నాయో - అగ్గిపుల్లతీసుకరాఇటు, వాటిని తగలబెడుతాను, ప్రతిరోజు ఏ గొడవా వుండదు. ఎన్ని పేలువున్నాయో! రోజు తినేస్తున్నావా?"

అమ్మ స్వరంలో కోపం కానీ ఎత్తిపొడుపుకానీలేవు బహుశా అందుకె ప్రభ ధైర్యంగా అన్నది. "అత్తయ్య, మీరైన చెప్పండి, ఎప్పుడు కడగ మంటారు!"

అమ్మకు ఎప్పుడు కోపం వస్తుందో చెప్పలేం! ఆమె కంఠంలో తీవ్రత పెరిగింది - "అలానా! నేనెంత పనిచేస్తున్నానో అని కదా ఎత్తిపొడుస్తున్నావ్? మంచికోడలివే! తీరికే దొరకదా? తిండికి మాత్రం తీరిక వుంటుందా? ఏదీ నాకు లెక్కబెట్టిచెప్పు నువ్వు రోజు ఎంత పని చేస్తున్నావూ? రెండు పూటలా రొట్టెలు చేయడం కూడా ఒకపనేనా! చేయదలచుకుంటే రోజంతా పడుతుంది. చూపించు, ఏ ఇంట్లో కోడళ్లు పని చేయడంలేదో? నీ నాన్నగారింట్లో పది మంది నౌకర్లువున్నారేమో, మా దగ్గర మాత్రం అంతా కోడళ్లేచేయాలి!"

నేను కొళాయి దగ్గర బొగ్గుపొడితో పళ్ళుతోముతున్నాను. ఏడుస్తున్నపా పను చేతుల్లో ఊపుతూ వదిన నావైపుసైగ చేసి అన్నది - "చూసావా కాస్త పని చేయగానే, ఎంతగొడవ చేస్తున్నదోరోజూ! నేను చేసేదాన్ని కదా చెప్పు? అత్తయ్య ఎప్పుడైనా అన్నదా? కొంచెం చేయగానే ఎంతో ఉపకారం చేసినట్టు, ఉపకారం నాకు పని చేసిపెడుతున్నానని ఏదో ఉపకారాన్ని జ్ఞాపకం చేయ నవసరం లేదు - నువ్వు ఎంత పని చేసిపెట్టావో అంతకు సమానంగా వడ్డీతో సహా చెల్లిస్తాను, మళ్ళీ రేపటికి..."

అన్నయ్య అటు నుంచి గర్జించాడు - "ఏమిటీ పగలు రాత్రనక ఎప్పుడూ గొడవ? పొద్దు పొడిచిందోలేదో అప్పుడే మొదలు - మరేం పనిలేదా? తొమ్మిది

అవుతోంది."

కాని ఆయన మాటలను ఎవరూ పట్టించు కోలేదు. అమ్మ తనలోతాను అనుకున్నట్టు "ఏదో రోజే అంటున్నాం కాబట్టి ఈ మాత్రం వున్నాం లేదంటే ఒకరోజు ఇల్లంతా కూలిపోతుంది - ఇక్కడ తన్నులు పడితే తప్ప ఎవ్వరు వినరు? చెబితే తప్ప ఒక్క ఆకుకూడా కదలదు. నేను అడిగితేనే చీరె కుడు తుంది లేక పోతే సొంతం చిరిగిపోవలసిందే! చూడు, ఎంత మురికి చివికి పోయిందో ఈ చీర! కనపడదనుకున్నావా? ఉతికితే తలప్రాణం తోకకువస్తుంది. ఏమీ శ్రమలేకుండా మంచంపై కూచోబెట్టి, చేతికి పుస్తకం ఇస్తేసరి..."

కళ్ళపై నీటిబిందువుల్ని కొట్టుకుంటు నేను చూసాను. చీర ఎన్ని చోట్ల చిరిగిపోయిందంటె ఎక్కడా కుట్టె అవకాశం కాని ఉతికే వీలుకాని లేదు. చిరి గిపోయిన స్థలంలో చలిని ఆహ్వానిస్తు లేచిన రోమాలు కనపడుతున్నాయి. "ఏవైతే నాకేం లే" అని అనుకుంటూ చేతులు, మొఖం కడుకుని అంగవ స్త్రంతో ముఖము, మెడా తుడుచుకుంటు వెళ్ళిపోయాను. ఆ కొట్లాట చివరికి ఎలా ముగిసిందో లేదా ఆ జగడం ఎటువైపు దారితీసిందో తెలుసుకునే ఉత్సుకత నాలోఏమాత్రం లేదు. అసలు నాలో ఆలోచించే. అనుభూతి చెందే శక్తి నాలో ఎప్పుడూ లేదేమోనని అనిపించింది.

పగలు నేను ఇంటికి రాగానే విన్నాను. నాన్నగారు ఎందుకో కోప్పడు తున్నారు. "పర్దా పాటించకపోతే మానే. ఛాతీపై ఆ బరువును కూడా సహిస్తాము. కాని సిగ్గులేనితనానికైనా ఒక హద్దు ఉండాలి కదా. పైకి వెళ్ళి కురులు కడిగే వేళ నలువైపులా చూసేవాళ్ళేం అనుకుంటారో తెలియదా! చలికాలంలో ఎండ కాచుకునే నెపంతో చాలామంది మిద్దెపైకి వస్తారు. అటు ఇటు తొంగిచూడ టంలో వాళ్ళ అబ్బ సొమ్మేం పోతుంది. ఈ మున్నీ కూడా ఇంత పెద్దదై పోయింది. దానికైనా తట్టలేదా. అక్కడే కూచుని తలపై నీళ్ళు పోస్తున్నదిపైగా."

మున్నీ మూతి తిప్పుతూ అన్నది "నాన్నగారు మీరు కూడా విచిత్రంగా మాట్లాడుతారు. ఇప్పుడు ఎంత చలిగా ఉంది. మీరైతె రామ, రామ అను కుంటూ రెండు చెంబులు గుమ్మరించుకునేప్పటికి స్నానం అయిపోతుంది. కాని మాతల అంత సులభంగా కడుక్కోగలమా రెండు గంటలు పడుతుంది. అంతసేపు కింద ఈ చలిలో కూచుని ఎలా తడపగలం. చేతిలోకి నీళ్ళు తీసుకుంటె కరపడానికి వస్తాయి. మిద్దెపైన ఎండవున్నది. అక్కడికి వెడితె ఏం మునిగిపోయిందని?"

"అయితే చలి దేముంది బాగానే వుంది." మున్నీ ధోరణి చూసి నాన్న గారు కొంచెం చల్లబడిపోయారు. ఈలోగా అమ్మ అన్నది. "దినమంతా నీళ్ళు వేడి చేయడానికి మూడు రూపాయల చొప్పున మణుగు కట్టెలు కొనాలంటె నాదగ్గర డబ్బులు లేవు, ఒక్కరికోసం అంటే వేడిచేయవచ్చునేమో. ఈ మొత్తం సైన్యానికి వేడినీళ్ళు కావాలంటె ప్రతిరోజు రెండు మణుగుల కట్టెలు కావాలి?"

అమ్మకు మాట్లాడేశక్తి ఈరోజుల్లో ఎంతో ఆశ్చర్యంగా పెరిగిపోయింది. వదిన ఎప్పుడు పాపనేసుకుని తిరుగుతుండేది.

ఇక నా శరీరమేమో ఎవరో నల్లమందు ఇంజెక్షన్ ఇచ్చినట్టు స్తబ్ధంగా వుండేది. నన్ను ఏదో ఒక చట్రంలో బంధించి అక్కడికి ఏ స్వరమూ వినబడకుండా, ఏవస్తువు తాకకుండా చేసినట్టు అప్పుడప్పుడు అనిపించేది. నాలో లోపల ఎవరైనా మాట్లాడుతున్నట్టుకాని అనుభవిస్తున్నట్టు కాని ఏమీ అనిపించడం లేదు. సంవేదన అనేది క్రుంగిపోయి వుంటుంది. లేదా సంవేదన అనే వస్తువు లేకుండా పోయింది. లోపలా, బయట అంతా అవాస్తవమే. ఉపరితలంలోని పొరలు బాగా గట్టిపడిపోయి లోపల కూడా ప్రతిక్షణం ఏదో గడ్డ కట్టుకు పోతున్నట్టు అనిపించేది. మెల్లి మెల్లిగా నా అంతరం బాహ్యమంతా పూర్తిగా గడ్డ కట్టుకుపోయి రాయిగా మారిపోతుందా?

లేదు, లేదు. ఇదంతా ఆలోచించకూడదు. పరీక్షలు మరో అయిదారు రోజులలో ప్రారంభం కానున్నాయి.

# తొమ్మిది

చివరిపేపరు రాసి హాలులోంచి బయటికి రాగానే మనస్సంతా ఎంతో తేలిగ్గా ఆనందంగా ఉంది. పేపర్లన్నీ బాగానే రాసాను. తలపైనుంచి ఓ పెద్ద బరువుదిగిపోయింది. ఇంతవరకు ఒకపని అనేది ఉండేది. అందులో అన్నివిధాలా మునిగిపోయి వుండేవాణ్ణి కాని ఇప్పుడు ఇక ఏం చేయాలి. ఆ సమస్య గురించి ఆలోచించేముందే దివాకర్ అన్నాడు. "నడు ఈ రోజు హాయిగా సినిమా చూద్దాం. ఎన్ని సంవత్సరాలైంది సినిమా చూసి." అతను స్వయంగా ఆ తర్వాత మాట్లాడకుండా ఉంటె నేను ధర్మసంకటంలో పడిపోయి ఉండేవాణ్ణి.

"ఈ రోజు నేనే సినిమా చూపిస్తాను. అమ్మగారు ఒప్పుకుంటె కిరణ్‌ను కూడా వెంట తీసుకెడదాం. పాపం, ఎంతకాలమైంది ఆవిడ కూడా సినిమా చూడక! తీసుకొచ్చి ఎక్కడ బావిలో పడవేసారని అనుకుంటున్నదో."

మేము విడిపోతున్నప్పుడు, నన్ను ఆ సాయంత్రం సరిగ్గా సమయానికి రమ్మని అతను మళ్ళీ జ్ఞాపకం చేసాడు. నేనేదో నా దార్శనికతలో చిక్కుకు పోతానని అతని భయం. కాని మాయింట్లో ఎలాంటి సంఘటన నా దారి చూస్తున్నదో పాపం అతనికేం తెలుసు.

ఒక యుగం గడిచిపోయాక అకస్మాత్తుగా మున్నీ పతిదేవుడు వేంచేసాడు. ఎందుకోనాకు ఆమనిషి మొఖం చూడాలన్నా అసహ్యం! ఇల్లంతా సందడిగా ఉంది. అందరికి ఆశ్చర్యమే. అతన్ని బయటిగదిలో కూచోబెట్టారు. తరచుగా ఆ గదిలోనే నాన్నగారు, అన్నయ్య కూచునేవారు. మిగితా విషయాలు ఏమీ తెలియకున్నా అతను మాత్రం రాగానే మున్నీని తీసుకెడతానని చెప్పాడు. మున్నీ భర్త గత రెండేళ్లన్నర నుంచి ఎలాంటి ఉత్తరాలు రాయలేదు. నాన్నగారు వేసిన ఎన్ని జాబులకో ఒక్క జవాబుకూడా ఇవ్వలేదు. మున్నీ బతికివుంది చచ్చి పోయిందాననే విషయంకూడా పట్టని వాడు. బంధువుల పత్తిడికి కూడా లొంగనివాడు. ఈ రోజుఇలా అకస్మాత్తుగా ఊడిపడేసరికి అందరికి అందరు అయోమయంలో పడిపోయారు. అతను మున్నీని తీసుకెళ్లడానికి వచ్చాడని విని నేను స్తంభించిపోయాను. ఇంట్లోని వాళ్లందరూ భయం భయంగా, పరస్పరం మాట్లాడాలనే ఉత్సుకతతో తిరుగుతున్నారు.

మున్నీ, ప్రభ నిశ్శబ్దంగా వంటగదిలో తమ పని చూసుకుంటున్నారు. వదిన - అమ్మ మెల్లమెల్లగా గుసగుసలాడుతూ, రకరకాలుగా అంచనాలు వేసుకుంటూ, అప్పుడప్పుడు కువర్ ను బయటికి పంపిస్తూ వుండేది "వెళ్ళు, మీ నాన్నగారికి - వాళ్లమధ్య ఏం మాటలు సాగుతున్నాయో, మెల్లిగా వినేసిరా!" వదిన కూడా స్వయంగా అతిమెల్లిగా పాదాలు మోపుతూ వెళ్లి చాటునేవుండి వాళ్ల మాటలువిని మళ్లీ వచ్చి అమ్మ చెవిన వేస్తుండేది. కొన్ని వినేది, మరి కొన్నింటిని ఊహించుకునేది. అనుకోకుండా అతనిలో జరిగిన ఈ హృదయ పరివర్తన గురించి అందరూ తెలుసు కోవాలనుకొంటున్నారు, బైటిగదిలో గంభీరంగా చర్చలు సాగిపోతున్నాయి.

రాత్రికి భోజనాల తర్వాత నాన్నగారు వచ్చి అమ్మతో చెప్పారు. "రేపు మున్నీ వెడుతుంది! ఉదయం పదిగంటల బండికి. ఇల్లంతా నిస్తబ్ధత ఆవహిం

చిపోయింది."

ఇంతకూ విషయమేమిటో తెలుసుకోవాలని మేమంతా ఒకచోట గుమి గూడాం. అమ్మ ఇంత సేపు ఎదురుచూసి పడిన ఇబ్బందిని చికాకులో వ్యక్తం చేసింది. ఆమె ఎంతో చిరాకుతో అన్నది. "ముందు ఇక్కడ కూర్చొండి. ఏమీ చెప్పకుండా మున్నీ రేపు వెడుతుంది. అంటే సరిపోతుందా. ఇప్పుడు ఆ హీనుడికి వచ్చిన ఆపద ఏమిటి? రెండు సంవత్సరాలపాటు ఏ పురుగు ముట్టిందట." అమ్మ డగ్గుత్తికతో బయటికి మాట వినపడకుండా అడిగింది. నాన్నగారు అమ్మ మంచం చివర కాళ్ళ దగ్గర కూర్చున్నారు. నేలపై చిన్న లాంతరు ఉంది. మేమంతా ఆ లాంతరుచుట్టూ వలయకారంగా నిటారుగా కూర్చున్నాము. కాళ్ళపై గదవలు ఆనించిన అందరికి నాన్నగారు ఏం చెబు తారో వినాలని ఉత్సుకతగా ఉంది. మరోవైపు మున్నీ గోడకుఆనుకుని కూర్చుంది. పాపను బలవంతంగా పడుకోబెట్టేసి ముఖంపై పొడుగాటి ముసుగు లాక్కుని వదినవచ్చి కూచుంది. ప్రభ కనపడలేదు. మా అందరి మధ్య ఆదే ఒక చిన్న కాంతి. అన్నయ్య నేను ఇంకా అమర్ కువర్ వలయాకారంగా కూర్చోడం వల్ల అది మరింత మసకబారింది. కువర్ భయపడుతూనే లాంతర్ మూతపైన చేయిపెట్టి వేడిపొందే ప్రయత్నం చేస్తున్నాడు. ఆ గంభీరమైన వాతావరణంలో ఎవరైనా చేయి తగిలిస్తారేమోనని జాగ్రత్తవహించాడు. కాని అతని పట్ల ఎవరికి ధ్యాసలేదు.

ఎంతో ఓర్పుతో నాన్నగారు చెప్పారు, "చూడండి అతను మున్నీని తీసుకువెళ్ళడానికి వచ్చాడు. మన్నించమంటున్నాడు. తనవల్ల తప్పు జరి గిందని విచారం వెళ్ళబుచ్చుతున్నాడు. ఇక ముందు అలా జరగదని హామీ ఇస్తున్నాడు. మళ్ళీ ఏవైనా జరిగితే చెవి మెలి పెట్టమంటున్నాడు. బంధువులు ఏశిక్ష విధించినా భరిస్తాడట. చివరికి ఏడుపు ముఖం పెడితే నేను ఏం చెయ్యగలను."

"ఊరికే అలా ఏడుపు మొహం పెట్టాడా? అసలు ఏమైనా చెప్పాడా చివరికి? ఇప్పుడు అకస్మాత్తుగా ఆ బుద్ధిహీనుడికి జ్ఞానదంతం పుట్టుకొచ్చిందా. ఆ దయ్యం ముండ సంగతేమిటట తన అల్లుడిపట్ల అమ్మ ప్రయోగిస్తున్న భాష కొత్తగానే ఉంది."

"ఆ దయ్యం ముండ కారణంగానే బుద్ధివచ్చింది. అయిదారు నెలల క్రితం దుస్తులు, ఆభరణాలు అన్నీ మూటగట్టుకుని పారిపోయిందట, పోలీసు

లకు కూడా రిపోర్టు ఇచ్చాడట అయినా మళ్ళీ దొరుకుతుందా అది. ఇప్పటి కికాని అతగాడి బుద్ధి దారికి రాలేదు."

మేమంతా ఉలిక్కిపడ్డాం. "అదా సంగతి ఇప్పుడు తన కవసరం కాబట్టి మొనగాడొచ్చాడన్నమాట." కువర్ కోపంగా అరిచాడు. "నాన్నగారు మీరు కూడా మున్నీ అక్కయ్యను పంపించవలసిన అవసరం లేదు."

కాని ఆ గంభీరమైన వాతావరణంలో వాడిమాటలను ఎవరూ పట్టించుకోలేదు. అన్నయ్య అన్నాడు. "ఆ ముండ తనను పాడుచేసిందని ఇప్పుడంటున్నాడు. మొదట్లో తన కళ్ళకు పొరలు కప్పింది. తన మంచేమిటో చెడు ఏమిటో అర్ధం కాలేదు. దాని మాయమాటల్లో పడి బుద్ధి ఎందుకు గడ్డి తిన్నదో అర్ధం కాలేదట."

వెంటనే అమ్మ కోపంతో మూతి తిప్పుకుని గాఢంగా శ్వాసించి అన్నది. "వాడి బుద్ధి మీ అమ్మగారి పుట్టింటికి పోయింది. అయినా ఇలాంటి మనిషి నమ్మకమేమిటి రేపు మరొకరి మాయలో పడిపోడని నమ్మకం ఏమిటి? నేనైతే మా అమ్మాయిని పంపించను. మొదలే దాన్ని సగం చంపేసాడు, ఇప్పుడిక చంపి వదులుతాడు."

"నే చెబుతున్నాగా అతను ప్రమాణంచేస్తున్నాడు నమ్మమంటున్నాడు," నాన్నగారు నచ్చజెప్పే ధోరణిలో అన్నారు. "అతని మాటల్ని బట్టి బుద్ధివచ్చిందనే అనుకుంటున్నాను. ధీరజ్ అమ్మ ఏదో ఒకసారి తప్పు జరిగిపోయింది. ఇక జీవితాంతం అదే చెయ్యడుగా, ఈ వయస్సులో స్పృహ వుండదుగా నేను అతనితో అన్ని విషయాలు స్పష్టంగా మాట్లాడాను."

అమ్మ ఒప్పుకోలేదు. అదేవిధంగా నిర్లక్ష్యంగా మళ్ళీ అన్నది "మీ మాటల కేముంది? ఎవరు ఎలా చెబితే అలా నమ్మేస్తారు."

"నువ్విట్ల మాట్లాడితేనే నాకు కోపం వస్తుంది. అర్థం చేసుకునే ప్రయత్నం చేయవు పైగా నీ పాటే పాడుతుంటావ్. ఎప్పుడైనా ఇతరుల మాటలు కూడా వినాలి."

నిస్పృహతో హతాశుడైన నాన్నగారు అన్నారు. "ఇప్పుడు అతని అవసరమే కావచ్చు, అయినా స్వయంగా వచ్చాడు కదా. ఒకసారి ఎదురుదెబ్బ తగిలి అతని కళ్ళు తెరుచుకున్నాయి. అతనిలో ఎంతో పశ్చాత్తాపముందని అమ్మాయిని వేధించడని అతని మాటల వల్ల తెలుస్తున్నది. ఇలాంటి పరిస్థితిలో నువ్వే చెప్పు పంపించడంలో అభ్యంతరమేమిటి? సరే పంపించమనుకో,

అమ్మాయిని జీవితాంతం ఇక్కడే కూచోబెట్టగలవా? పోనీ చదివించి ఏదైనా పని నేర్పించాలంటె మనదగ్గర ఏమున్నదని. మగపిల్లలనే సరిగ్గా చూడలేక పోతున్నాం. అందరికి వాళ్ళ వాళ్ళ బాధ్యతలు వున్నాయ్. మనమైన ఎంత వరకు ఉంచుకోగలం. సరే పంపించమనుకో, అలాంటప్పుడు మున్నీకి రెండో పెళ్ళి చేసేద్దామా?"

అమ్మ వెంటనే అందుకుంది. "నీ నోరు కాలిపోను. పిల్లల మధ్య కూర్చుని ఇవన్నీ చెప్పడానికి సిగ్గులేదా! మహావచ్చాడు. రెండో పెళ్ళి చేయ డానికి. అప్పుడిక బంధువర్గం, మొత్తం పట్నం మనపై ఉమ్మేస్తుంది. ఇప్పటికే మంచి పేరే ముందని? ఆర్యసమాజిలతో ఉంటూఉంటు మీ బుద్ధి పెడదారి పడుతున్నది."

"అయితే సన్నేం చేయమంటావ్ ఇప్పుడు. మంచిమాట చెబితే నీకు అర్థంకాదు. పైగా కోపమొస్తుంది. నువ్వే చెప్పు ఏం చేయాలో ఇంతకంటె మంచి అవకాశం రాదని నాకనిపిస్తున్నది. స్వయంగా ఇంటి కొచ్చాడు. ఇక్కడ మున్నీ పరిస్థితి ఇకముందు ఏమిటి? నువ్వే ఆలోచించు. తన స్వంత ఇంట్లో ఉంటె తన కాపురాన్ని చక్క దిద్దుకుంటుంది. లేకపోతే పామును పట్టుకోలేక అది నడిచివెళ్ళిపోయిన గీతల్ని కొట్టినట్టు వుంటుంది."

అమ్మ ఏదో చెప్పాలని నోరు తెరుస్తూ వుండగానే మున్నీ ఏడుపు విని అందరూ ఉలిక్కిపడ్డారు. ఇంతవరకు ఆమె కూడా గోడకు వీపుఆనించి అలా నిటారుగా కూర్చుని ఉంది. చలివల్ల లేదా ముఖాన్ని దాచుకున్నందువల్ల ఆమె రెండు మోకాళ్ళు బాహువులమధ్య ఉన్నాయి. ఇప్పుడు ఏడుపుమూలంగా తల కదులుతున్నది. నేను ఆమె దగ్గర గానే వున్నాను. ఆమె తలపై నా చేయి ఆనించి తలను పైకి లేపుతూ బాధగా అడిగాను. "ఏం జరిగింది మున్నీ! చెప్పు ఏమిటో ఎందుకేడుస్తున్నావ్ చెప్పమ్మ?"

మున్నీ బలంగా తనతలను విదిలించుకుంది. ఆ తర్వాత మరింత పెద్దగా ఏడుస్తూవుంది. "నోటితో చెప్పు ఏమిటో, మున్నీ నువ్వు ఎందుకేడుస్తున్నావో మాకు ఎలా తెలుస్తుంది?" అన్నయ్య సానుభూతితో అడిగాడు.

జవాబు ఇవ్వకుండా ఆమె ఏడుస్తూనేవుంది. కాసేపటికి ఎంతో కష్టం మీద ఏడుస్తూనే వెక్కిళ్ళ మధ్య అన్నది. "నాన్నగారు మీరు చేతులతో విష మిచ్చి చంపేయండి. నా గొంతు పిసికేయండి... నన్ను మాత్రం అక్కడికి పంపించకండి నన్ను అక్కడికి పంపించకండి నాన్నగారు, నేను అక్కడైతే

చచ్చిపోతాను... మీకు చేతులు జోడిస్తాను పాదాలు పట్టుకుంటాను. నన్నెక్కడికి పంపించొద్దు."

వెంటనే ఆమె కిందికి విరుచుకుపడి మంచం కింద వేలాడుతున్న నాన్నగారి పాదాలకు చుట్టుకుపోయింది. వెక్కి వెక్కి ఏడుస్తూనే ఉంది.

మా అందరి కళ్ళలో కన్నీళ్ళు తిరిగాయి. అమ్మ రాలుతున్న కన్నీటిని కొంగుతో అద్దుకుంటున్నది. నోరువిప్పి వస్తున్న ఏడుపుతో శ్వాసిస్తున్నది.

"అరేరే! ఏమిటి చేస్తున్నావ్?" నాన్నగారు కిందికి వంగి బలవంతంగా మున్నీని పైకి లేపి లాక్కున్నారు. ఆమె ఆయన వళ్ళోనే బోర్లాపడి నరకబడనున్న ఆవులా రోదించసాగింది. ఆమె ఏడుపులోని ఛీత్కారాన్ని నాన్నగారి చొక్కా అంచును నోట్లో కుక్కుకొని ఆపుకొనే ప్రయత్నిస్తున్నట్లు అనిపిస్తున్నది. ఆమె రోదన పక్కటెముకలను చీల్చుకుని బయటికి వస్తున్నట్టు అనిపిస్తున్నది. ఆమె ఏడ్పు వల్ల భుజాలు రెండు శరీరమంతా అతి తీవ్రంగా వణికిపోతున్నది. కదులు తున్న ఆమె నల్లనల్లని కురులు ఉన్న తలపై తన దవడకు ఆనించి నాన్నగారు కూడా నిశ్శబ్దంగా రోదిస్తున్నారు.

ఆయన లావాటి కన్నీళ్ళు చెంపలపై నుంచి జారి మున్నీ వెంట్రుకల్లో కలిసిపోతున్నాయ్. తన మనస్సులోని అశాంతిని కప్పి పుచ్చుకోడానికి ఆయన గబ గబా అమె వీపుపై ఓదార్పుగా అరచేతితో రాస్తున్నారు. మా కళ్ళలోంచి కూడా అనాయాసంగానే కన్నీళ్ళు చెక్కిళ్ళ పైనుంచి జారిపోతున్నాయి. అప్పుడప్పుడు ఆ ఉప్పటి తీవ్రమైన ఆసిడ్ పెదవుల కొసల్లోంచి నోట్లోకి వెళ్ళిపోతున్నది. లేస్తున్న ఆ వేగాన్ని అణచాలని ముక్కులోంచి కారుతున్న నీరుతున్న నీటిని ఎగబీలుస్తున్నాం. కువర్ ఇక తనను తాను ఆపుకోలేక లేచి వెళ్ళి అమ్మను చుట్టేసి ఏడుస్తు అన్నాడు.

"అమ్మా, మున్నీ అక్కయ్యను వెళ్ళనివ్వం. ఆమెను పంపించకండి."

దుఃఖంలో వున్న ఈ అమ్మాయిని మేము ఎంతగా ఉపేక్షించి,అప్పుడప్పుడు చీదరించుకున్నామో, తలచుకున్నప్పుడల్లా ఎంతో ఆవేదన కలుగుతున్నది. ఏ పనైనా చేసి, మున్నీని నా దగ్గరే వుంచుకుని పోషించాలని నిశ్చయించుకున్నాను. ఒక్క అమ్మాయికి మేమంతా కలసి భోజనం - దుస్తుల ఏర్పాటు చేయలేమా ? అయిదారు నిమిషాలు కాగానే ఉద్విగ్నత తగ్గిపోయింది. అప్పుడు మున్నీ మళ్ళీ అన్నది - "నాన్నగారు నేను ఎక్కడైనా ఎవరింట్లోనైనా పాచి పని చేస్తాను. దంపుడు పని చేస్తాను. నన్ను మాత్రం ఆయన వెంట అక్కడికి

పంపిం చవద్దు."

అప్పుడిక నాన్నగారు నిగ్రహాన్ని వహించారు. నచ్చజెబుతూ అన్నారు. "పిచ్చిదానివా, బిడ్డా మేమంతా నీకు పరాయివాళ్ళమా? నీకు ఏదైనా జరిగితే వెంటనే అర్థరాత్రి పూటైనా ఇక్కడికి వచ్చేయ్. అసలు ఈ ఇల్లు మొదట నీది. ఆ తర్వాతే మాది. కాని నువ్వు ఈ సారి ఒప్పుకో. మళ్ళీ ఇంకేమీ జరగదు."

"లేదు నాన్నగారు లేదు. ఏదో ఒక భయంకరమైన రాక్షసుడిని ఊహించుకుని ఆమె వెక్కి ఏడ్చింది. నన్ను ఆ బావిలోకి నెట్టకండి నాన్నగారు."

ఈ సారి నాన్నగారు నిట్టూరుస్తు కృంగిపోతున్నవాడిలా అన్నారు. "బిడ్డా, నీ మంచి కోసమే కదా ఈ ప్రయత్నమంతా. అది నీ ఇల్లు. నువ్వు వెళ్ళి సంభాలించుకోకపోతే మళ్ళీ వ్యవహారమంతా చెడిపోతుంది. ఇది నీ మంచికే జరుగు తున్నదమ్మాయ్. మన బంధువుల్లో చెడు పేరు వస్తుంది. అందరూ వేలెత్తి చూపుతారు. ఎవరెవర్ని నోరు మూయించగలం?"

"నా గురించి మీకు ఏదైనా అనుమానం కలిగితే అదే రోజు నాకు విష మిచ్చి చంపేయండి నాన్నగారు." "ఆమె ఏడుస్తూనే వుంది. ప్రయత్నించినా ఆమె ఏడుపు ఆగలేదు."

నాన్నగారు మళ్ళీ కంటతడి పెట్టుకున్నారు. ఈసారి ఇక ఆయన తనను ఆపుకోలేక పెద్దగా ఏడ్చేస్తారని అనిపించింది. భావాతిరేకం వల్ల ఆయన కింది పెదవి బాగా వణికిపోతున్నది. ఆ తర్వాత మున్నీని మంచంపై మరోవైపు జరిపి ఆయన బయటికి వెళ్ళిపోయారు.

ఆ తర్వాత మేమంతా ఎంతోసేపు దాదాపు ఓ గంటపాటు అలానే నిశ్శబ్దంగా కూచున్నాము. చలి పెరగగానే, నిద్రవచుంచుకొస్తుంటే ఒక్కొక్కరే లేచి వెళ్ళిపోసాగారు. మున్నీ అక్కడే పడి వెక్కి వెక్కి ఏడుస్తూనే వుంది.

ఇక పొద్దున్నే మున్నీని సాగనంపాము. బయల్దేరే ముందు ఆమె పెద్దగా అరుస్తూ ఏడ్చింది. కుళ్ళి కుళ్ళి ఏడ్చింది. అందర్ని కౌగిలించుకుని ఏడ్చింది. ఏమి మాట్లాడకుండానే హిస్టీరియా తిరగబెట్టినట్టు ఆమె అలా ఏడుస్తూనే ఉంది. ప్రభను కౌగిలించుకుని తాము జన్మ జన్మాంతరాలకు విడిపోతున్నట్టు మరీ ఏడ్చింది. వాళ్ళిద్దరు ఎంతోసేపు వదలకుండా నిలుచున్నారు. ట్రెయిన్కి ఆలస్యమవుతున్నది. అందువల్ల ఎంతో కష్టం మీద ఇద్దర్ని విడిపించాము. ఆ వేళ నాన్నగారు ఏదో పనుందని వెళ్ళిపోయారు.

మా ఇంట్లో నా తరువాతే మున్నీ. అందువల్ల ఇంట్లో అందరికంటే నేనే

ప్రేమగా చూసేవాణ్ణి. నా మెడ చుట్టూ చేతులు వేసి వెక్కి వెక్కి ఏడుస్తున్నపుడు నా గొంతు ఆడలేదు. ఆ శోకంలో నా శరీరంలోని ఒక్కొక్క అణువు చెదిరిపో తున్నట్టు నా పక్కటెముకలు విస్ఫోటనం వల్ల పగిలిపోతున్నట్టు. నా గుండె నోట్లోకి వస్తున్నట్టు అనిపించింది. మున్నీ చివరికి ఎలాగో అనగలిగింది. "అన్నయ్యా వదినతో మాట్లాడు. పాపం ఆమె ఏమీ చేయలేదు..."

ఆ తర్వాత వెళ్ళిపోయింది. ఆమెకు ఏడుపు తప్ప మరో స్పృహలేదు. రైలు కనపడుతున్న మేర నేను ఆమెను చూస్తూనే ఉన్నాను. ఇంటికి తిరిగి వచ్చిన తర్వాత నా గది కిటికీలు మూసుకుని కూచున్నాను. నా చెక్కిళ్ళపై నుంచి కన్నీరు పారుతూ నా ఒడిలో పడుతూనే వుంది. నేనేమో సమా ధ్యావస్థలో ఉన్నట్టు కూర్చున్నాను. మనస్సులో ఏదో ప్రతిధ్వనిస్తున్నది. దానిని నేను అర్థం చేసుకోలేక పోతున్నాను.

ఇంట్లో స్మశాన ప్రశాంతి ఆవరించి వుంది. ఎవరినో కాటికి పంపించి వచ్చినట్లు ఇంట్లో ఒకరు తలవాల్చి కూచుంటె మరొకరు తలుచుకుని-తలుచుకుని ఏడుస్తున్నారు. ఇంట్లోని గోడలు మీద విరుచుకుపడి కరవడానికి వస్తున్నాయి.

# పది

దివాకర్ ఇంటిలోనే భోంచేసి తిరిగి వస్తున్నప్పుడు పదకొండు గంటలవు తున్నది. మా ఇంట్లో అసలు చెప్పి రాలేదు. వెళ్ళగానే చీవాట్లు పడితే అప్పుడు స్పృహ వస్తుంది - 'కనీసం చెప్పి వెడితే ఎక్కడున్నావో కనుక్కోవచ్చు కదా.' ఇప్పుడే అర్ధరాత్రి తలుపు తెరిపించడం ఒక సమస్య. ఎవరు తెరవడానికి వచ్చినా తమ ఇబ్బంది గురించి ఇంకా నా భాద్యతల గురించి ఉపన్యసించడం తమ కర్తవ్యమని అనుకుంటారు. ఒక్కొక్క అడుగే వేస్తూ ఉంటె గుండె కొట్టుకుంటున్నది. రోడ్డు వీధులు నిర్మానుష్యంగా ఉన్నాయి. ఎగుడు దిగుడుగా ఉన్న ఇళ్ళ మూలంగా రోడ్డుపై వెన్నెల చెదురుమదురుగా పరుచుకుని ఉంది. మంచు పొగ కలిసి పోయి విచిత్రమైన పొగలా వ్యాపించింది.

మనస్సులో అశాంతి వ్యాపించి ఉంది. ఎందుకో లోపల ఏదో ఒక మర్మ వేదన. జరిగిందేమిటంటే మున్నీ కారణంగా ఆ రోజు సినిమాకు వెళ్ళలేక పోయాము. రెండు, మూడు రోజుల తర్వాత మళ్ళి ప్రోగ్రాం వేసుకుని వెళ్ళాం.

రాత్రి పది గంటలకు సినిమా వదిలారు. సినిమా ఏమంత గొప్పగా లేదు కాని నాయికా, నాయకుల ప్రేమ దృశ్యాలు మాత్రం నిజంగానే హృదయాన్ని హత్తుకున్నాయి. నా జీవితంలో కూడా అలానే జరిగి ఉంటే ఎంత బావుండేదోనని లోపలి నుంచి ఒక వేదన. చాలా రోజుల తర్వాత సినిమా చూశాం. తిరిగి వస్తున్నప్పుడు కాలి నడకనే ఇంటి ముఖంపట్టాం. నేను దివాకర్ వెంట నడుస్తుండగా, కిరణ్ కొంచెం దూరంలో నడుస్తున్నది. సినిమా చూసి వస్తున్న స్త్రీ, పురుషులు సినిమాలోని ఏదో ఒక అంశం గురించి మాట్లాడుకుంటు వెడుతున్నారు. కిరణ్ అసలు నాతో కాని నా సమక్షంలో కాని మాట్లాడేదికాదు. సినిమాకు వెళ్ళెముందు తలెత్తిన సంకోచం తిరిగి వస్తుంటే మళ్ళీ మొదలైంది. వాళ్ళతో పోల్చుకుంటే నావి చాలా నాసిరకపు దుస్తులు. ముడతలు పడి కాస్త చిరిగిన పైకి లేచిన ప్యాంటు, షర్టు. పాతబడి చిరిగిన స్యాండల్స్. మరో విచిత్రమేమిటంటే ఆ వేళప్పుడు ముడివేసుకున్న నా పిలక నాకే ఎంతో ఎబ్బెట్టుగా ఉంది. అంతకుముందే జాగ్రత్తపడి పిలకని విప్పదీసి మిగతా వెంట్రుకల్లో కలిపాను. చేతితో తాకుతూ అదెక్కడైనా నిక్కబొడుచు కుంటున్నదేమోనని చూసేవాణ్ణి. దాన్ని కత్తిరించేయడమే మంచి దేమోనని మనస్సులో ఒకసారి అనిపించింది. కాని ఛీ, ఈ రోజుల్లో ఏమిటింత అధ్వాన్నంగా ఆలోచిస్తున్నానని అనిపించింది.

అప్పుడే దివాకర్ మరింత దగ్గరగా వచ్చి అన్నాడు "చెప్పండి మహాశయా, రోజులెలా గడుస్తున్నాయి. ఇప్పుడేం చేస్తున్నట్టు."

ఆ ఉదయమే అన్నయ్య చెప్పిన మాటలు స్ఫురణకు వచ్చాయి. "ఇంతకూ ఏం చేయాలనుకుంటున్నావ్? పరీక్షలైతే అయిపోయాయి కదా!"

"నా ఉద్దేశ్యమంటారా మీరేం చెబితే అదే." నేనేదైనా ఉద్యోగం చేయాలనే ఆయన అంతరార్థాన్ని నేను గమనించాను.

"ఇక ఎక్కడైనా ప్రయత్నం చేయి. మీ మిత్రుణ్ణి అడుగు."

"రిజల్ట్సు అయితే రానివ్వండి. ఇప్పుడే అప్లయ్ చేస్తే ఏం రాయాలి?"

"రిజల్ట్సు రావడానికి మరో రెండు, రెండున్నర నెలలు పడుతుంది. అప్పటి వరకైనా ఏదో చెయ్యాలి కదా. లేకపోతే ఊరికే కాలాన్ని వ్యర్థం చేస్తావా?" చింతాపూరితమైన స్వరంతో అన్నయ్య అన్నాడు. "ఇంటి పరిస్థితులు నువ్వు చూస్తూనే ఉన్నావు కదా. నా తొంభై-వంద జీతంతో ఊదు కూడ ముండదు. ఏదో ఒకటి చెయ్యక తప్పదు. అమర్-కుపర్ లను మనిద్దరం బాగా

చదివించగలిగితే వాళ్ళకి మంచి సర్వీసు దొరుకుతుంది."

"సరే, ఏదైనా చూసుకుంటాను" నేను ఎగేసే ప్రయత్నం చేశాను.

"మీ ఆ మిత్రుడుతో చెప్పు. ఎక్కడైనా వెదికి పెడతాడు. అతనికి ఎంతో మంది పరిచయం ఉన్నారనుకుంటాను." ఆయన మళ్ళీ దివాకర్‌కు గుర్తు చేసాడు.

"అడుగుతాను" అసలు లోపలి నుంచి నాన్నగారు పెడుతున్న కేకలమూలాన నా ధ్యాస అటు మళ్ళింది. విషయాన్ని మారుస్తూ అన్నాను. "ఇంతకు నాన్నగారు లోపల ఎందుకు కోప్పడుతున్నారు" ఆ విషయం నాకు అంతగా ముఖ్య మైనదేమీ కాదు. అయన ఎవరో ఒకరిపై కోప్పడుతున్నారేమో. ఎవరి పనేదో వాళ్ళు చేస్తున్నారు. దానికి అంతగాచింతిం చాల్సిన పనేమిటి. కాని ఇప్పుడు ఇక్కడ ఈ మాటలను తప్పించుకోవాలికదా.

"నడు, ఎవరి మీదో కోపం వచ్చి అరుస్తున్నట్టున్నారు" అన్నయ్య నేను లోపలికి వచ్చేసాము. అక్కడ కూడా ఆయన మళ్ళీ జ్ఞాపకం చేసాడు. "చూడు అతనిని తప్పకుండా అడుగు."

ఇప్పుడు దివాకర్ అడగగానే నాకు అన్నయ్య చెప్పిన మాట జ్ఞాపకం వచ్చింది. "ఏం లేదు, నువ్వే చెప్పు. ఏం చేయాలో."

"ఓరే బాబూ, ఏదో చెయ్యడం ఎందుకు పిలక జాడించి హాయిగా వుండక. విశ్రాంతి చాలా గొప్పది. ముసుగు తన్ని పడుకో." దివాకర్ నిర్లక్ష్యంగానే అని వెంటనే ఏదోజ్ఞాపకం రాగానే మళ్ళీ అన్నాడు. "కాని నీ మెదడులో విశ్రాంతి ఎక్కడ. నువ్వయితే విశ్రాంతికి శత్రువు. నువ్వయితే థర్డు ఇయర్ పుస్తకాలు మధించివేస్తున్నావనుకుంటా. లేదా భారతీయ తత్వశాస్త్రాన్ని చదువుతున్నావేమో."

నేను విచారంగా జవాబిచ్చాను. "లేదు దివాకర్, బహుశా నేను ఇక ముందు చదువుకోలేను."

"చదువుకోలేవా? ఏమిటీ నీ ఉద్దేశ్యం?" అతను నవ్వేసి "విన్నావా, కిరణ్, మన సమర్ గారు సినిమా డైలాగు చెబుతున్నారు."

కిరణ్ చిరునవ్వు నవ్వింది. అంతవరకు తటస్థం గానే నడుస్తున్నది.

నేను పరధ్యానంగానే అన్నాను. "సరే ఇంకా చాలా రోజులుందిగా. ఇంతకు నీ సంగతి చెప్పు. ఇప్పుడు నీవేం చేస్తున్నావో?"

"మేమంటావా. చేయాలంటే మాకేం మిగిలిందని. కిరణ్, నేను ఉన్నాం.

నేను చదువులో పడి ఆమెను అసలు పట్టించుకోవడం లేదని బాగా కోపం వచ్చింది. అందువల్ల ఇప్పుడు ఆమెకు నన్ను మొత్తం సమర్పించుకున్నాను."

దివాకర్ పెద్దగా నవ్వాడు. అయితే హాస్యం శృతి మించుతున్నదని గమనించాడు. దంపతుల విషయాన్ని అలా చెప్పేస్తుంటే కిరణ్ కనుబొమలు ముడిపడ్డాయి. అపుడు వెంటనే దివాకర్ అన్నాడు. "ఇప్పుడేమో మా అమ్మగారికి సంజాయిషి ఇచ్చుకోవాలి. ఏం కిరణ్ అమ్మకు బాగా కోపం వచ్చి వుంటుంది. అప్పుడేమో వెళ్ళండి సినిమాకు అని చిరాకుతో అన్నదే కాని వంట పనిలో కళ్ళలోకి పొగ పోగానే బాగా తిట్టుకొని ఉంటుంది. అవే విని ఉంటే తిక్క కుదిరేది."

అప్పుడు కిరణ్ ఉపేక్షాభావంతో అన్నది. "పొద్దస్తమానం ఎక్కడ చావను. ఆరు నెలల తర్వాత సినిమాకు వచ్చాను. అప్పటికి ఆమె తిడితే ఎవరేంచేస్తారు."

"ఆమె ముందు ఈ మాట అను" దివాకర్ ఇకిలించాడు.

నాకు దివాకర్ మాట అసలు నచ్చలేదు. తన తల్లి గురించి భార్య నోట విన డమేమిటి? ఇక ఈ కిరణ్... నా ఎదుట కూడా తల్లిలాంటి తన అత్తయ్యను ధిక్క రిస్తున్నది. ఇదే ధోరణి ప్రభ చూపించే ఉంటే నా ప్రమాణాలన్ని మరిచిపోయి ఆ ఒక్క మాటపై లాగి చెంపదెబ్బ వేసేవాణ్ణి. అలా అనుకొన్న వెంటనే ఆ చెంప దెబ్బ దృశ్యం నా మనసులో మెరిసింది. కిరణ్ అసభ్యత నాకు నచ్చలేదు.

అప్పుడే దివాకర్ హఠాత్తుగా నాతో అన్నాడు. "సరే, సమర్ బాబూ మరో మాట. ఈవిడ నీ వైఫ్‌ను మా యింటికి తీసుకు రమ్మని ఎన్నో సార్లు నాతో చెప్పింది. సరే కిరణ్‌జీ ఒక రోజు విందుకు ఆహ్వానించు. అప్పుడు వదినగారిని తీసుకువస్తాడు."

నేను ధర్మ సంకటంలో పడిపోయాను. దివాకర్‌కు ఏం సమాధానం చెబుతానోనని కిరణ్ నా వైపు ఉత్సుకతతో చూస్తుండగా, వెంటనే తత్తరపాటుతో అన్నాను. "ఆమె... తల్లిగారింట్లో ఉంది. ఈ సారి రాగానే తప్పకుండా తీసుకువస్తాను."

అక్కడితో ఘట్టం ముగిసింది. కాని నాకు తెలియకుండానే హృదయం లోపల మంచు దిబ్బ కింద దాగివున్న వేడి పొర లోంచి ఒక చల్లని నిట్టూర్పు పైకి వచ్చింది. బహుశా నేను కూడా ఇలాగే భార్యతో సినిమాకు వచ్చి ఉంటే ఎంత బాగుండేది! సినిమాలో ఇందాక వాళ్ళిద్దరు పక్కపక్కనే తలలు ఆనించుకుని ఎలా సినిమా గురించి మాట్లాడుకున్నారు. నాకు జ్ఞాపకం. వెంటనే

సినిమాలోని అనేక దృశ్యాలు నా లోపల గిలిగింతలు పెట్టాయి. అయినా ఈ భార్య అనే పదానికి ఇస్తున్న అర్థంలో ప్రభ రాగలదా? లేదా ఈ కరంగా చెలరేగుతున్న ఆకాంక్షలతో ఆవిడ నివాసం వున్నదా? ఇది నేను అంగీకరించడానికి సిద్ధంగా లేను. అసలు ప్రభను నేనెప్పుడో ఈ రంగానికి వెలుపల ఉన్న జీవిగా భావించాను. ఇంతకూ నా భార్య అనే ఆవిడ మరొకరు ఉందని అనుకుంటున్నాను. అమె ప్రభ కానే కాదు.

దివాకర్ వెంటపడితే అక్కడే భోంచేసాను. ఇంటికి తిరిగి రాగానే నాతోపాటు ఇదే అయిదు గంటలనాటి ఆ పాత సమర్ కూడా వచ్చేసాడు. ఏ విసుగుతో కృంగిపోయి పారిపోయానో అదే మళ్ళీ తిరగవేసింది. ఏదో స్వప్నంలో కలలో విహరిస్తున్న వాణ్ణి ఇప్పుడు యదార్థలోకంలోకి తిరిగి వచ్చినట్టు అనిపించింది.

నేను, అన్నయ్య లోపలికి వెళ్ళి తల దించుకుని అపరాధిలా నిలుచున్న ప్రభను చూసాము. మరి నాన్నగారేమో దుర్వాసుడి అవతారమెత్తి చేయిపైకెత్తి గర్జిస్తున్నారు. అమ్మకూడ మధ్యమధ్యన సహకరిస్తున్నది. ఏనుగు తొండంలా ముసుగు తీసిన వదిన కిటికి వెనకాల దాక్కొని నిలుచుంది.

"పప్పు ఏరుకోడానికి మరో చోటు దొరకలేదా నీకు?" మమ్మల్ని చూడ గానే కథంతా మళ్ళీ చెప్పడం ప్రారంభించారు. "మిద్దె మీదే పప్పు ఏరాలి! ఇదే విధంగా ఆ రోజు కూడ మిద్దె మీదకు బాల్చి తీసుకెళ్ళి తల కడిగింది. ఆ రోజైతె మున్నీ సిఫార్సు మూలంగా ఊరుకున్నాను. ఇప్పుడిక తినడం, పడుకోడం, అన్ని మిద్దె మీదేనా. ఎప్పుడు చూసినా మూగదానిలా ఏడుపుగొట్టు మొహంతో తిరగడమేనా! అలా తప్పించుకుంటూ ఉంటావేమిటి? అసలు మనస్సులో ఏముందో యువరాణికి. ఆ మిద్దెమీద ఏముందో నాకు చెప్పు కాస్త. నేను ఈ రోజు స్పష్టంగా చెబుతున్నాను విను. ఇవన్నీ నాకు నచ్చవు. చెవులు విప్పి మరీ విను. చలి కాలపు రోజులు. ఎండ కాచుకునే నెపం మీద ఎంతో మంది మిద్దలపైనే అటు ఇటూ తొంగిచూస్తుంటారు. ఇంటి కోడలి పద్ధతిలో ఉండు."

"అందర్ని తప్పించుకుని అలా ఒక్కతే మిద్దె మీదికి వెళ్ళకపోతే పొరుగు వాళ్ళతో చూపులెలా కలుస్తాయి?" అమ్మ మమ్మల్ని చూసి మరింత ఆవేశంతో విరుచుకుపడింది. "అందుకే అలా మిద్దెకు పదే పదే పరిగెడతావు కదా."

అంతసేపు ప్రభ తలదించుకునే ఏమీ మాట్లాడకుండా వింటున్నది. ఈ మాటతో ఒక్కసారి తల చివ్వున పైకి లేపింది. ఒక్కసారి అమ్మ వైపు తీక్షణంగా చూసి మళ్ళీ మెల్లిగా తలదించేసుకుంది. బహుశా కళ్ళలోంచి

రెండు కన్నీటి చుక్కలు కూడా రాలినట్టున్నాయి.

"అవునవును. పాండేగారి అమ్మాయిలా ఎవడితోనైనా లేచిపోతుందేమో!" తారాస్థాయికి చేరిన కోపంతో తలవంచుకుని నాన్నగారు తనలోతాను గొణుక్కుంటు ముందు గదిలోకి వెళ్ళిపోయారు.

"ఎవరా పాండేగారు?" అమ్మ ఉలిక్కిపడి అడిగింది. "మన వాడలోనేనా. ఆయన అమ్మాయిలలో ఎవరు లేచిపోయ్యారు. పెద్దదేనా? అదే ఏనుగులా పెంచిపెట్టారు. ఆమె రెండు చేతులలో తల బాదుకున్నది." అయ్యో రామ. ఏం కాలమొచ్చి పడింది. అంతా అధర్మమే "నాన్నగారు. వెళ్ళిపోగానే అన్నయ్యను అడిగింది. ధీరజ్ ఎవడితో లేచిపోయింది.?"

"ఇంకెడితో లేచిపోతుంది. అదే చదువు చెప్పే మాస్టారుతో" అన్నయ్య అన్నాడు. "ఇపుడు బయటికి వెళ్ళి కనుక్కుంటాను."

"అయ్యో ఏం పాపం ముంచుకొస్తున్నది! చూస్తుండగానే అన్నీ జరిగిపోతున్నాయి. కనీసం పక్కవాళ్ళకు కూడా తెలియకుండా పోతున్నది. భగవంతుడా, ఈ లోకం ఎటు వెడుతున్నదో?" అమ్మ ఎంతో విషాదభావంతో నిట్టూర్చింది.

అన్నయ్య వెనక్కి తిరిగి బయటికి వెళ్ళిపోతున్నాడు. మొఖంపై ముసుగును పైకి లేపుతూ వదిన ముందుకు వచ్చింది. అమ్మ దగ్గరికి వెళ్ళి అన్నది "ఈ చదువుకున్న అమ్మాయిలు ఎంతకైనా వెనకాడరు అత్తయ్య."

హఠాత్తుగా అమ్మకు మళ్ళీ మొదటి విషయం జ్ఞాపకం వచ్చింది. సరే, మనకెందుకు లోకం ఏట్లో మునిగిపోతే ఏం? అయినా ఈ అమ్మాయి మాటిమాటికి పైకెందుకు పరిగెడుతుంది? దీనికి కావలసిన వాళ్ళు ఎవరు కూర్చున్నారక్కడ? ఇటు నావైపు తిరిగి "జాగ్రత్త ఈ క్షణం నుంచి అక్కడ అడుగుపెట్టావో నా అంత చెడ్డది మరొకటి వుండదు."

వదిన తన పాపను అమ్మ ఒళ్ళో ప్రేమగా పడుకోబెడుతూ అన్నది. "తీసు కోండి అత్తయ్య మీరెందుకు మనసు పాడుచేసుకుంటారు."

నేను వెనక్కి మళ్ళి వెడుతుండగా అమ్మ మాట వినబడింది "మనసు పాడు చేసుకోకపోతే ఏం చేయను? ఈ లక్షణాల మూలంగానే వాడు కనీసం మొఖమైన చూడడు. మరి రాణిగారికేమో యవ్వనం పొంగుతున్నది. ఆ అబ్బాయేమో అలా ఎండిపోయి కట్టె పుల్లవుతున్నాడు. వాడి రోగమేంటో అర్థం కాదు. మంచి పీడే మెడకు చుట్టుకుంది. చావనైనా చావదు పీడ వదిలిపోను. ఏం పరిస్థితి వచ్చింది. దేవుడా కక్కాలేము, మింగాలేము. కుర్రాడి

జీవితం నాశనమై పోతున్నది. నా వశమైతే "వాడికి రేపే రెండో పెళ్ళి చేస్తాను ..." అమ్మ కంఠం రుద్ధమైపోయింది.

నేనే బయట వరండాలోకి వచ్చి మెట్లెక్కుతూ గదివైపు వెడుతున్నాను. ఈ ఇంట్లో రోజుకొక్క జగడం. ఎన్నని పట్టించుకోను. కాని ఆ రోజు వెడుతున్న ప్పుడు మున్నీ చెప్పిన మాట నా చెవుల్లో ఇంకా ప్రతిధ్వనిస్తూనే ఉంది. ఆ పదాలకు ఏమి అర్థమో బోధపడకున్నా అంతరంగమంతా అశాంతి వ్యాపించింది.

ఇప్పుడు సినిమా నుంచి తిరిగి వచ్చిన ఈ అర్థరాత్రి తలుపు తట్టిన తర్వాత ఆ అశాంతి తిరిగి లోపలనుంచి ఉబుకుతూనే వుంది. ఇదంతా తప్పించుకోవాలనే కదా దివాకర్ దగ్గరకు వెళ్ళిపోయాను. ఇంత వరకు అన్నీ మరచిపోయాను. ఇప్పుడు ఆ దృశ్యమంతా కళ్ళ ఎదుట సాక్షాత్కరించింది. నయం, తలుపు తెరిచినవాడు అమర్ కాబట్టి సరిపోయింది. అయినా నేనెలాగు చీవాట్లు తినేందుకు సిద్ధపడ్డాను. వాడు అన్నాడు "అన్నయ్యా నువ్వు ఎక్కడికి పోయావు. ఇంటిల్లి పాది నీ కోసం ఎక్కడికెళ్ళావో అని బెంగ పెట్టుకున్నారు." నేను మెల్లిగా అడిగాను "ఇప్పుడైతే అందరూ పడుకున్నారు కదా?" వాడు అవును అనుకుంటూ మారు మాట్లాడకుండా మెట్లెక్కి తన గదిలోకి వెళ్ళిపోయాడు. నా భోజనం విడిగా మూతపెట్టబడి వుందేమోనని భయపడ్డాను. చూస్తే భోజనం లేదు. సంతోషంగా ఊపిరి పీల్చి దుస్తులు మార్చుకున్నాను.

మార్చి నెల ముగుస్తున్న సమయం. చలి బాగా తగ్గిపోయింది. మేమంతా కిటికీలు తెరుచుకునే లోపల పడుకునే వాళ్ళం. అప్పుడు పదకొండున్నర, పావు తక్కువ పన్నెండు అయ్యి వుంటుంది. బయట ఏకాదశి వెన్నెల విరబూసి వుంది. మంచు పొగతో కలిసిపోయి ఆ వెన్నెల మసకబారి మరింత గాఢంగా అల్లు కుంది. నాకు దాహం వేసింది. నలువైపులా చూసాను. నీళ్ళు ఎక్కడాలేవు. ఏవిటీరోజు భోజనం లేదు, నీళ్ళు లేవు. ప్రభ సాధారణంగా తన పని ఎప్పుడు మరిచిపోదు. బహుశా జ్ఞాపకం లేదేమో. పోనీ మానేద్దాంలే అని అనుకున్నాను. అవసరం ముందుకు నెట్టింది. పైన కప్పుకు మరో వైపు గోడలో వున్న రాయిపై నీళ్ళ కుండ వుంటుంది. అక్కడ దాకా వెళ్ళడమే ఆలస్యం.

లేచి బయటికి నడిచాను. మంచు బాగానే కురుస్తున్నది. నీళ్ళవైపు వెడుతూ నేను హఠాత్తుగా భయంతో ఉలిక్కిపడ్డాను. ఎదురుగా గోడకానుకుని ఎవరో కూర్చున్నారు తెల తెల్లగా... గుండె గుభేలుమన్నది. ఓరి భగవంతుడా ఎవరక్కడ దయ్యం, భూతం లేదా దొంగలు ఇలా పరిపరి విధాలా మనస్సు

ఊహించుకో సాగింది. ధైర్యం కూడదీసుకుని పరిశీలనగా చూసాను. రెండడుగులు మరి కొంత ముందుకు వేసి చూస్తే ప్రభ! ఆవిడను గుర్తు పట్టినందుకు సంతోషంతో పాటు ఎంతో ఆశ్చర్యం కూడా వేసింది. ఈ అర్ధరాత్రి పన్నెండు గంటలకు భయంకర మైన మంచులో ఒంటరిగా కూర్చుని ఏం చేస్తున్నది? అక్కడ కూర్చున్నది ప్రభనే అనే నమ్మకం కుదిరాక స్థిరంగా అడుగులు వేసుకుంటూ నీళ్ళవైపు వెళ్ళాను. ఇంతకూ ఈ వేళప్పుడు ఎందుకు కూర్చున్నదో నడుస్తుంటె నా మెదడులో ప్రశ్న గిర్రున తిరుగుతున్నది. బహుశా కూర్చుని అలాగే నిద్రపోయిందే మోనని ఒక క్షణం అనిపించింది. కాని ఆమె పక్కనుంచె వెనక్కి వస్తూ వుంటె ఆమె ఏడుస్తున్న వెక్కిళ్ళు వినపడ్డాయి.

నీళ్ళు తాగి వెనక్కి వచ్చిన తర్వాత పక్కపై పడుకుని అటూ ఇటూ పొర్లుతూ వుండిపోయాను. నా లోలోన ఎవరో అడుగుతున్నారు అయినా రాత్రి పన్నెండు గంటలకు అలా ఒక్కతే కూర్చుని ఎందుకు ఏడుస్తున్నట్టు. ఏడవడానికి మరో చోటు దొరకలేదా? అలా పడుకుని ఏడ్చుకోవచ్చు కదా. అందులో బయట ఈ అర్ధరాత్రిపూట? ఇంతకు పూర్వం ఎంత గొడవ జరిగినా ఆమె ఏడ్చిందని ఎవరూ చెప్పలేదు. నేను కూడా ఆమె ఏడుస్తుండగా చూడలేదు. ఎప్పుడు మౌనంగా, ఉదాసీనంగా వుండేది. కాని ఈ రోజు ఏం జరిగింది. అదే ఆశ్చర్యం.

కాని ఈ గొడవల్లో నేనెందుకు తలబాదుకోవాలి? ఈ ఆలోచన రాగానే అంతరంగపు లోతుల్లోంచి ఏదో ధిక్కార స్వరం లేచింది ఛీ! నైచ్యానికి కూడా హద్దులుంటాయి. ఆ తర్వాత అనేక రకాల అస్తవ్యస్తపుటాలోచనలు చుట్టుముట్టాయి. సినిమాలో డైనమేట్‌తో కొండల్ని పేల్చేసిన దృశ్యం చూసాను. అది ఇప్పుడు అనుకోకుండానే ఒక్కసారి ప్రత్యక్షమయ్యింది. నా లోపల ఏదో బాంబు పడిపోయింది. చుట్టు పక్కల ఉన్న ఇళ్ళన్ని కూలిపోయాయి. గాయపడి, భయ పడిన స్త్రీ, పురుషులందరూ పెద్దగా అరుస్తూ, తీవ్రమైన కోలాహలాన్ని రెచ్చగొడుతూ అటూ, ఇటు పరిగెడుతున్నారు.

ఆ తీవ్రమైన గందరగోళం అరుపుల మధ్య ఎవరి మాటా స్పష్టంగా వినపడడం లేదు. కేవలం ఒక కోలాహలం, లయబద్ధమైన కోలాహలం, గుడ్డి కోలా హలం నా మెదడులో పేలుసున్న బాంబులా సుళ్ళు తిరగడం మాత్రం వినబడు తుంది. చాలా సేపటికి ఒకటో, రెండో కంఠాలు స్పష్టంగా వినపడ సాగాయి. ఏదో పెద్ద దూలం కింద అణగివున్న మున్నీ అరుస్తున్నది "అన్నయ్యా,

వదినతో మాట్లాడు" - మరో కంఠం నాదే, మెల్లిగా వినబడుతున్నది "లేదు, ఆమె ఇప్పుడు తల్లిగారింట్లో వుంది. రాగానే తప్పకుండా తీసుకొస్తాను." ఈ కోలాహలానికి ఆవల ఎక్కడో దూరంగా, పైన ఊగులాడుతూన్న భారీగురు గంభీరమైన గంటలా ఒక ధ్వని నిరంతరంగా ఆగకుండా వినపడుతూనే వుంది బయట మంచులో, పన్నెండు గంటల రాత్రి ఒంటరిగా ఎవరో కూచుని రోదిస్తున్నారు. ఈ ధ్వని, బాంబు పేలిన తర్వాత వ్యాపించిన పొగలా గంతులేస్తు, ప్రశ్నవాచక చిహ్నంగా మారిపోతున్నది.

ఈ ప్రేలుడు మూలంగా నా మస్తిష్కంలోని జ్ఞానతంతువులపై ఒక భారీ గన్ను దెబ్బ తగిలి, సరనరాన జివ్వుమన్న అనుభవం... ఇవ్వన్నీ మరచిపోయి, నిద్రపోయే ప్రయత్నం చేస్తుంటే, నా గుండెలపై ఏదో ఒక సాలీడు భయంకరంగా తన పంజాతో గుచ్చుతూ వుంది. దాన్ని ఎత్తి దూరంగా విసిరివేస్తే తప్ప నిద్రపోలేను. అసలు నిద్రపోలేను! అలా ఎంతోసేపు ఆ ద్వంద్వంలో, ఉద్వేగితమైన ఉప్పెనలో ఊగుతూనే వున్నాను కాస్సేపు కునికిపాట్లు పడుతూ, మరి కొంతసేపు సచేతనంగా మేల్కొంటూ గడచిపోయింది.

ఇక ఆపుకోలేక మెల్లిగా పక్కమీంచి లేచాను. లేచి నిలుచోగానే నా ఆత్మాభిమానం భూతంలా నాదారి కడ్డంగా నిలుచుంది. ఒక్కసారి అలా ఆగిపోయి, వెంటనే క్రూరంగా దాన్ని దారి నుంచి తొలిగించి బయటికి వచ్చేసాను. ఎంతో సంకోచం ఆమె దగ్గరికి వెళ్ళాలంటే! సరాసరి వెళ్లగలిగే ధైర్యం లేదు, మళ్ళీ తిన్నగా నీళ్ళవైపు వెళ్ళాను. వెన్నెల అప్పటికింకా విస్తరించే వుంది. మంచు ఇంకా పడుతూనే వుంది. అక్కడే ప్రభ కూచుని అలానే రోదిస్తున్నది. కొట్టుకుంటున్న గుండెను ఎవరో తీవ్రంగా బిగించిన అనుభవం. గంటకుపైగా గడచిపోయినా, ఇంకా ఏడుస్తూనే వుంది. నాకు దాహం లేకున్నా, వెళ్ళి కాసిన్ని నీళ్ళు తాగి, మెల్లి మెల్లిగా వచ్చి ఎదుట నిలుచున్నాను. నన్ను చూసి ఉలిక్కిపడి వెంటనే సంభాలించుకుంటుందని అనుకున్నాను. కానీ ఆ ధ్యాస లేకుండా నిశ్చలంగా ఉలుకూ పలుకూ లేకుండా ఏడుస్తూ కూచునే ఉంది. అప్పుడు ఏం చేయాలో నాకు అర్థం కాలేదు. నేను వచ్చినట్టు పొడిదగ్గు దగ్గి సూచించనా? ఇక ఏమీ పాలుపోక వెనక్కి వచ్చేసాను. కాని అడుగులు వేయడానికి నిరాకరిస్తున్నాయి. మోకాళ్ళదాక ఊబిలో చిక్కుకుని ఎంతో కష్టంపైన ఒక్కో అడుగుపైకి లేపుతూ వెడుతున్నాను. అయినా ఎవరో వెనక్కి లాగుతున్నట్టు అనిపిస్తూనే వుంది. చివరికి నేను మళ్ళీ వెనక్కి

తిరిగి ఈ సారి సరాసరిన ఆమె ఎదుట నిలుచున్నాను. అయినా ఆమె ఒక రాయిలా అలానే కూచుని ఉంది. కాసేపు చూసి ఎంతో కష్టంగా గొంతులో ఇరుక్కున్న మాట బయటకు వచ్చింది. "ఈ అర్థరాత్రి ఇక్కడ కూచుని ఏం చేస్తున్నావ్?"

ఆమె తలెత్తి ఈసారి నావైపు చూసింది. జీవితంలో నన్ను మొదటిసారి చూసినట్టు వెంటనే చీర కొంగు వెనకాల మొఖం దాచుకుంది. ఏడుపు వేగం రెండింతలు పెరిగింది. నేను మరికొంత సేపు అలానే నిలుచున్నాను. అప్పుడు నేను అలా నిలుచోవటం అనవసరం, వ్యర్థం. ఇంకా అవమానకరంగా. అనిపించింది. మళ్ళీ కాస్త కటువుగా అయినా నచ్చచెపుతూ అన్నాను "కావాలంటె ఉదయం ఏడ్చుకోరాదు. మంచులో ఆరోగ్యం పాడవుతుంది. రాత్రి చాలా పొద్దు పోయింది." ఎలాగోలా మాటమాత్రం అనేసాను. కాని అలోచనకు వ్యక్తీకరణకు ఎంత తేడా ఉందో ఆ క్షణం అనిపించింది. ఆ మాత్రం చెప్పాలంటేనే నా గొంతు బొంగురుబోయింది. లోలోపల ఏదో కరుగుతున్నది. ఛాతీలో ఏదో గుంభ్రంగా అడ్డుకుంది. గుటక వేసాను.

"మీ కెందుకు మీరు వెళ్ళి పడుకోవచ్చుగా?" ఈ సారి పైట తొలగించుకుని తలపైకి లేపి ఎంతో ఆవేదనతో అన్నది "ఒక్క సంవత్సరం తర్వాత నేను చచ్చానో, బతికానో అని ఇప్పుడా మీ చింత? అయినా ఇప్పుడు మీకు ఏం అవసర మొచ్చింది. మీరు వెళ్ళి పడుకోండి." ఆమె సూటిగా నా కళ్ళలోకి చూసి అన్నది కళ్ళలోనీళ్ళు పొంగుతున్నాయి.

ఆ చూపు నా అణువణువును చేధించింది. నా శక్తి అనే సాగరాన్ని తన తీవ్రమైన అగస్త్యుడిలాంటి చూపుతో ఒకేసారి తాగేసినట్టు అనిపించింది. ఆపాద మస్తకం నా శరీరంలోని శక్తిని ఎవరో మంత్రం జపించి బయటికి లాగేసినట్టు ఉంది. నిస్సత్తువతో చెదిరిపోయిన వాడిలా పాత రోగిలా దఢాలున అమె ముందే రోగిలా కూర్చున్నాను. వణుకుతున్న నా నిర్జీవమైన చేతులను ఎంతో భయపడుతూ, భయపడుతూ ఆమె భుజాల మీద పెట్టి బొంగురుగా ఖండిత స్వరంతో అన్నాను. "ప్రభా నేనంటె నీకు కోపమా...?" అసలు నా లోపలి నుంచి అలా ఎవరంటున్నారోనని ఆశ్చర్యం వేసింది.

నేను మళ్ళీ ఏదో చెప్పేలోగా అమె ఒక్కసారే తన రెండు చేతులతో నా భుజాలను పట్టుకుంది. తన బలాన్నంతా ఉపయోగించి ఏదో ఉన్మక్త ఆవేశంలో అలా నన్ను ఊపేస్తు అన్నది. "మీకు నేను ఏమి చెడుపు చేసానో

నాకు చెప్పండి. మీ పట్ల నేను చేసిన తప్పేమిటి? నేను మీకు తగినదాన్ని కాకపోతే, నేను మీకు నచ్చకపోతే మీ రెండు చేతులతో నా గొంతుపిసికేయండి. నేను ఒక్క మాట మాట్లాడను. మీరు హాయిగా రెండో పెళ్ళి చేసుకోవచ్చు. కాని నాకు ... అసలు విషయం చెప్పండి..." ఎంతకూ ఆగని ఆ భీషణమైన రోదన వల్ల ఆమె శరీరంలోని ప్రతి రోమం కరిగి బయటికి వస్తున్నట్టు అనిపించింది. తనను తాను మరిచిపోయి నా భుజాలపై తల ఆన్చి నన్ను చుట్టేసింది. ఆమె నోటిలోంచి ఏడుపు బయటికి రాకుండా కొరడా దెబ్బ పడగానే బాధతో మెలికలు తిరిగినట్టు ఆమె శరీరం సొంతం వెక్కిళ్ళ తాకిడికి ఆకులా గజగజా వణికిపోతున్నది. వెక్కిళ్ళు వచ్చినప్పుడల్లా పై నుంచి కిందికి ఆవిడ వణికి పోయేది. చివరికి నేను కూడా ఆమె కంటె ప్రబల వేగంతో ఎప్పుడు రోదించసాగానో నాకే స్పృహ లేదు. ఇన్ని రోజులుగా అణిగివున్న లావా ప్రేలిన అగ్ని పర్వతంలా వెలుపలికి వచ్చేస్తున్నది. ఇప్పుడు స్పందన లేని, సంవేదన శూన్యమైన రాయి కింది నుంచి పైకెగిసిన గ్లేషియర్‌లాగా మంచులా గడ్డకట్టుపోయి నాహృదయంలోని కొండలన్ని కరిగి కరిగి కన్నీటి ద్వారా బయటికి వస్తున్నది. ఒకరిని ఒకరం గట్టిగా వాటేసుకుని ఇద్దరమూ ఏడుస్తూనే ఉన్నాం స్పృహ లేకుండా, ఎలాంటి ధ్యాస లేకుండా.

ఎంతో అమాయకురాలైన ఒక గారాలపట్టిని ఏకైక కూతుర్ని నేను తీసు కొచ్చి ఎంతగా హింసించానని ఆవిడని ఎంతగా యాతన పెట్టాను. ఇక్కడెవ రున్నారని తన బాధలు చెప్పుకోడానికి ఇవన్నీ కూడా వేల ఈటెలుగా నా గుండెల్లోకి చొచ్చుకుపోయి నా ఏడుపు రెండింతలు. నాలుగింతలు పెరిగింది. ఆవిడ పాపం మెల్లమెల్లిగా కరిగిపోకుండా మరి ఏం చేస్తుంది. ఆ క్షణం నాకు అనిపించింది ఒక ఆవేదన, పైకెగిసే రోదన ఈ హృదయంలోని పశ్చాత్తాపాన్ని, మనసులోని అశాంతిని, మర్మాంతకమైన బాధను బయటికి తీసుకురాగలిగే శక్తి ఆ వెక్కిళ్ళకు లేదనిపించింది. పెద్దగా గొంతు చించుకుని వెర్రివాడిలా అరుస్తు రెండు చేతులు పైకెత్తి ఈ నగరంలోని రోడ్లపై అలా పరిగెడుతూనే వుండాలని ఒక ఆవేశం మేల్కొనసాగింది... అలానే మూర్ఛపోయి పరిగెడితే తప్ప నా మనస్సు తేలికపడదు.

ఆమెది కూడ ఒక ప్రాణమేనని ఒక్క క్షణమైనా నేను అర్థం చేసుకునే ప్రయత్నం చేసానా? ఆమెకు కూడ దేనివల్లనో సుఖమో, దుఃఖమో కలుగుతుందని అనుకున్నానా? ఆమెకు కూడ అభిలాషలు, ఆకాంక్షలు ఉండవా? ఎప్పుడు

అనుకోలేదు. ఆమె ఇక్కడ ఎవరి అధారంగా ఎవరి నమ్మకంపై ఒక పనిమనిషిలా దివారాత్రులు గడిపేస్తున్నదని, ఎప్పుడైనా నా మనస్సులో తట్టిందా? ఆమె మేము కొనుగోలు చేసిన బానిస కాదు కదా! ఆ రోజు ఏ చేతితో ఆమె చెంపపై లాగి కొట్టానో, అదే ఆవేశంతో వణుకుతున్న నా వేళ్ళతో అదే చెంపను నిమురుతూ ఇప్పటికీ అక్కడే అయిదువేళ్ళ గుర్తులు ఉలికి ఉన్నట్టు అనిపించింది. మండుతున్నట్టు అనిపించిన ఆ చెంపను నేను నిజంగానే పిచ్చివాడిలా వెన్నెల వైపు తిప్పి అక్కడ ఇప్పటికి వేళ్ళ గుర్తులున్నాయేమోనని చూడసాగాను. అప్పుడే మిద్దెపై నుంచి దూకి ఆత్మహత్య చేసుకోవాలని అనిపించింది. నేను చేసిన తప్పుకు ప్రాయశ్చిత్తమే లేదా. పాతదాన్ని తుడిచివేయడానికి మరొకటి ఏది లేదా? భుజాలు ఆమెను బంధించాయి.

మేము ఎంతసేపు ఏడుస్తూ ఉండిపోయామో మాకే తెలియదు. నోట్లోంచి ఒక్కమాట రాగానే కాసేపు ఏడ్పు ఆపేవాళ్ళం. మళ్ళీ క్రొత్త ఆవేశంతో రోదించే వాళ్ళం. ఆవిడకు చాలా సేపటిదాకా తన స్పృహ లేదని నాకనిపించింది. అచేతన శరీరంలా ఆవిడ దేహాన్ని నా బాహువులతో ఎత్తి ఏదో కాలిపోతున్న ఇంట్లోంచి, కూలుతున్న గోడల రాళ్ళ కింది నుంచి బయటకు లాగి ఆవిడను తీసుకొస్తుంటే అక్కడక్కడా నా శరీరం, దుస్తులు కాలుతున్నట్టనిపించింది. చంద్రుడు మబ్బుల్లోకి వెళ్ళిపోగానే ఆకాశమంతా మసకబారింది.

ఆ రాత్రి సొంతం మేమిద్దరం ఒక క్షణం కూడా నిద్ర పోలేదు. ఒక్క మాట కూడ మాట్లాడలేదు, ఒక్క క్షణం కూడ పరస్పరం చూసుకోలేదు. ఏడాది పొడుగునా వ్యాపించిన దుమ్ము ఈ రోజే బయటికి వెళ్ళిపోతున్నట్టు అనిపించింది. కాస్సేపు కొంచెం విడిపోయి మళ్ళీ రెండింతల వేగంతో కౌగిలించుకునే వాళ్ళం.

కావ్, కావ్ కాకులు అరుస్తున్నాయి. పొద్దున్నే ఎవ్వరూ నిద్రలేవక ముందే ఆమె బయటికి వెళ్ళిపోయింది. వెళ్ళే ముందు మొఖం అటు తిప్పుకుని. ఇంత మాత్రం అంది. "నాకు ఒక పోస్టు కార్డు తెచ్చివ్వండి. చాలా రోజుల నుంచి అమ్మకు ఉత్తరం రాయాలని అనుకుంటున్నాను. కాని పైసలు లేక ఊరుకున్నాను." చీర కొంగుతో కళ్ళు తుడుచుకుంటూ ఆమె వెళ్ళిపోయింది. అప్పుడు వెంటనే గోడకేసి నా తలను బాదుకోవాలని అనిపించింది. అయ్యో ఈ వెలుగులో మేము ఒకరి మొఖాన్ని ఒకరం ఎలా చూసుకో గలం. బయట కిరణాల దారాలు నిలువు, అడ్డంగా నేస్తున్నట్టు పరుచున్నాయి.

# ఒకటి

ఆకాశం సొంతం నల్లరంగుతో, తూర్పు దిశన ఈ చివరి నుంచి ఆ చివర దాక విస్తరించిన ఊదా రంగు వెలుగు మెల్లిగా బంగారు కాంతిలోకి మారుతున్న ప్పుడు, మళ్ళీ అందులో దిక్కుల మధ్య భారీ మంచు తెరలను అటూ, ఇటూ జరిపేసి, ఒక జ్యోతిర్మయ ముఖం బయటికి తొంగి చూస్తున్నపుడు, గాలిలో తేలికైన చల్లదనం పెరుగుతున్నప్పుడు దగ్గరనే వున్న చెట్ల ఆకులు కదులు తున్నపుడు, మెల్లి మెల్లిగా నగరం మేల్కొంటున్నప్పుడు మా మిద్దె పిట్ట గోడ కానుకుని ఒక కాలును గోడపై పెట్టి ఆక్షణాన్ని చూస్తూ మనస్సులోని అనేక పొరలలో అదంతా అనుభవించడం ఎలాంటి ఆహ్లాదకరమైన అనుభవమో, నేను మొదటిసారి తెలుసుకున్నాను. సూర్యుడు మెల్లిమెల్లిగా ఎలా ఉదయిస్తాడో మొదటిసారే చూసాను. గోళాకారంలో వేగంగా బొంగరంలా తిరుగుతూ, లేస్తున్నట్టు ఒకసారి, మెలిమెల్లిగా అలలపై ఆడుతున్న బంతిలా మరోసారి అనిపిస్తుంది. ఒక్కొక్క వస్తువును చూస్తూ మనసులో ఎవరో అంటున్నారు. "అరే, సూర్యుడు ఉదయించక ముందు కిరణాలన్నో ఫౌంటెన్‌లోని నీటి ధారల్లా లేచి ఎదురుగా వున్న ఎత్తైన మూడంతస్తుల ఇంటి ఏరియల్ వెదురుబొంగును అన్నింటికంటె మొదలు స్పర్శిస్తాయని తెలియనే తెలియదు." నాకు కొత్త జ్ఞానం కలుగుతున్నట్టు ఎవరైనా నా పక్కన నిలుచుని ఉంటే, ఈ దృశ్యాల్ని చెబుతూ మెల్లిమెల్లిగా సూర్యోదయాన్ని చూపుతూ వుండేవాణ్ణి అని ప్రతిక్షణం అనిపిస్తున్నది.

అయితే నేనే నా జీవితంలో మొదటిసారి సూర్యోదయాన్ని చూస్తున్నట్టు అనిపించింది. ఆ రోజుల్లో ఏ చీకటి కొట్టాల్లో బందీనై వున్నానో అసలు నా చుట్టు పక్కల ఏం జరుగుతుందో చూసేవాడినే కాదు. ఇప్పుడు వెలుగులోకి రాగానే ఇన్ని రోజుల నుంచి చీకటి బందీగా వున్న భయంతో కళ్ళు తట్టుకోలేక పోతున్నాయి. నిజంగానే... వెలుగులో ప్రభతో నేను ఎలా మాట్లాడగలను, సూటిగా ఆమె మొహంలోకి ఎలా చూడగలను, ఆరోపిస్తు నిందించె ఆ కళ్ళను ఎలా ఎదుర్కోగలను, అందరితో ఎలా స్వేచ్ఛగా మాట్లాడగలను. బహుశా ఇప్పుడిక ఇంటి వాళ్ళందరు నాన్నగారు మొదలైన వాళ్ళంతా ఆనందిస్తారనుకుంటా. ఇప్పు డిక నన్ను డాక్టరుకు చూపించుకోమని పదిన సైగలతో చెప్పరు... అయితే ఏ సైగల వల్ల నా శరీరమంతా మండిపోయేదో,

ఇప్పుడు అదంతా జ్ఞాపకం చేసు కుని నాలో నేను చిరునవ్వుతో పులకించాను.

అంతకుముందే ప్రభ లేచి వెళ్ళిపోయింది. నేను ఆమె వైపు చూడలేదు. ఆమె కూడా నా వైపు సూటిగా చూడలేక పోయింది. ఆ తర్వాత నేను నెమ్మదిగా లేచి వచ్చేసాను. ఎంతో సేపు అలా నిలుచుని చూస్తూ ఉండిపోయాను. ఇప్పుడిక ఏం చేయాలో నాకు అర్థం కాలేదు. ఇంట్లో వాళ్ళు నన్ను చూడక ముందే నిశ్శబ్దంగా బయటికి వెళ్ళి పోవాలని అనుకున్నాను. ప్రభ పోస్టుకార్డు కావాలన్న సంగతి వెంటనే జ్ఞాపకం వచ్చింది.

రోడ్లపై మునిసిపల్ పనివాళ్ళు చెత్తనంతా నెట్టుతూ ఊడ్చేస్తున్నారు. సైకిళ్ళకు పాలడబ్బాలు కట్టుకుని పాలవాడు ఏదో తెరచిన తలుపు ముందు నిలుచున్నాడు. పిల్లవాణ్ణి చంకలో ఎత్తుకొని దుప్పటి కప్పుకుని ఎవరో ముసలి మహాశయుడు పాలకోసం పాత్రను ముందుకి చాచాడు. ఒకచోట నేను నిజంగానే వెనక్కి తిరిగి పాలవాడు పాలడబ్బాలో చెంబుముంచి పాలు తియ్యగానే అతని వేళ్ళవెంట లేదా చెంబుతో పాటు చుక్కలుగా పాలు ఎలా కారుతున్నాయో ఆసక్తిగా చూసాను. ఆ దృశ్యం నన్నెంతో ఆకట్టుకుంది. ఇంతకు పూర్వం అసలు ఇలా జరిగేదా అని అనిపించింది. దారి వెంట నడుస్తున్న ప్రతి మనిషి నా లోపల సుఖాల ఎన్ని శక్తివంతమైన ఫౌంటెన్లను నాలోనే బలవంతంగా అణచి పెట్టుకుని నడుస్తున్నానో అని వారికి తెలుసునని అనిపించింది. నాలోని ఈ అడ్డుకట్ట తెగిపోయి నేను ఒక వెర్రివాడిలా రోడ్లపై అరుస్తూ పరిగెడతానేమోనని ప్రతి క్షణం అనిపిస్తున్నది. "చూడండి, నేను చాలా సుఖంగా ఉన్నాను." నా ఈ ఆనందాన్ని ఎలా వ్యక్తం చేయాలో నాకు అర్థం కాలేదు. ప్రభ పరిస్థితి ఎలా ఉన్నదో ఊహించుకొని నా శరీరం సాంతం రోమాంచితమౌతున్నది. ఎండిపోయిన ఇసుకలో పడిన సారాయి చుక్కల్లా లోలోపల అణువణువునా వ్యాపించి భూమి సాంతం చెమ్మగిల్లినట్టు అనిపించింది. ఎంతో భీషణమైన వేడి మండిస్తున్న వడగాడ్పు వీచిన తర్వాత స్వచ్ఛందమైన శీతల శాంతిని యుగయుగాల దాహార్తిగా తాగేస్తున్నాను.

ఎన్నోసార్లు అరచి పెద్దగా పిలిచిన తర్వాత దివాకర్ మహానుభావుడు ఆవులిస్తు తలుపులోంచి మొఖాన్ని బయట పెట్టాడు. "ఏమిటీ రాత్రి పదకొండు గంటలకు వెళ్ళావు. అప్పుడే పొద్దునే ఏడు గంటలకే ప్రత్యక్షమయ్యావేమిటి?" అని లోపలి నుంచి ఎవరైనావస్తున్నారేమోనని చూసి వెకిలిస్తూ అన్నాడు. "నీ భార్య తల్లిగారింట్లో ఉంది. భార్యలున్న వాళ్ళ సుఖాల్ని చూసి

ఎందుకేడుస్తావ్?"

భార్య విషయమై హాస్య మాడగానే నా లోపల మనస్సు కితకితలాడింది. అప్పుడు అనాలనుకున్నాను. "ఏ పిచ్చోడి భార్య తల్లిగారింట్లో ఉంది?" కాని పైకి మాత్రం గంభీరంగా మొహం పెట్టి అడిగాను. "నీ ఉద్దేశ్యమేంటి? వెళ్ళి పొమ్మంటావా. బయటికి వచ్చి చూడు ఎంత పొద్దు పోయిందో."

"ఎవడి పని వాడు ఎలాగూ చేసుకుంటాడు. మేము మాత్రం ఇప్పుడే నీ కోడి కూతలు విని లేచాం. మొఖం కడుక్కొని వస్తాను. పరీక్షల్లో అంతగా రాపిడి జరిగాక కొంచెం విశ్రాంతి తీసుకోవద్దా. మహా ప్రభువులం. నీలాగ భగవంతుడికి చెప్పి పొద్దు పొడవక ముందే నాలుగు గంటలకే లేచి, లేచి లెవ్వగానే చల్లని నీళ్ళతో స్నానమాడగానే లోకాన్నంతా మేల్కొలుపుతానని నేను చెప్పుకు న్నానా." అతను డ్రాయింగ్ రూం తలుపులు తెరిచి అన్నాడు. "ఇక లోపలికి దయచేయండి స్వామీ."

"సరే నడు. ఇక దొరవారు అలంకరించుకోడానికి రెండు, రెండున్నర గంటలు పడుతుంది." నేను డ్రాయింగ్ రూంలోకి వెళ్ళి హాయిగా కూచున్నాను. "ఏమిటి ఈ రోజు మొహం బాగా మెరిసిపోతుంది. ఏమిటీ సంగతి ఫస్ట్ డివిజన్‌లో పాస్ అయ్యానని కలగన్నావా? వేకువ జామునే చూసిన కలలు నిజ మౌతాయి." అతను బద్ధకంగా ఆవులించాడు.

"మిత్రమా, ఈ పరీక్షల సంగతి గుర్తు చేయకు. నా ప్రాణం పోయినట్టు ఉంటుంది. ఇంతకూ పాస్ అవుతానో లేదో తెలియదు. నిజంగానే ఫెయిల్ అయిపోతే నేను చచ్చిపోడానికి కూడా చోటు ఉండదు." నిజం కూడా అంతే. పరీక్షలు, పరీక్షా ఫలితాల గురించి జ్ఞాపకం వచ్చినప్పుడల్లా మెదడులో మరోమాట ఉండేది కాదు. గుండె కొట్టుకునేది. ఏమవుతుందోనని భయం వేసేది. ఇప్పుడు ఒక్క ఊపుతో ఆ ఆలోచనలన్నీ దూరం నెట్టి అన్నాను. "వదిలేయ్ భాయ్, దాని గురించి మాట్లాడకు. ఏం జరుగుతుందో చూద్దాం. ఇప్పటి నుంచె ప్రాణాల మీదికి ఎందుకు తెచ్చుకోడం." అప్పుడు నాకే ఆశ్చర్యం వేసింది. భవిష్యత్తు పట్ల ఇలాంటి నిర్లక్ష్యం గతంలో నా మనస్సులో ఎప్పుడూ లేదు.

కాసేపు ఆగి దివాకర్ అన్నాడు "ఇప్పటికీ మా అమ్మగారు మొఖం మాడ్చు కునే ఉన్నారు, నువ్వే చెప్పు. భార్యతోపాటు సినిమాకు వెళ్ళిపోతే ఏమిటీ నష్టం? వీళ్ళధోరణి అసలు అర్థం కాదు. ఒక్క ఇంట్లోనైనా అత్త తన

కోడలి వల్ల సంతోషంగా ఉందని నేనెక్కడా వినలేదు. నలుగురు పిల్లలైనా అదే మాట. ఇద్దరు పిల్లల తల్లి అయినా అదే మాట. ఈ రోజుతో తగాదా చల్లబడాలని నేను కోరుకుంటున్నాను."

"అలానా ఇప్పటికి సాగుతూనే ఉందా?" ఆ వాక్యాన్ని అతనితో అన్నానన్న మాటే గాని అసలు నన్నే ప్రశ్నించుకున్న మాట. గోడకానుకొని ఒత్తి గిల్లి నిలుచున్న ప్రభ రెండోవైపు అమ్మా, వదినల చిత్రం కళ్ళ ముందు ప్రత్యక్షమై పోయింది. హఠాత్తుగా కళ్ళు చెమ్మగిల్లాయ్. తన నరనరాల్లోంచి రోది స్తున్న మున్నీ కేకలు నాకు వినపడుతూనే ఉన్నాయి. "అన్నయ్య వదినతో మాట్లాడు." మొదట్లో ఈ చప్పుడును నేను విని రెండో చెవిలోంచి వదిలేసాను. కాని ఈ క్షణాల నా లోపల్నించి వస్తున్న ఆ చప్పుడుకు ప్రతిధ్వనికి నా అస్తిత్వపు అణువణువు మార్మోగింది. మున్నీతో దెబ్బతిని ఆమె చెవిలో ఆనంద విహ్వలమైన వాణిలో కూ కూ అంటూ, "చూడు మున్నీ, నేను మాట్లాడాను. మీ వదినతో నేను మాట్లాడాను." కాని మున్నీ ఇప్పుడెక్కడుంది. ఆమెను ఆ గొయ్యిలోకి నెట్టేసి నోటిపై రాయిని దొర్లించేసాం. మున్నీ నా లోలోపల తన విముక్తికై తటపటాయిస్తున్నదని నాకు అనిపిస్తున్నది. ఆమె నన్ను ఒక గొయ్యిలోంచి బయటికి లాగి తాను స్వయంగా ఆ గొయ్యిలోనే పడిపోయింది. అయ్యో ఒకవేళ కాస్త ముందు నన్ను బయటికి లాగి ఉంటే నేను ఆమెను ఆనరకంలోకి ఎప్పటికి వెళ్ళనిచ్చే వాడ్ని కాదు.

దివాకర్ చెప్పిన ఏదో మాటకు నేను ఉలిక్కిపడ్డాను. నేనేం ఆలోచిస్తు న్నానో ఇతను పసిగట్టిలేదు కదా! అసలు నేను మాట్లాడుతూ మాట్లాడుతూనే ఆలోచించడం నాకున్న చెడు అలవాటు. దివాకర్ అంటున్నాడు. "సమర్ రేపు మా పెదనాన్న కొడుకు వస్తున్నాడు. ఈ రోజే మా అమ్మగారి కోపం చల్లారిపోతే మంచిది. కిందటిసారి వచ్చినపుడు నేను ఆయన్ని పరిచయం చేయలేకపోయాను. అబ్బో ఆయన ఎంత తిరిగాడని, ఏ నగరాన్ని వదలలేదు. కాని మిత్రమా నీ ఈ పిలక మాత్రం కత్తిరించి వచ్చేయ్. ఆయన నీ పిలకను చూసి హాస్యమాడితె నీకు కోపం రావచ్చు. ఆయన కాస్త అలాంటివాడే. ఈ నటనలు, వేషాలు ఆయనకు నచ్చవు."

"నటనేమిటి? ఎవరి నమ్మకం వారిది" నేను వాదనను పొడిగించ దలుచుకోలేదు.

"అచ్ఛా, నువ్వేమో ఏడిగా వెదుతున్నావని, మరి హిందుత్వపు జెండా

విడిగా ఎగురుతున్నదని నీ నమ్మకమా? ఈ పిలక ఉపయోగం ఉండనుకో! ఎవడితోనైనా కొట్లాడితే అలా ఎగిరి మొదట వాడి పిలక పట్టుకుంటే చాలు. ఆ మనిషి అస్సలు కదల లేడు. ఏమీ చేయలేడు కూడా. హాఁ, పరీక్షల రోజుల్లో దీన్ని చిలక్కొయ్యకు కట్టి చదువుకోవచ్చు కూడాను." అతను స్వయంగా నవ్వేసాడు.

"నువ్వు తాగుడూ, తిండితో భోగ విలాసాల్లో మత్తుగా ఉండే జీవివి! నీకేం తెలుసు. విశ్వాసం, ఆత్మకు సంబంధించిన ఆనందం?"

"నీ ఇష్టమున్నట్టూ అను, కానీ సమర్ బాబూ లోకంలో అంతకంటె ఏం వుందని? అప్పుడప్పుడు మేం కూడా మీ దేవాలయాల్లోకి వచ్చేస్తాం. అక్కడికి వచ్చే వస్తువులన్ని చాలా ప్రత్యేకమైనవి. అదే జరుగుతూ వచ్చింది. దాని చుట్టూ ఎలాంటి పదాల గారడీనైనా అల్లుకోవచ్చు."

నా కప్పుడు దేవాలయానికి వెళ్ళకుండా ఎన్ని యుగాలు గడిచిపోయాయో అనిపించింది. అయినా గంభీరంగా అన్నాను. "చూడు, దివాకర్, ఇది మన విశ్వాసాల సంగతి. ప్రతి దేశంలో దుస్తులు, జీవన విధానం, లేదా భావాలతో కూడిన ఒక సంస్కృతి వుంటుంది. మనం మన సంస్కృతిని అధ్యయనం చెయ్యం. ఇలాంటి వాళ్ళ మూలంగానే ఈ దేశ పరిస్థితి ఈ విధంగా ఉంది. మనం పతితులమైపోతున్నాము. మన వాటి గురించి, మన దేవీదేవతలను అపహాస్యం చేస్తూ ప్రతీ విదేశీ వస్తువు వెనకా పరిగెడుతూ వుంటాం." నేనెప్పుడైతె నా వాదనను ప్రారంభించానో ఎంతో దీర్ఘంగా ఆకట్టుకునే ప్రసంగం చేసి అతనికి నచ్చజెప్పాలనే ధ్యాస నాకు ఉంది, కాని మధ్యలోనే అకస్మాత్తుగా నాకు ఆనాడు ఇంట్లో గణపతిని మట్టి ముద్ద అనుకొని పాత్రలు తోమిన సంఘటన జ్ఞాపకం వచ్చింది. ప్రభ మంచిపనే చేసిందని నేను ఇప్పటికి ఒప్పుకోను. కానీ ఆ రోజు నేను ప్రవర్తించిన తీరు ఎంతో ఘోరమైనదని ఒక విధంగా అమానుషమైనదని ఆనాటి నుంచి అది నన్ను తెలియకుండానే లోలోన రంపపు కోత పెడుతున్నది. అప్పుడే ఒక క్షణం నాకు ఇలా అనిపించింది ఈ రోజు ప్రభ నేను ప్రవర్తించిన తీరు గురించి సంజాయిషి అడిగితే నేను చేసిన పని గురించి ఏమని సంజాయిషి ఇవ్వగలను? బహుశా నా దగ్గర నిజం చెప్పాలంటె నేను చేసిన ఎన్నో పనులకు ఎలాంటి సంజాయిషీ లేదు.

దివాకర్ ఆవేశంలో అన్నాడు. "దేశీ, విదేశీ వ్యవహారమేంటో నాకు తెలియదు. కాని దేశీ లక్షణమని కార్టూన్‌లా మొఖం తయారుచేసుకోడం

నాకు ఇష్టం వుండదు. నా మాటలకు కోపం తెచ్చుకోవద్దు. నేనొక మాట అడుగుతాను - అలా పైకి ఇస్త్రీ చేయని ప్యాంటూ, మురికిగా ముడతలు పడిన షర్టూ, లేదా ఇంగ్లీషు పద్ధతిలో చేసుకున్న కటింగ్ మధ్య బొంగరంలా వేలాడుతూ ముడేసు కున్న పిలక. ఒక వేళ ఇదే దేశీ లక్షణమైతే దానికి నేను దూరం నుంచే నమస్కరిస్తాను. ఒక వేళ ఈ దేశంలోనే మనిషి కాస్త లక్షణంగా బాగా ఉండాలంటే అది విదేశీ పద్ధతి ఎలా అవుతుందో నాకు చెబుతావా! అసలు అదేమీ అక్కరలేదను కుంటే తలపై మెషిన్‌ను తిప్పి గుండు కొట్టించేసి, ముదురు ఖాదీ, ధోవతీ కుర్తా వేసుకో, అప్పుడు గాలివీస్తున్నప్పుడల్లా నీ కళ్ళమధ్య ఉన్న ధోవతి స్వాతంత్ర్య దినోత్సవం నాటి జెండాలా ఎగురుతూ పోతుంటె నువ్వు దానిని సంభాలించు కుంటూదాని వెనకాలే పరిగెత్తవచ్చు."

నా మొఖం ఎర్రబడి పోయింది. నన్ను ఇలానే దివాకర్ చాలాసార్లు వెక్కిరించినా ప్రతిసారి ఇదంతా వ్యక్తిగతమైన అభిరుచి, విశ్వాసం అని తప్పించు కునే వాడిని. అప్పుడప్పుడు ఎన్నో రోజులు మాట్లాడేవాణ్ణే కాదు. అసలు నా దగ్గర ఈ దుస్తులు తప్ప ఇంకొటి లేవని ఈ మూర్ఖుడికి ఎలా నచ్చచెప్పను. నాకు చిరిగిన మాసికలు వేసుకున్న చీరతో ప్రభ మనసులో మెదిలింది. ఎప్పుడైతె ప్రభ మొఖం నా ముందుకు వచ్చిందో నేను దివాకర్ వాగుడును మరిచి పోయి ఇలా అన్నాను. "సరే, సరేరా బాబు ఇక చాలు. ఇదేమైనా కాలేజీలో డిబేట్ అనుకున్నావా. పొద్దున్నే నా మూడ్ పాడుచేయకు."

"కాని మరి ఇలా అకస్మాత్తుగా నీలో వచ్చిన ఈ ఆనందమైన మూడ్‌కు కారణమేమిటో చెబుతావా?"

నా పెదాల దాక మాటవచ్చింది. అణచుకుని అన్నాను "వూరికెనే పెద్ద విశేషమేమీ లేదు. సరే నువ్వెళ్ళి స్నానం చేయ్. నేను వెడతాను. కొన్ని ముఖ్య మైన ఉత్తరాలు రాయలి వెంటనే నాలుగైదు పోస్టు కార్డులివ్వు." వెంటనే నా శరీరం సొంతం ఒణికిపోయింది. ప్రభ నన్ను పోస్టు కార్డు అడిగిన తీరు జ్ఞాపకం వచ్చింది.

"ఉత్తరాలు ఎవరెవరికి రాస్తున్నావో నాకు కూడా చెప్పు. నా రోల్ నంబర్‌ను కూడా గుర్తు పెట్టుకో. మన ఆన్సర్ షీట్స్ ఎవరి దగ్గరికి వెళ్ళాయో?" దివాకర్ నవ్వాడు. ఆ తర్వాత గంభీరంగానే అన్నాడు "మిత్రమా, ఎక్కడో తెలుసుకుని బయలుదేరితే సరి. ఆ దిగ్విజయ యాత్ర కోసం చాలా మంది

కు(రాళ్ళు బయలుదేరినట్లు విన్నాను. జీవితంలో ఎవరినైతె ఎప్పుడు కలుసుకోలేదో అలాంటి వాళ్ళ దగ్గర బైఠాయించి ఎంతో గర్వంగా పని చేయించు కుంటారని విన్నాను. ఈసారి అటూ, ఇటూ ఏదైనా చేయగలిగితేనే ప్రాణాలు దక్కుతాయి." అతని నుదురుపై చింతాపూరితమైన ముడతలు ఉబికాయి.

అతని ముఖం చూసి పరీక్ష ప్యాస్ అవుతామో లేదోననే సందేహంతో గుండె కొట్టుకుంటున్నది. నేను మళ్ళీ నాలో నేను తప్పిపోయి ఆలోచిస్తున్నాను. నేను ఫెయిల్ అయితే జరిగే ప్రతిక్రియ ఏమిటి? దివాకర్‌ని ఉద్దేశించి అడిగాను "తర్వాత ఏం చేయాలని ఆలోచిస్తున్నావ్? థర్డ్ ఇయర్ జాయిన్ అవుతావా లేక మరో లైన్‌లోకి వెళ్ళిపోతావా?"

"అరే మిత్రమా, మొదట పాస్ అవుతే అప్పుడు ఆలోచిద్దాం. ఒకవేళ ఫెయిల్ అయిపోతే మరో సంవత్సరం రాపిడి జరుగుతుంది. ప్రతిరోజూ దేవాలయానికి వెళ్ళి చేసుకున్న దర్శనం లోకంలో వున్నన్ని మంచి శకునాలు, నిష్ప్రయోజనం అయిపోతాయి. నువ్వైతే ఫస్ట్ డివిజన్‌లో వచ్చేస్తావు. నీకేమిటి చింత. అసలు బాధంతా మాది."

నా పట్ల దివాకర్‌కు వున్న ఈ అభిప్రాయం విని ఆనందం కలిగింది. కాని నా లోపలి ఉత్సాహాన్ని అణచిపెడుతూ అన్నాను "ఎట్లోపోనీ ఆ ఫస్ట్ డివిజన్, ఏదో పాసైపోతే వెళ్ళి ఆంజనేయస్వామికి రూపాయి పావలా ప్రసాదం సమర్పించుకుంటాను." నేను ఫస్ట్ డివిజన్‌లో వస్తానని పూర్తి నమ్మకముంది. ఒక వేళ ఇంటివాళ్ళ సహకారమే వుండివుంటె ఫస్ట్ డివిజన్ ఏమిటో చూపించేవాణ్ణి.

"అలానా, ఇక ఫోజు కొట్టడం మానేయ్! ఇక ముందు ఏం చేయదలుచుకున్నావో చెప్పు. మా నాన్నగారేమో ఇక ముందు పెద్ద ఒరిగేదేమీ వుండదని, వయస్సులో వుండగానే పోలీసు ఇన్‌స్పెక్టరుగా చేరిపొమ్మని నా వెంట పడుతున్నారు. ఆ ఉద్యోగంలో ఉండే పరపతి, దాని ద్వారా ఎంతో పై సంపాదన. కాని, సమర్ నాకు ఆ పోలీసు ఉద్యోగం పట్ల అసలు కోరికే లేదు. ఎక్కడెక్కడని తిరగగలం. ఎక్కడో మారుమూల గ్రామంలోనో, నగరంలోనో కూలేస్తే మనిషి మొఖం చూడాలన్నా దొరకదు. కిరణ్ ఏడ్చి ఏడ్చి పుణ్యానికి చస్తుంది." గాఢంగా శ్వాస పీల్చి దివాకర్ మళ్ళీ అన్నాడు "ఇక ఈ పై సంపాదన విషయానికొస్తే నాన్నగారిప్పటికి తమ కాలంనాటి విషయమే ఆలోచిస్తున్నారు."

దివాకర్ మాట నన్ను ఆకట్టుకుంది. అయినా మళ్ళీ అన్నాను "నీకొచ్చిన కష్టమేమిటిలే, కష్టాలన్నీ నా ముంగిట్లో ఉన్నాయి. ఇంతకూ ఏం చేయాలో

అర్థం కావడం లేదు. చదువైతే మొత్తం ఆగిపోయిందనుకో. ఎక్కడైనా యాభై రూపాయల ఉద్యోగం దొరికితే ఏదోలా గడిచిపోతుంది."

"మూర్ఖుడివా? విను. ఇవన్నీ బావిలోకి పోనీ. నా మాట విను. మనమిద్దరం థర్డ్ ఇయర్ జాయన్ అవుతున్నాం." దివాకర్ ఓదార్చే కంఠంతో అన్నాడు.

"లేదు, దివాకర్. మన పరిమితులను బట్టి ఏదైనా ఆలోచించాలి. మాయింటి పరిస్థితులేమో అనుకూలంగా లేవు. ఈసారి తప్పక ఏదో ఒకటి చేయాలి. ఇక ముందు ఏదో విధంగా గడిచిపోతుందనే నమ్మకం లేదు. నేనైతే ఇప్పుడే ఏదైనా పని దొరికితే చేరిపోవాలని వెతుకుతున్నాను. నువ్వేమైనా చేయగలితే చూపించు." నాకు అన్నగారి మాట జ్ఞాపకం వచ్చింది.

"నేను కూడా అదే అంటున్నాను. మహాశయా, నువ్వు అనుకుంటున్న మాటల్లో ఏమి లేదు. మంచి డిగ్రీ ఉందనుకో మంచి ఉద్యోగం దొరుకుతుంది. లేదంటావా ఏదో షావుకారు దగ్గర నలభై రూపాయల జీతానికి గుమాస్తాగా ఉండాల్సిందే. ఇంటర్ పాసైన వాళ్ళని ఎవరూ అడగరు."

ఆ తర్కం ముందు నేను ఏ మాత్రం మాట్లాడలేక పోయాను. నిజమే నాకు ఎవరు ఉద్యోగం ఇస్తారు? ఈ యధార్థ రూపాన్ని చూసి నేను భయపడి పోయాను. ఏదో. తప్పించుకోవాలని అన్నాను. "సరే పోనీలే మిత్రమా, మొదలు రిజల్ట్సు రానివ్వు." అప్పుడు నేను లేచి నిలబడ్డాను. ప్రతిరోజూ నా నౌకరీ కోసం అతన్ని ఎందుకు వేధించను. ఒకవేళ ఉద్యోగమే ఉంటే అతను చూపించడా? డ్రాయింగ్ రూంలోంచి బయటికి వస్తూ అన్నాను "నువ్వెళ్ళి స్నానంచేయ్. అప్పుడే మళ్ళీ జ్ఞాపకం వచ్చింది ఇంతకూ ఆ పోస్ట్ కార్డులేవి..."

"మేమైతే హోళీకు, దీపావళికో స్నానం చేస్తాము మిత్రమా" అంటూ అతను పోస్ట్ కార్డుల కోసం లోపలికి వెళ్ళిపోయాడు. ఇతనికి చింతల లోటే లేదు. అయినా ఎంతో హాయిగా వుంటాడు. కేవలం ఒక పోస్ట్ కార్డు అడగాలంటే సిగ్గేసింది. అందువల్ల నాలుగైదు అడిగేసాను. పోస్టుకార్డులు తీసుకుని అన్నాను. "వీటిని తిరిగి ఇచ్చేస్తాను."

"అవునూ, ఇంతకు వీటిని తిరిగి ఇస్తాసంటున్నావ్ ఆ మాటేదో రాసుకోడానికి రసీదు కాగితం తీసుకురాలేదే నేను." అప్పుడు అతనే నవ్వి "అది సరే ఇప్పుడైనా చెప్పు ఈ రోజు ఇంత సంతోషంగా ఎందుకున్నావ్?"

ఈసారి నేను నిజంగానే మనస్ఫూర్తిగా నవ్వేసాను. బయటికి వస్తూనే అన్నాను "ప్రభ వచ్చేసింది..." ఆపి తిరిగి వచ్చేసాను.

"అదా సంగతి..." నా వెనకాలే దివాకర్ అరుపు వినపడింది.

అయితే ఏ సంకోచం వల్లనైతె నేను ఉదయం నుంచి అలా ముఖం తప్పించుకుంటూ తిరుగుతున్నానో అది సాయంత్రానికి దూరమై పోయింది. నా మొఖంపై తెలియని ఒక దృఢత్వం వచ్చేసింది. అవును, నేను నా భార్యతో మాట్లాడాను. ఇందులో ఎవరిదేం పోయింది. నాపై నాకే చిరాకు వేసింది. ఇందులో సంకోచం సిగ్గు పడవలసిన అవసరమేముంది.

దివాకర్ దగ్గరి నుంచి రాగానే మనస్సులో చక్కెర పాకం కరుగుతున్నట్టు ఉంది. ఎన్నో ఏళ్ళ తర్వాత మనస్సు తేలికపడింది. ఎన్నో సంవత్సరాల తర్వాత జైలు నుంచి బయట పడినట్టు ఉంది. ఒక విచిత్రమైన జాలితో మనస్సంతా ద్రవించి పోతున్నది. పాపం ప్రభ ఎన్ని యాతనలు అనుభవించింది ఈ మధ్య. ఈ ఇంట్లో ఆమె పట్ల సానుభూతితో వున్నది ఒక్క మున్ని తప్ప ఇంకెవరూ లేరు. చివరికి ఇంట్లో ఎవరితోను ఒక్క పోస్ట్ కార్డు కూడా అడగాలనే ధైర్యం లేకపోవడం ఎంత శోచనీయం. అన్నింటిని మించి నాకు వదినపైన ఆశ్చర్యం వేస్తున్నది. ఇప్పటి నుంచే ఆవిడ ధోరణి ఇలా ఉంటే రేపు నిజంగానే అత్తగారై పోయినపుడు ఎన్ని యాతనలు పెడుతుందో? ఆవిడ కూడ ప్రభలా ఒక కోడలనే విషయం బొత్తిగా మర్చిపోయింది. ఆమె రెచ్చగొట్టగానే నేను ప్రవర్తించిన తీరు సిగ్గుతో తలవంచుకునేలా చేసింది.

అటూ, ఇటూ తిరిగి నేను ఇంటికి వెళ్ళే సరికి మధ్యాహ్నం రెండు అయిపోయింది. కొళాయి దగ్గర నిలుచుని నాన్నగారు నీటి ధార కింద ఒక కాలుకు మరో కాలుతో బాగా రాస్తు కడుగుతున్నారు. నన్ను చూడగానే అన్నారు. "దొరగారు పనిలేకుండా ఎక్కడ తిరిగి వస్తున్నారు. కనీసం భోజనం ధ్యాస కూడా లేదు."

నాకేమీ బాగా అనిపించలేదు. ప్రభ విని ఉంటె ఏమనుకుంటుంది? నాకు తెలుసు మొత్తం మీద అటూ, ఇటూ తిరిగి నేనేమీ చేయడం లేదనే విషయానికే వస్తుందని. అందుకే నాన్నగారికి కనపడాలంటె కొంచం భయంగానే ఉంది. ఢగ్గుత్తికతో అన్నాను "దివాకర్ దగ్గరికి వెళ్ళాను. నా ఉద్యోగ విషయమే మాట్లాడుతుంటె ఆలస్యమై పోయింది."

వెంటనే నాన్నగారి స్వరం మెత్తబడింది "అవును, ఏదైనా చేయాలి అబ్బాయ్! లేకపోతే ఎలా గడుస్తుంది చెప్పు."

లోపలికి రాగానే అమ్మ ఎదురైంది "ఇప్పుడు చదువు లేదుకదా,

అయినా దినమంతా తిరగడమేనా. పగలు రెండు గంటలై పోయింది. ఇదేనా భోంచేసే టైము. రాత్రికి కూడ మరి ఎన్ని గంటలకు వచ్చావో."

పిల్లిలా, మెల్లిగా వంట గదిలోకి వచ్చేసాను. నిశ్శబ్దంగా పీట లాక్కుని కూచున్నాను. ప్రభ భోజనం ముందు పెట్టగానే ఒక్కసారి ఉలిక్కిపడ్డాను. తెలియనట్టు తలెత్తి చూసాను. శుభ్రంగా ఉన్న ఆమె ముఖంపై ఒక విచిత్రమైన నిగ్రహంతో కూడిన గాంభీర్యం ఉంది. కనురెప్పలు వాలి ఉన్నాయ్. పెదాలపై మందహాసం దోబూచులాడుతోంది. ముఖం వాడిపోయినప్పటికి ఈ రోజు ఒక విచిత్రమైన సంతోషపు కాంతితో వెలుగుతోంది. ఎన్నో సంవత్సరాల తర్వాత అద్దంపై ఉన్న దుమ్మును తుడిచినట్టనిపించింది. ఆ అద్దాన్ని అలానే చూస్తూ, చూస్తూ వుండిపోవాలని అనిపించింది. మనస్సులో ఆవిడతో మాట్లాడాలనే కోరిక తీవ్రంగా వున్నా ఏం మాట్లాడాలో అర్థం కాలేదు. ఎప్పటి నుంచో ప్రభ మాటలను వినాలని తపిస్తున్నాను. బహుశా ఎప్పుడూ సరిగ్గా వినలేదు కూడాను. అయినా ఆవిడ కంఠాన్ని ఎలా గుర్తు పట్టగలను? ఆవిడ ఎప్పుడైనా మాట్లాడు తుందా? అనే ధ్యాస కూడా నాకు లేదు. ఎంతసేపూ అలా మౌనంగా భావరహితమైన ముఖంతో పనిచేస్తూవెళ్ళేది.

అన్నం పెట్టి వెడుతుంటే చూసాను ఎంత మురికి చీరెను కట్టుకుందో! ఎటు చూసినా చిరిగిపోయి, మాసికలతో వుంది. అది కట్టుకోదగిన చీరేనా? ఇదే ఎందుకు కట్టాలి? మరో చీర లేదా? వివాహంలో పెట్టిన చీరలు అన్నీ ఎక్కడున్నాయి? ఈసారి రాగానే ఇవ్వన్నీ అడుగుతాను. నేనెలాగు ఆవిడను పట్టించుకునే లేదు. చివరికి అమ్మ కూడా తన చిన్న కోడలికి ఏమైనా అవసర మనేది వుంటుందనే విషయాన్ని ఆలోచించలేదు! ఆమే ప్రభకు తల్లిలాంటిది. ఇంత పక్షపాతం వహించవలసింది కాదు. వదినకు అమ్మాయి ఏం పుట్టిందో కాని రాజ్యమేలే ఆదేశం లభించినట్టుంది. తరచుగా ఆమె గదికే భోజనం పంపిస్తారు. అమ్మ కన్ను కప్పి అయిదారు చీరెలు వదిన తన దగ్గరే పెట్టుకుందని నాకు తెలుసు. అయినా ఆవిడెందుకు ఇస్తుంది. చివరికి, జనవరి, ఫిబ్రవరి లాంటి భీషణమైన చలిలో కూడా ఇలాంటి చిరిగిన చీరలతోనే గడిపేయడం జ్ఞాపకం చేసుకుంటూ ఉంటే నా రోమాలన్ని వణికిపోతున్నాయి. పాపం ఆ రోజుల్లో ఆవిడ ఎంత బాధ పడిందో ఎవరూ సహాయపడే వారు ను. తన అవసరాలు చెప్పుకోలేకపోయేది ఎవరితోను మాట్లాడలేక పోయేది కూడా... చెయ్యినైనా బయట పెట్టడానికి వీలుండని ఆ భీషణమైన చలిని

ఎలా భరించిందో!

నా కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి. ప్రభ వంట గదిలోనే ఆ పిట్టగోడ వెనకాల కూచుని వుంది. ఈ రోజు ఇన్ని దినాల తర్వాత పెళ్ళి నాటి ఆ సంఘటన జ్ఞాపకం వచ్చింది. ఆమె ఇలానే వంటగదిలో కూర్చుని వుండగా, ఈ మాత్రమే చెయ్యి బయట కనపడుతుండగా నేను పళ్ళాన్ని తన్నేసి గబగబా వెళ్ళిపోయాను. ఆ రోజు ఇదే చేతికి నల్లని సన్నని స్ట్రాప్‌తో కట్టుకున్న చిన్న రిస్టు వాచ్ ఎర్రని మణికట్టుపై ఎంతగా ఆకట్టుకుందో. ఈ రోజు చూస్తుంటె స్తబ్ధుణ్ణి అయిపోయాను. ఆ రోజు నేను పట్టించుకోలేదు. కాని ఆ నాటి చెయ్యి యధావిధిగా జ్ఞాపకం వచ్చేసింది. వంటపాత్రలు కడిగి, ఇంటి పనంతా చేయడం వల్ల చర్మం నల్లబడింది. ఇంకా వాడిపోయి ఎముకపై సన్నని చర్మాన్ని బిగించి కట్టినట్టు అనిపించింది, నా చూపు ఆమె పాదాలవైపు మళ్ళింది. మురికి పేరుకుపోయి పట్టించుకునే ధ్యాస లేక రెండు పాదాల వేళ్ళు నల్లబడి పోయాయి. మడిమల దగ్గర పగుళ్ళు తొంగి చూస్తున్నాయి. ఎంత ఆమోద ప్రమోదాలతో, ఆశలు ఆకాంక్షలతో పెరిగిన ఈ అమ్మాయిని మేళతాళాల మధ్య మా యింటికి తీసుకువచ్చారు. మరి ఇప్పుడో...

పళ్ళాన్ని, ప్రభ బాధ పడకుండా ఉండాలని అతి మెల్లగా పక్కకు జరిపి నేను లేచి నిలుచున్నాను, ప్రభ కంగారుగా పైకి తలెత్తి ఉత్సుకతతో నా వైపు చూసింది. చూస్తున్న అదే రాత్రినాటి తీరు మెరుపులా మెరిసింది. ఆహా. ఆమె కళ్ళు నిశ్చలంగా అమాయకంగా ఎంతో పెద్దగా ఉన్నాయి. కాని వాటి చుట్టు నల్లని గీతలు ఏర్పడి వున్నాయి. నేను ఆ నల్లని వలయాలతో పాటు ప్రభ మొఖాన్ని చుడగానే ఎంతో భయంకరమనిపించి వెంటనే తిప్పేసుకున్నాను. తత్తరపడుతూ ఆమె స్వరం వినపడింది. "ఏమైంది?"

అకారణంగానే నా గుండెలో ఏదో మెలి తిప్పినట్టు అనిపించింది. ఏ మాత్రం మాట్లాడినా ఏడుపు వచ్చేట్టు ఉంది. ఎలాగోలా నా కింది పెదవిని అదిమి పట్టి ఎంతో కష్టం మీద అన్నాను "దివాకర్ దగ్గరే తిని వచ్చాను. ఆకలిగా లేదు" వెంటనే బయటికి నడిచాను.

అమ్మ బయట నిశ్శబ్దంగా కూర్చుని ఏదో ఆధ్యాత్మిక గ్రంధాన్ని తన లావాటి కళ్ళద్దాలతో చదువుతున్నది. నా గదిలోకి వెళ్ళాలని మెట్లు ఎక్కుతున్నాను. మెట్లమీంచి పైకి వెళ్ళగానే ఎదురుగా తెరుచుకున్న కిటికీ కనపడుతున్నది. అది పదిన గది. అప్పుడే కంఠం విని ఆగిపోయాను. ఆమె

చెబుతున్నది. వాళ్ళిద్దరు ఒకరితో ఒకరు మాట్లాడేస్తున్నారు.

"ఎవరూ? అన్నయ్య మాట వినపడింది. ఈ రోజు ఆదివారమనే సంగతి గుర్తుకొచ్చింది."

"సమర్ లాలాజీ, చిన్న కోడలితో" ఆమె కంఠంలో ఒక తేలికైన వ్యంగ్యం నాకు ధ్వనించింది.

"అలానా" అన్నయ్య కూడా ఉలిక్కిపడి అన్నాడు. పడుకున్నవాడు మరో వైపు తిరిగి అడుగుతున్నట్టు అనిపించింది. "నీకెలా తెలుసు?"

"భోజనాల తర్వాత యాలకుల కోసం వచ్చిన కువర్ లాలాజీ చెప్పగా విన్నాను."

ఆ మాటలు సొంతం నిలకుండానే నా గదిలోకి పరిగెత్తుకు వచ్చాను. తలుపులు మూసుకుని నా పక్కమీద బోర్లా పడుకుని రోదించసాగాను.

సాయంత్రం మళ్ళీ నేరస్థుడిలా బయటికి వచ్చేసి ఒక గమ్యం లేకుండా అలా ఉండిపోయాను. ఉదయాన్నే ఆవరించిన ఆనందపు మత్తు దిగిపోయింది. ఒక ధిక్కార భావము ఏవగింపు నిరంతరంగా మనస్సును పొడుస్తూవుంది. ఆ అంతర్యామి ఎదుట మాటిమాటికి వేడుకున్నాను. "ఓ భగవతుడా నన్ను దండించు, నేను ఒక అమాయకురాలైన అబలను ఘోరంగా హింసించాను. ఆమెను నరక యాతనలు పెడుతున్నా నేను మౌనంగా చూస్తూఉండిపోయాను. నా కళ్ళు ఏమై పోయాయి. అది సరే నెనైతె కుర్రాణ్ణి. మరి అమ్మా, నాన్నలకు ఏమైంది?"

ఆ తర్వాత ప్రాయశ్చిత్త భావన నన్ను దేవాలయంలోకి లాక్కెళ్ళింది. అక్కడ నేను శూన్యమైన కళ్ళతో ఎగాదిగా చూస్తు వుండిపోయాను. ఏదో ఒక యుగం తర్వాత విదేశాల నుంచి వచ్చినట్టు నేను ప్రతి వస్తువును విశ్లేషిస్తున్నాను. నా వెనుకాల ఎన్ని సంఘటనలు జరిగిపోయాయో గమనిస్తున్నాను. ఈ ప్రాయశ్చిత్తము, జాలిగా వుండాలనే భావన ప్రతి వస్తువును కొత్త రకంగా చూడాలనే ప్రక్రియతో పాటు, మనస్సులోని అనేక పొరలపై రాత్రి కోసం ఒక వ్యాకుల మైన నిరీక్షణ కూడా సాగుతున్నది. ఆఖరికి ఎటూ పాలుపోక తిరిగివచ్చేసాను.

ఈలోగా నా పట్ల మా ఇంట్లో అందరి దృష్టి మారిపోయిందని గమనించాను. ప్రభ వంట గదిలో ఉంది. అమ్మ దగ్గర కూర్చున్న వదిన ఏదో గుసగుస లాడుతున్నది. ఇంట్లోకి అడుగు పెట్టగానే నేనూ, ప్రభ పరస్పరం మాట్లాడుతున్నా

మనే విషయం ఇల్లంతా వ్యాపించి పోయిందని తెలుసుకున్నాను. నేనేదో జూ నుంచి తప్పించుకుని వచ్చిన జంతువులా అందరూ చూస్తున్నారు. ఇంట్లో అందరికి ఆ విషయం తెలియగానే ఎంతగా సిగ్గుపడవలసివస్తుందో, అందరి చూపుల్ని ఎలా ఎదుర్కోగలనోనని నేను అప్పటి నుంచీ ఆలోచిస్తున్నాను. కాని గుచ్చుకుంటున్న ఆ చూపుల్ని చూసి నా లోపల ఒక విచిత్రమైన చిరాకు నిండి పోయింది. ఒక వేళ నేను ప్రభతో మాట్లాడినంత మాత్రాన అది చర్చనీయాంశము కావలసిన విషయమా అని అనిపించింది. డోలు వాయించి దానికింత గొడవ చేయలా? భార్యభర్తలు నిన్నటి దాక మాట్లాడలేదు. ఈ రోజు మాట్లాడితే మరొకరు ఇందులో ఎందుకు ఆసక్తి చూపించాలి.

నలువైపుల వున్న వాతావరణాన్ని ఉపేక్షిస్తు అసలు నా జీవితంలో ఏ కొత్త దనమూ లేదా ముఖ్యమైన పరిణామం రాలేదన్నట్టు వ్యవహరించే ప్రయత్నం చేస్తున్నాను. నేను భోంచేసి రాగానే అమ్మ అన్నది. "ఒరే సమర్, మీ నాన్నగారిని పిలువ్ ఆయన కూడా వేడి వేడిగా తినేస్తారు. భోజనం చల్లబడిపోతుంది."

"ఎక్కడికి వెళ్ళారు?" నేను అడిగాను.

పాపను తిప్పుకొస్తానని వెళ్ళారు. నవల్‌కిశోర్ పండిత్ జీ ఇంట్లో కూచున్నారేమో. పాపకూడా ఏమి తినలేదు.

నాకు ఆ మాటపై కోపం వచ్చింది. నేనేదో కాదంటానన్నట్టు అమ్మ చెబు తున్నది. మళ్ళీ కోప్పడే నా స్వభావంపై నవ్వు వచ్చింది. నాకు అసలు ఏమై పోయింది? నాన్నగారు కుర్చీపై రెండు కాళ్ళు ముడుచుకుని హాయిగా కూర్చున్నారు. ఎప్పుడూ జబ్బుగా ఉండే నవల్‌కిశోర్ ఆయన వైపు తిరిగి వింటున్నారు. ఆ వాడలోని మరో ఇద్దరు, ముగ్గురు అక్కడే కూచుని శ్రద్ధగా వింటున్నారు. నాన్నగారు అనేక సార్లు చేసిన ప్రసంగమే సరిగ్గా ఆ పదాల్లోనే సాగిపోతున్నది. "నిజం చెప్పాలంటె మన భారతీయ సభ్యతను, ఈ సభ్యత అందుకో గలుగుతుందా? ఎంత ప్రయత్నించినా ప్రయోజనమేమిటి?" అసలు ఈ రోజుల్లో ఈ ప్రపంచం ఏ రసాతలంలోకి వెళ్ళి ఆగుతుందో అర్థం కావడం లేదు. భాయి సాబ్, ఎవర్ని తప్పుపడదాం. అంతా మనం చేసుకున్న ఫలితమే. వేలాది సంవత్సరాలు ఆలోచించి మన ఋషులు, మునులు రూపొందించిన మార్గాన్ని ఈనాటి కుర్రాళ్ళు ఇవన్నీ అడవి మనుషులు తయారు చేసిన నియమాలని అంటున్నారు. మీరే చెప్పండి. మన పూర్వీకుల్ని అడవి

మనుషులని అంటె సిగ్గు వేయదా? ఆ మహానుభావుల మేథస్సును ఒప్పుకుని తీరాలి. "ఒక్కొక్క నియమాన్ని ఎంత ఆలోచించి రూపొందించారో, ముక్కు మీద వేలు వేసుకోవల్సిందే. కులాల ఏర్పాటు చేసి అందరి కర్మకాండలని నిర్ణయించారు... అందరూ తమ తమ నియమాల్లో నడుస్తుంటేనే ఈ అల్లరీ కేకలు..." ఇక నవల్ కిషోర్ గారికి ఆ విషయంపై ఏదో మాట్లాడటం తమ హక్కుగా అనిపించింది. ఆయన చెప్పడం ప్రారంభించారు. "భగవాన్ మను మహర్షి తన మనుస్మృతిలో ఇలా అన్నాడు..." "నాన్నగారు తమ మాటను ఆపితే నేను చెప్పాలనుకున్నాను." అప్పుడు సంకోచిస్తూనే, ఎక్కడ చీవాట్లు వేస్తారో అని, వెంటనే అన్నాను. "నాన్నగారు, మిమ్మల్ని రమ్మన్నారు."

"సరే వస్తున్నాను. లోపలికి వెళ్ళి పాపను తీసుకురా. నా వైపు చూడకుండానే అన్నారు."

నేను పండిట్‌జీ ఇంట్లోకి తరచుగా వెళ్ళి వస్తుండేవాణ్ణి. పండిట్‌జీ కోడలు లోపల కూర్చుని పాపాయిని ఆడిస్తున్నది. నేను అన్నాను. "వదినా, నాన్నగారు పాపాయిని తీసుకు రమ్మన్నారు." ఈవిడ పతిదేవులే ఆ రోజు దేవాలయంలో శరణార్థిని కొట్టి బయటికి నెట్టారు. నా మాట విని పండిట్‌జీ భార్య బయటికి వచ్చింది. చూడగానే అడిగింది. "ఎవరూ సమర్?" ఏమిటి బాబూ, నువ్వు బొత్తిగా రావటమే మానేసావ్. పరీక్షలైపోయాయా? మంచిదే. మరి నువ్వు నీ భార్యతో మాట్లాడే వాడివి కాదు గదా, ఇప్పుడు మాట్లాడుతున్నావని విన్నాం. చాలా మంచి పని చేసావు బాబూ. నీ భార్యతో నువ్వు మాట్లాడకపోతే మరెవరు మాట్లాడు తారు. ఇలాంటివన్ని జరుగుతూనే వుంటాయ్. అంత మాత్రాన మాట్లాడడం మానేస్తామా? తప్పకుండా మాట్లాడాలి బాబూ. కాని బిసను (విష్ణు)లా అవకతవక పనులు మాత్రం చేయకు. దేవాలయంలో దొరికే నైవేద్యాలు, ప్రసాదాలు తీసు కొచ్చి భార్య ఒడిలో వేస్తున్నాడు. నీ మీద ఒట్టు బిడ్డా! ఒక్క పైసా ఇస్తే అడుగు. మంచి మంచి మిఠాయిలన్ని వాళ్ళిద్దరూ కలిసి తినేస్తారు. ఎంగిలివన్నీ మా ముందు పడేస్తారు. బాబూ, ఈ దౌర్భాగ్యులిద్దరూ మా ముసలితనంలో ఎంత ఇబ్బంది పెడుతున్నారో తెలుసా? పగలూ, రాత్రి అనకుండా ఒకటే కేరింతలూ, నవ్వులూ ఎవరైనా వింటారేమోనని, చూస్తారేమోనని కూడా వీళ్ళకు రవ్వంత చింత కూడా లేదు. మందిరంలోకి ఏం వస్తున్నాయ్, ఏం పోతున్నాయ్, అనే విషయం ఏమైనా తెలిస్తేనా? ఇప్పుడు భగవంతుడా మమ్మల్ని తీసుకు వెళ్ళమని

మేమిద్దరం రెండు పూటల ప్రార్థిస్తున్నాం. కాని సమర్ బాబూ ఇది కూడా విను, రెండు పూటలా వస్తున్న కలాకంద్ మిఠాయి అంతా కూడా పండిట్‌జీ చలువ మూలానే వస్తున్నది. ఆ తర్వాత ఒక్క పైసా రానప్పుడు అన్నపానాలు ఎలా గడుస్తాయో తెలుస్తుంది. ఇప్పుడైతే అన్నీ పచ్చపచ్చగా కనబడు తున్నాయి." పండిట్‌జీ, మరణాన్ని ఊహించుకునో లేదా ఏవో వ్యక్తిగత కారణాలవల్లనో ఆమె గొంతు పూడుకుపోయింది. ఆమె కళ్ళపై కొంగు పెట్టుకుని ఏడ్వసాగింది.

బిసన్ (విష్ణు) భార్య తన అత్తవైపు బొటన వేలితో చూపించి చిరునవ్వుతో పాపాయిని నాకిచ్చి వేసింది. పాపాయిని తీసుకు వస్తున్నపుడు ఎందుకో మా వదిన నన్ను డాక్టర్ కు చూపించుకోమన్న మాట జ్ఞాపకం వచ్చింది. నేను స్వయంగా మళ్ళీ చిరునవ్వు నవ్వాను.

# రెండు

నేను ఆశ్చర్యంగా కళ్ళు వెడల్పు చేసి అడిగాను "నువ్వు స్వయంగా చూసావా?" ప్రభ మరో వైపు చూస్తూ అన్నది "స్వయంగా మాత్రం చూడలేదు. కాని మున్నీ తాను చూసిందని చెప్పింది. ఆమె మీకు కూడా చెబుతానన్నది. నేను ఆ రోజు పొయ్యి మీద కూర వేసి కాస్త జరగగానే ఆమె పిడికిటనిండా ఉప్పు వేసిందట."

"అలానా" రెండు అరచేతుల మధ్య మొఖాన్ని ఆనించుకుని నేను తీవ్రంగా ఆలోచిస్తున్నాను. ఆదే విధంగా అడిగాను "మొదటి రోజు నువ్వు నాతో ఎందుకు మాట్లాడలేదు. వచ్చిన రోజే అలా ఎందుకు అవమానించావు."

ప్రభ ఒక మోకాలిని లేపికూర్చుంది, తన రెండు బాహువులతో మోకాలిని చుట్టేసి, మోకాళ్ళపై గవద ఆనించింది. అదేవిధంగా ఎంతో శాంతంగా, అవిచలిత భావంతో నా ప్రతిప్రశ్నకు జవాబిస్తున్నది. గది బయట నిన్నటిలానే వెన్నెల కురుస్తున్నది. పాలలాంటి ఒక జల్లు వలయాకారంలోంచి వంకర తిరిగి మా మంచం దాకా వచ్చేసింది. ఎంతో కష్టం మీద ఆనాటి మాటను ఆమె చెప్పేటట్టు సిద్ధం చేసాను. ఎలాంటి ఒడిదుడుకులు లేని స్వరంతో అన్నది. "నేను అవమానించ లేదు. నేను అవమానించినట్టు మీకు అనిపించుంట."

మళ్ళీ గాఢంగా శ్వాస పీల్చి అన్నది. "ఇక పోనివ్వండి. పాతవన్నీ తిరగదోడుకుంటే లాభమేమిటి? అదృష్టంలో అలా రాసి ఉంది, అలానే జరిగిపోయింది."

"అదృష్టం, గిదృష్టం ఏమీ లేదు ప్రభ నాకు తెలుసుకోవాలని మరీ కుతూహలంగా ఉంది. ఇప్పుడైనా చెప్పరాదు. ఇంతగా బతిమిలాడుతున్నాను కదా!" నేనెంతో అనునయంగా అన్నాను. మెల్లిగా ఆమె చేతిని నా చేతిలోకి తీసుకున్నాను. ఆమె కోమలమైన హస్తం చల్లగా నిర్జీవంగా వున్నా నాకు రోమాంచితమైంది.

తన చెయ్యిని ఆమె అలానే ఉంచేసింది. నా మాటపై ఏదో విద్వాంసురాలిలా, అనుభవజ్ఞురాలిలా నెమ్మదిగా నవ్వింది. "అంతగా నన్ను ఏడ్పించి, కాస్త బతిమిలాడితే పొయ్యింది ఏమిటి?" నాకు బదులు చెప్పే అవకాశం ఇవ్వ కుండా తానే చెప్పింది.

"ఎన్నో వారాలుగా మేల్కొని ఉన్నానేమో అలసటతో శరీరమంతా తూలిపోసాగింది. మనస్సంతా బాధగా మాటిమాటికి మా యిల్లు జ్ఞాపక మొచ్చేది. అందులో మున్నీ తన కథంతా చెప్పేసరికి మనస్సు మరింత కుంగిపోయింది. అవన్నీ మీతో మాట్లాడాలని అనుకున్నాను. కాని అప్పుడే మన కిటికీకి ఎదురుగా వున్న ఇంట్లో ఆ వెధవ సాంవల్ భార్య ఒళ్ళు కాల్చుకుని చచ్చిపోయింది. మరో ఒకటి రెండు సంఘటనల వల్ల కూడా ఏడుపు తప్ప మరోదారి కనపడలేదు. అసలు మాట్లాడాలని ఏ మాత్రం లేదు. పైగా ఈ పెళ్ళి మీకు ఇష్టం లేదని విన్నాను. దాంతో నా ధైర్యమంతా ఎగిరిపోయింది. ఇక మీతో ఏం మాట్లాడమంటారు."

"చూడు ప్రభ, ఇక చెప్పాలని కూచున్నపుడు దాచి పెట్టకు. నిజంగానే నాకు తెలుసుకోవాలని ఉంది. అన్నీ స్పష్టంగా చెబుతానని నువ్వే కదా భరోసా ఇచ్చావ్. మళ్ళీ అప్పుడే ఈ చలాకితనమేంటి?" నా సున్నితమైన అనునయంతో నిండిన స్వరం అనాయాసంగానే వణకసాగింది. నేను కాస్త ముందుకు జరిగి ఆవిడ తొడపై తలపెట్టుకుని వెల్లకిలా పడుకున్నాను. ఆమె గభాలున నా తలను పక్కకు నెట్టేసి "ఇప్పుడు మహా ప్రేమ చూపిస్తున్నారు" అని ఎక్కడంటుందోనని నాకు అనిపించింది. ఒక శరీరమైన ఉష్ణం మూలంగా నా మస్తిష్కంలోని ఒక్కొక్క సిర కంపించిపోయింది.

"అవన్నీ ఇప్పుడెందుకు లెండి." గదిలోని చీకట్లో ఆవిడ ముఖపు ఛాయ మాత్రమే కనపడుతున్నది. కాని నా నుదురుపై రెండు వేడి చుక్కలు

రాలగానే నేను తట్టుకోలేక పోయాను. నా వేళ్ళతో ఆమె ముఖాన్ని నా వైపు తిప్పుకుని స్నేహంగా గదమాయించి అన్నాను "ఏమిటా పిచ్చిపని? ఇక ఇరవై నాలుగ్గంటలు ఏడుస్తావా." నేను చాలా మెల్లగా ఆవిడ చెక్కిలిపై ఒక దెబ్బ వేశాను. అప్పుడు ఆమె పెదాలపై ఆడుతున్న సిగ్గు, పల్లవించిన చిరునవ్వు నా ఊహ లోని కళ్ళముందు సాకారమై పోయింది. కాని వెంటనే నేను నా చెయ్యిని లాక్కున్నాను. ఇదే చెంపపై ఇదే చెయ్యితో చెంప దెబ్బ వేసినపుడు ఆవిడ ఎంతగా తల్లడిల్లిందో స్ఫురణకు వచ్చింది. అది కూడ ఒక మట్టి ముద్ద కోసం దాన్నే కదా పురోహితుడు గణపతిగా మార్చాడు. వెలుగు ఉంటే ఆ చేతివేళ్ళ గుర్తులు ఇంకా ఉన్నాయేమోనని చూసేవాణ్ణి. ప్రభకు కూడ ఆనాటి విషయం జ్ఞాపకం వచ్చిందేమోనని అనిపించింది. కొంచెం గాభరాపడి వెంటనే విషయాన్ని మార్చేసాను. "అది సరే ప్రభ ఒక విషయం చెప్పు. ఈ వదిన, అమ్మకు నువ్వంటె ఎందు కంత కోపం?"

ప్రభ జవాబివ్వలేదు. ఆ తర్వాత గుక్క తిప్పుకుని అన్నది "నాకేం తెలుసు నా అదృష్టంలో అలా రాసిపెట్టి వుందేమో. అంత కంటె ఏం చెప్పమంటారు?"

"చూడు, ప్రభ నా మీద ఒట్టు. ఇప్పుడు నేను ఏం అడుగుతున్నానో అన్నీ దాచి పెట్టకుండా చెప్పు. అప్పటి నుంచి అదృష్టం, విదృష్టం అని అంటూ వున్నావ్. దాన్ని ఏట్లో పోనీయ్."

జీవితంలో నేను మొదటిసారి అదృష్టానికి విరుద్ధంగా మాట్లాడాను.

"ఏమిటీ చెడ్డ అలవాటు. నేను మాట్లాడడమే ఆలస్యం మీరు ఒట్టు పెట్టుకుంటున్నారు." ఆమె ప్రేమ నిండిన చికాకుతో అన్నది. ఆమె రెండు చేతులు నా వేడి తలపై నిశ్చేష్టగా ఆని వున్నాయి. తర్వాత అవి మెలిమెల్లగా నా చిక్కు బడిన వెంట్రుకల్లో తిరగనారంభించాయి. ఎన్ని సీసాల మత్తు నా నరనరాన దిగు తున్నదో తెలియదు. వేళ్ళని అలానే తిప్పుతూ ఆమె అన్నది. "అమ్మా, నాన్నగారలకు కోపం రావడం సహజమే. వాళ్ళు కోరిన విధంగా పెట్టుపోతలు ఇవ్వలేక పోయాం కదా! డబ్బులు, ఆభరణాలు, దుస్తులు ఏం ఇచ్చామని? ఇందులో చదువుకోడం కూడా ఒక దుర్గుణంగా మారిపోయింది. మున్నీ బీబీ అలానే అత్తయ్య కూడా ప్రత్యక్షంగా, పరోక్షంగా నేను పెద్ద కోడలికంటె చూడ్డానికి, వినడానికి లక్షరెట్లు నయమని ఆనందం వ్యక్తం చేసారు. ఇంకేముంది మీ వదిన గారికి అసంతృప్తి కలిగించడానికి ఈ రెండు,

మూడు కారణాలు చాలా ఎక్కువే. పొద్దస్త మానం అత్తయ్యకు చాడీలు చెబుతుండేది. నేను వింటూ ఊరుకునేదాన్ని. అయినా ఎవరితో చెప్పుకోవాలి. మీకు కూడా అసంతృప్తే కదా! చాలాసార్లు మనస్సులో నేను కూడా సాంవల్ కోడలి లాగా..." ఇక చెప్పలేక ఆమె గొంతు పూడుకుపోయింది. రెండు, మూడు కన్నీటి చుక్కలు రాలాయి.

నేను వెంటనే, ఆమె నోటికి చెయ్యి అడ్డం పెట్టాను. ప్రేమతో చీవాట్లేస్తు అన్నాను. "జాగ్రత్త ప్రభ, మళ్ళీ ఇలా ఒక్కమాట కూడా మాట్లాడవద్దు." అప్పుడు ఆమె మెడలో నా బాహువులు వేసి ఆమె తలను కిందికి వంచి ఎంతో మెల్లిగా ఆమె చల్లని ఎండిన పెదాలను ముద్దు పెట్టుకున్నాను. నా నరనరాన కాలుతున్న బ్రాందీ గుటక ప్రవేశించి జణజణమన్నట్లు అనించింది. వణుకుతున్న బొంగురు గొంతుతో అన్నాను. "ఇక చాలు ప్రభ. ఈ తప్పును క్షమించేసేయ్. అప్పుడు ఏ భూతం నాపై సవారీ చేస్తుందో నాకే తెలియదు. ఇది నా జీవితం లోని అన్నింటికంటె చివరి తప్పు. రా, ఇక నుంచి మళ్ళీ ఎప్పుడూ పోట్లాడమని ఈ రోజు మనం నిశ్చయించుకుందాం. ఎవరు ఏమన్నాసరే..."

ప్రభ తన చెక్కిలితో నా పెదాలను నొక్కి పెట్టగానే నా మాట ఆగిపోయింది. మళ్ళీ కన్నీటి ప్రవాహమే. నేను చీదరించుకుని అన్నాను. "మళ్ళీ అదేనా. నువ్వు ఇంత బలహీనురాలివైతె ఎలా ప్రభ." కాని అప్పుడే ఎవరో నా నాలుకను పట్టు కున్నారు. ఎవరైతే ఇన్ని తుఫానుల సుడిగుండాలలో కూడా తొణకకుండా వుందో ఆమె ఎలా బలహీనురాలవుతుంది. నిన్న రాత్రి మిద్దెపై కూచుని ప్రభ రోదించిన విషయం జ్ఞాపకమొచ్చింది. ఆమె అలా ఏడ్వడం నేను మొదటిసారి చూసాను. అందువల్లే అడిగాను " సరే ప్రభ ఒక విషయం చెప్పు."

"ఏమిటి?" ఆమె అలవోకగా అన్నది "నిన్న నువ్వు ఎందుకు ఏడ్చావు? ఇన్ని రోజుల నుంచి బహుశా నేను ఏడ్వడం మొదటిసారి చూసాను. నేను చెంప దెబ్బ కొట్టినపుడు కూడా నువ్వు ఏడవలేదే?"

ఈసారి ప్రభ కంఠంలో తీవ్రత పెరిగింది. "నేనేమిటి నా స్థానంలో ఎవరున్నా ఏడ్చేవారే. ఇంత పెద్దదాన్ని అయ్యాను. ఎవ్వరు ఇంత వరకు నా శీలం గురించి ఒక్క మాట అనలేదు. ఆ రోజు నేను విన్న మాటలకు..." అని వెంటనే ఊరుకుంది. కాసేపటికి ఆవేశం నిండిన కంఠంతో అన్నది. "ఏ

రోజైతో మీరు నా శీలాన్ని శంకిస్తారో ఆరే రోజు నేను విషం మింగేస్తాను."

నేను మౌనంగా ఉండిపోయాను. ఆమె దృఢత్వం ముందు నేను మరుగు జ్జునని పించింది. బాధగానే అన్నాను. "మా యింటి వాతావరణమంతా రోజురోజుకి చెడిపోతున్నది. ఏం చేయాలి." అవిడను ఓదారుస్తూ అన్నాను. "చదువు కున్న దానిని ఈ నుయ్యిలోకి వచ్చి పడ్డానేమిటని అనుకుంటున్నావు కదూ."

అప్పుడు ప్రభ వెంటనే ఏమీ బదులివ్వలేదు. ఎంతోసేపు నిశ్శబంగా ఉండి పోయింది.

మళ్ళీ ఎక్కడి నుంచో అన్నది "కష్టాలు ఎప్పటికీ ఉండవు కదా. మీ చదువు పూర్తి కానివ్వండి. కొంతైనా పని సులువవుతుంది. మీతో ఉండగా ఏ నుయ్యో గొయ్యో భయమెందుకుంటుంది. ఒంటరితనం అనిపించినపుడే మన స్సంతా గాభరాపడి పోతుంది." ఆమె ఆర్ద్రమైన కంఠంలోని రోమాంచితాన్ని నా హృదయపు లోతుల్లో అనుభవించాను.

"సరే, నువ్వు ఇన్ని ప్రశ్నలడిగావు. ఇప్పుడు నేను కూడా అడగొచ్చా?"

"లేదు ప్రభ, లేదు. నేను నీ ఏ ఒక్క ప్రశ్నకు కూడా సమాధానం ఇవ్వ లేను. నన్ను పిచ్చివాడి కింద జమకట్టుకో. ఆ రోజుల్లో మెదడు చెడి పోయిందనుకో."

ప్రభ 'మీరు' నుంచి 'నేను' లోకిదిగిపోవడం ఎంతో బాగా అనిపించింది.

పొద్దునే ప్రభతో నేను అన్నాను. "ప్రభా, ఇంతకు ముందు జరిగింది మరిచిపో. అదంతా నా తప్పే. నా నిస్సహాయతను అర్థం చేసుకోగలిగితే నన్ను మన్నించేసెయ్. మా యింటి పరిస్థితులను నువ్వు చూస్తూ వున్నావు కదా! నువ్వు స్వయంగా తెలివైన దానివి. ఇలాంటి పరిస్థితుల్లో ఎలా వుండాలో మనమే నిర్ణయించుకోవాలి." నేను ఇంత గంభీరమైన ఒక ముఖ్యమైన మాటను చెప్పగలనని, ఆలోచించగలనని భావిస్తుంటే నాకు ఎంతో హాయిగా ఉంది.

"దానికి నేనేం చెప్పగలను? నువ్వు ఎలా చెబితే అదే నాకు అంగీకారం. మీరే చెప్పండి. ఇంత వరకు నేనెప్పుడైనా మిమ్మల్ని ఎదిరించానా?" నా బాహువులపై తలపెట్టుకుని పై కప్పు చూస్తూ ఆమె అన్నది.

"కాని నువ్వు ఎదిరించాలని నేను కోరుతున్నాను. మనం బాగా చర్చించు కున్న తర్వాత, ఎంతో ఆలోచించి నిర్ణయానికి కావాలి." పైకి అలా అనేసానే కాని మనస్సు లోపల ఎవరో అడిగారు "నువ్వు ఎదిరించిన మాటని అసలు వింటావా?" వెంటనే అన్నాను "నీ సలహా లేకుండా నేను ఏ పని చేయను.

నువ్వు కూచుని ఈ ఇంటి పరిస్థితుల గురించి మాట్లాడాలని నీకు అనిపించదా? సలహా ఇవ్వాలంటె నీకు భయమెందుకు? నువ్వు చదువుకున్న దానివి, తెలివైన దానివి కదా!"

"చదువుకున్న దానివి అని ఏమిటా ఎత్తిపొడుపు?" ప్రభ కంఠంలో తీవ్రత వచ్చేసింది. "నువ్వు మీ ఇంటివాళ్ళ భాషే మాట్లాడతావా? ఈ చదువును ఎక్కడ పడెయ్యనో నువ్వే చెప్పు. తల్లితండ్రులు చదివించిన దానికి నేనేం చేయను? మొదట్లో ఏం చదువుకున్నానో అంతా మరచిపోయాను. నేను చదువుకున్న దాన్ని అని ఎవరితోనైనా అహంకరించానా?" కంఠంలో కోపంతో పాటు ఒక ఆర్ద్రత ధ్వనించింది.

నాకు నా తప్పేమిటో అర్థం అయ్యింది. ఈ విషయంలో తాను ఎలాంటి సంజాయిషీ ఇచ్చుకునే అవకాశం లేకుండానే ఎన్నో ఎత్తిపొడుపులు భరించింది. అందుకే ఇప్పుడు అంత కోపం. అనునయంగా ఆవిడ ముఖాన్ని నా వైపు తిప్పుకుంటూ అన్నాను. "నేను అవేమీ అనడం లేదే. ఇన్ని రోజుల మౌనానికి ప్రతీకారం తీర్చుకోవాలని పట్టుదలగా ఉందా? నోటి నుంచి మాట రావటమే తరువాయి. అలా కరుస్తున్నావేమిటి? మాగపెట్టిన సారాయిలాగా ఘాటెక్కి పోయావ్." ఆవిడని సంతోష పరచాలని మళ్ళీ అన్నాను. "మనిషి కాస్త తాగితే చాలు, ఆ రుచి వదలదు. ఇక తర్వాత జీవితాంతం మత్తులో ఉండి పోవలసిందే."

నిష్ఠూరంగానే ఆమె అన్నది "ఈ మాటల అర్థం ఏమిటో నాకు తెలుసు." ఆమె కంఠంలో కాఠిన్యం వచ్చేసిందని అనుకున్నదేమో, సిగ్గుపడుతూ మళ్ళీ అన్నది "రెండు రోజుల్లో నువ్వు సినిమా యాక్టర్‌ను మించిన ఎక్స్‌పర్ట్ గా మారి పోయావు. మనం మాట్లాడుతున్నది గొయ్యిలోకి తోసేసి-పనికిరాని మాటలు మాట్లాడుతున్నారేమిటి?"

ఎక్స్‌పర్ట్ అనే పదం నా చెవులకు కట్‌మని తగిలింది. ప్రభ చదువుకున్నదనే మాట ఎన్నోసార్లు అనుకోవడం వల్ల ఆ మాట అర్థమే కోల్పోయింది. ఇప్పుడు ఈ మాట వినగానే ఆమె ఏదో, గ్రామానికో, చిన్న బస్తీకో చెంది నది కాదని, ఒక మంచి పట్న వాసపు కుటుంబానికి చెందిన ఏకైక కూతురని మొదటిసారి గుర్తు కొచ్చింది. దివాకర్ భార్య కిరణ్ దుస్తులు వేసుకునే పద్ధతి మాట తీరు చూసినప్పుడల్లా అలాంటి తెలివైన, మంచి అభిరుచి ఉన్న భార్య నాకు కూడా ఉంటే బావుండునని మనసులో అనిపించింది. నేను ప్రభను ఆ దృష్టితో

ఎప్పుడూ జ్ఞాపకం చేసుకోలేదు. ఆమె మా యింట్లో ఏదో ఒక పనిచేసుకుంటూ ఉండే ఒక ఉత్త మామూలు మనిషిలా అనిపించేది. సినిమా మాట దేవుడెరుగు, పాపం మా దగ్గర కనీసం సినిమా పోస్టరైనా చూడాలని తహతహలాడి ఉంటుంది. కథో, నవలనో చదవాలనే ఎంతో ఉబలాటపడి ఉంటుంది. పట్నవాసపు అమ్మాయిలకు ఎన్నెన్ని కలలు ఉంటాయో ఎన్నెన్ని కోరికలు ఉంటాయో! పాపం తాను వాటి నన్నింటిని మా యింటి గోడల్లో పాతిపెట్టేసింది. అప్పుడే నాకు దివాకర్ ఇంటికి, మా ఇంటికి నడుమ ఉన్న అంతరం కనపడింది. అక్కడ ఆ ఇంట్లో చదువును ఒక దుర్గుణంగా మాత్రం వాళ్ళు భావించరు. మా యిల్లు కూడా ఎప్పటికైనా అలా మారగలదా? నేను కూడా ప్రభతో సాయంత్రం అలా షికారు కెళదామని ఎప్పుడైనా చెప్పగలనా? దివాకర్, కిరణ్ వస్తారు. వాళ్ళతో పాటు చాయ్ తాగాలి... కాని... నా ఆలోచన ముందుకు సాగలేదు. ఒక గాఢమైన నిట్టూర్పు తనంతట తానుగా నోటిలోంచి వెలువడింది.

ప్రభ నా నిట్టూర్పు వినగానే నన్ను ఊపుతూ అన్నది "ఇప్పుడు ఏమిటి ఆలోచిస్తున్నారు?" ఆ తర్వాత తలపైకి వంగి చేతితో నిమురుతూ అన్నది. "సరే చెప్పు, ఏమంటున్నావో. యాక్టర్ అన్నానని కోపం వచ్చిందా?"

నేను మాట్లాడకుండానే నాపై వంగిన ఆమె ముఖాన్ని పరిశీలనగా చూసాను. ఆమెచెపుతున్నదంతా, చేస్తున్నదంతా మనస్ఫూర్తిగా చేయడంలేదని నాకనిపించింది. ఏదోకట్టబెట్టారు కాబట్టి ఎలానో నిభాయించుకోవాలని అనుకుంటున్నట్టు ఉంది. తనకు నేను తగినవాణ్ణి కాదని ఆమె నిజంగానే తనలో తాను భావిస్తున్నట్టు ఉంది.

"చెప్పొచ్చు కదా!" "ఈలోగా ఆమె అనునయంగా అన్నది." "చూడు, నేను నీ వంద మాటలు ఒప్పుకుంటాను. నువ్వు నా ఒక్క మాటా ఒప్పుకోవాలి. లొడ లొడ వాగడం నాకు బాగా అలవాటు. నోటికి ఏది వస్తే అదే వాగేస్తాను. అసలు ఏం చెప్పాలో, ఏం చెప్పగూడదో నాకు స్వయంగా ధ్యాసే వుండదు. ఆ తర్వాత బాధపడతాను. ఇన్ని రోజులు మౌనంగా ఉన్నానేమో ఏదో ఒకటి మాట్లాడాలని అనిపిస్తున్నది. నేను చాలా వాగుతానని రమ కూడా అంటుంది."

నేను ఆమె మాటలని చెడుగా తీసుకోలేదు. కాని నా ఆలోచన మూలంగానే మనస్సులో ఎంతో విషాదం ఆవరించింది. నిజంగానే ఈ అమ్మాయికి నేను ఎలా తగినవాడ్ని? పైగా నేనడిగాను. "రమ ఎవరు?"

"నా క్లాస్‌మేట్" అన్నీ మరిచిపోయి ఉత్సాహంగా రమ గురించి చెబుతూ

పోతున్నది. చివరికి అన్నది. "ఈసారి వెళ్ళినపుడు నీ గురించి ఎన్నో అడిగింది. మా క్లాసులో మేమిద్దరం బాగా అల్లరి చేసే వాళ్ళం. నాకు మంచి స్నేహితురాలు. అమ్మాయిల్లో అంత గాఢమైన స్నేహం ఉండదు. మేము ఎప్పుడూ పెళ్ళి చేసుకోకుండా బాగా చదువుకుని గ్రామాలకు వెళ్ళి మహిళలకు చదువు చెప్పాలని మేము పరస్పరం అనుకునే వాళ్ళం. మళ్ళీ అప్పుడప్పుడు అనుకునే వాళ్ళం ఏవో అవసరమైన వాటిని వెంట తీసుకుని భారతదేశం అంతా నడుచుకుంటూ టూర్ చెయ్యాలని, ఎంతో విస్తారంగా మా డైరీ రాయాలని కొత్త కొత్త పల్లెల్లో, పట్నాల్లో రకరకాల వాళ్ళు కలుస్తారు. గూండాలను, రౌడీలను లేదా అడవి జంతువుల నుంచి మమ్మల్ని మేము రక్షించుకోడానికి కత్తీ, కర్ర తిప్పడం నేర్చుకోవాలని ప్రణాళికలు వేసేవాళ్ళం. అలా కూచుని ఏవేవో మాట్లాడుతుండే వాళ్ళం. అసలు మేము అంతసేపు ఏం మాట్లాడుతూ ఉంటామోనని మా యింటి వాళ్ళు, బయటి వాళ్ళు విసిగిపోయే వాళ్ళు. మేము ఏమో వాళ్ళను మరింత ఏడిపించేవాళ్ళం."

నేను అకస్మాత్తుగా ఆమె మాటలకు అడ్డు వస్తూ అడిగాను. "సరే ప్రభ, నువ్వు పెళ్ళి చేసుకున్నందుకు బాధ పడుతున్నావా?"

ప్రభ వెంటనే ఉలిక్కిపడి "లేదే, నేను నీతో అలా అన్నానా?" అని ఆమె గలగలా నవ్వేసింది. "చూడు, నే చెప్పాకదా నాకు ఊరికే వాగే అలవాటుందని. నన్ను ఆపుతూ ఉండండి. నాకు జ్ఞాపకమే ఉండదు. ఏం చేయను. మళ్ళీ అదే జరిగింది కదా?" అని చాలా సేపు గల గలా నవ్వసాగింది. ఆమె అలా ఉన్ముక్త భావంతో గల గలా నవ్వేయడం నాకు ఎంతో ముచ్చటవేసింది. అలాగే ఆశ్చర్యం కూడాను. ఎందువల్లనంటే ఈవిడేనా ఇంత జరిగిపోయిన తర్వాత కూడా ఎలాంటి సంకోచం లేకుండా నవ్వగల్గుతున్నది, అలానే మాట్లాడుతున్నది కూడా. నాకు జ్ఞాపకం ఉన్నంత వరకు ఎప్పుడు నేనింత నవ్వలేదు. అకస్మాత్తుగా నవ్వడం ఆపేసి ఆమె తన రెండు అరచేతుల మధ్య నా కణతలను వత్తుతూ సూటిగా నా కళ్ళలోకి చూస్తూ అన్నది. "చూడు, నువ్వు నేను ఏమన్నానో అంతా మరిచిపో. ఇప్పుడు నువ్వు బాగా చదవాలి. నాకు ఏమి చెబితే అది నేను చేస్తూ వెడతాను."

నాకు దివాకర్, ఇంకా నాన్నగారి మాటలన్నీ జ్ఞాపకం వచ్చాయి. అప్పుడు అడిగాను. "ప్రభా, ఒక విషయంలో సలహా ఇస్తావా?"

"నేను చెప్పానుగా, నన్ను సలహా అడగొద్దు, నువ్వు ఏం చెబుతావో

అది చేస్తాను."

"అరే, ముందు విను. ఎంతో విధేయురాలుగా మాట్లాడుతున్నావే" నేను అలా ఉత్తుత్తి కోపంతో అన్నాను.

"నాకు దివాకర్ అనే స్నేహితుడున్నాడు. నన్ను థర్డ్ ఇయర్ చదవమని అతను కూడా వెంటబడుతున్నాడు. మరో వైపు ఏమో నేను ఏదైనా ఉద్యోగం చేస్తే ఇంటికి సహాయంగా ఉంటుందని అన్నయ్యా, నాన్నగారు చెబుతున్నారు. ఏం చేయాలో నాకు తోచడం లేదు. నువ్వే చెప్పు."

ఆమె కాసేపు మౌనంగా ఉండి పోయింది. నేనే మళ్ళీ ఏదైనా చెబుతానని చూసింది. ఆ తర్వాత అన్నది "ఇందులో నా సలహా ఏమిటి. మీకు తోచింది చేయండి."

అసలు ఆమె చెప్పదలుచున్నది ఏమిటో, చెప్పకుండా దాట వేస్తున్నదని నాకు స్పష్టంగా అనిపించింది. "నాకు తోచింది చెయ్యాలంటె నిన్నెందుకు అడిగేవాణ్ణి. నేను ఏ నిర్ణయం తీసుకున్నా, దాని ప్రభావం కేవలం నా వరకే ఉండదు. ఇప్పటిదాకా నా చదువు ఇంటి వాళ్ళకు, నాకు ఒక సాకు మాత్రమే. ఇప్పుడు అది కూడా ముగిసింది. ఇప్పుడు వున్న పరిస్థితుల్లో చదువు సాగదనేది స్పష్టం. ఇంతవరకూ ఏదో ఏడుస్తూ గడిచిపోయింది. అదే నయం. ఇంటి వాళ్ళకు వెంటనే నా సాయం అవసరం. మరో మార్గం వెతకాల్సిందే."

ప్రభ ఆపులిస్తూ అన్నది. "అది నిజమే. ఏదైనా పని చేయండి."

"అంత అయిష్టంగా చెబుతున్నావేమిటి?" నేను అన్నాను. నీకు నా మాట నచ్చలేదని తెలుసు. కాని ఏం చేయమంటావ్ నువ్వే చెప్పు. ఇక పని సంగతి అంటావా. చెప్పడం అందరికీ సులభమే. కాస్త బయటికి వచ్చి చూస్తే తెలుస్తుంది అసలు పని ఎక్కడుందోనని ఇంటర్లు, బియ్యేలు పాసైన వాళ్ళు చెప్పులు అరిగేలా తిరిగినా దమ్మిడికి రాకుండా పోతున్నారు. మరీ ప్రయత్నం చేస్తే నలభై లేదా యాభై రూపాయల నౌకరి దొరుకుతుంది. ఏముంది? దినమంతా కలంతో గీస్తూ రాత్రికి ఫైళ్ళు కట్ట మోసుకు రావలసి వుంటుంది. మాట్లాడే తీరిక వుండదు. రాత్రంతా కూర్చుని కళ్ళు పొడుచుకోవాలి. అన్నగారు యుద్ధకాలంలో ఉద్యోగం సంపాదించుకున్నారు. ఇప్పటికీ అంతే సులువు అనుకుంటున్నారు. ఆ కాలం కాదు కదా! కాని ఇవన్నీ ఎవరికి తలకెక్కుతాయి. నా ఇంగితజ్ఞానం పనిచేయడం లేదు. ఏదైనా మంచి డిగ్రీ ఉంటె ప్రయత్నించినా సుఖం. ఇప్పుడు ఎవరి దగ్గరికి వెళ్ళి ఏం చెబుతాం?

"ఏవండి నేను ఇంటర్ పాసయ్యాను" విని ఎవడైనా పాపం ఏమి ఉద్యోగం ఇవ్వగలడు. అయినా నువ్వేమీ మాట్లాడవేంటి?"

"ఏమి మాట్లాడమంటావ్, చెప్పు? కావాలంటె ఏదో స్కూల్లో పంతులమ్మ లాగో, గింతులమ్మలాగో ఉద్యోగం చేయమంటావా?" ఆమె కంఠంలో పరిహాసం ధ్వనించింది.

అప్పుడు నేను వెంటనే అలా నోరు తెరచి అన్నాను. "ఇంట్లో నుంచి బయటికి అడుగు పెడతానన్న మాట అమ్మ, వదినల చెవుల్లో పడిందంటె తుఫాను వచ్చేస్తుంది. చేతికి గడియారం పెట్టుకుని నువ్వు వంట చేసిన రోజు మరిచిపోయావా?" ఈ పరిస్థితుల మూలంగా నా నిస్సహాయతపై నాకే కోపం రాసాగింది. "నిజం ప్రభా, అప్పుడప్పుడు ఎక్కడికైనా పారిపోవా లన్నంత చికాకు వేస్తుంది. నాలాంటి చవట దొరికాడేమిటని నువ్వు కూడా అను కుంటున్నావేమో. నేను నా మనస్సులోని మాట చెబుతున్నాను. ఈ నీ అవస్థను నేను చూడలేను. సుఖంగా వుంటున్నామా అనే ప్రశ్నే లేదు కనీసం వేసుకోవాలన్నా, కప్పుకోవాలన్నా బట్టలున్నాయా? అసలు నీకు వేసుకోవాలంటే దుస్తులు లేవు."

"నువ్వు నా చింత వదిలేయ్. నా దగ్గర చాలానే ఉన్నయ్."

కాని నేను ఆమె మాటలు వినిపించుకోకుండా అన్నాను. "దివాకర్ వైఫ్ ఒకసారి తీసుకురమ్మని రోజూ వెంటబడుతున్నది. కాని నువ్వే చెప్పు ఎలా తీసుకెళ్ళను. ఇక ఏదో ఒక రోజు వాళ్ళే ఇక్కడికి వచ్చేస్తారేమోనని నాకు భయంగా ఉంది." అసలు నేను ప్రభ వచ్చేసిందని దివాకర్ కు ఎందుకు చెప్పానని బాధవేసింది. "వాళ్ళు నిజంగానే వస్తే ఈ యింట్లో ఎక్కడ కూచో బెట్టగలను."

అప్పుడే ప్రభ అనేసింది. "అమ్మో నిజమే, ఇక్కడికి తీసుకు రావద్దు. ఈ ఇంటిని చూసి ఏమనుకుంటారు? వాళ్ళకు మర్యాద చేయడానికి ఏముందని?"

"నాకు అదే చింత. ఒక్కోసారి ఎంత కోపం వస్తుంది అంటే, ఈ గొడ వంతా పట్టించుకోకుండా ఎవరేం వాగినా లెక్క చేయకుండా , ఏకాగ్రచిత్తంతో బాగా చదివి, ఆ తర్వాత మంచి ఉద్యోగాన్ని సంపాదించుకుని హాయిగా సుఖంగా ఉండాలని... ఏదో స్వప్నావస్థలో ఉన్నట్లు చెప్పుకుపోతున్నాను. ఎవరెవరి గురించి చింతించను. అందరూ తమ తమ స్వార్థమే చూసుకుంటారు.

అందరూ తమ అదృష్టాన్ని వెంట తెచ్చుకుంటారు. అయినా అంతరాత్మ అంగీకరించదు. తల్లితండ్రుల పట్ల నా బాధ్యత అనేది ఉంది కదా!"

ప్రభాత కాంతి ఆకాశంలో ఉబుకుతున్నది. ప్రభ అటు ఇటూ కదుల్తూ ఆవులింతలతో తాను ఇక వెళ్ళడానికి ఆయత్తమవుతున్నది. లేచి కూర్చుని అన్నది. "ఇంతకూ మంచి ఉద్యోగం దొరికిన తర్వాత బాధ్యతను కూడా అంతే మంచిగా నిర్వర్తించలేమా?"

ఆమె అంతరార్థం ఏమిటో తెలుసుకోవాలని ఆమె వైపు ప్రశ్నార్థకంగా చూసాను.

# మూడు

ఏ మార్గమూ లేదు. సమస్యకు ఎలాంటి పరిష్కారం లేదు. అలా కృంగి కుళ్ళి పోవడం, స్తంభాలకు తల ఆనించి ఏడుస్తూ వుండడం దివారాత్రులు స్వయాన్ని వేరు పురుగులా తొలి చేయడం... వీటిసన్నింటిని అలా విదిలించేసి ముగించే యడానికి ఒక పద్ధతి లేదా? నేను ఇలానే ముక్కు సూటిగా వెళ్ళిపోతూ, వెళ్ళిపోతూ ఉంటె? అబ్బా ఈ రోజు ఏమిటీ మెదడంతా ఇలా వేడెక్కిపోతుంది. ఇప్పుడు నాతోపాటు మరొకరి భవిష్యత్తు కట్టి వేసారనే సంగతిని కనీసం నేను ఆలోచించాలి. ఒంటరిగా ఇప్పుడు నేను ఏ నిర్ణయమూ చేయలేను. ఏదో ఒకటి జరుగుతుంది. ఈ జీవితంలో ఇలా నిరాశపడాల్సిన పనేమిటి?

ఇంత ఆలస్యంగా ఇంటికి వెడుతున్నందుకు చీవాట్లు పడతాయని మనస్సులో భయంగానే ఉంది, చూద్దాం. ఈలోగా అక్కడ ఏమేం జరిగిపోయిందో అయిష్టంగానే తిరిగి వస్తున్నాను. ఎంప్లాయ్‌మెంట్ ఎక్స్ఛేంజి బిల్డింగ్ వెనక్కి వెళ్ళిపోతుంది. కోలాహలం తగ్గిపోతున్నది.

అసలు ఏం జరిగింది అంటే రెండు రోజుల తర్వాత నేను భయం, భయం గానే వదినతో అన్నాను. "వదినా, నీ దగ్గర మామూలు సాదా చీరె ఏదైనా ఉంది?"

చీర ఏం చేసుకుంటావ్? వదినకు అర్థం అయ్యిందని నాకు తెలుసు. కాని ఏమి తెలియనట్టు అడుగుతున్నది.

"ఉంటె ప్రభకు ఇచ్చేయ్, ఎవరైనా చూస్తే ఏమనుకుంటారు? చూడాలంటేనే సిగ్గేస్తున్నది." నేనెంతో కష్టం మీద మెల్లిగా అడిగాను.

వదిన కళ్ళల్లో కుటిలత్వము నా మాటలోని అంతరార్థాన్ని తెలుసుకున్న సంతోషంతో చిరునవ్వు వెలిగింది. నేను ఆమె చిరునవ్వులోని విషాన్ని చూసి కూడ చూడనట్లు ఊరుకున్నాను. ఆమె అన్నది "నా మీద ఒట్టు లాలాజీ, నా దగ్గర ఒక్క చీర కూడా లేదు. నమ్మకం లేకపోతే వచ్చి నా పెట్టెలో చూసుకో. అత్తయ్యే దగ్గర ఒకటి, రెండు వున్నాయేమో వెళ్ళి అడగొచ్చు కదా!" ఆమె రెండు చేతులతో పాపను ఊపుతున్నది.

అమ్మ దగ్గరికి వెళ్ళాలంటె ధైర్యం చాలలేదు. అందువల్ల వదిన దగ్గరికి వెళ్ళాను. ఇప్పుడు కాస్త ధైర్యం కూడగట్టుకోగలిగాను. ఇందులో భయపడవలసిన పనేమిటని నాకు నేను నచ్చజెప్పుకున్నాను. నేను మాట్లాడుతున్నాననే సంగతి ఆమెకైతె అర్థమైపోయింది. అటూఇటూ తిరిగి అమ్మ దగ్గరికి వెళ్ళి అడిగాను. "అమ్మా, నీ దగ్గర ఒకటో, రెండో చీరెలు ఉన్నాయా?" సూటిగా ఆమె వైపు చూసే ధైర్యం చాలలేదు.

"ఎలాంటివి?" ప్రశ్నించిన తర్వాతే అడిగింది. "మొన్ననే కదా నువ్వు ఒక ప్యాంటు కుట్టించుకున్నావు."

"నాకు కాదు అమ్మా, నేను ప్రభకు కావాలని అడుగుతున్నాను. ఆమె చీరె మొత్తం చిరిగి పోయింది. అసలు చూడలేము"

"ఓహో అలానా! చిన్న కోడలికి కావాలా అంత డొంక తిరుగుడుగా అడగడం ఎందుకు?" ప్రభ పేరు వినగానే అమ్మ ముఖం మాడిపోయింది. తన దిండుకింది నుంచి తాళం గుత్తి తీసి నా ముందు గిరాటేస్తు అన్నది. "తీసుకో నీ ఎదుట మొత్తం ఇల్లు తెరిచేస్తున్నాను. కనపడితే తీసుకురా. నాకు కనపడడం లేదే? చీరె ఉంటె నేనే తీసి ఇచ్చేదాన్ని కాదా? ఈ నెలలో డబ్బులు మిగిలితె తెప్పిస్తాను. ఒకటి, రెండు ఆమె దగ్గరే ఉన్నాయేమో!"

నేను మాట్లాడలేదు. ఏమని జవాబు చెప్పను. వెదుతూ వెదుతూ నీరసమైన కంఠంతో అన్నాను. "ఆమె పెళ్ళిలో మిగిలినవి ఒకటి, రెండు ఉంటె ఇచ్చెయ్. ఎవరైనా ఏమనుకుంటారు?"

ఈసారి అమ్మ ఒకసారి విరుచుకు పడింది. "పెళ్ళిలో మిగిలిపోయినవి రాళ్ళు. నువ్వు చూడకుండా ఎక్కడికైనా వెళ్ళిపోయావా? పెళ్ళిలో ఎంత నిధి వచ్చిందని. ఎన్ని జన్మలు దాటిపోయాయని పెళ్ళి విషయం జ్ఞాపకం

చేస్తున్నావ్. ఏరా! ఇప్పటిదాకా ఆ వస్తువులన్నీ అలానే ఉన్నాయని అనుకుంటున్నావా? మున్నీ వెడుతుండగా కొన్ని ఇచ్చాం కదా. నీ భార్య వెడుతుండగా కొన్ని తీసుకువెళ్ళిందే?" అమ్మ కోపం తనంతతానుగా పెరుగుతూనే ఉంది. పెద్ద పెద్దగా అరవసాగింది. "నీ భార్యతో ఏం మాట్లాడుతున్నావో గాని ఇక ప్రతి చిన్న విషయానికి మాపై దాడి చేస్తావా? నీ కొక్కడికే అపురూపాల భార్య ఉందనుకుంటున్నావా? ఇంకెవరికి లేరా? నీకు బాగా నేర్పించి పంపించిందని ఎందుకు చెప్పవూ? అదేమిటో నాకు బాగా తెలుసు. అది అమాయకురాలేం కాదు. నాలి ముచ్చు రకం. ఇంతకాలం స్కూల్లో ఏం చదివిందనుకుంటున్నావ్. తన వాళ్ళు పరాయి వాళ్ళు అనేదే నేర్చుకున్నది..."

అమ్మ ప్రసంగం నిరాటంకంగా సాగిపోతున్నది. అప్పుడే నాన్నగారు వచ్చి చీవాట్లు వేస్తూ అన్నారు. "ఏమిటీ గొడవ ఎందుకిలా అరుస్తున్నావ్? బయటి గదిలో ఎవరైనా ఉన్నారని కాని కలుసుకోడానికి వచ్చారని కాని ధ్యాస లేకపోతే ఎలా? వింటె ఏమనుకుంటారు. ఒక్క క్షణం కూడా ఈ ఇంట్లో శాంతి ఉండదు ఎప్పుడు చూసినా..."

అమ్మ అయన మాటను వినిపించుకోకుండానే అంతే పెద్దగా అన్నది. "మీ గారాల చిన్న కోడలి పక్షం వహిస్తున్నాడు. పెళ్ళి లెక్కలడుగున్నాడు. పెళ్ళిలో వచ్చిన బట్టలు ఇమ్మంటున్నాడు. తన భార్యకు ఈ దుస్తుల్లో సిగ్గు వేస్తున్నదట. నువ్వే అడుగు, పెళ్ళిలో ఎన్ని తానుల బట్ట చేరిందో మనకు."

నాన్నగారు మండే కళ్ళతో నన్ను చూసి ఈసడించుకుంటూ అన్నారు. "దమ్మిడి సంపాదించడం చేత కాదు కాని, భార్య పక్షం వహించడాకి వచ్చాడు మొనగాడు. సిగ్గులేదు! థూ... నీ నిర్లజ్జపై... నీ అన్నయ్య చూడు. పాపం చస్తున్నాడు. నిన్ను చదివిస్తేనేమో ఇప్పుడు లోకంలోని ఫ్యాషన్లన్నీ కావాలి. కనీసం నీ ఖర్చు కోసం నీ ప్రయత్నాలు చేసి కొంత భారమైనా తగ్గించవచ్చు కదా. మనిషన్నవాడు తానే ఆలోచించాలి..." అని కోపంగా తన గదిలోకి వెళ్ళిపోయారు.

నాన్నగారి కోపాన్ని చూసి లేదా తాను చెయ్యదలుచుకున్నది ఎంతో ఘాటుగానే వ్యక్తం అయినందుకు సంతోషపడుతూ, అమ్మ ఒక్కసారే మౌనం వహించింది. దెబ్బతిన్న వాడిలా నిశ్శబంగా నా గదిలోకి వచ్చేసాను. నేను అసలు అమ్మ దగ్గరికి ఎందుకు వెళ్ళాను. వదినకు ఈ విషయం బాగా

తెలుసు. ఆమె వ్యవహారమేమిటో తర్వాత స్వయంగా మాత్రం ఏదైనా అనే దమ్ములు ఆమెకు లేవు. కాని అటూ ఇటూ చిచ్చు పెడుతుంది.

అప్పుడే ఎలానో వీలు చేసుకుని వచ్చింది ప్రభ. రాగానే అన్నది. "అక్కడికి వెళ్ళి ఈ గొడవంతా ఎవరు చేయమన్నారు, మిమ్మల్ని. నాకు అసలు చీర ఏది అవసరం లేదు. నా దగ్గర పెట్టెనిండా ఉన్నయ్. ఖరీదైన మంచి చీరలు కట్టుకుంటె ఇంటి పనుల్లో పాడైపోతాయని నేను కట్టుకోవడం లేదు. పొద్దున్నే వెళ్ళిపోయి ఎవరు తగాదా పెట్టుకోమన్నారు? నువ్వేదైనా ఉద్యోగం చేస్తూ ఉంటె ఎన్ని అయినా కట్టుకోవచ్చు. అంత ఎముకలు కొరికే చలిలోనే గడుపుకొచ్చాను. ఇప్పుడేమైనా చస్తున్నానా. మీరు చూడలేకుండా ఉంటె ఇప్పుడే తీసి కట్టుకుంటాను. ఎప్పుడైనా బయటికి వెడితే కట్టుకోవాలని జాగ్రత్త చేసా అంతె. కాని ప్రభూ! చేతులు జోడిస్తాను. మీ కాళ్ళు మొక్కుతాను. అక్కడికి వెళ్ళి గొడవ పెట్టుకోకండి. నువ్వు అయితే ఏదో అని చేయి కడిగేసుకుంటావ్. కాని ఆ తర్వాత ఇంట్లో నా ప్రాణాలను కొరుక్కుతింటారు."

నేను నిస్పృహతో బాధగా అన్నాను. "సరే ప్రభా, ఇప్పుడు నువ్వెళ్ళిపో. నేనేమన్నా అన్నాననుకో నీకు కోపం వస్తుంది."

ప్రభ గొంతు పూడుకుపోయింది. "నేనెప్పుడైనా కోపంతెచ్చుకున్నానా?"

అప్పుడే కిందినుంచి ఎవరో మరీ పెద్దగా అరుస్తూపిలిచారు. "ఇప్పుడే ఎక్కడికి మాయమైపోయిందో. ప్రభా, పప్పు పొంగి పొయ్యిల్లో పడిపోతుంది. అది దించేసి కబుర్లు చెప్పుకోవచ్చు కదా!"

ప్రభ అరిటాకులా వణికిపోయింది. వెంటనే కిందికి పరిగెత్తింది.

నేను అలా కూర్చుని మండిపోసాగాను. సంపాదించు ... నుయ్యినితోడు, ఏ మట్టి అయినా కరువు. మొత్తంపై ఏదో సంపాదించుకుని రా... నాకే ఎక్కడో పాతిపెట్టిన నిధి దొరికి ఉంటె వీళ్ళందరి పీకలదాకా రూపాయలని కుక్కేవాణ్ణి. అప్పుడు అనేవాణ్ణి... తీసుకోండి, నమలండి! అప్పుడే చిననాటి ఊహ మళ్ళీ తలెత్తింది... దారిలో నడుస్తూ ఉంటె నా కాలు దేనికో తగిలింది. ఇటుకనో, రాయో అనుకుని మొదట పట్టించుకోలేదు. కాని తర్వాత జ్ఞాపకం రాగానే తిరిగివచ్చి చూస్తే భూమిలోపల పాతిపెట్టిన ఏదో మూత పైభాగం పైకి కనపడింది. కాలితో దానిపైనున్న మట్టిని అటూఇటూ జరిపి చూస్తే ఏముంది. ఇత్తడి లంకెబిందె. తెరిచి చూస్తే అందులో వెండి, బంగారపు ఆభరణాలు నిండి ఉన్నాయి. అప్పుడు నేను అటూఇటూ చూసి దాన్ని పెకిలించె

ప్రయత్నంలో ఉంటాను. లేదా అలా దాక్కొని చీకటి పడేదాక ఎదురు చూస్తుంటాను... వెనువెంట నా ఈ ఊహ ఎంత అసంభవమో అని అనుకుని నవ్వుకుంటాను. మొదటి విషయం ఏమిటంటె రోడ్డువేసే, వాళ్ళు భూమిని మొదలే లోతుగా తవ్వుతారు. పోనీ అక్కడే భూమిలో ఆ నిధి స్థిరంగా ఉంటే పోలీసులో బయటి వాళ్ళో వదిలివేస్తారా! మొత్తం ఎప్పుడో పెకిలించుకుపోతారు.

మళ్ళీ నా ఈ మూర్ఖత్వం పై నాకే చికాకు వేస్తుంది. ఇలా ఊరికే కూర్చుని పనికిరానివన్ని ఆలోచిస్తున్నాను. అసలు ఇపుడు ఆఖరికి ఏం చేయాలనేది ప్రశ్న. రిజల్ట్‌కోసం ఎదురు చూడకుండా అలా ఉద్యోగం కోసం వెళ్ళిపోతే, ఎక్కడికని వెళ్ళను. సరే చూద్దాం. ఏదైనాకాని ఈ రోజు నా అదృష్టాన్ని పరీక్షించుకోవలిసిందే. ఇంకెంతకాలం ఇలా?

కాగితాల మధ్య ఉన్న మెట్రిక్ సర్టిఫికెట్ గుండ్రంగా మడిచి నా జేబులో పెట్టుకుని మెల్లిగా బయటికి వచ్చేసాను. షరా మామూలే. అమ్మ మళ్ళీ ప్రభపై ఏదో విషయంపై గొణుగుతున్నది. ఇంక పనేం ఉందని. పూజ చేసుకోడం గొణుగుతూ ఉండడం. వెడుతున్న నన్ను చూసి వెనకాల నుంచి అన్నది "మళ్ళీ బయలుదేరావా? తినిపోవచ్చు కదా! ఎంతసేపని విడిగా పెడతారు. నిన్ననే గిన్నె నిండా పప్పు పారేయవలసి వచ్చింది. మిగిలిన రొట్టెల్ని రోజూ పాకీ పని మనిషికి ఇచ్చేస్తున్నాము..."

ఇది ఇల్లా లేక పావురాల కొంపా? ఎప్పుడు చూసినా ఒకటే సోది. ఒక్క క్షణమైనా శాంతంగా కూర్చోరు. స్వయంగా మాత్రం ఆలోచించరు. ఏమైనా చెబితే తగాదాకు దిగుతారు. ప్రభ కోసం చీరె అడిగి నేను ఏం తప్పు చేసాను. ఇందాకే ప్రభ వచ్చి నన్ను మందలించింది. నాకు కోపం రాదా? కాని నాన్నగారి మాటలు మాత్రం ఈటెలుగా నా గుండెల్ని చీల్చుకుని వెళ్ళిపోయాయి. ఇక అమ్మ ఉంది, రొట్టెల్ని పాకి పని మనిషికి ఇచ్చానని అరుస్తున్నది. ఎవరినైనా కాస్త నిశ్చింతగా తిననిస్తే కదా, తినేది... ఆ రోజు కిరణ్ తన అత్తగార్ని ధిక్కరిస్తుంటె నాకు బాధ వేసింది. ఆమె బాగానే చేసిందని ఇప్పుడనిపిస్తుంది. ఈమె ఈ రకంగా ప్రవర్తిస్తే ఎదుటివాళ్ళకి సద్భావం ఎందుకుంటుంది? అమ్మ దగ్గర చీరెలు అన్నీ వుండే వుంటాయి. వాటిని తన ప్రియమైన పెద్ద కోడలికి ఇవ్వాలి కదా! ఆమె భర్త సంపాదిస్తాడు కాబట్టి దినమంతా పాపాయిని ఎత్తుకుని పచార్లు చేస్తూ రాజ్యమేలడం...! ఇంటిల్లిపాదికి ఒక పనిమనిషి దొరికింది. ఇంకే ముంది పశువులా పని చేయించడమే. ఆమె

తిండి విషయం కాని దుస్తుల విషయం కాని ఆలోచించనక్కర లేదు. ఇష్టం వచ్చినపుడు తిట్టడం చీవాట్లు వేయడం. పాపం, పనికిరాని భర్తకు భార్య.

రోడ్డు మీదికి వచ్చానన్న మాటేగాని ఆలోచిస్తు ఎక్కడికి వెళ్ళాలని బయల్దేరానో జ్ఞాపకమే లేదు. ఎక్కడికైతె వెడుతున్నానో అక్కడ ఎవరూ చూడకుండా వుండాలని మాత్రం తెలుసు. చాలాసేపు నా తలపైన వేలితో కొడుతూ జ్ఞాపకం చేసుకున్నాను. ఏమై పోయింది నా మెదడుకు...

ఎంప్లాయ్మెంటు ఎక్స్చేంజి ఎత్తైన బిల్డింగు రెండు వేల మంది గుంపు ఏదో తిరునాళ్ళలాగా కోలాహలం. బిల్డింగులేని గ్యాలరీల ద్వారాల వద్ద జనం నిండి ఉన్నారు. చుట్టుపక్కల కాంపౌండు మొత్తం జనంతో క్రిక్కిరిసి పోయి ఉంది. జనం వీలున్నచోటల్లా ఎక్కి నిలుచున్నారు. బయట బౌండరీ వాల్ గోడపై పాదాలను బ్యాలన్సు చేసుకుంటూ రెండో లైనులో కూడా నిలుచున్నారు. పరస్పరం భుజాల ఆసరాతో తొంగిచూసే ప్రయత్నం చేస్తున్నారు. ఇందరి చూపులు ఆ మేడవైపే ఉన్నాయి. అక్కడికి ఎవరో ఒక మహా నాయకుడైన వచ్చి ఉండాలి, ఏదో విషయంపై ఉపన్యసిస్తు దేశం ఎంతగా అభివృద్ధి చెందుతున్న దోనని చెబుతుండాలని చూడగానే అనిపిస్తున్నది. ఈ దేశంలో ఎన్ని ఆనకట్టలు కట్టారో, ఎన్ని ఫ్యాక్టరీలు నడుస్తున్నాయో ప్రపంచంలో భారతదేశం ఎంత ప్రాముఖ్యతను సంతరించుకుందో - ఆ ఉపన్యాస సారాంశం కావచ్చు. అక్కడ ఏదైన దుర్ఘటన జరుగలేదు కదా, అగ్ని ప్రమాదం జరుగలేదు కదా, లేదా ఎవరిదైనా, హత్య జరిగిందేమోనని కూడా అనిపించింది. కాని చౌరస్తా దగ్గర మాత్రం ట్రాఫిక్ పోలీసు శాంతంగా ఆవేశ రహితంగా ట్రాఫిక్ ను నియంత్రిస్తున్నాడు. ఇక ఆ గుంపులోకి జొరబడలేక సైకిల్‌వాళ్ళు తమ సైకిళ్ళ కానుకుని రోడ్డుపై నిలుచుని లోపలి సమాచారం తెలుసుకునే ప్రయత్నం చేస్తున్నారు. ఆ గుంపుకి చివర వెళ్ళి నిలుచున్నానో లేదో అప్పుడే ఎవరో నా భుజంపై చేయి వేసారు. "చెప్పండి, స్వయం సేవక్ గారు."

ఉలిక్కిపడి వెనక్కి చూసాను. అప్పుడే విన్నాను. "క్షమించండి, నాతో పొరపాటు జరిగిపోయింది."

లోపల నుంచి బనియన్ కనపడుతున్న సన్నని మల్‌మల్ కుర్తా పైజామా వేసుకుని పొడి వెంట్రుకలని వెనక్కి దువ్విన ఒక ఎర్రటి మహాశయుడు. తన పలుచని మొఖంపై మన్నించమనే చిరునవ్వుతో అన్నాడు "నేను మిమ్మల్ని చూసి ఎవరో అనుకున్నాను."

నేను కూడా చిరునవ్వు నవ్వి అన్నాను "ఏమి ఫరవాలేదు లెండి. ఇంతకూ మీకు తెలుసా ఇక్కడ ఏం జరుగుతున్నదో?" ఎందువల్లనో ఆ వ్యక్తి ముఖం నన్ను ఆకట్టుకున్నది.

"ఈ రోజు ఇక్కడ కార్మికుల, క్లర్కుల భర్తీ జరుగుతున్నదనుకుంట." ఈసారి ఆయన దగ్గర ఉన్న నల్లని రేకు నోటీసును జాగ్రత్తగా చదువుతూ అన్నాడు. నేను కూడా అటువైపు వంగి చూసాను. పై నుంచి కింది దాకా వందలాది ఉద్యోగాల పేర్లు రాసి ఉన్నాయి. ప్రతి దాని ఎదుట సుద్ద ముక్కతో క్రాస్ చిహ్నాలు వున్నాయి. వడ్రంగి ఎదుట రాసి వుంది 10 మంది వడ్రంగులు, కూలీల ఎదుట రాసి వుంది - 50 మంది కూలీలు, క్లర్కుల ఎదుట ముగ్గురు క్లర్కులు. అసలు 63 మందికి ఖాళీలు వుంటే మూడు వేల మంది గుమికూడడం ఆశ్చర్య మేసి నోరు వెళ్ళబెట్టాను. మనస్సులో ఏదో మెరిసిపోయింది.

మరికొంత సేపు ఆ తమాషా చూసి, తల వేలాడేసుకుని ఇంటికి తిరిగి వచ్చేసాను.

లేదు, ఈ అపారజన సమూహంలో నాకు చోటు లేదు. అసలు మంచి డిగ్రీ వుంటే తప్ప మంచి ఉద్యోగం దొరకదని దివాకర్ సరిగ్గానే చెప్పాడు. ఇక్కడ నేనేం చేయగలను? ఈ వేలాదిమందిలో ఎవరో ఒకరు ఎంప్లాయ్‌మెంట్ ఆఫీసర్ మేనల్లుడు కావచ్చు. అన్న కొడుకు కావచ్చు, వాళ్ళ పేర్లు ముందు వెడతాయా? నాదా? ఆ మహాశయుడు నాతోపాటు కొంచెం దూరం దాకా తిరిగి వస్తు నిస్పృహతో కోపంగా అన్నాడు. పొద్దస్తమానం గొంతు చించుకుని అరిచే ఈ నాయకులకు సిగ్గు కూడా రాదు. మనం ఇపుడు స్వతంత్రులమని అడవి మనుషుల్లా నోళ్ళు వెల్లబెట్టి గంభీరంగా ఉపన్యసిస్తారు, పైగా దేశ నవ నిర్మాణం కోసం మాకు మంచి, మంచి ఇంజనీర్లు కావాలి, డాక్టర్లు కావాలి, యంత్రాలు నడిపే వాళ్ళు కావాలి, శాస్త్రవేత్తలు... అసలు మీకు ఎవ్వరి అవసరము లేదు. మీకు మీ భవంతులు, మేడలు, తోటల్లో మొక్కలకు నీళ్ళు పోయడానికి తోట మాలీలు కావాలి. కార్లు నడపడానికి డ్రైవర్లు కావాలి. ఇది కావాలి... అది కావాలి... మీకు కావాలి రాళ్ళూ రప్పలు.

ఆయన కోపం నా గాయాన్ని నిమిరినట్టు అనిపించింది. నిజమే కదా, ముందుకు వెళ్ళాలనే కోరిక ఉన్న వాళ్ళకు ఏమైనా సాధించాలని అనుకున్న వాళ్ళకు ఎలాంటి సాధనాలు లేవు సౌకర్యాలు లేవు. మరి మీకేమో మాంత్రిక శక్తితో డాక్టర్లను, ఇంజనీర్లను, విజ్ఞాన శాస్త్రవేత్తలను. టెక్నీషియన్లను తయారు

చేసుకుని అపసరాలు తీర్చుకోతం కావాలాయె!

నేను తిరిగి వస్తూ - గతంలో, ప్రపంచంలో కెల్లా గొప్పవాణ్ణి కావాలని ఎలాంటి అసంపూర్ణమైన కలలు కన్నానో మరోసారి గుర్తుచేసుకున్నాను. ఎన్నో రాత్రుళ్ళు మేలుకుని నేను ఏంతో ఉన్నతికి ఎదగాలని చూసిన కలలకు నా నిద్రా, నెత్తుటిని ధారపోసాను. దయానంద్ నుంచి శివాజీ, రవీంద్రనాద్, గాంధీ నుంచి, జవహర్ లాల్ వరకు ఆదర్శం కాదని. ఎవరెవరి జీవన గాధలతో నేను శారీరకంగా మానసికంగా ఉత్తేజం పొందలేదని. అడ్డంకులను రబ్బరు బెలూన్లలా అటూ ఇటూ విసిరేసే ఎంత ఉత్సాహం నాలో ఉండేదని. పెళ్ళి జరిగేదాకా అలాంటి కలల ఊయలపై ఊగుతుండేవాణ్ణి. ప్రభతో మాట్లాడకుండా నన్ను నేను ఎంతో ప్రసన్నుడిగా భావించి నా మార్గంలోని కంటకాలన్ని అవే తొలగిపోయాయని, ప్రారబ్ధమూలకంగా నేను మహనీయుడిగా మారే దారే స్వయంగా నా ఎదుట తెరుచుకున్నదని అనుకునేవాణ్ణి. దానిదేముంది. మహనీయుడని కావడానికి ఎంత కాలం పడుతుందని. అదంతా ఎంతటి మూర్ఖత్వమో, బుద్ధిహీనతో ఇప్పుడు అర్ధమవుతున్నది. అవన్నీ కాల్పనికమైనవి, నిరాధారమైనవి! నేనేమో యధార్థాన్ని విస్మరించి వాటినే నిజం అనుకున్నాను.

"అందులో కూడా పెద్ద జోక్ ఒకటుంది." ఆయన సిగరెట్ ఉన్న చేతిని దులుపుతూ అన్నాడు - విజయాన్ని సాధించి గొప్పవాడు కావడానికి స్కూళ్ళలో కాలేజీలలో మన అపరిపక్వ మెదళ్ళలోకి సరఫరా చేసే చిట్కాలను చూస్తుంటె అసలు మనమంతా మొదట జవహర్ లాల్ నెహ్రూలుగా తయారై ఆ తర్వాత స్నానం భోజనం చేసుకోవచ్చు. నూరు లేదా నూటయాభై రూపాయల జీతం తీసుకుని మాస్టారు ఉద్యోగం చేసే గోబర్ గణేశ్ కూడా ఇదే పాఠం. తాను కూడా చదివి గొప్పవాడిగా మారుతూ మారుతూ ఆ స్కూలు హెడ్ మాస్టర్ చీవాట్లు తినడానికి, బతకలేక పడి ఉన్నాననే సంగతి పాపం అర్థం చేసుకోలేడు. అసలు ఆ గొప్పవాళ్ళంతా పెద్దవాళ్ళ, సంపన్నుల పిల్లలనే సంగతి మర్చిపోతారు వీళ్ళంతా. వాళ్ళకు తిండి గొడవ అనేది ఉంటె తమకుతాము గొప్పవాళ్ళు కాగలిగేవాళ్ళా - మన్నించండి, ఒక వేళ నేను తప్పుగా మాట్లాడి ఉంటె - మలుపు దగ్గరికి రాగానే అటు తిరుగుతూ ఆయన అన్నారు.

ఆయన మాటల్ని విని ఆశ్చర్యం వేసింది. అతన్ని ఎక్కడో చూసినట్లు కూడా అనిపించింది. జ్ఞాపకం రావడం లేదు. నేను పైకి లేదండి అలాంటిదేమీ లేదు అని ఆయనకు జవాబిచ్చాను. అతని మాటల్లోని నిజం నా గుండెను

చీలుస్తూ వెళ్ళిపోయింది... లేదు, లేదు నాకు ఎలాంటి భవిష్యత్తూ లేదు. ఎలాంటి స్థానమూ లేదు. కోపంగా నా జేబులో మడత పెట్టుకున్న మెట్రిక్ సర్టిఫికెట్‌ను నేను మరింతగా మడుస్తూ మెలిపెట్టాను.

ఎంతసేపు అలా వ్యర్థంగా తిరిగేస్తూ, నేను ఏదైనా చేయాలి... ఏదైనా చేయాలి... నాకోసం కాకున్నా ప్రభ కోసమైనా అనే మాట నిరంతరంగా నా మెదడును నులిపెడుతున్నది. కాని ఎక్కడా ఏమీ లేదని, మన అనేవాళ్ళు ఎవరూ లేరని, ఢంకా మీద పడుతున్న దెబ్బలా ఒక వాస్తవం మోగుతూనేవుంది.

మధ్యాహ్నం దాటిన తర్వాత ఇంటికి వెళ్ళినపుడు పోస్ట్‌మాన్ దగ్గర ఏదో తీసుకుని అమర్ ఇంటిలోనికి వెడుతున్నాడు. అడిగాను "ఎవరి ఉత్తరమది అమర్?"

అమర్ ఏదో పట్టుబడినట్టు ఉలిక్కిపడ్డాడు. తత్తరపాటుతో అన్నాడు. "చిన్న వదినది."

"ఏది నా కివ్వు." చెయ్యి చాచి ఉత్తరం వాడి దగ్గర నుంచి తీసేసుకున్నాను. ముద్ర చూసాను. ప్రభ ఊరి నుంచి వచ్చినది కాదు. స్పష్టంగా లేదు. పరిశీలనగా చూస్తే జోథ్‌పూర్ లా కనపడింది. జోథ్‌పూర్ నుంచి ఎవరు రాసా రబ్బా అని ఆశ్చర్యం వేసింది. కాని తెరిచి చూడాలనే కోరిక ఏ మాత్రం కలగ లేదు. ప్రభకు సంబంధించిన ఉత్తరాలను తెరిచి చూస్తున్నారనే విషయం నాకు తెలుసు. అమర్ ధోరణి చూసిన తర్వాత ఈ ఉత్తరాన్ని కూడా ఈ రాత్రికి విప్పి బాగా సెన్సార్ అవసరం అనుకుంటె రేపు ఇచ్చేవారని నేను అర్థం చేసు కున్నాను.

నేను ఉత్తరం తీసుకుని లోపలికి వచ్చాను. ప్రభ ఒక మూల కూర్చుని పిండి జల్లెడ పడుతున్నది. ఎప్పుడు చూసినా ఆమె వంట గదికి సంబంధించిన ఏదో ఒక పని చేస్తూనే ఉంటుంది ఇది చూసి చూసి నాకు విసుగొచ్చింది. అసలు వంటపని ఎంత ఉంటుందని ఎప్పటికి తెమలనే తెమలదు. ఆమె రెండు బాహువులను పట్టుకుని పైకి లేపి అప్పుడే ఇలా అనాలనిపించింది "నడు ఇక చాలు మిగతా పని రేపు చూసుకోవచ్చులే." కాని ఆ మాటను మరొకరు అనగల రేమో? వణుకుతున్న పెదాలతో, ఎండిన గొంతుతో అన్నాను "ప్రభా, ఇదో నీ ఉత్తరం."

"ఎక్కడి నుంచి?" గభాలున లేచి నా చేతిలోంచి ఉత్తరం తీసుకుని ఉత్తరం కొసనుపట్టుకుని అడ్రస్ చదివింది. "జోథ్‌పూర్ నుంచి వచ్చింది

రమదే అయ్యి వుంటుంది. చాలా రోజులకు వచ్చింది. నేను కూడా ఆమెకు ఉత్తరం రాసి పెట్టాను. కవర్ లేక వేయలేక పోయాను." మళ్ళీ వెంటనే నా మొఖం వైపు చూసి తన మాట సగంలోనే ఆపి "మీకు ఒంట్లో బాగాలేదా."

"నాకేమయ్యిందని" నేను వెదుతూ వెదుతూ అన్నాను. "మొదట ఆ ఉత్తరం చదువుకో. పిండి తర్వాత జల్లెడ పట్టుకోవచ్చు."

ఉత్తరాన్ని నాకిస్తూ అన్నది. "ఇది విను. కాస్త దీన్ని నా ట్రంకు పెట్టెలో పెట్టు. రాత్రికి చదువుకుంటాను. ఇదోతాళంచెవి." కొంగుకు ముడివేసుకున్న తాళం చెవిని తీస్తూ అన్నది. "ఇంకా చాలా పని మిగిలిపోయింది. వంటకానే లేదు." అప్పుడే ఆమెకు జ్ఞాపకం రాగానే ఇలా అన్నది." "మహాశయా, మీరు భోజనానికి ఎందుకు రాలేదు. నేను ఇప్పటివరకు తినకుండా కుర్చున్నాను."

నేనుఎంతో నెమ్మదిగా అన్నాను. "ఆకలిగా లేదు ప్రభా. ఏదో తిన్నానులే."

"పేద్దా తిన్నారులే," కొంచెం కోపం నటిస్తూ అన్నది. "నువ్వు ఏమాత్రం తింటావో నాకు బాగా తెలుసు" కొంచెం కోపం రాగానే నేను తినడం మానేసినా, నా మూలంగా మరోవ్యక్తి ఆకలితో కూర్చుని ఉందన్న విషయాన్ని కనీసం గుర్తుంచుకోవాలిసింది.

"అదేంటి, నువ్వు నిజంగానే ఇప్పటివరకు తినలేదా?" నేను వెంటనే అడిగాను. అపజయంలోని అలసటంతా, మనస్సులోని దైన్యమంతా తనంత తానే కరిగిపోయినట్లు అనిపించింది. కళ్ళల్లో ఆర్ద్రత కదిలింది.

"మీదేముంది. మీ తిరుగుడుతో తీరిక దొరికితేకదా మీరడిగేది." ఆవిడ అలిగిపోయి పిండి జల్లెడ పడుతున్నది. మనస్సు పులకించిపోయింది. వేలాది ప్రశ్నలు మనస్సులో మెలి తిరుగుతున్నాయి. "నేను నీతో మాట్లాడనపుడు కూడా ఇలానే పస్తులుండేదానివా?" గొంతు సవరించుకుని ఈ మాత్రం అన్నాను "సరే, అదేదో ఇప్పుడు పెట్టు." పొద్దున నేను అన్నమాటలకు నాకే కోపం వచ్చింది.

"ఇప్పుడిక పాసిపోయింది తింటారా?" ఆమె త్వరపడుతూ అన్నది "ఇప్పుడే అరగంటలో తాజాగా వండిపెడతాగా. ఇదో చూడు నా ట్రంకు పెట్టెను అటూ ఇటూ తిరగేయకండి."

నేనుపైకి వచ్చేసాను. గదిలో ఉన్న ఆమె ట్రంకు పెట్టెను తెరిచి నిర్లక్ష్యంగా ఆ ఉత్తరాన్ని వేసాను. మళ్ళీ ఆమె చెప్పినమాట జ్ఞాపకం వచ్చి కుతూహలం తీవ్రంకావడ్డం వల్ల పెట్టెలో అసలు ఏమున్నాయో అని తిరగేసాను. నాలుగైదు

సిల్కు, కాటన్ చీరలు బ్లౌజులు వాటితో పాటు కాగితాల్లో మిగతా డబ్బాల్లో ఏమేమో ఉన్నాయి. బట్టలు నిజంగానే ఖరీదైనవే. అందువల్ల రోజువారి ఇంటి పనికి అవి కట్టుకోడానికి వీలు కాదు. నన్ను బాగా ఆకర్షించినవి రెండు మూడు పుస్తకాలు. "మాయ" పత్రిక కాపీ ఒకటి ఇప్పటికి అలానే ఉంది. పుస్తకాలు ఎవరో ఆమె బంధువులు ఇచ్చినట్టున్నారు. గొప్ప మహిళల జీవితాలపై ఒక పుస్తకం, గాంధీజీగారి ఆత్మకథ, నవ యువతులు తెలుసుకోవలసిన అంశాలపై ఒక పుస్తకం, మరొకటేమో ప్రేమ్‌చంద్ నవల "రంగభూమి" కానుకగా ఎవరెవరు ఇచ్చారో. వారి వివరాలతోసాటు ఒక మూల ఆమె చేతిరాతతో ప్రభ అని ఆ పుస్తకాలపై ఉంది. రంగభూమి పుటలలోంచి ఏదో కాగితం చివర తొంగి చూస్తున్నట్టు కన బడింది. బయటికి లాగి చూస్తే ఎవరిదో ఉత్తరం. మొట్ట మొదట ఆ ఉత్తరం ఎవరు రాసారో చివర చూసి ఉలిక్కిపడ్డాను. అక్కడ ప్రభ పేరు ఉంది. ప్రభ రాసిన ఉత్తరం ఇక్కడెందుకున్నది. కాగితాన్ని విప్పి జాగ్రత్తగా చూసాను. స్పష్టంగా రాయబడిన అక్షరాలు, కాని తొందరపాటులో రాసినట్టు అర్థమవుతున్నది. మొత్తం సంవత్సరంలో మొదటిసారి నా భార్య చేతిరాతతో ఉన్న ఉత్తరాన్ని చదువుతున్నాను. అది కూడా ఇంకెవరి పేరుపైనో వుంది. నా భార్య చేతిరాత ఇతరులతో పోల్చుకుంటె ఎంతో బాగున్నందుకు గర్వపడ్డాను. దొంగచాటుగా చదువుతున్నానని ప్రభ చూస్తుందేమోనని గబాగబా చదవడం ప్రారంభించాను.

ఆ ఉత్తరంలోని ప్రతి ఒక్క అక్షరం నా మనస్సులో మారుమ్రోగుతున్నది. ఆమె స్వయంగా ఆ రాత్రి చీకట్లో అలా పడుకుని నా ఎదుట తన హృదయాన్ని విప్పిచెప్పినట్టు ఆ ఉత్తరం చదవగానే నాకనిపించింది. అంత పెద్ద ఉత్తరాన్ని నేను అంత త్వరగా ఎలా చదవగలిగానో అని కొన్ని రోజుల వరకు నాకే నమ్మకం కలుగలేదు. కాని వాస్తవంగా ఉత్తరం చిన్నదే, నా మనస్సులోని ఊహలన్ని దాన్ని సాగదీసి పొడిగించుకున్నాయి. ఆ ఉత్తరం ఎన్నో వాయిదా పద్ధతుల్లో రాసి నట్టు అక్కడక్కడా తెగిన భావప్రవాహాన్ని చూస్తుంటె అర్థమవుతున్నది. అసలా ఉత్తరం చాలా రోజులదాకా జ్ఞాపకము ఉండిపోయింది. సవిస్తారంగా ఆ ఉత్తరం ఇలా ఉంది.

ప్రియ రమా,

నీ ఉత్తరం వచ్చినపుడు నేను మా అమ్మగారింట్లోనే ఉన్నాను. మళ్ళీ నేను మా అమ్మగారి ఇంటికి వచ్చినపుడే దీనికి సమాధానం దొరకపచ్చు.

నేనేదో పనిసాకు పెట్టుకుని ఎగ్గొడుతున్నానని అనుకోవద్దు. నిజంగానే నాకు మా అత్తగారింట్లో ఊపిరి పీల్చుకునే తీరిక కూడా లేదు. ప్రతి రోజు ఉదయాన్నే సాయంత్రం రాద్దాంలే అని అనుకుంటాను. కాని నీ మీద ఒట్టు. సమయం దొరికితే కదా! ఉదయం నుంచి సాయంత్రం దాకా నా కార్యక్రమాల వివరాలు రాయమంటావా?

నీకు బాగా కోపం వచ్చి ఉంటుందని నా గురించి ఎంతో చెడ్డగా భావిస్తుంటావని నాకు బాగా తెలుసు. స్కూలులో మనం తగాదా పడినప్పుడల్లా మొఖం మాడ్చుకుని వెళ్ళి స్కూలు వెనకాల వున్న దానిమ్మ చెట్టు కింద కూర్చుని నేను నీకు నచ్చచెప్పడానికి వస్తానులే అని బహుంశా ఇప్పుడు కూడా ఎదురు చూస్తుంటావ్. కాని ప్రియమైన నా రమ, నేను రాలేనని నీకు ఎలా చెప్పను. నాకు రావాలని ఉన్నా అప్పుడు కూడా రాలేనని నీకు ఎలా చెప్పను. నాకు రావాలని ఉన్నా అప్పుడు కూడా రాలేను. నువ్వే ఇక్కడికి వచ్చి స్కూల్లో అందరి కంటె పొగరుమోతు, పులిపిల్లలాంటి అమ్మాయి ఎలా ఉందో స్వయంగా చూడ గలిగితే బావుండు. నువ్వేకదా నన్ను సర్కస్‌లో ఉద్యోగం చేయమని వెంటపడే దానివి. కాని మనం అనుకున్నవన్ని ఎంత అబద్ధమో నేనిప్పుడు అనుభవ పూర్వకంగా తెలుసుకున్నాను. మనం ఏమేమి కోరుకుంటామో ఆ కోరికలకు ఏమన్నా హద్దు ఉన్నదా? లోకంలోని ప్రతి మంచి వస్తువు మనకు కావాలనుకునే స్కూలు రోజుల ఊహాగానం, ఆ భావుకతతో నిండిన కలలు...! రమా, అదంతా అబద్ధ మని అప్పుడు ఎందుకు ఆపేవాళ్ళు కారు. ఏ అమ్మాయి పెళ్ళి జరిగినా నేను వెళ్ళి ఆమె భర్తను చూడగానే 'ఛా' నా భర్త ఇలా ఉంటాడా ఏమిటని అనుకునేదాన్ని. నా భర్త ప్రొఫెసర్ అని, పెద్ద ఆఫీసర్ అని ఏదో పెద్ద కంపెనీ మేనేజర్ అని ఊహించుకునేదాన్ని. నేనూ, ఆయన అనే జీవులు మాత్రమే ఉంటామని. ఈ జంజాటమంతా - అత్తా, మరిది, వదినా, మేనల్లుడు వీరెవరూ ఉండరు. ఎంతో విశాలమైన కొత్త పద్ధతిలో కట్టుకున్న మేడ ఉంటుంది. ఎక్కడ మంచి ఫర్నిచర్ కనపడినా కొనేసి మా భవంతిలో అలంకరించుకుంటాము. ఆ భవనానికి రంగులు, పాలిష్‌లు, తెరలు నలువైపులా పచ్చపచ్చని గోరింటాకు మొక్కల లాన్సూ, ఒక చోట టెన్నిస్ లేదా బ్యాడ్‌మింటన్ కోర్టు ఇవన్నీ ఉంటాయి. అయిదారుగురు నౌకర్లు, పొద్దునే ఎంతో అనునయంగా నిద్రలేపి రాత్రి ఆలస్యంగా పడుకునే నా దురలవాటును ఎత్తిపొడుస్తూ ఉంటార్ను. ఛాయ్ తాగుతూ, నవ్వుతూ,

తుళ్ళుతూ వార్తాపత్రిక చదువుకుంటూ సమయమంతా గడిచిపోతుంది. ఆయన ఆఫీసుకు వెళ్ళిపోగానే కాలాన్ని ఎలా గడపాలో నాకు తోచదు. ఎవరో పొరుగింటావిడ ఇంటికి వెడతాను లేదా ఆవిడనే పిలిపించుకుంటాను. ఇక ప్రతి సాయంత్రం ఏదైనా సినిమాకో, స్నేహితుల ఇంటికో వెడతాము... ఇలాంటివే ఏవేవో ఊహల్లో మునిగిపోయేదాన్ని. ఇప్పుడు అవన్నీ జ్ఞాపకం కూడా రావు.

కాని రమ, ఊహలన్ని నిజమైతే ఇంకేముంది? మన ప్రతి నవ్వుపై అదృష్టం పళ్ళునూరుతుంది. మనం ఏడిస్తే అది కిలకిలా నవ్వుతుంది. దానికి బాగా తెలుసు - మనం తోలు బొమ్మల్లా ఎన్ని గంతులేసినా. ధయా దాక్షిణ్యాలు లేని దారాలు మాత్రం ఆ చేతుల్లోనే ఉంటాయి. కవిత్వంలో చెప్పాలి అంటే ఆ చిన్ననాటి కలల దీపాలన్ని నేటి యధార్థమనే విష వాయువుకు ఊపిరాడకుండా ఆరిపోతాయి. బుసలు కొడుతున్న ఆ భయంకరమైన విషవాయు పాములు అటు ఇటూ పాకుతున్నాయి. పాములంటె మొదట్లో భయం వేసేది. కాని రమ, ఇప్పుడు ఆ భయం కూడా లేదు. అవి నన్ను కాటువేస్తే బావుండునని అనిపిస్తుంది. కొత్త కొత్త బాధల ముఖాలు చూసి ఇప్పుడు ఎలాంటి వణుకుడు కూడా కలుగదు. గుండె రాయిగా మారిపోయిందని పిస్తున్నది. రమా, నువ్వే చెప్పు. అలా జరుగకుండా ఉంటె నేను ఎలా మిగిలిపోయి ఉండేదాన్ని. ఇప్పటికే విషమైనా మింగే దాన్ని, ఏ నుయ్యిలోనైనా దూకేదాన్ని.

చూస్తూన్నావుగా అంతా నా గొడవే రాస్తున్నాను. నిన్ను బోర్ కొట్టేస్తున్నాననే విషయాన్ని కూడా మరచిపోయాను. కాని నా గురించైనా కూడా నీకు ఏం రాయగలిగానని నా విషయం కొంచెం ఎక్కువ రాసినా ఈ ఉత్తరం నీ దాకా చేరదని నాకు తెలుసు. అందువల్ల ఎక్కువగా రాయలేను. ఇంతకు మించి నన్ను అడగవద్దని ప్రార్థిస్తున్నాను. నిన్ను కలవాలని, నిన్ను కలిసి ఏడ్వాలని, నీ ఒళ్ళో పడుకుని నా మనస్సులోని వన్నీ చెప్పేయాలని ఎంతగా ఉవ్విళ్ళూరుతున్నానో నీకెలా చెప్పనూ? చూద్దాం. భగవంతుడు ఎప్పుడు కలుపుతాడో.

సదా నీ

ప్రభ

ఉత్తరం ముగిసింది. దాన్ని పట్టుకుని అలా ఎంతసేపు నిలుచున్నానో

నాకే తెలియదు. చేతిపట్టు వదులు కాగానే హఠాత్తుగా ఉత్తరం కింద పడినప్పుడు తెలిసివచ్చింది. ఉలిక్కిపడి దాన్ని యథాస్థానంలో పెట్టేసాను. ట్రంకు పెట్టెను మూసివేస్తుంటె ఎవరినో సజీవంగా ఉన్న జీవిని చంపేసి పూడ్చి పెడుతున్నా నని అనిపించింది. కన్నీళ్ళతో నిండిన కళ్ళను తుడుచుకున్నాను. ప్రభా, నా ప్రభా, ఆ కలలన్నీ నావి కూడానని నీకెలా చెప్పను... నేను కూడా ఇలాగే ఊహించుకునేవాణ్ణి. నువ్వు నీకు కాబోతున్న భర్తని గురించి ఎలాంటి ఊహాగా నాలు చేసావో, నేను కూడా అనేక రాత్రుల్లో మేల్కొని నా భవిష్యత్తును ఎలా తీర్చి దిద్దుకోవాలోనని ఆలోచించేవాణ్ణి కాదా? నీ కలలన్నీ ఊపిరాడక చచ్చిపోతే, నా భవిష్యత్తు కూడా కిందపడి ముక్కచెక్కలై పోలేదా. కాని నేను ఎవర్ని తిట్టను. నువ్వు అయితే రమకు రాయగలవు, అదృష్టాన్ని తిట్టగలవు, లోలోన కృశించి మౌనంగా ఉండగలవు. కాని నేను కూడా అలానే చేయగలిగితే ఏమవు తుంది? ఏమవుతుంది?

నా ఆత్మపై ఒక హత్యాపాపం అంటుకొని ఉందని నాకెందుకో అనిపిస్తున్నది. గడపకానుకొని నిలబడి, నేను ఎంతో సేపు కిటికి ఊచలకు తలబాదుకున్నాను. ఎదురుగా ఎత్తైన మేడల వెనక, మెలిమెల్లిగా సూర్యగోళం కిందికి దిగి పోతున్నది. పట్నం సందడి బాగా పెరుగుతున్నది. అక్కడక్కడ రెండు మూడు గాలిపటాలు ఆకాశంలో తారట్లాడుతున్నాయి. కాకులన్నీ బారులు తీరి సూర్యుడి వైపు వెళ్ళిపోతున్నాయి.

ఆ రాత్రి నేను ప్రభను అడిగాను "సరే ప్రభ, నువ్వు ఏం కోరుకుంటున్నావో ఇంతకు చెప్పు? నిజాయతీగా చెప్పు. నన్నేదో మెప్పించాలని కాదు. నేను ఇక ముందు కూడా చదవనా లేక" ఉద్యోగం చేయనా? నాకెందుకో ఆ అజ్ఞాత వ్యక్తి స్ఫురణకు వచ్చాడు.

ప్రభ గాఢంగా నిట్టూర్చి - "నేను కోరుకున్నవన్ని ఎలా సాధ్యమవుతాయి? మన పరిస్థితిని కూడా అంచనా వేసుకోవాలి కదా! నన్నడిగితే, మీరు బాగా చదవాలి కనీసం యమ్.ఏ.నైనా కావాలి"!

"ఆ తర్వాత" - నేను ఆమె అభిప్రాయం వివరంగా వినాలనే ఉత్సుకతతో అడిగాను. తన ఉత్తరంలోని భాషను తిరిగి మాట్లాడుతుందేమోనని చూసాను.

"ఆ తర్వాత ఏమిటీ? ఎక్కడో ప్రొఫెసర్ ఉద్యోగం సంపాదించి హాయిగా వుండొచ్చు!"

"కాని అంతపరకు ఇంటి సంగతి ఏమిటి? ఎం.ఏ. పూర్తి చేసేలోగా ఈ

ఇంటి కీచులాటల్లో నేను బతికి ఉండగలనని నీకు నమ్మకంగా ఉందా?"

"అయితే ఈ ఇంటివాళ్ళ దారిద్ర్యాన్ని తరిమేయడానికి ఇప్పుడే మీకు ఏ ఉద్యోగం దొరుకుతున్నదని." ప్రభ కొంచెం రోషంగానే అన్నది "నన్ను మాత్రం తప్పుపట్టవద్దు. నీ మనసుకు తోచింది చేసేయ్."

"తప్పు పట్టడం కాదు ప్రభ, డిగ్రీ లేకుండా మంచి ఉద్యోగం సంపాదించడం చాలా కష్టమని నాకు తెలియదకున్నావా? ఎలాంటి పరిస్థితులలోనైనా నేను యం.ఏ. చేయవలసిందే. అవసరం అయితే ఉద్యోగంతో పాటు మరేమైనా చేయవలసి రావచ్చు. మనిద్దరం మాత్రం కొంచెం కష్టపడవలసి ఉంటుంది."

"ఇప్పుడేదో తివాచీలపై పడుకుని సుఖం అనుభవిస్తున్నట్టు! కష్టానిది ఏముంది మరి కాస్త పెరుగుతుంది." అని ప్రభ నిర్లిప్తంగా అన్నది.

"నిజం ప్రభ, నేను అన్నీ చేసుకుంటాను. నువ్వు నాకు ధైర్యాన్ని ఇస్తూ వెళ్ళు. నేను ప్రపంచంలోని అన్ని పనులు చేయగలను. నేను జీవితంలో ఎంతో ఒంటరిగా ఉన్నాను. చాలా నిరాశావాదిగా గడిపాను. ఎప్పుడూ ఎవరు కూడా నన్ను ప్రోత్సహించి ప్రేమగా ఒక్క మాటా మాట్లాడలేదు. నువ్వు నా శక్తిగా ప్రేరణగా ఉండగలిగితే మనిద్దరి కలల్ని నేను సాకారం చేయగలను." భావుకత్వంలోని ఆవేశం వల్ల నా కళ్ళల్లో నీళ్ళు నిండాయి.

"నేను నీ కాళ్ళకు సంకెళ్ళుగా మారిపోయి వస్తానని ఎప్పుడూ అనుకోలేదు. మీ దారికి అడ్డం వచ్చి వెనక్కి లాగుతున్నట్టు అనిపిస్తే నిర్మొహమాటంగా నన్ను వదిలేసి మీ దారి చూసుకోవచ్చు. నా అరుపులు కేకలను లక్ష్యపెట్టవద్దు." బయటినుంచి పరుచుకున్న వెన్నెలలో ఆమె చెక్కిళ్ళపై కారుతున్న కన్నీటి ధారలు మెరుస్తున్నాయి.

నేను అపుడు కొంచెం వ్యావహారికంగా మారుతూ అన్నాను. "అయితే ప్రభ, ఈ ఇంట్లో మనం ఏ వస్తువూ ముట్టుకోమని మనం మొదట నిశ్చయించుకోవాలి. రేపు నేను మరింత పట్టుదలతో ఉద్యోగాన్వేషణ చేస్తాను. చీరె కావాలని అడిగితె అమ్మా, నాన్నగార్ల చీవాట్లు వినవలసి వచ్చింది."

"పోనివ్వు, వాళ్ళు అయినా ఏం చేస్తారు?" ప్రభ నా మాటను ఎగురగొట్టింది.

"ఏం వాళ్ళు ఎందుకు చేయకూడదు. వదినకైతె ఎక్కడ నుంచి వస్తాయ్." నాకు కోపం వచ్చేసింది. "వదిన భర్త సంపాదనపైనె ఇల్లంతా నడుస్తుందని కదా. పోనీయ్. ఆ మాటనైనా స్పష్టంగా చెబుతారా? కొడుకులనందరిని

సమాన భావంతో చూస్తున్నామన్న మాట ఎందుకు పైగా. సరే, ఇకనుంచి మాత్రం మనం ఏమీ తీసుకోవద్దు."

"తీసుకోవాలంటె ఏం దొరుకుతుందని అసలు అడిగితేనే దొరకనప్పుడు..."

"ప్రభా, నిజం చెప్పాలంటె నేను ఈ రోజు ఎంత కృంగిపోయానో తెలుసా, నువ్వు లేకపోతె అసలు నేను ఇంటికి వచ్చేవాడినో, కాదో!" అవేశంతో అన్నాను. ఆమె శరీరాన్ని సొంతం నా బాహువుల్లో బంధించేసాను. ముగ్ధమయూరిలా ఆమె తెరుచుకున్న కళ్ళ ఆకాశంలోకి తన్మయత్వపు మేఘాలు కమ్ముకున్నాయి. నా అలసట నిరాశలు అనురాగపు శీతల ప్రవాహంలో తలమునకలు కాసాగాయి.

# నాలుగు

ఎంప్లాయ్‌మెంట్ ఎక్స్ఛేంజ్ బయట కలిసిన మహాశయుడి గురించి, అతను చెప్పిన మాటల గురించి నేను ప్రభకు వివరించాను. ఆయన చెప్పిన మాటలు నిరంతరం నా మెదడులో మెరుస్తూనే ఉన్నాయి. ఆయన మాట్లాడిన తీరు, ఆత్మ విశ్వాసంతో కూడిన శైలి, క్షోభ అవన్నీ కూడ నన్ను ఆకట్టుకున్నాయి. ఆయన్ని ఎందుకు పరిచయం చేసుకోలేదా అని నా మనస్సులో బాధ కలిగింది. నా ఆవేదనకు ఆయన పదాలు ఊరడింపు కల్గించడమే అనుకుంటాను. కాని ఆయన్ని రెండోసారి ఇంత త్వరగా ఇలా కలుసుకోగలనని అప్పుడు ఆలోచించలేదు. వస్తూ పోతూ నా కళ్ళు అదుర్దాగా అతని కోసమే వెతుకుతుండేవి.

దివాకర్ నన్ను చూడగానే అన్నాడు "దీనినే కాబోలు దీర్ఘాయుష్మగల సైతాను అని!" అంటే ఎవరైతే జ్ఞాపకం చేసుకోగానే ఊడిపడతారో అతన్ని ఇంగ్లీషులో సైతాను అంటారు. మరి భారతదేశంలోనేమో దీర్ఘాయుష్మగల వాడిగా భావిస్తారు. నిన్ను నీవు ఏ బోనులో నిలబెట్టుకుంటావో తేల్చుకో."

పేలవమైన చిరునవ్వుతో డ్రాయింగ్ రూంలోకి ప్రవేశిస్తు నేను అన్నాను "నీకు ఏది ఇష్టమో అదే." కాని అక్కడే ఈజీ ఛైయిర్ లో కూర్చున్న మరో మహాశయుణ్ణి చూసి నేను కొంచెం తగ్గాను. ఆయన తన సగం శరీరాన్ని ఆ పొడవాటి వార్తాపత్రిక వెనకాల దాచి పెట్టుకున్నాడు. నేను చేయితో సైగ చేస్తూ ఎవరూ? అని అడిగాను.

"వినండి. పేపర్ ఇక్కడే ఉంటుంది కదా. రండి నా స్నేహితుణ్ణి మీకు పరిచయం చేస్తాను." దివాకర్ ఆయన చేతిలో పేపర్ ను పట్టుకుని లాగుతూ అన్నాడు. ఒక కొత్త వ్యక్తి వచ్చినప్పటికి వార్తా పత్రికలో లీనమై చదివేయడం నా కెందుకో సభ్యత కాదనిపించింది.

వార్తా పత్రిక పక్కకి తొలిగిపోగానే ఒక క్లీన్‌షేవ్‌డ్ మొహం బైటపడింది. ఆయన్ని చూడగానే నేను ఉలిక్కిపడి గభాలున అనేసాను. "అరే, మీరా?"

ఆయన ఎంతో నిశ్చింతగా పేపర్ ను మడిచి ఒక పక్కన పెడుతూ అన్నాడు. "అవునండి, నేను అదే వ్యక్తిని. దివాకర్ తరుచుగా మీ గురించి చెప్పినవన్నీ విన్న తర్వాత ఆ రోజు మిమ్మల్ని చూడగానే మీరే కాదు గదా అనుకున్నాను. ఇతను మీ పరిచయం చేయకముందే నేనే స్వయంగా మిమ్మల్ని పరిచయం చేసుకోవాలని అనుకున్నాను. ఆ రోజు క్యాంట్ (కంటోన్మెంటు) నుండి వస్తుండగా బహుశా మీరే అయ్యి ఉంటారని అనుకున్నాను."

"నిజం చెప్పాలంటె మీ పరిచయం ఎందుకు చేసుకోలేదా అని ఎంతో బాధ పడ్డాను. ఆ రోజు మీ మాటలు నన్ను ఎంతో..." నా లోపల పొర్లుతున్న కృతజ్ఞతాభావాన్ని ఆపుతూ అన్నాను. ఈ లోగా నా మాటను తుంచుతూ దివాకర్ నిరాశగా చేతులు దులిపి అన్నాడు - ఇంకేం పరిచయం చేయను? మొదటే మీరు ఎక్కడ కలుసుకున్నారేమిటి? అయితే సమర్ - వీరి గురించే నీకు చెబుతూ వుండే వాడ్డే! వీరే మా శిరీష్ అన్నగారు. నిన్ను ఎక్కడో చూసానని కలిసానని ఈయన అంటూనే వున్నారు. కానీ గత రెండు మూడు రోజుల నుంచి అసలు మా వాడు కనపడడం లేదు. పోలీసులు వెతుకున్నారని చెప్పాను."

దివాకర్ హాస్యాన్ని పట్టించుకోకుండా నేనే కృతజ్ఞతతో అన్నాను - "మీరే శిరీష్ అన్నగారని నాకు అప్పుడే తెలిసి వుంటే..."

మధ్యలోనే అయన కలుగజేసుకుంటూ

"ఏం నన్ను బాగా తన్నాలనుకున్నారేమిటి?" అని కిలకిలా నవ్వేసారు. "సరే, ఇక అవ్వన్నీ వదిలేయండి. హాయిగా కూచోండి. నేను వచ్చి అప్పుడే రెండు మూడు రోజులైపోయింది. వచ్చినప్పటి నుంచి మీరు ఇక్కడికి ఎప్పుడు వస్తారా అని ఎదురు చూస్తున్నాను."

"ఒక ముఖ్యమైన పని వల్ల రాలేకపోయాను." నేను మన్నించమనే ధోరణిలో "మాట్లాడుతూ. మళ్ళీ అడిగాను - మీరు ఇక్కడికి ఏదైనా పనమీద

వచ్చారా లేదా...?"

"అవును, పనే అనుకోండి! చెల్లెల్ని తీసుకొచ్చాను." అంటూ ఆయన దివాకర్‌వైపు చూసాడు. ఆయన లుంగీ - బనియన్‌పై వున్నారు - భుజంపై టవల్‌తో స్నానానికి వెడుతున్నట్లున్నారు.

"అమ్మగారిని కలుసుకోవాలని తీసుకొచ్చి వుంటారు." నేను ఎలాంటి ఉద్దేశం లేకుండా అనేసాను.

. "లేదు కసుకోవాలని కాదు" ఈసారి ఆయన కాస్త నీరసంగా తనలో తాను తప్పిపోయారు - "ఒక విధంగా కలుసుకోవాలనే అనుకోండి... ఏం దివాకర్, నువ్వు ఈయనతో చెప్పలేదా? సమర్‌బాబు, అసలు విషయమేమిటంటే - మా చెల్లెలికి హిస్టీరియా వ్యాధి వుంది. ఇప్పుడామె పిచ్చి దానిలా ప్రవర్తిస్తున్నది... ఆ పిచ్చి ముదిరిపోతున్నది. డాక్టర్ సలహాపై ఆమెను మెంటల్ ఆసుపత్రిలో చేర్పించి వస్తున్నాము."

"నువ్వు వుంటే, నిన్ను కూడా అక్కడే వదిలి పెట్టేవాళ్ళం!" మధ్యలోనే దివాకర్ అన్నారు.

అతని హాస్యానికి నాకు చిరాకేసింది. ఇలాంటి సీరియస్ విషయంలో కూడా హాస్యమేమిటి? నేను మరింత గంభీరంగా అడిగాను "హిస్టీరియా ఎందుకు తిరగబెట్టింది? డాక్టర్స్ ఏమిటంటారు?"

"ఈ జబ్బు గురించి డాక్టర్లు ఏం చెప్పగలరు" శిరీష్ అన్నారు. ఈ "జబ్బు మానసిక సమస్యలవల్ల విపరీతంగా ఆలోచించడం వల్ల నరాల ఒత్తిడివల్ల వస్తుంటుంది. డాక్టర్ దగ్గరికి వెడితే ఏదో ఒకటి చెప్పకపోడు. కాని నిజమైన కారణమేమిటో మాకు తెలుసు." ఆయన కాసేపు నిశ్శబ్దంగా ఉండి చింతాగ్రస్తుడై తనవేళ్ళను పరస్పరం బిగించి మెటికలు విరుస్తు ఉండిపోయారు. మళ్ళీ తమంత తామే అన్నారు. "అసలు ఆలోచిస్తే విషయం అంత ముఖ్యమైనదేమీ కాదు. కాని ఆమెకి అర్థం కాదు. ఏం చేయమంటారు? తప్పంతా మా వాళ్ళదే. చిన్నప్పుడే ఆమెకు పెళ్ళి చేసారు. అప్పుడు ఆమె వయస్సు మహా అయితే పదకొండు లేక పన్నెండు సంవత్సరాలు ఉండి ఉండవచ్చు. ఆ రోజుల్లో భర్తగారు చదువుకుంటున్నారు. అయన చదువు పూర్తికాగానే తన భార్య చదువు రానిదని తెలుసుకున్నాడు. ఆమెతో కాపురం చేయలేననుకున్నాడు. అంతే ఇక అప్పటి నుంచి ఆమెను వదిలివేసినట్టె లెక్క. నేను ఆమెను నా సంరక్షణలోనే ఉంచి పొద్దనక, రాత్రనక వెంటపడి

మెట్రిక్ పాస్ చేయించాను. కాని బుద్ధి లేదసలు. విపరీతంగా ఆలోచిస్తుంది. అమెకు ఈ జబ్బు లేకపోతే ఆ సంవత్సరం ఇంటర్ పూర్తి చేసేది. ఆమెను చింతించవద్దని లక్షసార్లు చెప్పాను ఎవ్వరి మాటా వినదు. రాత్రి పడుకోగానే కేకలు వేస్తూ వుంటుంది. చెపుతూ వుండగా చెల్లెలి దుఃఖం మూలంగా ఆయన కంఠం పూడుకుపోయింది. ఆయన ముఖం మరోవైపు తిప్పుకుని వార్తాపత్రిక పుటలను సరిచేయసాగారు.

నేను ఆయన మాటలను గంభీరంగా విన్నాను. ఆయన మా మున్నీ గురించి చెబుతున్నట్లే నాకు అనిపించింది. కాస్సేపటికి అన్నాను. "అయితే మీరు ప్రతి సారి ఇక్కడికి రావలసిందే కదా!"

"అవునండి, నెలలో రెండు సార్లు నేను రావలసిందే! అంతా గొడవ." ఆయన ఎంతో అలసిపోయిన కంఠంతో మళ్ళీ అన్నారు. "హిందూకోడ్ బిల్ అమలపుతే లేదా ఈ నాయకులు ఏదో ఒక చట్టం ఆమోదిస్తే ఆమెకు విడాకులు ఇప్పించి మరో వివాహం చేయాలకుంటున్నాను. వివాహం కాకున్నా ఫర్వా లేదు కానీ, ఈ గొడవ వుండదు కదా కనీసం... కానీ ఈ నాయకులకేమో వోట్ల చింత... మా చెల్లాయి విషయంలో ఇంట్లో వాళ్ళంతా విరోధులే. కానీ నేను ఆ అమ్మాయి చస్తుంటే ఎలా చూడను?"

చెల్లెలు చస్తుంటే చూడలేము నిజమే కాని దానికి 'విడాకులు' పరిష్కార మంటే నాకు బోధపడలేదు. అడిగాను "మీరు, విడాకులు లేదా తండ్రి ఆస్తిలో సమాన హక్కు పక్షంలో వున్నారా?"

అయన ఎంతో నిబ్బరంగా, అంతిమ నిర్ణయంలా అన్నారు.

"అవును... పూర్తిగా...!"

"కానీ, దాని వల్ల మన సామాజిక స్వరూపమే తనకిందులైపోతుందే?" నేను విచారంగా అన్నాను.

"ఏ సమాజమంటారు?... నాకు అర్థం కాలేదు" - ఆయన ఆశ్చర్యంగా అడిగారు.

"మన హిందూ సమాజం," నేను సాహసించి అన్నాను. నలువైపులా భయంకరమైన అల్లకల్లోలం చెలరేగుతున్నది. వివాహమనే పవిత్ర బంధాన్ని ఏదో సరదా కింద ఆడుకునే వ్యవహారంగా భావిస్తారు జనం! పెళ్ళి చేసుకోగానే సరదా తీరిన వెంటనే విడాకులు కోరుకుంటారు. అంతా బొమ్మలాటగా మారిపోతుంది. ఇక ఆస్తిపరంగా బావా-బావ మరుదుల మధ్య లేదా అన్నా

చెల్లెల మధ్య తగాదాలు పెరుగుతాయి. అపుడిక అన్నా - అక్కా - చెల్లెలు - తమ్ముళ్ళ మధ్య ప్రేమానుబంధాలు ఏమి మిగులుతాయి? నన్ను సమర్థిస్తాడేమోనని నేను దివాకర్ వైపు చూసాను. గతంలో మేము ఈ విషయంలో పార్కులో కూచుని గంటల తరబడి తర్జన భర్జనలు చేసాము.

"ఎలాంటి ప్రేమానుబంధాలు?" ఆయన అడుగుతున్న ధోరణిని బట్టి కావాలని ఏమి తెలియనట్టు అడుగుతున్నారని అర్థం చేసుకున్నాను. నా వాదన విన్న తర్వాత చివరగా సమాధానమివ్వాలని ఆయన ఉద్దేశంలా వుంది!

"ఎలాంటి ప్రేమానుబంధమంటే - మీరు మీ చెల్లెలు చికిత్స కోసం చెందుతున్న ఆందోళన, ఆమె కోసం వారం పది రోజులకోసారి రావడం లాంటిదన్న మాట! నేను నా వాదనను నొక్కి చెప్పాలనే పట్టుదలతో అన్నాను - అదంతా ఎందువల్లనంటే మీకు మీ చెల్లెలు పట్ల ఇప్పుడు ప్రేమాభిమానాలు, దయా జాలి వున్నాయి కాబట్టి. అది చట్టపరమైన కట్టుబాటు కాదు. మీ మనస్సులోని కోరిక, అనుబంధం... అదే, ఆమె రేపు మీ ఆస్తిలో సమానభాగం అడిగితే మీలో ఆ దయ, ప్రేమానుబంధాలు వుంటాయా? ఒక వేళ వున్నప్పటికీ - ఒక విధమైన ద్వేషం మాత్రం పెరుగుతుంది. మరోవైపు...

"మహాశయా ఇంతసేపు విన్న తర్వాత ఆయన కాస్త తీవ్రంగానే అన్నాడు. వీటన్నింటిని మీరు ఏ దృష్టితో చూస్తున్నారో నాకు తెలియదు. అసలు ఆ యుగమే ఈనాటికంటె బాగుండేదేమోని నేను అనుకుంటున్నాను. మీ చెల్లెలిపట్ల మీ మనస్సులో ఇపుడు దయా లేదా ప్రేమా అనేది ఉన్నది. ఇది చట్టబద్ధమైన బంధనమూ కాదు బాహ్యమైన సామాజిక ఒత్తిడి. మీరు దయ చూపకుండా కొంచెం సిగ్గు వదిలేస్తే పాపం ఆమె ఏమి చేయలేదు. ఏడుస్తుంది, ఒకరిద్దరికి ఫిర్యాదు చేస్తుంది. ఆ తర్వాత తన అదృష్టాన్ని తిడుతుంది. దీని మూలంగా మీ ఇష్టానుసారం ఆమె బతకవలసిన అవసరం ఉండదు. మీ రాగద్వేషాలన్నీ మీ ఇష్టానుసారం ఉండవు. మీ జాలి అనే ముక్కలపై ఆమె బతకదు లేదా చావదు. ఇద్దరు అన్నదమ్ముల ఆస్తిలో సమానభాగాలు పంచుకుంటున్నపుడు వారి మధ్య తగాదాలు తలెత్తవా? వాళ్ళిద్దరు తమ తమ భాగాల్ని తీసుకుని వేరువేరుగా ఎందుకు జీవిస్తున్నారు? ఒక సోదరుడికి భాగం పంచి ఇవ్వడమనేది చట్టపరంగా కాకుండా కేవలం మీ ఇష్టంపై ఆధారపడి వుంటే, మీ ఇష్టం వుంటె ఆ భాగాన్ని పంచి ఇస్తారు, లేకపోతే అతన్ని దారినపోయే బిచ్చగాడిగా మార్చేస్తారు.

ఈ తర్కాన్ని విని నేను కలవరపడిపోయాను. ఈ కోణాల్లో అసలు నేను ఆలోచించనే లేదు. అయినప్పటికి ధైర్యంతో మళ్ళీ అన్నాను. సరేలెండి, ఏమైనా ఇలాంటి నియమాల వల్ల చాలా గందరగోళం తలెత్తుందని మాత్రం ఒప్పుకోవాలి. ఈ సమాజాన్ని నడిపించడానికి పాత తరం వాళ్ళు ఎంతో ఆలోచించి రూపొందించిన నియమాలు, అన్నీ తలకిందులైపోతాయి.

అప్పుడు ఆయన ఎంతో ప్రశాంతంగా అడిగాడు. "అయితే కానివ్వండి, దానివల్ల ఏం అవుతుంది?"

ఎలాంటి ఉద్విగ్నత లేకుండా ఆయన వేస్తున్న చిన్న ప్రశ్నలకు నేను భయపడసాగాను. అందువల్ల ఎంతో జాగ్రత్తగా తలాతోక లేకుండా ఎక్కడ సమాధానమిస్తానో అనే భయంతో అన్నాను. దీని మూలంగా మన దేశంలోని సతి, ఆదర్శవంతులైన మహిళల ఉజ్వల సాంప్రదాయం ఒక్కసారే సమసిపోతుంది. వివాహానికి ఇక మిగిలిపోయే ఆధారం కేవలం స్వార్థం లేదా కామవాసన...

"క్షమించాలి, సమర్‌బాబూ ఆయన అదే స్వరంతో అన్నారు. మీరు బాగా ఆలోచిస్తారని, మంచి యోచనాపరులని దివాకర్ నాతో చెప్పాడు. కాని ఆలోచించడం రెండు రకాలుగా ఉంటుందని నేనిపుడు చూస్తున్నాను. ఒకటేమో ప్రతి దాన్ని తర్కము, బుద్ధీ అనే గీటురాయిపై పరీక్షించడం, రెండోది భావాల ఆవేశంలో మునిగిపోవడం. చెడుగా భావించవద్దు. మీరు రెండో రకం జీవులుగా కనపడుతున్నారు." ఆయన రెండు వేళ్ళతో వార్తాపత్రికను లేపి అన్నారు. "సమాజం తలక్రిందులవుతుందనే మాట మీరన్నారు. కొంచెం కళ్ళు విప్పి చూడండి. ఏ వ్యవస్థ ఎంత అందంగా మీకు కనపడుతున్నది? ఇది ఈ రోజు పేపర్, లక్నో జిల్లాలో అయిదువేల మంది పెద్దింటి ఆడపడుచులు విడాకులు కావాలని దరఖాస్తులు పెట్టుకున్నారు. వాళ్ళందరికి ఒక్కసారే అలా సరదా వేసిందా లేక మీ దృష్టితో చూస్తే వాళ్ళందరు కామవాసనలో ఉన్మత్తులై పోయారా? ఇద్దరు స్త్రీలు కాల్చుకొని మరణించారు. నలుగురు నుయ్యిలో దూకారు. ఆరుగురు పారిపోయారు లేదా క్షయ వ్యాధితో మరణించారు. ఈ వార్తలన్ని మనకు ఎంత సహజమైపోయాయంటే మనం వాటిని పట్టించుకోవడం మానివేసాం. అవి మనని ఎక్కడా కదిలించవు. అసలు మీరు ఏ సువ్యవస్థ గురించి మాట్లాడుతున్నారో నాకు కాస్త చెప్పండి. నాకు మీ ఇంటి విషయం తెలియదు. కాని సమస్యలతో నిస్సహాయంగా లేని ఒక్క స్త్రీ ఉన్న ఇంటినైనా

చూపించగలరా? నేను చదువు కున్న సాహసవంతులైన మహిళల గురించి మాట్లాడడం లేదు. అక్కడ కూడా సమస్యలున్నాయి. కాని వాటి స్వరూపంవేరు."

ఆయన మాట్లాడుతుంటే నా కళ్ళ ముందు ఒక్కోసారి మున్నీ మరోసారి ప్రభ రూపాలు కదలాడుతున్నాయి. ఆయన మాటలన్నీ కేవలం వారిద్దరినీ దృష్టిలో పెట్టుకుని చెబుతున్నట్టు అనిపించింది. నాకు మాత్రమే వివరిస్తున్నట్టు ఉంది.

"నిస్సహాయంగా తప్పనిసరిగా అలా కృశించి ఊపిరాడక మరణించె భారతీయ నారిని 'సహనశీలత' అనే పేరుతో పూజించకండి. కోట్లాది వ్యక్తుల వేలాది సంవత్సరాల చరిత్రలోంచి తీసిన రెండు పేర్లు సీతా, సావిత్రి. సీత పేరును ఉచ్ఛరించినపుడు మన తలలు సిగ్గుతో ఎందుకు వాలిపోవని నేను అడుగుతున్నాను. నిర్దోషులైన మహిళలను ఎంతో కళంకితం చేసి, ఎంతో అమానుషంగా యాతనలు పెట్టి మనమంతా జెండాలపై కెక్కించి పూజించడం లేదా!

ఆయన మాటలతో నా ముఖం ఎర్రబడిపోయింది. బాహాటంగా నిలుచోబెట్టి ఆయన నన్ను తిట్టినట్టు అనిపించింది. "మన ఋషులు, మునులు రూపొందించిన ధర్మాలు నియమాలు అన్నీ మీ దృష్టిలో వ్యర్థమేనా?"

"వాటిని మ్యూజియంలో పెట్టాలనుకుంటె అందమైన అద్దాల బీరువాలుండడం మంచిది. కాని వాటిని ఈనాటి సమాజానికి సంబంధించిన చట్టాలుగా రుద్దాలంటె మాత్రం వాటిని పొయ్యిలో అంటించేసి టీ కాచుకోండి. మీ భుజాల పైకెక్కి మీ మెడలోకి దంతాలు దించుతున్న ఎలుగ్గొడ్డును విసిరి పారేసామని అట్టహాసంగా నవ్వి ఆనందించండి." నా ఆవేశాన్నిచూసి ఆనందిస్తూ తన జేబు లోంచి సిగిరెట్ పాకెట్‌ను తీసి అగ్గిపెట్టె వెతకసాగారు.

నాకు ఆయన సిగిరెట్ ఇవ్వబోతే అక్కరలేదని నేను ముఖాన్ని పరిశీలనగా చూసాను ఈయన చెల్లెలిలాగా ఈయన మెదడు కూడా పాడుకాలేదు కదా? ఆయన నోటితో పొగ ఊదుతూ కాలుతున్న అగ్గిపుల్లను ఆర్పుతున్నారు. అప్పుడు ఆయన తలను లాగి గోడకు కొడితే బయటికి వస్తున్న పొగ ఎలా ఉంటుందని నేను ఆలోచిస్తున్నాను. ఎంతో కష్టం మీద నిగ్రహించుకుని నేను అన్నాను. "మీ హిందూమతాన్ని మీరు ప్రపంచంలో కల్లా సర్వశ్రేష్ఠమైనదని అనుకోవడం లేదా?" ఆయన మళ్ళీ పెదాలు వంకరగాపెడుతూ చిరునవ్వుతో, "మీరు అసలు ఈ పురోగమిస్తున్న ప్రపంచానికి చాలా దూరంగా వుంటున్నారని

పిస్తున్నది. శ్రీమాన్ సమర్‌బాబు, మీ ఈ సంఘ్‌కి సంబంధించిన భాష అరేబియా సముద్రానికి ఆవల ఎవ్వరికి తెలియదు. ప్రపంచం ఒకవైపు ఆటం, హైడ్రోజన్ బాంబులను తయారుచేస్తూ ఉంటె, మీరు మీ గోబర్ సంస్కృతి (పేడ సంస్కృతి) కోసం ఏడుస్తున్నారు. మీ గొప్పలు చెప్పుకునే ముందు మిగతా నాగరికతలు, సంస్కృతులను పరిశీలించే ప్రయత్నం చేసారా? ప్రాచీన శిధిలాలు, జ్ఞానానికి సంబంధించిన గ్రంధాలు రోమ్, ఈజిప్టుల దగ్గర తక్కువేమీ లేవు. ప్రపంచానికి చైనా నాగరికత ప్రసాదించిన దానిలో సగం కూడా మరెవ్వరూ ఇవ్వలేదు. క్రైస్తవులను మీరు ఎన్నైనా తిట్టండి - వాళ్ళు మతాంతరీకరణ చేస్తారని నిందించండి కానీ ముక్కుముఖం తెలియని మంది దగ్గరికి వెళ్ళి, లెక్కలేనన్ని ఇబ్బందులు ఎదుర్కొంటూ, స్కూళ్ళు తెరుస్తారు, ఆసుపత్రులు తెరుస్తారు, మతం పేర తమ జీవితాలనే సమర్పించుకుంటారు. ఇక మీ వైపున విశ్వకళ్యాణం కోసం అని ఆవేశం ఉబికిరాగానే, సరాసరిన హిమాలయాలకు పారిపోయి తపస్సు చేసుకుంటారు. డబ్బుంటే దేవాలయాలు నిర్మించి సాధు సన్యాసులను పోషిస్తారు. పేదవాడైతే గుండు కొట్టించేసి పాలూ మీగడ తింటు కూచుంటాడు."

"మీరు కేవలం ఒక పార్శ్వాన్ని చూస్తున్నారు శిరీష్ అన్నయ్యా!" నేను అన్నాను.

"ఒకటా రెండా అనేది నేను ఎరుగను. మన ఎదుట వున్నది లేదా మనం దేనికి బలవుతున్నామో ఈ రోజు అనే పార్శ్వాన్ని మాత్రం నేను చూస్తున్నాను. మీ దగ్గర పాల నదులు ప్రవహించేవి, బంగారం వాన కురిసేది, కాని ఇప్పుడు ప్రపంచంలోకెల్లా మీది అజ్ఞానపు జాతి. మీ మతం అన్నింటికంటే అశాస్త్రీయ మైన మతం. మనిషి మేధో వికాసాన్ని విస్మరించి పనికిరాని అంశాలను జీవిత లక్ష్యంగా చూపే మతం. ప్రపంచంలోని విజ్ఞానాన్ని అంతా వేదాల్లో వెతికే ఆ మతం నిజంగానే చాలా దయనీయమైనది. ఇవ్వన్నీవింటూ వుంటే లక్నోలో జట్కాబళ్ళు తోలుతున్న నవాబులు గుర్తుకొస్తున్నారు అని ఆయన తన మాటలపై తానే పెద్దగా నవ్వసాగారు.

నేను ప్రయత్నపూర్వకంగా అన్నాను "ఈ బాహ్యామైన అంశాలపై కేంద్రీ కరించడం ఎప్పుడు మా లక్ష్యం కాలేదు. అందువల్ల మేము పరాయి దేశాలపై దురాక్రమణ జరుపలేదు. లేదా మతాన్ని ప్రపంచంలో వ్యాపింప చేయడానికి ధర్మ యుద్ధాలు చేయలేదు. మా లక్ష్యం ఎల్లప్పుడూ ఆధ్యాత్మిక

శాంతి, ఉన్నతి మాత్రమే."

ఈసారి సిగిరెట్ తాగడం మధ్యలోనే ఆపి ఆయన మళ్ళీ నవ్వారు. "మీ నిస్సహాయత్వాన్ని దాచుకోడానికి ఎంత అందమైన పదజాలం. దీనినే జనం పేదరికాన్ని పూజించడం అంటారు. పరాయి దేశాలపై దాడి చేయకపోవడానికి కారణం ఏదో దార్శనికమైన ఆధారమేమి కాదు. కాని నిజమేమిటంటె మీ దగ్గర బలం లేదు. కాకపోతే పరస్పరం యుద్ధాలు చేసుకోవడంలో, రాజ్యాలు కాజేయ డంలో మీరెప్పుడు వెనకబడేవారు కాదు. ఇక ఏ అశోకుడు, కనిష్కుడి దగ్గర బలం ఉన్నదో, వాళ్ళు పరాయి దేశాలను ఏదో దయతలచి వదిలివేశారు అనేది కూడా నిజం కాదు. నేను ప్రాచీన చరిత్ర గురించి కాని, గాలి కబుర్లు కాని చెప్పడం లేదు. నేను సూటిగా అడుగుతున్నాను. ఈ రోజు అసలు తన మనస్సులో ఎంతటి ఆధ్యాత్మిక శాంతి అనేది ఇక్కడ దానాలు, ట్రస్టులు, విరాళాలుగా వచ్చె డబ్బుతో పాలూ మీగడలను మెక్కడంలో ఉంది.

కత్తెరలా నడుస్తున్న ఈయన నాలుకను ఆపడానికి ఎలాంటి ప్రశ్న అడగాలని నా మనస్సు ఆరాటపడుతున్నది. అకస్మాత్తుగా నేను అడిగా ఈ విశ్వం ఉత్పత్తి ఎలా జరిగింది?

ఆయన మళ్ళీ పెద్దగా నవ్వి అన్నారు. మీరు ప్రాచీనకాలం నాటి ఋషులు మునుల మాదిరి శాస్త్రచర్చ చేస్తున్నారు. విశ్వం ఉత్పత్తి ఒక క్రమ పరిణామం లోనే జరిగింది. బ్రహ్మ తాను ఒంటరినని, అలా ఉండడం కుదరదని అనేకమై పోవాలని అనుకున్నాడు. తన గుణాల ప్రసారం చేసాడు. అప్పుడు ప్రకృతి వచ్చేసింది లేదా దేవుడుఅవు అన్నాడు. జగత్తు పుట్టింది. ఇందులో పెద్ద ఇబ్బంది ఏమిటి? ముక్కులోంచి పొగ వదులుతూ సిగిరెట్ను తెరిచిన ద్వారం గుండా బయటికి విసిరేసి ఆయన చిరునవ్వుతో సమర్‌బాబూ, ఈనాటి శాస్త్రవేత్తలు ఈ విశ్వం యొక్క ఉత్పత్తి గురించి ఏం చెబుతున్నారో అది అంతిమ సత్యమని నేను అనడం లేదు. కాని మిగతా అభూతకల్పనల కంటె ఇది నిజమనిపించడం లేదా! ఇక జ్ఞానానికి అసలు అంతమనేది ఉన్నదా? మనం తెలుసుకున్న కొద్ది మన జ్ఞానం పెరుగుతూనే ఉంటుంది. సరేలెండి. ఏమిటీ మనం కలుసుకోగానే ఇలా జగత్తు భూత, భవిష్యత్తుల గురించి చర్చ ప్రారంభించాం. మొదట ఆ తర్వాత ఇప్పుడు నేను మాట్లాడిన తీరు చూసి మీరు నన్ను వాగుడు కాయ అను కుంటున్నారా?

"లేదు, లేదు. మీ మూలంగా ఆలోచనలకు, పరిశీలనకు ఎంతో మసాలా

దొరికింది" నేను కొంచెం ఇబ్బందిగానే అన్నాను.

"అలాంటప్పుడు మీరు అసంపూర్ణమైన హిందూ అన్న మాట. నిజమైన హిందువు ఆలోచించడు. లేదా ఏమీ పరిశీలించడు. అతను ఆధ్యాత్మిక జ్ఞానమైన లేదా లంచం, నల్లబజారు డబ్బు వీటన్నింటిని ఆట్టే సొంతం చేసుకోగలడు. ఇంతకూ నా మాటలు మిమ్మల్ని నొప్పించి ఉంటె క్షమించండి. వాదనలో నాకు మరో ధ్యాస ఉండదు. ఏమి సరైనదని అనుకుంటానో అది అనేస్తాను."

"అదే కావాలి మరి. నేను మీతో అనేక విషయాలపై మాట్లాడాలి" నేను అన్నాను.

"తప్పకుండా. తప్పకుండా. ఇప్పుడిక మిమ్మల్ని ఇక తరుచుగా కలుస్తూనే వుంటాను. మీ నుండి కొంత నేను నేర్చుకోవచ్చు. కొన్ని అంశాల గురించి మీరు కూడా తిరిగి ఆలోచించవచ్చు."

"నానుండి ఏం నేర్చుకుంటారు?" నేను సిగ్గుపడుతూ కుంచించుకు పోయాను. నేలవైపు చూస్తూ అన్నాను. "మీరు చెప్పినవన్నీ కొత్తగానే ఉన్నాయి. ఎన్నో విషయాలను తెలుసుకున్నాను."

"అలాకాదు నేనైతే ఏ విషయాన్ని సంపూర్ణమని భావించను. ప్రతి వస్తువు వికాసం చెందుతూ ఉంటుంది. అందువల్ల పూర్ణజ్ఞాని అని ఎవరూ వుండరు. ఎవరిలోనైతె జిజ్ఞాస ఉంటుందో అతనినే నేను జ్ఞానిగా భావిస్తాను. తెలుసుకోవాలని కోరిక ఉన్నంతవరకు అతను జ్ఞాని. అది కాకపోతే లైబ్రేరీలోని పుస్తకానికి అతనికి తేడా లేదు. మీవి, దివాకర్ వి పరీక్షలైతె అయిపోయాయి కదా. ఇక ముందు ఎం చేయాలనుకుంటున్నారు?" ఆయన అన్నయ్యలాంటి ఆత్మీయతతో అన్నారు.

"ఇక ముందు ఏం చేయాలి అనేదే ఇప్పుడు సమస్య...? ఏమీ అర్థం కావడం లేదు." కొత్త వ్యక్తి ముందు నా ఇబ్బందులను ఏకరువు పెట్టడం నాకెప్పుడూ ఇష్టం ఉండదు.

"వీలైతె ఇక ముందు కూడా చదవండి. మీరు అభివృద్ధి సాధించగలరు."

"ఈ రోజుల్లో మీరేం చేస్తున్నారు?" ఈసారి నేను అడిగాను.

ఆయన ఒకసారి దివాకర్ వైపు చూసి చెప్పసాగారు. "నేను భారత ప్రభుత్వంలో నూటయాభై రూపాయల క్లర్కును. ఎంతో కష్టంపై సెలవు దొరుకుతుంది. శనివారం వచ్చి ఆదివారం తిరిగి వెళ్ళాలని అనుకుంటున్నాను."

నేను లేవడం చూసి ఆయన మళ్ళీ అన్నారు. "ఈసారి వస్తె మిమ్మల్ని

తప్పకుండా" కలుస్తాను. ఈ సాయంత్రమే నేను వెళ్ళిపోతున్నాను.

"మిమ్మల్ని కలుసుకోవడం నాకు ఎంతో ఆనందంగా వుంది. నాకంటె ఎంతో ఎక్కువ పరిజ్ఞానం ఉన్న వ్యక్తి ఇలా మొదటిసారి ఇంత ఆత్మీయంగా నాతో మాట్లాడాడు. నేను తన్మయుడనై పోయాను. నా మాట వినగానే ఆయన ముఖంపై స్నేహం పొంగిపొర్లింది. చేయి కలిపి నేను బయటికి వచ్చేసాను. దివాకర్ ఇంతవరకు అలా మౌనంగా ఇద్దరు పహిల్వాన్లను చూస్తున్నట్టు ఒకసారి నన్ను, ఇంకొసారి ఆయన్ను చూస్తూ ఉండిపోయాడు. చూసావా మా అన్నయ్యగారిని అనే మెప్పుకోలు వాడి ప్రతి దృష్టిలో కనపడింది. నేను దివాకర్‌తో అన్నాను కాస్త బయటికి రా. నీతో ముఖ్యమైన పని ఉంది."

అతను బయటికి రాగానే రోడ్డుదాకా నడచి నేను భారంగానే అడిగాను. "మిత్రమా, నాకెక్కడైనా ఉద్యోగం చూపించరాదు. నాకు నిజంగానే ఎంతో ఇబ్బందిగా వుంది. ఉద్యోగం దొరకకపోతే ఇపుడు నా చదువంతా ఇక్కడే ఆగిపోయి జీవితాంతం క్లర్కుగానే గడిచిపోతుంది. నీతోనే మరికొన్ని రోజులుండాలని ఉంది."

అనునయంగా ఉన్న నా స్వరంవల్లనో లేదా మరెందు వల్లనో అతను వెంటనే అన్నాడు. "సర్లే, నాకు ముందే ఎందుకు చెప్పలేదు? నేను ఈ రోజే నాన్నగారితో చెబుతాను. మరి రెండు మూడు చోట్లమాట్లాడుతాను."

"అపును మిత్రమా, నేను చదువుకోడానికి వీలు ఉండే పని దొరికితే చాలు. ఇప్పుడిక ఎంతో సీరియస్లీగా వెతకవలసిందే" నేను ఆదుర్దాగా మళ్ళీ అన్నాను.

"తప్పకుండా ప్రయత్నిద్దాం. నువ్వేం చింతించపద్దు." అతని దగ్గర సెలవు తీసుకుని రాగానే నా మస్తిష్కంలో ఒక పెద్ద భారీ యుద్ధంజరుగుతున్నది. శిరీష్ ఇచ్చిన జవాబులు నన్ను ఆందోళన పరచలేదు. కాని ఆయన అంత సులువుగా ప్రతీ అంశానికి వెంటనే జవాబు ఇచ్చిన తీరు నన్ను అశాంతిలోకి దింపింది. నిజంగానే ఆ రోజు నేను చాలా కొత్త విషయాలు తెలుసుకున్నాను.

## అయిదు

వెనకాల నుంచి వచ్చే ఒక్కమాట చెవుల్లోకి దూరకూడదని రెండు చెవుల్లోకి వేళ్ళు దోపి నేను బయటికి వచ్చేసాను.

సంధ్యా సమయం. ఆవులు, గేదెల మందలు రోడ్డుపై వున్న రిక్షాలను, టాంగాలను ఒక వైపు నెడుతూ దుమ్ము, పేడను వెదజల్లుతూ తిరిగి వస్తున్నాయి. అప్పుడూ మందిరంలోకి లేదా సంఘశాఖా సమావేశాలను వెళ్ళాలనే ధ్యాసేలేదు. వాటన్నింటికి ఎంతో, ఎంతో దూరం వచ్చేసినట్టు ఉంది. ఏ వ్యక్తికైతె వాటన్నింటితో సంబంధం ఉండేదో అతను మరొక మనిషి, నేను కాదు. అదంతా నాకిప్పుడు నిష్ప్రయోజనమని కాలాన్ని వ్యర్థంగా గడిపేయడమని ఈ రోజుల్లో జనం ఏ విధంగా కాలాన్ని వ్యర్థంగా గడిపేస్తున్నారో చూసి ఆశ్చర్యం వేసింది.

నా అదే పార్కులోకి వచ్చి అలా ఒరిగిపోయాను. నా పెళ్ళికి పూర్వం ఇక్కడికే వచ్చి పడుకునేవాణ్ణి. సాయంత్రం కావడానికి చాలా ఆలస్యముంది. జనం ఆ చిన్న రోడ్లపై సన్నని దారులగుండా అటూ ఇటూ షికార్లు కొడుతున్నారు. వాళ్ళు అలా నడుస్తూ నవ్వుతూ ఉంటె వీళ్ళకు ఎలాంటి చీకుచింతా లేదా అని అనిపిస్తున్నది. కిలకిలా నవ్వుతున్న పిల్ల వాణ్ణి తోపుడు బండిలో కూచోబెట్టుకుని ఆయా వెడుతున్నది. అప్పుడప్పుడు యువతి, యువకులు ఎంతో అన్యోన్యంగా నవ్వుతూ, తుళ్ళుతూ వెడుతుంటే దగ్గరలోని లాన్సలో కూర్చుని నిర్నిమేషంగా అలా తెరచిన కళ్ళతో చూస్తూవుండేవాణ్ణి. లోలోపల పళ్ళు పటపటా కొరుకుతూ అసలు వీళ్ళకు తిండిబట్టా గురించి ఏ చింతా ఉన్నట్టు లేదు. వెధవలు చూడూ ఎలా నడిచి వెడుతున్నారో. అయ్య బాగా సంపాదించి పెట్టి పోయుంటాడు. ఇంట్లో రెండు పూటలా గొణుగుడు ఉన్నా ఏదో సినిమాకు వెడుతున్నట్టు వచ్చేస్తున్నారు. పిచ్చి వెధవలు మరేం పని ఉన్నట్టు లేదు... నా ఈ కుళ్ళుబోతుతనంపై నాకే కోపం వచ్చింది. మరి నవ్వు కూడా. అసలు నాకు ఏమైపోయింది. ఇతరుల ఆనందాన్ని కూడా చూడలేక పోతున్నాను. కాని నేను ఏదో నల్లమందు మత్తులో స్పందన లేకుండా, చేష్టలుడిగి ఏదో నిస్సహాయుడిగా, రోగగ్రస్తుడిగా పడుకుని పైకి లేవడం చేతకాని వాడిలా అటుఇటూ చూస్తున్నాను. సగం తెరచిన కళ్ళతో నలువైపులా చూస్తున్నాను... ఒకవైపు పిల్లలు క్రికెట్ ఆడుతున్నారు. ఆ ఇద్దరు పిల్లలు సైకిల్‌పై వెడుతున్నారు. ఆ మనిషి ఉల్లాసంగా ఊగిపోతూ పుస్తకం చదువుతున్నాడు. ఆ నలుగురు అమ్మాయిలు జెడలు ఊపుతూ పచార్లు కొడుతున్నారు. ఆ కుర్రాడు కుక్కపిల్ల వెంట పరిగెడుతున్నాడు. అదో మళ్ళీ మరొక జంట వచ్చేసింది... ఏదో మరో లోకం నుంచి ఇవన్నీ చూస్తు వింటున్నట్టు

అనిపిస్తున్నది. అయితే ఇంటిలోంచి వస్తున్న మాటలు, అరుపులు ఇక్కడిదాకా వెంటాడుతున్నట్టు ఉంది... అబ్బా, అది ఇల్లేనా పురుగులు లుకలుకమంటున్న నరకం అది నరకం!

"రొట్టెలకు ఈ రోజు నెయ్యి పెట్టడం లేదేమి వదినా" ప్రభ పళ్ళెంలో వడ్డించి అమర్ ముందుకు జరుపగానే, అమర్ రొట్టెల వాలకాన్ని చూసి గొణిగాడు.

"నెయ్యి అయిపోయింది లాలాజీ" ప్రభ ఎంతో మెత్తని స్వరంతో అన్నది.

"మొన్ననే కదా సేరు తీసుకొచ్చాను. అప్పుడే అయిపోయిందా?" వాడు తీవ్రంగానే అడిగాడు.

"ఎంత మిగిలిందని?" పనిలో నిమగ్నమై ఉన్న ప్రభ పట్టించుకోకుండా అన్నది "ఇప్పుడు నువ్వే చూస్తున్నావు కదా ఇంట్లోనే ఉపయోగపడుతున్నది."

తనను ఉపేక్షించినట్లు భావించి అమర్ ఎదురుచెప్పాడు. "నీ మొగుడికే అంతా తినిపించానని చెప్పొచ్చు కదా, మేము చూడ్డంలేదా ఇంట్లో ఇంకెవరికి దొరికినా దొరకక పోయినా సమర్ అన్నయ్య పప్పులో బాగా నెయ్యి వేస్తావు. రొట్టెలకు బాగా నెయ్యి రుద్దుతావు. ఇక మా దగ్గరకు వచ్చేసరికి..."

"ఏమ్రా అమర్" నేను పెద్దగా అరిచాను. నేను అటు పక్కనే వరండాలో కూర్చుని బూట్లకు పాలిష్ చేస్తున్నానన్న సంగతి వాడికి తెలియదు. నేను నిప్పులు చెరుగుతున్న కళ్ళతో వాణ్ణి తీక్షణంగా చూస్తూ ఒక చేత్తో బూట్ పట్టుకుని వంట గదిలోకి వచ్చి నిలుచున్నాను.

నన్ను చూడగానే ఏమి చేయాలో తోచక. చిన్న చిన్న రొట్టె ముక్కలను నములసాగాడు.

వాడి వీపుపై లాగి తన్నాను. అప్పుడు అన్నాను "సిగ్గులేదురా వెధవ! ఎలా మాట్లాడాలో చేతకాదా? నోటికి కళ్ళెం లేదూ? నోటికి ఏది వస్తే అది వాగేయడమేనా? మెట్రిక్ వెలగబెడ్తున్నావ్ పైగా!

ఆ దెబ్బకు వాడు తట్టుకోలేక నన్నొకసారి చూసిన తర్వాత. పళ్ళెన్నిగిరా టేసి, ఏడుస్తూ అరుస్తూ బయటికి వెళ్లిపోయాడు.

ప్రభ రొట్టెలు చేయడం మానేసి గభాలున మెడ తిప్పి నన్ను తీక్షణంగా చూసింది. "అలా బయట కూర్చుని బూట్లకు పాలిష్ చేస్తున్న వాళ్ళు ఆ బూట్లతో వంట గదిలోకి వచ్చేరేమిటి..."

నేను గొంతు చించుకుని అన్నాను "నువ్వు ఊరుకో. వీడు ఇంత పెద్ద

వాడయ్యాడు. కనీసం ఎలామాట్లాడాలో తెలియదు."

అప్పుడే బయట మంచంపై నుంచి అమ్మ పెద్దగా అరిచింది. "ఒరేయ్ సమర్ వెధవ ఇలైతే రా కొంచెం. అదేనా నీకు భార్య. మిగతా వాళ్ళకు మరేమీ కాదా?"

వరండాలో బూట్లు పడేసి గబాగబా వెళ్ళి అమ్మ ఎదుట నిలుచున్నాను. అమర్ మరోవైపు నిలుచుని ఏడుస్తున్నాడు.

"ఏవిటా భోంచేస్తున్న వాణ్ణి ఎందుకు కొట్టావ్?" జపమాల చివరి పూసను కళ్ళకద్దుకుని అన్నది - నీ చెయ్యి చాలా లేస్తున్నది ఏమిటి, అసలు నీ మనసులో ఉందేమిటి చెప్పు?"

"చెయ్యి ఎత్తడమేమిటి?" నేను గొంతు చించుకుని అన్నాను "వీడు తన కంటె పెద్ద వాళ్ళతో మర్యాదగా మాట్లాడలేడా?"

"నేను ఏం అమర్యాదగా మాట్లాడానో చెప్పు" అమర్ తల బిరుసుతో మొండిగా అన్నాడు. "నేను ఏమన్నానని, మొన్ననే తెచ్చిన సేరు నెయ్యి ఇంత తొందరగా అయిపోయిందే ఏమిటని అన్నానంతే!"

"ఎదురుగా ఉండగానే అబద్ధం చెబుతున్నవ్. అమ్మ అండ చూసుకుని ఎగరకు. అమర్ ఇంకా నేను ఇక్కడే ఉన్నానని మరచిపోకు." నేను చేతిలో ఉన్న బ్రష్‌తో వాడి పైకి విరుచుకుపడ్డాను.

"జాగ్రత్త, పిల్లాడిపై చెయ్యి లేపావో బాగుండదు!" అమ్మ ఒక్కసారే గర్జించి చివాట్లు వేసింది. "నేను ఇంకా బతికే వున్నాను. వాడితో అలా కోపంగా ఎలా ప్రవర్తిస్తావో చూస్తాను. మేమంతా ఇప్పుడు నీకు శత్రువుల్లా కనపడుతున్నాం. నీ ఈ లక్షణాలన్ని నాకు ముందే తెలుసు. ఆ తలమాసిన దానికోసం తమ్ముడిపై చెయ్యి చేసుకుంటున్నావ్. అసలు నీకు సిగ్గుంటె కదా వాడికి నేర్పడానికి వస్తున్నావ్. ఏ నోటితో ఇవన్నీ అంటున్నావ్. నీ గారాల రాణీతో మాట్లాడడం మొదలు పెట్టావో లేదో ఆకాశం సొంతం తలపై మోస్తున్నావు. రోజూ ఏదో ఒక ఉపద్రవం. రోజూ ఏదో ఒక అల్లరి. అసలు నువ్వు దానితో మాట్లాడకుండా ఉన్నప్పుడే బాగుండేది.

"నేను మాట్లాడలేదు కాబట్టి అందరూ తలమీదకెక్కి కూర్చున్నారు. ఎవర్ని లెక్కచేయడమే లేదు. మర్యాద ఒక పద్ధతి దేన్నని అంటారో ఎవరికీ తెలియదు." నేను సమాధానమిచ్చాను.

"అవును. అవునురా బాబూ, మాకు మర్యాదా పద్ధతి అనేవి ఎలా

తెలుస్తాయి. నువ్వు అయితే ఒక్క రోజులో ఆ పుచ్చిపోయిన మొహం దాని దగ్గర నేర్చుకున్నావు కదా? ఇప్పుడు కదా నీకు దొరికింది ఒక గురువు. అబ్బో, మా బాబే మాకు మర్యాదా, పద్ధతి నేర్పుతున్నాడు. నిన్నటిదాకా నీకు నడవడం చాత కానపుడు ఆ మర్యాద నేర్పించేది ఎందుకు రాలేదట. ఇప్పుడేమో ఆకాశంలో ఎగురుతున్నావు. నేల మీద నడువు కొడకా, నేల మీద. అసలు సిగ్గులేనివాడు నువ్వా వాడా, ఎప్పుడు చూసినా భార్యను వెనకేసుకొస్తావ్. తల్లి ధ్యాస లేదు, నాన్న ధ్యాస లేదు. నీకు చిన్నా, పెద్దా అనేది లేకుండా పోయింది. మేమైతే..." అప్పుడు ఏడుపు ప్రారంభించింది.

"నువ్వు స్వంతంగా ఏమి ఆలోచించవు. ఇతరులు ఏదైనా చెబితే భార్యను వెనకేసుకొచ్చాతంటావ్. ఎన్ని నెలలై పోయంది. ఆమె ఎప్పుడు తింటున్నది, ఎప్పుడు పడుకుంటున్నది. అనే ధ్యాస ఎవరికైనా ఉన్నదా? ఒక్క చీర అడిగితే లోకంలో లేని మహాభారతం? వదినకు ఏమీ చేతకాదా? అపును, ఆమె ఎందుకు చేస్తుంది. ఆమె పెద్ద కోడలు కదా, అత్తగారి స్థానంలో ఉంది. ఆమెకేం మహారాణి, మిగతావాళ్ళంతా దాసీలు..."

"అదెందుకు దాసీ దవుతుంది. అసలు మేమంతా దాసీలం. జీవితాంతం కూర్చోబెట్టి తినిపించాం. ఇంకా తినిపిస్తాం. మొదట్లో ఒక్కరికి తినిపిస్తే ఇప్పుడు ఇద్దరిద్దరికి తినిపిస్తాం." ఏడుస్తున్న పాపను బలవంతంగా మంచంపై కూలేసి పదిన రంగం మీదకు వచ్చేసింది. గొణుగుతూనే తిన్నగా వంటగదిలోకి వెళ్ళిపోయి ప్రభను జబర్దస్తీగా పీటపై నుంచి లాగుతూ అన్నది నువ్వు జరుగు తల్లీ, నీకు కష్టం అవుతుందనుకుంటా. నేను చేస్తాను."

"నేను చేస్తూనే వున్నాగా... నిన్ను నేనేమైనా అని ఉంటె నన్ను అను, నాపై కోపమెందుకు..." ప్రభ నచ్చజెపుతున్న ధోరణిలో మాట్లాడసాగింది. కాని వదిన చేతిలో ఒక ప్రచండమైన శక్తి వచ్చేసింది. చిక్కిపోయిన ప్రభ శరీరాన్ని లేపి ఒక పక్కన పెట్టి తను దఢాలున పీటపై కూర్చుని గబగబా రొట్టెలను కాల్చ సాగింది. ప్రభ కళ్ళల్లో నీళ్ళు ఉలికి వచ్చాయి. స్తబ్దంగా అక్కడే కూర్చుని చూస్తూ ఉండిపోయింది. ఆ తర్వాత చిమ్మటతో నిప్పులపై వున్న రొట్టెలను అటూ ఇటూ తిప్పసాగింది.

"సంపాదించేది లేదు కాని ఇంకా చదవాలట, ఇంకా చదవాలట..." అమ్మ అలానే గొణుగుతూ వుండిపోయింది. వదిన గభాలున ప్రభ చేతిలోంచి చిమ్మట లాక్కున్నది. మూతి ఉబ్బించి, తన బలాన్నంతా చూపుతూ ఉబ్బిన

రొట్టెలను పళ్ళు నూరుతూ చెక్కపై కొట్టసాగింది. నాలుగైదు నిముషాలు నిశ్శబ్దంగా అలా కూర్చున్న తర్వాత ఏం చేయాలో ప్రభకు తోచక ఒక నేరస్థురాలిగా మెల్లిగా లేచి, ఏడుస్తున్న పాప దగ్గరికి వెళ్ళింది. వదిన కోపంతో ఆ పాపను అక్కడ పడేసిందేమో అది గొంతంతా చించుకుని ఏడుస్తున్నది. ప్రభ దాన్ని లేపి చేతులపై అలా ఊపుతూ బుజ్జగిస్తున్నది.

రొట్టెల్ని కాలుస్తున్న వదినకు ఇది తెలిసింది. అన్నీ వదిలేసి ధమ ధమ వచ్చి ప్రభ దగ్గర ఉన్న పాపను బలవంతంగా లాక్కుంటూ అన్నది - ఉండనీ తల్లి దానిని వదిలేసేయ్. దాన్ని అలా ఏడవనివ్వు. ఆ మాత్రం ఏడిస్తే ఏం చావదులే. దానదృష్టంలో ఏడ్వడమే రాసుంటే ఏడుస్తుంటుంది. మహా అయితే చస్తుంది అంతే కదా. నీ ఆత్మకైతే సంతోషం కలుగుతుందిలే.

ఈ వ్యవహారానికంతా తనను బాధ్యురాలిగా చేస్తున్నట్టు ప్రభకు అనిపించింది. ఈ అనుకోని పరిస్థితికి ఆమె వస్తున్న ఏడుపును ఆపుకుంటూ అన్నది "అక్కయ్య నేనేమీ అనలేదు. నన్ను ఎందుకు ఇవన్నీ అంటున్నావ్...?" పాపను ఇవ్వకుండా ప్రభ మొండికెత్తేసరికి అటూ అటూ లాగడంలో పాప మరింత పెద్దగా ఏడవసాగింది

అలా నిశ్చేష్టుడనై నేను వాళ్ళను ప్రేక్షకుడిలా చూస్తూ ఉండిపోయాను. నేను గట్టిగా అన్నాను - పాపను ఇచ్చేయ్ ప్రభ. ఎవ్వర్ని ఏమీ అనకూడదు. అన్నామో ప్రతి ఒక్కరూ ఎగురుతుంటారు. ఆ గొడవ నుంచి పారిపోవాలని అలా అనేసి బయటపడి వచ్చేస్తూ ఉండగా...

ప్రభ చేతుల్లోంచి పాపను లాక్కొని వదిన దాన్ని మళ్ళి మంచంపై పడేసి వంటగదిలోకి వెళ్ళిపోయింది. నేను వచ్చేసిన తర్వాత ఏం జరిగిందో తెలియదు. ప్రభ ఏదో ఒక తుఫానును ఎదుర్కొని ఉంటుందని నేను ఊహించాను. నా మెదడు మొద్దుబారిపోయింది. అప్పుడు...

పార్కులో అలా ఒరిగి ఇంటి పరిస్థితినంతా జ్ఞాపకం చేసుకోగానే నరాలు చిట్లిపోసాగాయి.

ఎక్కడో నాకు చాలా దగ్గరే హఠాత్తుగా తుపాకీ పేలింది. ఆకాశాన్ని చీల్చి నట్టున్న ఆ చప్పుడుకు ఉలిక్కిపడి గభాలున లేచి నిలుచున్నాను. ఎవరో నన్ను తుపాకి గురిచూసి కొడుతున్నారనిపించింది. తర్వాత అటూ ఇటూ చూసాను. పార్కుకు మరో చివర కొంతమంది ఎవరినో చుట్టుముట్టి నిలుచున్నారు. అన్ని మరచిపోయి నేను గబాగబా అటు నడిచాను. వది,

పదిహేను మంది ఉన్న గుంపు మధ్య పొడగాటి నాలుక, నురుగలు కక్కుతూ మెలిపడిన మెడతో ఒక పెద్ద గుర్రం తన నాలుగు కాళ్ళను చాచుకుని ప్రాణం వదులుతున్నది. చిక్కగా ఉన్న రక్తపుధార ఎండిన గడ్డి వున్న నేలపై కొంచెం దూరం దాకా పారి గడ్డకట్టుకుపోయింది. గుర్రం ఎదుటి కాళ్లపై భాగంలో రంధ్రం పడి వుంది. అందులోంచి రక్తం కారుతూ ఆగిపోయింది. దానితోపాటు ఏదో తెల్లని ద్రవ పదార్థం వచ్చే సింది. కాస్త దూరంలో ఖాకీ ప్యాంటు - తెల్ల షర్టులో నిలుచున్న ఒక ఆసామి చేతి రుమాలుతో కన్నీళ్ళు తుడ్చుకుంటున్నాడు. మరో చేతిలో నేలకు ఆని వున్న తుపాకి వుంది. అయన అలా నిలుచుని ఏడుస్తున్నట్టున్నాడు. నా పక్కనే వున్న వ్యక్తిని అడిగాను ఏమి జరిగిందండి? అతను బాధగా అన్నాడు - పోలీసు సూపరెంటుగారి గుర్రం. ఎంతో ప్రేమగా చూసేవారు, చాలా కాలం నుంచి జబ్బుతో, బాధతో ప్రాణాలు తీసుకుంటున్నది. ఎంతకూ నయం కాకపోయేసరికి చంపేసారు.

"భలేవాడే ఏం ప్రేమగా చూసుకునే వాడో, జబ్బు పడగానే చంపేసాడు. జీవితాంతం సవారీ మోసింది. అది జబ్బుపడితే చంపేస్తాడా? ఇక ఒక రోజు ఇలానే ముసలితండ్రిని కూడా చంపేస్తాడేమో. నేను అసహ్యంగా కోపంతో మూతి తిప్పుతూ అన్నాను. ఇంకా ఏమేమి అనేవాణ్ణో. అప్పుడే ఆ పక్కనున్న మనిషి తిరస్కార భావంతో నన్ను చూసి అంటే మిగిలిన జీవితమంతా ఘోరంగాతీసుకుంటు యాతన పడితే బాగుండేదా? ఇప్పుడు ఒక్క నిముషం బాధ కలిగి ఉంటుంది. కాని పాపం ఆ యాతన నుంచి ముక్తి పొందలేదా? కొందరేమోయాతనను చూడగలరు. మరి కొందరు చూడలేరు."

నేను నోరు మూసుకుని మెల్లిగా అక్కడినుంచి జారుకున్నాను. కొంచెందూరం వెళ్ళిన తర్వాత తలపై రెండు మూడు సార్లు కొట్టుకుని ఈ తలకు ఇంతకూ ఏమైంది? ఆ మాత్రం నాకు అర్థం కాకపోవడమేమిటి. అతను చెప్పింది నిజమే కదా! సూపరెంటుగారు ఏం తప్పు చేసారని. ఇదే విధంగా ఆ రోజు కూడా శిరీష్ చెప్పిన మాటలు నాకు అర్థం కాలేదు. పాపం అతను కూడా ఎంతో కరెక్టుగా చెప్పాడు. నా మెదడే మొద్దుబారిపోయింది.

రాత్రి పది గంటలకు నేను ఇంటికి తిరిగిరాగానే ఏం చెయ్యాలో నాకు తోచలేదు. తలలో పేడఅయినా నిండి వుండాలి లేదా ఖాళీగానైనా ఉండాలి. విపరీతంగా తలపోటు. ఇంట్లో ఎటుచూసినా నిశ్శబ్దమే. అందరూ ఇప్పుడు నిద్ర పోతున్నారు. తలుపులు దగ్గరికి వేసి ఉన్నాయి. అమ్మయ్యో లేదా నాన్నగారో

ఇంతవరకు తిరిగి వచ్చినట్టు లేదు. నేను నెమ్మదిగా మిద్దె మీదికి వెళ్ళిపోయాను. ఏప్రిల్ మాసం గడిచిపోయింది. అందరూ మిద్దెపైనే పడుకుని ఉన్నారు. నా గది లోకి వచ్చేసి దుస్తులు మార్చుకోకుండానే పక్కపై పడ్డాను. గదిలోపల అంతా వేడిగా ఉంది నిద్రవచ్చే జాడ కనపడడం లేదు. అలానే శూన్యదృక్కులతో పైకప్పు చూస్తుండిపోయాను.

అప్పుడే ఎటునుంచో వచ్చి నా పక్కన కూర్చుండిపోయింది. జంకుతూనే నా భుజాన్ని తాకి అన్నది "అన్నం తినరా."

నాకు ఆమె మొఖం కనపడడం లేదు. ఇలాంటి, క్షణం వస్తుందని నేను లోలోపల అనుమానించాను. భావరహితంగా కదలకుండా అన్నాను "లేదు, నువ్వు తిన్నావా?"

"లేదు"... ఆమె నా తలపై తన అరచేతిని ఆనించి అన్నది.

నేనేమో గభాల్న ప్రభ తొడల మీద నా మొఖాన్ని దూర్చి ఏడ్చేసాను. "ప్రభా, ప్రభ నువ్వే చెప్పు. ఏం చేద్దాం? ఎక్కడికి వెడదాం?"

## ఆరు

మీ మనసులో ఏదైనా ఒక సంతోష వార్త ఉరకలు వేస్తుంటె సాధ్యమైనంత తొందరగా ఇంటికివెళ్ళి ఆ వార్తను చెప్పాలనుకుంటే అప్పుడే మిమ్మల్ని ఏవో మాటల్లో ఇరికించి లేదా చర్చలో ఏదో చిక్కుముడిని తీస్తూ ఉంటె మనస్సులో ఎంత చిరాకు వేస్తుందో శిష్టాచారాన్ని సభ్యతను ఒక మూలకుతోసేసి గభాలున లేచి ఇలా అనాలనిపిస్తుంది... "మీ వాగుడిని వెంటనే కట్టిపెట్టండి ఈ సంతోష వార్తను నేను వెళ్ళి మొట్టమొదట నా భార్యకు వినిపించాలి." దివాకర్ డ్రాయింగ్ రూంలో నా పరిస్థితి దాదాపు ఇలానే ఉంది.

దివాకర్ అడిగాడు. "పని చేస్తావా?"

"అవునవును ఏదైనా దొరికిందా?" నేను ఆపుకోలేక వెంటనే లేచినిలుచున్నాను.

"దొరికింది అనుకో. కాని చాలా దూరం వుంది" దివాకర్ చెప్పాడు. ఒక విధంగా పట్నానికి మరో కొసన వున్నది.

"మిత్రమా నువ్వు అయితే చెప్పు. నువ్వు పట్నం మాట అంటావేమిటి?

నేను ప్రపంచానికి మరో కొస దాకా వెళ్ళిపోతాను." నేను అతని భుజంపై చెయ్యి పెట్టి అన్నాను.

"షరతేమిటంటె నువ్వు థర్డ్ ఇయర్ జాయిన్ కావాలి."

"ఆహా! తప్పకుండా మిత్రమా నువ్వు అయితే చెప్పు ముందు." నేను చిరాకుతోనే చిరునవ్వు విసిరాను.

"అయితే విను, ఒక ప్రెస్సులో ప్రూఫ్ రీడింగ్ పని ఉంది." పొద్దున అయిదింటి నుంచి పదకొండు వరకు సమయాన్ని నిర్ణయించాము. ఎందువల్లనంటె నువ్వు అటు నుంచి తిన్నగా కాలేజికి రావాలి కదా.

"ఎవరు వాళ్ళు, ఎక్కడున్నారు? దివాకర్ చెప్పు సరిగ్గా. ఏమి ఇస్తారు?"

"మరీ అంత తొందర పడకు. నాన్నగారి స్నేహితుడి ప్రెస్సు అది. ప్రస్తుతం మరీ ఎక్కువేం కాదు. కాని రెండు మూడు నెలల తర్వాత చెబితే పెంచుతారు."

"అసలు ఎంత ఇస్తారో చెప్పు ముందు."

"డెబ్బై అయిదు రూపాయలు, ఒకటి, రెండు నెలల తర్వాత ఒక వంద చేయించవచ్చు. కాని నువ్వు మరీ ఇంత ఇదవుతున్నావేంటి?" చిన్న పిల్లాడిలాంటి ఆదుర్దాను చూసి నవ్వాడు.

"ఎంతో అవసరంరా బాబూ దివాకర్," కృతజ్ఞతతో గద్గద స్వరంతో నేనన్నాను. "ఈ పని నాకు దొరికితే దివాకర్ నన్ను నీవు ఉద్ధరించినవాడవు అవుతావు. నేను ఎలాంటి బాధల్లో ఉన్నానో నీకు తెలియదు. ఇంట్లో ఒక్క నిముషం కూడా శాంతి లేదు... ఎప్పుడు వెళదాం. నడు, ఇప్పుడే వెడితే." నా మనస్సులో ఏదో ఉప్పెన లేస్తున్నట్టు ఉంది.

దివాకర్ ఒక క్షణం నా మొహాన్ని చూసి అన్నాడు "సరే అయితే నడు." వ్యవహారమంతా నిర్ణయించిన తర్వాత కూడా నాకెందుకో నమ్మకం కలుగలేదు. డెబ్భై అయిదు రూపాయలిచ్చే ఉద్యోగం నిజంగానే నాకు దొరికిందా? అసలు పైసాపైసాకు దేవులాడడమే నా భాగ్యరేఖలా మారిపోయిందని నేను అనుకునేవాణ్ణి. ఇప్పుడు నెలకు డెబ్భై అయిదు రూపాయల జీతం అంటె నమ్మలేని ఒక కలలాగా అనిపిస్తున్నది. పాపం శిరీష్ గారికి ఇంతకంటె కొంచెం ఎక్కువే దొరుకుతుంది. పైగా ఆయన దినమంతా పని చేయాలి. తిరిగి వస్తుండగా వెంటనే ఎగిరి వెళ్ళి "చూడు ప్రభ నాకు ఉద్యోగం వచ్చేసింది" అని చెప్పాలని అనిపించింది. దివాకర్ మూలం

గానే ఇదంతా జరిగింది. లేకపోతే అలా కుళ్ళి కుళ్ళి చచ్చిపోయేవాణ్ని. నేను అతనితో పాటు ఇంటిదాకా తిరిగివచ్చాను. ఉదయం అయిదు నుంచి పదకొండు దాకా ప్రెస్సులో ఉండాలని ఆ తర్వాత సరాసరిన కాలేజికి వెళ్ళాలని నిర్ణయం జరిగింది. అదృష్టవశాత్తు థర్డ్ ఇయర్‌కు సంబంధించిన మొదటి పీరియడ్ ఉండకూడదు. అదృష్టం నన్ను ఇంతదాకా కనికరించి నపుడు అది కూడా సాధ్యమే. కాకపోతే అటెండెన్స్ కోసం ఎవరో ఒక ప్రొఫెసర్‌ని బతిమిలాడాలి. ఆ పీరియడ్‌ను వదిలివేస్తాను. దివాకర్ కాళ్ళను కౌగిలించుకోవాలని నాకనిపించింది.

"దివాకర్ నువ్వు నన్ను రక్షించావ్. లేకపోతే నిజంగా నేను పిచ్చి వాడిని అయిపోయేవాణ్ణి. మా యింటి పరిస్థితి ఎలా ఉందో నీకు తెలియదు. నీకు నేను ఎలా కృతజ్ఞతలు చెప్పుకోవాలో అర్థం కావడం లేదు." నా కళ్ళల్లో నీళ్ళుతిరిగాయి.

"అబ్బే, పెద్దగా నేను చేసినదేమిటి? కష్టాలతో సంఘర్షణకు మారు పేరు వీరత్వం. అదేంటి, నాకు ఉపదేశం చేస్తుంటావే. మరి నువ్వు స్వయంగా ఇలా బెంబేలు పడిపోతే ఎలా?" నన్ను మామూలు స్థితికి తీసుకురావాలని మాటమార్చి అన్నాడు. "కాని మిత్రమా, నీకు చాలా దూరమవుతుంది అని పిస్తుంది. రానూ పోనూ, తిండి తిప్పలకు చాలా ఇబ్బంది అవుతుంది."

"దూరం సంగతి వదిలేయ్. మహా అయితే రెండు మైళ్ళు ఉంటుంది. పెందరాళే షికారుకి వెళ్ళినట్టు ఉంటుంది. కాని తిండి విషయం మాత్రం సమస్యనే" ఆలోచించి మళ్ళీ అన్నాను "అది కూడ పెద్ద ఇబ్బంది కాదను కుంటాను. ప్రభ వండిపెడుతుంది. పొద్దున్నే మరి కాస్త తొందరగా లేవాలి అంతే. లేదా రాత్రికే తయారుచేసి పెడుతుంది. దివాకర్ నేను ఎలాగైనా యం.ఏ. పూర్తి చేయాలని ఆమె కోరిక. ఇప్పుడు ఈ ఉద్యోగం మాట వినగానే ఆనందంగా గంతులేస్తుంది."

"అది సరే ఇప్పుడు చెప్పు" అతను స్ఫురణకు తెచ్చుకుంటూ అడిగాడు. "ఆ రోజు నువ్వు కిరణ్‌తో..."

మన్నించమని స్వరంతో నేను అతని రెండు చేతులు పట్టుకున్నాను. "మిత్రమా, అన్నీ గడిచిపోతాయ్. ఇదీ కాస్తా గడిచిపోనివ్వు. మరి ఎప్పుడైనా కూర్చుని అన్నీ చెబుతాను."

"సరే నీ ఇష్టం. కాని అంత పొద్దున్నే వండి పెట్టాలంటె ఆమెకు కష్టం

కాదా? ఎందువల్లనంటె ఇక్కడికి అయిదు గంటలకే చేరాలంటె నువ్వు నాలుగు, నాలుగున్నర గంటలకు బయల్దేరాలన్నమాట. అంటే మూడు, మూడు నలభై అయిదుకో లేవాలి. ఎంతైనా ఇబ్బందే."

"అన్నీ సర్దుకుపోతాయ్ దివాకర్, అన్నీ. ఆమె ఏమిటో నీకు తెలియదు. ఆమె ఎన్ని కష్టాలు భరించిందో ఎవరికి తెలియదు. ఆమె నా కోసం ఏమైనా చేస్తుంది. ఏమైనా భరిస్తుంది. నాలాంటి దురదృష్టవంతుడి కోసం ప్రభ చేస్తున్న త్యాగం, భరిస్తున్న కష్టాలు స్ఫురణకు రాగానే నా కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి. విహ్వలత మూలంగా నా కింది పెదవి వణకడం ప్రారంభించింది. నా ఏడుపును కప్పి పుచ్చుకోడానికి మరో వైపు చూడసాగాను. ప్రభ ఎదుట కూడా ఇలానే రోదించడం బాగుండదు. కాస్సేపు మేమిద్దరం ఏమీ మాట్లాడ కుండా నడిచాము. ఆ తర్వాత అతి కష్టం మీద అడిగాను - "దివాకర్, కొంత డబ్బు బదులు ఇస్తావా?"

"ఎంత?"

"ఇరవై చాలు. దొరకగానే తిరిగి ఇచ్చేస్తాను." ఈ రోజు ఇంటికి ఖాళీ చేతులతో వెళ్ళకూడదనుకున్నాను. ప్రభ కోసం ఏదో ఒకటి తీసుకెడితే ఎంతో ఆనందిస్తుంది. ఆమెకు చీర కూడా ఎంతో అవసరం.

నా దగ్గర లేవు. కిరణ్ దగ్గర వుంటే ఇస్తాను - "అది సరే! శిరీష్ అన్నయ్య నిన్ను జ్ఞాపకం చేసారు. ఈ రోజు శనివారం కదా మధ్యాహ్నమే దిగారు. చెల్లెల్ని కలపడానికి వెళ్ళారు. ఈపాటికి తిరిగి వచ్చి వుంటారు."

నాకు అసలు ఇప్పుడు ఎక్కడికి వెళ్ళాలని లేదు. ఎవ్వర్నీ కలవాలని లేదు. మొదలు ప్రభ దగ్గరికి వెళ్ళి ఈ విషయం చెప్పాలి. మరి దివాకర్ దగ్గర డబ్బు తీసుకోవాలి కదా! పైగా ఇపుడు నేను అతనికి ఎంత కృతజ్ఞత అంటే అతను నన్ను నరకానికి వెళ్ళమన్నా వెడతాను. నడుస్తూనే అడిగాను "ఇంతకు నాకు ఆదివారం సెలవు వుంటుంది కద్రా!"

"తప్పకుండా వుంటుంది. ఆదివారం పని చేయిస్తే వోవర్ టైము కట్టిస్తారు." నాకు నచ్చజెబుతూ అతను అన్నాడు - "నీకు ప్రూఫ్ రీడింగ్ రాదు. నేర్చు కోడానికి ఐదారు రోజులైనా పడుతుంది."

"అరే, అన్నీ నేర్చుకుంటాను మిత్రమా! నీలా చేతకాని వాడనను కున్నావా?" అని అకారణంగానే గలగలా నవ్వేసాను.

వణుకుతున్న చేతులతో ఇరవై రూపాయలు జేబులో పెట్టుకుంటూ

వుండగానే, డ్రాయింగ్ రూంలోకి శిరీష్ భాయి ప్రవేశించి - "ఏమిటండీ, నేను రాగానే వెళ్ళిపోతున్నారే?"

"మీ కోసమే ఇందాకా వచ్చానండి. చెల్లెలు ఆరోగ్యం ఎలా వుంది?" అడుగుతూనే, మరో వైపు ఈ డబ్బుతో రెండు ధోవతులైనా (చీరలైనా) కొనుక్కుని వెళ్ళవచ్చని అనుకున్నాను.

ఆయన అలసిపోయిన వాడిలా కుర్చీపై కూచున్నారు. గాఢంగా శ్వాసించి అన్నారు- "ఫర్వాలేదు! కొంతకాలం ఎలాగైనా పడుతుంది. దివాకర్ భాయి, మన్నించాలి. నిన్ను నాతో పాటు వస్తావా అని అడిగానే కానీ ఎందుకో మన స్సంతా ఆందోళనగా వుంది, నేనే వెళ్ళిపోయాను. సరే, ఇంతకు మీరంతా ఎలా వున్నారు?"

"బాగానే..."

"అరే, అసలు నేను ఈ కొత్త విషయం చూడనే లేదు." ఆయన నన్ను మధ్యలోనే ఆపుతు అన్నారు- "మీ పిలక ఏమైంది?" నన్ను చూసి దివాకర్ కూడా గంతేసి అన్నాడు- "అరే, నిజమే - నేను గమనించనే లేదు! ఎలా జరిగింది?"

వెంటనే నా ముఖం ఎర్రబడింది. నిన్న క్షవరం చేయించుకుంటూ వుండగా, పిలకను కూడా కత్తిరించి వేయమన్నాను. అలా చేయడంలో శిరీష్‌భాయి భయమూ లేక పిలకవల్ల ఎలాంటి ప్రయోజనం లేదనే జ్ఞానమూ తెలియదు. కాని పిలక తీసేసిన తర్వాత బయటికి వెళ్ళాలంటె ధైర్యం లేక సంకోచం, కాస్త సిగ్గు వేసిన మాట వాస్తవం. తలపై చెయ్యిని రాసుకుంటూ, ఎగురుతున్న క్రాపును అణచి పెడుతున్నట్టు నటించి, పిలక తొలగిన విషయాన్ని దాచాలని ప్రయత్నించాను. ఇంటి వాళ్ళు తప్పకుండా కేకలు వేస్తారు. బయటి వాళ్ళు కూడా ఇబ్బంది పెడతారు నా పిలక ఏమైందో, అయితే ఇంతకు ముందే పిలకను క్రాపు కింద అణచి దువ్వుతున్నందు వల్ల, ఇప్పుడు ఎవ్వరూ వెంటనే గమనించక పోవచ్చు. కానీ ఇంటి వాళ్ళ నుంచి ఎంత కాలం దాచగలను? చీవాట్లు వేస్తారు. "జెంటిల్‌మన్ అవుతున్నాడు - ఫ్యాషన్ పిచ్చాడు - మన ఆచార వ్యవహారాలు మిగిలితేనా?" మొదలు టోపీ పెట్టు కోవాలనుకున్నాను. కాని అలా జరిగితే వెంటనే దృష్టిని ఆకర్షిస్తాను - పైగా ఎప్పుడూ టోపీ పెట్టుకోలేదు. బయటికి వెళ్ళినా, రోడ్డుపై నడుస్తున్నా, ఇంట్లో వున్నా - అందరూ నన్నే చూసి పిలకను కత్తిరించేసుకున్నానని కని

పెట్టారని అనుకున్నాను. ఉద్యోగం దొరికిన సంతోషంలో అదంతా మరచిపో యాను. కానీ ఇప్పుడు శిరీష్‌భాయి ఆ మాట అనగానే మళ్ళీ కొత్తగా సిగ్గు మొదలైంది.

"ఒక్కసారి జరిగిన చర్చతోనే జపం గిపం అన్నీ వదిలేసినట్టున్నావ్?" దివాకర్ ఎత్తి పొడవగానే నేను స్పృహలోకి వచ్చాను - "ఇంతసేపు నీతో వున్నాను, కానీ నేను గమనించనే లేదు నీ పిలకను."

ఈసారి శిరీష్ భాయి నా పక్షం వహించాడు. "అర్థమయ్యే పనిని చేస్తూ పోతారు. నీలాగా దద్దమ్మ అనుకున్నావా?"

"ఇప్పుడు బావుంది. మనిషిలా కనపడుతున్నావ్. లేకపోతే కార్టూన్‌లా తిరిగేవాడివి" అని దివాకర్ అకారణంగానే నవ్వాడు. అప్పుడు నేను అతని మాటల్ని చెడుగా భావించే స్థితిలో లేను. ఈ శిష్టాచారమంతా ముగించి సాధ్యమైనంత త్వరగా ప్రభ దగ్గరికి వెళ్ళాలని ఉంది. ఆమె హాయిగా నవ్వేస్తుంది.

ఈసారి శిరీష్ భాయ్ సిగరెట్టు అంటించి విషయాన్ని మారుస్తు అడిగారు. "అయితే మీరు చెప్పనే లేదు. భారతీయ సంస్కృతిలోని సర్వశ్రేష్ఠమైన అంశమేమిటి?"

విషయం మారినందుకు నేను కొంత ఊపిరి పీల్చుకున్నాను. ఆయన అడిగిన ఈ విషయంపై ఆలోచిస్తూనే ఉన్నాను, కాని అది ఏ అంశమా అనేది అర్థం కాలేదు. నాకు తెలిసిన విషయాన్ని ఆ మాటల్లోనే చెప్పగలనా అనేది నాకు నమ్మకం లేదు. అయినా సమాధానమిచ్చాను. "నాకు తెలిసి నంత వరకు ఆత్మజ్ఞానం, ఆధ్యాత్మిక చింతన..." ఆయన మధ్యలోనే జోక్యం చేసుకుంటు అన్నారు. "మిత్రమా ఇవన్నీ మరీ పెద్ద మాటలు వాటి అర్థం ఏమిటో నాకు బోధపడదు. ఒకవేళ ప్రయత్నించి వాటి అర్థాన్ని తెలుసుకున్న ప్పటికి వాటి వల్ల ప్రయోజనం ఏమిటో నాకు అంతు చిక్కదు. అందువల్ల కొంచెం..."

నేను తికమక పడ్డాను. అయినా ఎలాగో సర్దుకుని చెప్పాను. "తేలిక మాటల్లో చెప్పాలంటె బహుశా దాని అర్థం మనకు, జగత్తుకు సంబంధించిన జ్ఞానం."

వెంటనే ఆయన అన్నాడు "జగత్తు అబద్ధం, మాయ బ్రహ్మ యొక్క అంశం అయినపుడు, మీ తల్లితండ్రులు, సోదరీ, సోదరులు, భార్యా పుత్రులు అన్నీ మాయే. అలాగే మీరు వాళ్ళకు కూడా మాయనే. అందువల్ల ఈ

మాయకు చెందిన బంధనాలన్నింటిని తెంచుకున్నపుడు ఆత్మజ్ఞానం కలుగుతుంది. అలా హిమాలయ గుహల్లోకి పలాయనిస్తే ఇవన్నీ వాటంతటవే వదిలిపోతాయి" శిరీష్‌భాయ్ పెద్దగా నవ్వసాగాడు.

నేను ఉక్కిరిబిక్కిరి అయిపోయి చాలా సేపటిదాక ఏమి చెప్పాలో తోచలేదు. అప్పుడు ఆయనే నా భుజంపై చెయ్యి పెట్టి అన్నారు. "మిత్రమా ఈ పలాయనమే, పరాజయ దర్శన శాస్త్రమే మిమ్మల్ని ఇందాకా తీసుకు వచ్చింది. కొడుకు తండ్రిని మాయగా భావించి, తండ్రి, కొడుకును మాయ అన్నపుడు అంతకంటె కృతఘ్నత ఏముంటుంది? నీకు జన్మనిచ్చిన స్త్రీని నరకానికి ద్వారమని నీ కొడుకుకు నువ్వు తల్లిని చేయనున్న ఆవిడను కుంభీపాకమని భావించడం ఎంత ఘోరం."

"కాని చివరికి దీనివల్ల ఏమీ తేలదు" నేను అన్నాను.

"అందువల్ల మనిషి ఆత్మహత్య చేసుకోవాలా? బావుందండి. బావుంది మీ దర్శన శాస్త్రం." ఈసారి నిజంగానే శిరీష్ భాయ్ కాస్త ఆవేశంగానే అన్నారు. "ఈ ఆత్మహత్యకు ఎన్ని అందమైన పేర్లు ఆత్మజ్ఞానం, బ్రహ్మలో లీనమైపోవడం, మాయ, మోహ బంధనాల నుంచి విముక్తి, స్థితప్రజ్ఞత! అయినా ఈ జగత్తులోకి వచ్చి దీన్ని కృతార్థం చెయ్యమని మిమ్మల్ని ఎవ్వరు వేడుకున్నారండి. మాంత్రికుడు ఒక బంతిని తియ్యగానే అది మీ చేతిలో బ్రహ్మాండంగా మారుతున్నది. రెండో బంతి తీయగానే "మాయ" వచ్చేసింది. మూడో బంతి వల్ల గుణాలు జన్మించాయి - ఇక చూసుకోండి. గాలిలో దర్శన శాస్త్రం యొక్క భవనం రూపొందసాగింది. ఇంకేముంది. మీరు ఇంటి బాధ్యతలన్నీ వదిలేసి బ్రహ్మ జ్ఞానం వెనక పరిగెత్తితే చాలు..."

"దాని వల్ల మీరు అనవసరమైన గొడవలను, చింతలను తప్పించుకోగలరు" నేను అన్నాను.

"అవునండి. మా యింట్లో ఒక ప్రమాదం జరిగింది. మీకేమో బ్రహ్మజ్ఞానం లభించింది. మీరు ఒకవైపు ఆసనం వేసి కూర్చున్నారు. మరి ఆ ప్రమాదాన్ని ఎవరు నివారించాలి. అది బ్రహ్మజ్ఞానం కాదు. సారాయి సీసా. తాగేసి హాయిగా బోర్లాపడిపోతే చాలు. ఇల్లు, ఇల్లాలు అందరిని ఏట్లో పోసివ్వండి." వెంటనే ఆయనకు ఏదో జ్ఞాపకం వచ్చి మళ్ళీ అన్నారు "సరే ఇది చెప్పండి. మీ తల్లి తండ్రులు మీకు చదువు చెప్పించకుండా, మంచి భోజనము బట్టలు ఇవ్వకుండా, మిమ్మల్ని సరిగ్గా చూడకుండా ఉంటె మీరు

పెద్దవారు అయిన తర్వాత వాళ్ళను ఎందుకు తిడతారు. వాళ్ళకు కూడా బ్రహ్మజ్ఞానం కలిగి మిమ్మల్ని మాయ అని ఎందుకు అనుకోకూడదు. వాళ్ళ మాయ వెనకాల ఎందుకు పరిగెడతారు? అందువల్ల వాళ్ళు మిమ్మల్ని పట్టించుకోలేదు అంతే."

ఈసారి నేను నిజంగానే గాభరా పడిపోయాను. బ్రహ్మజ్ఞానానికి సంబంధించిన ఈ రూపాన్ని నేనెప్పుడు చూడలేదు. ఈ దృష్టితో చూసినపుడు అదంతా నిజంగానే చేసినది మరచిపోవడం, బాధ్యతారాహిత్యమే అవుతుంది. నేను అప్పుడు ఎత్తుగడ మార్చే ప్రయత్నం చేసాను. "బ్రహ్మజ్ఞానం అంటె ఇంత స్థూలంగాను ఉపరితల భావం కాదు. మనం దైవాంశమైనవి అనుకునే పనులన్ని... అద్భుతమనిపించే అనేక వస్తువులు..."

"మీ ఈ అద్భుతాల దైవిక సంఘటనల మాటపై నాకు ఒక విషయం జ్ఞాపకం వస్తున్నది" శిరీష్ చిరునవ్వుతో అన్నాడు. "ఇది ఎంతవరకు నిజమో కాని స్వామి వివేకానంద పేరుతోనే ఇది ప్రచారంలోకి వచ్చింది. ఆయన ఒకసారి వెడుతూవుండగా దారిలో నదిని దాటవలసిన అవసరం ఏర్పడింది. దాటించవలసిన పడవ ఆవలి తీరాన వుంది. ఆ పడవ తిరిగి రాగానే తాను నదిని దాటవచ్చునని స్వామీజీ అక్కడే ఎదురుచూస్తున్నారు. అప్పుడే ఒక యోగి అక్కడికి రాగానే పరిచయం ఏర్పడింది. స్వామీజీ పడవ కోసం నిరీక్షిస్తున్నారనే సంగతి తెలుసుకుని ఆ యోగి మండిపడ్డారు. ఆయన అన్నాడు - 'ఇలాంటి చిన్న చిన్న అడ్డంకులకు ఆగిపోతే ఈ జగత్తులో ఎలా నడపగలుగుతావు. నువ్వు అయితే స్వామి - వివేకానందుడివి. ఆధ్యాత్మిక గురువుగా దార్శనికుడిగా పేరున్నవాడివి. ఈ కాస్త నదిని దాటలేవా? చూడు నదిని ఇలా దాటగలం. ఆ యోగి తన పావుకోళ్ళు టకటకలాడిస్తు నీటిపైన నడుస్తూ వెళ్ళిపోయాడు. అలా నీటి ఉపరితలంపై ఎంతో దూరం దాకా వెళ్ళి ఆ యోగి తిరిగి వచ్చి సవాలు చేస్తున్న స్వరంతో అన్నాడు. 'అమెరికా వెళ్ళి ఏదో ఉపన్యాసాలు ఇచ్చి వచ్చినంత మాత్రాన ఎవరూ స్వామి కాలేరు. అందుకోసం తపస్సు, సాధన అవసరం.' ఆ యోగి శక్తి పట్ల స్వామీజీకి ఆశ్చర్యం వేసి అడిగారు. 'మహా పురుషా మీరు ఈ సిద్ధిని ఎక్కడ ఎలా పొందారు.' తన ప్రభావం స్వామీజీ మూఢత్వం పట్ల ఆ యోగి నవ్వి ఎంతో గర్వంగా అన్నాడు "ఈ సిద్ధి ఊరికే దొరకలేదు. దీనికోసం నేను హిమాలయ గుహల్లో ముప్పై సంవత్సరాలపాటు తపస్సు చేసాను." యోగి మాట విని

స్వామీజీ గలగలా నవ్వేసాడు" శిరీష్ భాయ్ తన మాటను ఆపి నాకు ప్రశ్నించే అవకాశాన్ని ఇచ్చారు.

ఆ ఉదంతం ఎంతో ఆసక్తిగా ఉంది. మధ్యలో అలా ఆపేసరికి అనాయాసంగానే నేను అనేసాను. "ఎందుకు ఇందులో నవ్వాల్సింది ఏముంది?"

"అదే స్వామీజీ కూడా అన్నారు. మీరు మహాత్ములు. మీ ఈ అద్భుతంపై నేను నిజంగానే ఆశ్చర్యపడుతున్నాను. కాని మహాపురుషా నదిని దాటాలంటె రెండు పైసలు సరిపోతాయి కదా. దీనికోసం జీవితంలోని ముప్పై సంవత్సరాలు వ్యర్థం చేసారు. రెండు పైసలతో జరిగే పనికోసం ముప్పై సంవత్సరాలా? మీరు కావాలన్నా ఆ సంవత్సరాలు తిరిగి రావు. ఈ సిద్ధి కోసం ముప్పై సంవత్సరాలు సాధనలో గడిపేసారు. ఇప్పుడు మిగతా జీవితాన్ని ఈ అద్భుతాన్ని, లేదా సిద్ధిని ప్రదర్శించడంలో గడుపుతారు. ఇక జీవితాంతం నదులను దాటుతూ, జనం నుంచి పూజలందుకుంటారు. ఆ ముప్పై సంవత్సరాలను మీరు మానవ సంక్షేమానికి ఉపయోగపడే మరో పనిలో వినియోగించలేక పోయారా? కనీసం జనంలో ఏదో ఒక రోగ విముక్తి కలుగడానికి ఒక మందునైనా కనిపెట్టవలసింది." ఈ ఉదంతాన్ని ముగించి శిరీష్ భాయ్ మళ్ళీ అన్నారు. "ఈ సంఘటన నిజమో అబద్ధమో నాకు తెలియదు. కాని ఒకటి మాత్రం నిజం. ఒకవైపు ఈ దేశంలో మనిషి ఆకలితో, రోగంతో తల్లడిల్లి చచ్చిపోతుంటె మీ భారతీయ సంస్కృతి మానవమాత్రుడి కళ్యాణం కోసమే ఇదంతా అనే రాగాన్ని ఆలాపిస్తు ఉండిపోయింది. స్త్రీలను, శూద్రులను వేయించుకుని మాంసం ముక్కలుగా తినేస్తూ మనం జీవుల సమానత్వం గురించి నినాదాలు ఇస్తూ వచ్చాం. చీమ ఏనుగులోనైతె మనం బ్రహ్మను చూసాం. కాని శంభూకుణ్ణి, సీతను, మాత్రం ప్రాణమున్న మనుష్యుల్లా భావించలేదు. వారిపై మనం ఎలాంటి అత్యాచారాలు చేయలేదని?"

హఠాత్తుగా నాకు శిరీష్ భాయ్ చెబుతున్న మాటలు వినపడడం ఆగిపోయాయి. నేను ప్రభ ఎదుట తలవంచుకుని, నేరస్థుడిలా నిలబడినట్లు అనిపించింది. మర్యాదా పురుషోత్తముడైన మహారాజు రాముడి లోపల కూడా ఆక్షణంలో ఇదే 'అపరాధం' - తలవంచుకుని నిలుచున్నదేమో. సీత ఎదుట ఏమి సమాధానం చెప్పాలో అర్థం కాలేదేమో. అకస్మాత్తుగా నన్ను నిశ్చేష్టత ఆవహించింది. ఇప్పటికి ఇప్పుడే ఇదే క్షణం ప్రభ ఎదుట నిలుచోకుండా నేను ఇక్కడ ఇలా కూర్చుని వాదిస్తున్నానేమిటి? అని అనిపించింది. అయితే

ఈ వాదనను ఎలా ముగించి పారిపోను. కాని ఆయన మాటలు నన్ను లేవ నీయకుండా ఆకట్టుకున్నాయి.

ఆయన చెబుతున్నారు "ఇంకా చెప్పాలి అంటె మన దగ్గర స్వంత చరిత్ర అనేది లేకపోవడమే మనకున్న పెద్ద ఇబ్బంది. మరో జాతి దగ్గర తమదైన వాస్తవ చరిత్ర ఉన్నదో లేదో తెలియదు కాని మన దగ్గర మాత్రం నిశ్చయంగా ఉన్నది చరిత్ర కాదు, పురాణాలు మాత్రమే. పురాణాల్లో కావ్యము, చరిత్ర, ఎంతగా గందరగోళ పరుస్తాయంటె నిజాన్ని కనిపెట్టడం ఎంతో కష్టం అవుతుంది. చారిత్రిక సత్యాలు, యధార్థాలకు కావ్య రూపాన్ని ఇవ్వగానే వాటిలోని వాస్తవికతని అంతా ఒక క్రమ పద్ధతిలో అర్థాలను మార్చేసి కొత్త అభిప్రాయాలను ప్రవేశపెట్టారు. ఇక ఆ తర్వాత ప్రతీ యుగంలో పురాణా లకు కావ్యాల ముసుగులు వేసినప్పుడల్లా నిజమేమిటో తెలియకుండా పోయింది. ప్రతి యుగం చరిత్రను, పురాణాన్ని తన పరిస్థితుల సమస్యల వెలుగులోనే చూస్తున్నదనే విషయం దాచలేము. అదే లెక్కన వక్రీకరించి కొత్త వ్యాఖ్యానాలు జోడించడమే కాకుండా ప్రాచీన వేషంలో కొత్త ఆత్మను చొప్పిస్తారు. ఇక ఆ తర్వాత ఒక చెవి నుంచి మరో చెవికి చేరే ఆ నిజం వేలాది సంవత్సరాల్లో ఏ రూపంలో ఉంటుందో మీరే స్వయంగా ఆలోచించుకోండి. ఒక చిన్న సంఘటన అయిదు నిముషాలుగా నాలుగైదు చెవులకు సోకగానే ఎన్ని రకాలుగా మారిపోతుందో మీరు స్వయంగానే చూసి ఉంటారు. ఇక కవిత్వంలోనైతె ఇతిహాసాని (చరిత్ర)కి సంబంధించిన రూపక, ప్రతీక ఉత్ప్రేక్షలు వ్యంజనం లాంటి వన్ని కుక్కుతారు."

ఆయన చెబుతున్న మాటలు కొన్ని నా చెవుల్లోకి దూరుతున్నాయి. మరికొన్ని పైకి వెళ్ళిపోతున్నాయి. బహుశా ఆయన నా మానసిక స్థితిని అర్థం చేసుకున్నట్టున్నారు. అందుకే అన్నారు. "నా మాటలు మీకు కష్టం కలిగిస్తున్నాయేమో?"

"లేదు, లేదు, మీరలా ఎందుకనుకుంటున్నారు."

"మీరేదో ఆందోళనగా ఉన్నట్టు నాకనిపిస్తున్నది."

"అసలు విషయం ఏమిటంటె... విషయం ఏమిటంటె" నేను తడబ డుతూ అతి కష్టం మీద అనగలిగాను. "ఇపుడు నేను కొంచెం తొందరలో ఉన్నాను. ఇంట్లో కొంచెం పనుంది. మీరు చెబుతున్న విషయం ఎంతో ఆస క్తికరంగా ఉంది. వెళ్ళాలని లేదు చాలా కొత్త విషయాలు చెప్పారు. అవి

కలవర పరుస్తాయికూడా."

"అరే మీరు వెళ్ళాలని ముందే ఎందుకు చెప్పలేదు. భలేవారండి విచిత్రమైన మనుషులే మీరు" అంటూ ఆయన లేచి నిలుచున్నారు. "నేను చర్చలంటె చెవి కోసుకుంటాను. మీకు పని ఉంటె తప్పకుండా చెప్పండి. నేనేదో వాగుతుంటాను." తమ బలహీనతపై నవ్వి మళ్ళీ ఆయన అన్నారు. "ఇంతకూ మీ రిజల్ట్స్ నేడో రేపో రావలసి ఉన్నాయి కదా నలువైపులా ఆ విషయమే వింటున్నాను."

అదే బెంగతో చిక్కిపోతున్నాను. ఏమవుతుందో ఏమో? నిజంగానే నా గుండె కొట్టుకోసాగింది. పేలవంగా నవ్వుతూ అన్నాను "మా చిన్న తమ్ముడు మెట్రిక్ పరీక్ష రాసాడు. వాడికెప్పుడు రిజల్ట్స్ ధ్యాసే. రాత్రి కూడా సరిగ్గా పడుకుంటాడో లేదో. ఒకరోజు గుడిలోకి వెళ్ళి దీపం ముట్టించి వస్తాడు. ఇంకోసారి జ్యోతిష్యుడ్ని సంప్రదిస్తాడు. ఆంజనేయస్వామి పూజలు, శివుడికి ప్రసాదం..."

ఈసారి దివాకర్ కలుగజేసుకున్నాడు "అవునవును, నాకు తెలుసు అతను. అసలు అతని గురించి నీతో మాట్లాడాలని అనుకున్నాను. ఎప్పుడు చూసినా మీ వాడు అక్కడా ఇక్కడా కనపడుతూనే ఉంటాడు. పెద్దగా ఏమీ తెలియని వయస్సు. అతనిపై నిఘా ఉంచాలి. లేకపోతే ఎటైనా దారి తప్పగలడు. అతనితో పాటు ఉన్న కుర్రవాళ్ళు అంత మంచివాళ్ళుగా అనిపించలేదు."

"నాకు కూడా తెలుసు దివాకర్. కాని నేను ఏమీ చేయలేను మిత్రమా. ఇప్పుడు నీకా వివరాలన్నీ ఎలా చెప్పను?" విచారంతో తలపంచుకుని నేను అన్నాను - ప్రభతో వాడు ప్రవర్తించిన తీరు మళ్ళీ జ్ఞాపకము వచ్చింది. శరీఫ్ భాయ్‌కి నమస్కారం చేసి నేను బయటికి వచ్చేసాను.

దివాకర్ కూడా నాతో పాటు బయటికి వచ్చేసి అన్నాడు "మీరిద్దరు నాగరికతా, సంస్కృతి తోలు వలుస్తున్నప్పుడు నేను నీ సమస్యకు ఒక పరిష్కారాన్ని వెతకాను."

"ఏమిటది?" ఈ రోజు అతను ఒక దేవదూతలా నా సమస్యలకు పరిష్కారాలు చూపుతూనే ఉన్నాడు. నిజంగానే అతను ఎన్నో సమస్యలను ఈ రోజు పరిష్కరించి వేసాడు.

"నాలుగున్నర లేదా పావు తక్కువ అయిదింటికి ఒక ట్రయిన్ బయల్దేరు

తుంది. అయిదు, పది నిమిషాల్లో రాజామండ్రీకి చేరవేస్తుంది. అంతే. ఇక అక్కడినుంచి కాలినడకన పరిగెత్తు."

"నిజమే మిత్రమా, అసలు ఆ ధ్యాసే లేదే నాకు." నేను ఎగిరి గంతేసాను. అరే ఈ సమస్య ఇంత సులువుగా పరిష్కారమై పోయిందే.

"కాని రానూ పోనూ రోజూ రెండు అణాల ఖర్చు అవుతుంది మరి." దివాకర్ కాస్త దిగులుతో అన్నాడు.

నేను అతనితో చేయి కలిపి అన్నాను "పోనీయ్ నీకా గొడవ ఎందుకులే. నేనేమైనా టిక్కెట్టు తీసుకుంటాననుకుంటున్నావా? టి.టి.ని ఎలా బోల్తా కొట్టిస్తానో చూడు. వాడి అబ్బకు కూడా తెలియదు."

నేను అకారణంగానే గలగలా నవ్వుతూ వచ్చేసాను.

ఒక చీర ధర పన్నెండు రూపాయలని వినగానే నా ఉత్సాహమంతా నీరుగారి పోయింది. కనీసం రెండు చీరెలు అయినా వస్తాయని అనుకున్నాను. సరే ఏం చేస్తాం. ఒకటితోనే సరిపెట్టుకోవాలి. చీర ప్యాకెట్టును ఒక చేతి నుంచి మరో చేతికి మార్చుకుంటూ ఒక చంక నుంచి మరో చంకలోకి పెట్టుకుంటు అలా గాలిలో నడుస్తు వెళ్ళిపోతున్నాను. ఆ రోడ్డంతా మంచులా పరుచుకుని నున్నగా పల్లంగా ఉంటె అలా జారుతూ వెంటనే క్షణంలో ఇంటికి వెళ్ళిపోయేవాణ్ణి. ప్రభకు ఆ చీరను ఇవ్వగానే ఆమె ఎగిరి గంతు వేస్తుంది. అసలు ఇప్పుడు నేను ఆకాశంలోంచి దిగి నడుస్తున్నట్టు ఉంది. అలా నడుస్తూనే నాలో నేను నవ్వుకుంటు ఏదో గొణుక్కుంటున్నాను. అప్పుడప్పుడు వేళ్ళపై లెక్కలు పెట్టుకుంటు తల ఊపుతు పెదాలు బిగించుకుంటున్నాను. మళ్ళీ ఈ నా పిచ్చి చేష్టలపై బాహాటంగా నవ్వేస్తున్నాను. ఇప్పుడిక దేవుడి దయవల్ల రిజల్ట్స్ అనుకూలంగా వస్తె ఎంత హాయిగా ఉంటుందో. కష్టాలన్ని తీరిపోతాయి. ఇక యం.ఏ. చేయడం పెద్ద సమస్యేం కాదు.

దేవుడి దయవల్ల శిరీష్ ఉంటె ఆ దేవుడి తోలు కూడా వలిచేసేవాడు. ఏంటో మూర్ఖుడిలా మాట్లాడుతాడు, ఒక్కోసారి నిజమే చెబుతాడు. కాని నాగరికతా, సంస్కృతి, మతం అనేవి లేకుండా ఎక్కడైనా పని జరుగుతుందా? మనం ఇప్పుడు మనిషికి మానవత్వం తప్ప మరో మతం అవసరం లేని దశకు చేరుకున్నాము అని ఆయన వాదన. కాని మన మతం మాత్రం అనాది అనే విషయం ఎలా మరచిపోతాం? ఈ కాస్త విషయానికి రెండు గంటల

పాటు చర్చ జరగాలా. నేనేమో తొందరగా ప్రభ దగ్గరికి వెళ్ళాలనుకుంటె ఆయనేమో వాదన పెంచుతూనే ఉన్నాడు. పాపం అమాయకురాలు ఎన్ని కష్టాలు భరించింది. నాపరంగా ఇస్తున్న మొదటి వస్తువు ఇది.

కాని వెంటనే ఈ సంతోషమంతా దిగులుగా మారిపోయింది. ఆ విష యాన్ని నేను ఆలోచించనే లేదు. ఈ చీరను ప్రభకు ఎలా ఇవ్వాలి? నిజం గానే ఇది మరీ పెద్ద సమస్య. అందరి ఎదుట ఇస్తేనేమో బావుండదు. అమ్మా, వదిన అపార్థం చేసుకుంటారు. అది వేరే గొడవ. అయితే ఇలా చేస్తే బావుంటుందేమో ఈ చీరను సరాసరిన అమ్మకు ఇచ్చి ఇది నీకే తెచ్చా నమ్మ అని చెబుతాను. ఆమె అర్థం చేసుకుని, అంతకు ముందు జరిగిన చీర గొడవను దృష్టిలో పెట్టుకుని ఆమె స్వయంగా ఇచ్చేస్తుంది. అలా చేయడమే బావుంటుంది. ఇంత పెద్ద గొడవలోంచి బయట పడగలను. మా యింట్లో కూడా ప్రతి చిన్న విషయానికి ఎంతో గొడవ జరుగుతూ ఉంటుంది. అయినా పాపం అమ్మ కూడా ఏం చెయ్యగలదు. ఇంటి పరిస్థితులు కూడా బావుండలేదు. అన్నయ్య దినమంతా పాపం రెక్కలు ముక్కలు చేసుకుని సంపాదించేది కూడా ఒక సంపాదనేనా? ఇల్లు మా సొంతం కాబట్టి సరిపోయింది. లేకపోతే అద్దె కడితే తెలిసొచ్చేది. తక్కువలో తక్కువ ముప్పై రూపాయలైనా అద్దె కట్టవలసి వచ్చేది. ఆచారాన్ని అనుసరించి నా యీ మొదటి సంపాదనతో కొన్న చీర అమ్మకే చెందాలి. అలా ఇస్తే ఆమె ఎంతో ఆనందపడి పోతుంది...

కాని ఇంటి ద్వారం కనపడగానే నా భావాలన్ని కర్పూరం అయిపోయాయి. లోపలికి అడుగుపెట్టగానే కుంవర్ అడిగాడు "అన్నయ్య ఏమిటీ తెచ్చావ్?" నేను ఎంతో సహజమైన ధోరణిలో చెప్పేసాను. "ఏమి లేదు. నీ వదినకు చీర తెచ్చాను. ఆమెకు ఏమి లేవు." వాడు ఇంకేమీ అడగకుండా వెళ్ళిపో యాడు. ఆ చీర ప్యాకెట్టును తిన్నగా తీసుకు వెళ్ళి అమ్మ ఒడిలో వేసాను. ఆమె అడిగింది "ఏమిటిది?" నేను సంతోషంగా చెప్పాను. "అమ్మా నీ కోసం చీర తెచ్చాను." వాస్తవంగా కూడా ఒక వేళ అమ్మ తనకే కావాలంటె అభ్యంతరం చెప్పకూడదని అనుకున్నాను. ప్రభ కోసం మరొకటి తీసుకు వస్తాను. అప్పుడే ఒక మూల పచ్చడి రుబ్బుతూ ప్రభ కనపడింది. అప్పుడు మళ్ళి అనిపించింది. అమ్మకంటె ప్రభకే అది అవసరం. మొదటి జీతం రాగానే ప్రభ కోసం తప్పకుండా తెస్తాను. ఇది అమ్మ పేరు మీదే కానిద్దాం.

అమ్మ తేలిగ్గా అన్నది "అబ్బొ నా కోసం చాలా తెచ్చావ్‌లే. నీ భార్య

కోసమే తెచ్చానని ఎందుకు చెప్పవ్?" అమ్మ చిరునవ్వుతో అన్నది. ఆమె ప్యాకెట్ విప్పుతుండగా పాపను చంకలో ఊపుతూ వదిన కూడా చూడాలని వచ్చి నిలుచుంది.

"చీర చాలా బావుంది. అమ్మా, వదిన ఒకేసారి అన్నారు." అప్పుడే కుంవర్ అక్కడికి వచ్చి కాసేపు ఆగి అన్నాడు "వదిన కోసం తెచ్చాడు."

"అవునవును. నేను ఆ మాత్రం అర్థం చేసుకోలేనా?" అమ్మ ఆ విష యాన్ని ఏదో గత జన్మనుంచి తెలుసు అన్నట్లు చెప్పసాగింది.

"లేదు. ఇప్పుడే ద్వారం దగ్గర చెప్పారు కదా." తన మాటను మరింత రూఢి చెయ్యాలని కుంవర్ అన్నాడు.

అమ్మ ఆనందమంతా ఒక్కసారి ఆరిపోయింది. నేను తీక్షణంగా కుంవర్ వైపు చూసాను. కాని చీకటి వల్ల వాడు చూడలేక పోయాడు. కావాలనే వాడు అమ్మను నాకు వ్యతిరేకంగా రెచ్చగొడుతున్నట్లు అనిపించింది. ఒక తంతు ప్రకారం కాసేపు ఆ చీరని అటూ ఇటూ తిప్పి చూసిన తర్వాత మడ తపెట్టి అమ్మ నాకిచ్చేసింది.

"నువ్వే ఉంచేసుకో అమ్మ, ఇప్పుడు నేనేం చేయను." అంటూ ఒక విధంగా నాపై నాకు కుంవర్‌పై కోపం వస్తున్నది. మాట నోటిదాకా వచ్చి ఆగిపోయింది. "నువ్వే ఇవ్వు" కాని ఊరుకున్నాను.

"ఎవరి కోసమైతె తెచ్చావో దానికి నువ్వే స్వయంగా ఎందుకివ్వవు. మధ్యలో నన్నెందుకు లాగుతావ్." ఈసారి అమ్మ ఎంత కటువుగా మాట్లా డిందంటె నేను ఆ చీర తీసుకోక తప్పలేదు. ఏమీ మాట్లాడకుండా లేచి పైకి వచ్చేసి మంచంపై ఆ చీరను పడేసాను. నా ఉత్సాహం, ఆనందం అన్ని నీరుగారిపోయాయి.

అదే రోజు భోజనాలప్పుడు అన్నయ్యతో చెప్పాను. "అన్నయ్యా థర్డ్ ఇయర్‌లో అడ్మిషన్ తీసుకోవాలని అనుకుంటున్నాను." ఇది వినగానే ఇంట్లో మళ్ళీ దుమారం రేగుతుందేమోనని నేను భయపడుతూనే వున్నాను.

అన్నయ్య తింటున్నవాడల్లా ఆగి నన్ను గుర్తుపట్టనివాడిలా చూస్తూ ఉండిపోయాడు. అప్పుడు అడిగాడు. "నాన్నగారిని అడిగావా?"

"మీరే చెబితే ఆయన సులువుగా అంగీకరిస్తారు." అన్నయ్యకు కోపం రాదని తెలుసుకుని కొంచెం ధైర్యంగా అన్నాను. "అసలు విషయం ఏమి టంటె అన్నయ్య, ఏదైనా డిగ్రీ ఉంటేనే ఒక మంచి ఉద్యోగం దొరికే అవ

కాశం ఉంటుంది. పెద్ద పెద్ద బి.ఏ, యం.ఏ.లు చేసినవాళ్ళే ఊరికే అలా తిరి గేస్తున్నారు."

అన్నయ్య కాస్త నెమ్మదిగానే అన్నాడు "అది నిజమేననుకో. కాని ఆ డిగ్రీ కోసం ఖర్చుకూడా పెట్టాలి కదా. బి.ఏ. చదువుకు ఖర్చవుతుంది. ఇక అమర్ కూడా పాస్ అవుతాడనే నమ్మకం నాకు లేదు."

ఈసారి నేను కాస్త గట్టిగానే మళ్ళీ అన్నాను. "బి.ఏ. చదువుకు కావ లసిన ఖర్చును నేనే ఎలాగో సర్దుబాటు చేసుకుంటాను. దాని కోసం మీరేం చింతించకండి" నా ఉద్యోగ విషయం చెబుదామని నోటిదాకా వచ్చింది.

"అది కాదు తమ్ముడు. ఇప్పుడు నువ్వు ఒక్కడివే కాదు కదా. మిగతా వాళ్ళు కూడా ఉన్నారు కదా." ఆయన ప్రభను దృష్టిలో పెట్టుకుని ఆ మాట అన్నారనేది స్పష్టం.

"అదంతా నేను చూసుకుంటాను అన్నయ్య. మీరు మాత్రం కాస్త నాన్న గారితో చెప్పండి" నేను బతిమిలాడుతున్న ధోరణిలో అడిగాను.

"నీకు ఏది బాగనిపిస్తే అది చేయ్. నేను మాత్రం నాన్నగారితో చెప్పను. ఆయన ధోరణి అంత అనుకూలంగా ఏమి లేదు." అన్నయ్య కొంచెం విసు గ్గానే అని ఊరుకున్నారు. ఇక నేనే నాన్నగారి కోపాన్ని భరించాలి. చివరికి ఆ క్షణం కూడా వచ్చేసింది.

చీర చూడగానే ప్రభకు కోపం వచ్చింది. ఆనందం కూడా... కాస్త గంభీ రంగానే అన్నది. "మహా తీసుకొచ్చారు చీర. అత్తయ్యకు మాత్రం కోపం తెప్పించారు కదా."

"నువ్వే చెప్పు నేను అంత కంటె ఏం చేయాలి? తప్పు నాదైతె నన్ను చీవాట్లు వేయ్." నేను నిజాయితీగానే ఈ మాటలు అన్నాను. "ఆమె ఈ చీర తీసుకుని ఉంటె. నేను నీకు మరోటి కొనాలనే అనుకున్నాను."

"అబ్బో, మహా ధనవంతులు అయిపోయినట్టున్నారే. ఏమిటీ ఎక్కడైనా డబ్బు దొరికిందా?" ప్రభ తన కళ్ళు తిప్పుతూ గారాలుపోతూ అడిగింది.

నేను ప్రయత్నపూర్వకంగానే, ఏదో చాలా మామూలు విషయం చెబు తున్నట్టె నిర్లక్ష్యంగా అన్నాను. "నాకు ఉద్యోగం దొరికింది కదా."

"అవునా! నిజంగానా!" ప్రభ ఎగిరి గంతేసింది. ఆమె కళ్ళు ఆశ్చర్యంగా, ప్రసన్నంగా ఉత్సాహంతో విచ్చుకున్నాయి. "మీరు మరీనూ. ఇంతసేపు ఏమీ చెప్పకుండా అలా ఉన్నారేమిటి? అసలు ఏమీ కానట్టు ఎంత మెల్లగా

చెబుతున్నారు."

ఆమె ఉత్సుకత, అసహనం నాకు ఎంతో బాగా అనిపించింది. అయినా కృత్రిమమైన నిర్లక్ష్యంతో అన్నాను. "అవును... అందులో గొప్ప ఏముందని చెప్పాలనే అనుకున్నాను."

ప్రభలోంచి ఆనందం వెల్లి విరుస్తున్నది. పువ్వుల్లా వికసించిన కొమ్మ లాంటి ఆమె సంతోషం చూసి నిజంగానే ఎంత పెద్ద సంఘటన జరిగి పోయింది అని అనిపించింది. అప్పుడు నేను ఆవేశంతో ఆమెను నా రెండు బాహువుల్లో బంధించి ఆమె ముఖాన్ని ముద్దులతో నింపేసాను. "అవును ప్రభ నేను నిన్ను ఎంతో ఇబ్బంది పెడుతున్నాను. అసలు నేను ఇక ముందు చదవగలనా అనే బెంగ ఉండేది."

ప్రభ తన ఊపిరి సడలించుకుని అడిగింది. "ఇంతకూ జీతమెంత?"

"అది మాత్రం అడగకు. చదువుకు సరిపోయేంత వస్తుందని అనుకో. ఆ ఉద్యోగం అలానే కొనసాగితే కనీసం యం.ఏ. దాకా చేయగలను." అంటూ నేను సుదూర భవిష్యత్తులోకి తప్పిపోయాను.

ఆమె మళ్ళీ అసహనంగానే నా రెండు భుజాలని ఊపుతూ అన్నది "అయినా ఎంతో చెప్పరాదు."

ఆమె చికాకు నాలోపల గిలిగింతలు పెడుతున్నది. నేను హాయిగా ఆమె వళ్లో పడుకుని ఆమె చంకలోంచి కిందికి వచ్చిన జడతో ఆడుకుంటూ ఆమె మాటలు విననట్టు నటించాను. ఏదో స్వగతంలా మాట్లాడుతూ ఉండి పోయాను. "ఇంకేం మొట్టమొదట పని కాలేజిలో పేరు రాయించుకుంటాను. తర్వాత ఫీజు మాఫీ చేయించుకుంటాను. ఏదో విధంగా నీకు మంచి మంచి దుస్తులు తీసుకువస్తాను. రెండు చీరలు, బ్లౌజులు చలికాలంలో చిన్న కోటు."

"నేను అడిగినదేమో చెప్పకుండా లోకంలోని పనికిరాని మాటలన్ని చెబుతున్నారు" ఆమె మరింత చిరాకు పడుతున్నది. తాను పట్టుకున్న నా చెయ్యిని ముందుకులాగి నా వేలిని తన పళ్ళ మధ్య నొక్కుతూ అన్నది. "సరే ఇప్పుడన్నా చెబుతారా?" పళ్ళతో నొక్కుతూనే వుంది.

"ఇక చూడు ఇంట్లోంచి ఒక పైసా విలువ వస్తువు కూడా తీసుకోవలసిన పని ఉండదు. ఏమి అవసరం ఉన్నా, నేనే తీసుకొచ్చేస్తుంటాను," నేను అలా చెబుతూనే ఉన్నాను.

"చెప్పండి..." ఆమె పళ్ళు నా వేళ్ళలోకి దిగుతూనే ఉన్నాయి.

"అబ్బా, వదిలేయ్ నా వేలును తెగ్గొట్టేస్తావా?" ఈసారి నేను బాధతో మూలిగాను.

"మరి ఎందుకు చెప్పడం లేదు?" తాను చేస్తున్న పనికి నేరస్తురాలిగా చూపులు తప్పించుకుంటు చూడసాగింది. వేలిపై పళ్ళ గుర్తులను చూసి చిరాకెత్తి లాగి ఆమె వీపుపై గుద్దాను. "నేను ఆపకపోతే వేలిని కొరికేసే దానివి. పిచ్చిదానా" మళ్ళీ అనిపించింది. ఆమెకు ఎక్కడ కోపం వస్తుందో నని, చిన్న పిల్లాడిలా నేను కొట్లాడుతుంటె నాకు నవ్వు వచ్చి, దాన్నంతా ఒకే పరిహాసంగా మారుస్తూ అన్నాను. "ముగ్గురు పిల్లల తల్లివి కావలసిన దానివి. ఇంకా ఇప్పటికి నిన్ను నువ్వు చిన్నపిల్లనని అనుకుంటున్నావా? పళ్ళు చూడు ఎలక దంతాల్లా ఎంతవాడిగా ఉన్నాయో?"

ఆమె అలిగి వెంటనే నా తలను లేపి నేలపై పెట్టి అన్నది "ఈ రెండు న్నర మణుగుల బరువును నా ఒడిలో పెట్టి పైగా నన్ను కొడతావా?" ఆమె చిరునవ్వును చిందించింది. నా దెబ్బ మరీ గట్టిగా తగిలిందేమోనని భయమేసింది.

నేను వెంటనే రాజీ పడుతూ అన్నాను "సరే, సరే, చెబుతానుగా, మొదట నా తలను మళ్ళీ నీ ఒడిలో పెట్టుకోనివ్వు." ఎంతో హుందాగా నా తలను మళ్ళీ ఆవిడ ఒడిలో పెట్టి విషయమంతా చెప్పేసాను.

ఆ రాత్రికి మేము చాలాసేపు మాట్లాడుతూ ఉండిపోయాము. నా ఊహకు రెక్కలు మొలిచినట్టు అనిపించింది. అలా ఆగుతూ ఆగుతూ మాటి మాటికి నా కలలను పర్చిస్తు వుండిపోయాను. నేను యం.ఏ. మంచి డివిజన్‌లో పాస్ కాగలిగితే ఎక్కడైనా ప్రొఫెసర్ గా ఉద్యోగం సంపాదించుకోగలను. "ఇక నీ సంగతి చెప్పాలా. ఏమి హోదానో ఇక నీకు. పొట్ట పొడిస్తే అక్షరం ముక్క రాదు కాని ప్రొఫెసరమ్మని అనిపించుకుంటావు. కాస్త ప్రొఫెసరమ్మ వాలకమైతే చూడండి!"

ప్రభ అలిగిపోతూ అన్నది - "అయితే బాగా చదువుకొన్న అమ్మాయినే తెచ్చుకోండి. అమ్మాయిలకు కూడా ఎలానూ చదువు చెబుతారు కదా, వాళ్ళలోనే ఒకర్ని ఏరుకోవచ్చు!"

"మా అమ్మాయిని ఎందుకు చదివించుకో కూడదు!" నేను బుజ్జగిస్తూ అన్నాను.

కోపం మరచి ప్రభ అన్నది - "ఇప్పుడే చెప్పేస్తున్నాను - తర్వాత వీలు కాదంటే పూరుకునేది లేదు, నేను తప్పకుండా కాలేజీలో చేరుతాను."

"ఏమి కావాలనుకుంటే అదే చేసుకో, ప్రభ! ఇంటికి మహారాణివి నువ్వే! నిన్ను ఎవ్వరు ఆపుతారు?" నేను మళ్ళీ కలల్లోకి జారిపోయాను - "చూడు, మనకు ఒక మంచి లైబ్రరీ వుంటుంది. దానిలో కొత్త కొత్త పుస్తకాలు తెచ్చి పెడతాము. రెండు, మూడు పత్రికలు తెప్పిద్దాం!"

"మరి రేడియో లేకపోతే ఇల్లంతా బోసిపోతుంది."

"లేదు, ఇల్లు అలా బోసిపోవడానికి వీలు లేదు. రేడియో ఏర్పాటు కూడా మొదటే చేసేస్తాం. అప్పటిదాకా అటూ ఇటూ తిరిగే రేడియో ఇంట్లోనే ఉంది కదా."

ప్రభ ముఖం సిగ్గుతో ఎర్రబడిపోయింది. ఆ సమయంలో ప్రతీది సాధ్యమేనని అనిపించింది. ప్రభ బాహువుపై తల ఆనించి లోకంలోని పెద్ద పెద్ద కష్టాలన్నీ చిన్నవిగానే నాకు కనిపించసాగాయి. ప్రతి అడ్డంకిని జయించగలిగే సామర్థ్యం నాకున్నదని అనిపించింది. నేను సూచించే ప్రతి ప్రణాళికకు ప్రభ మార్పు చేర్పులు చేసేది. నేనేమో ప్రభ చెప్పిన వాట్లో లోపాలు వెతికేవాణ్ణి. ఆ రాత్రి మాకు ఉండబోయే తోటలోని పూలనుంచి మా బంగ్లా గేటుపై తగిలించబోయే నేమ్ ప్లేట్ దాకా ప్రతి విషయంపై మేము మాట్లాడుతూ ఉండిపోయాము. మధ్యమధ్యన ఈ మాటలన్నీ నిరాధారమని నిష్ప్రయోజనమని మాకు స్ఫురణకు వచ్చేది. ఎవరైనా ఆ విషయం జ్ఞాపకం చేసి ఉంటె మేము అనేవాళ్ళం. "ఉట్టికెక్క లేనమ్మ స్వర్గానికి ఎగురుతున్నది!" కాసేపు నిశ్శబ్దంగా ఉండి మళ్ళీ కొత్తగా ఏదో ఒకటి మాట్లాడుతూ ఉండేవాళ్ళం. ఈ మాటలన్నీ చివరికి ఇక్కడ ముగిసేవి - "ఏముంది ఈ మధ్యకాలంలో ఈ కాసిన్ని కష్టాలను, సమస్యలను ఎదుర్కొన్నామంటె ఆ తర్వాత నదిని దాటినట్టె లెక్క. వీటిని ఇంకాస్త ధైర్యంగా సహించు ప్రభ. నేను నిన్ను రాణిగా మార్చేస్తాను. రాణిగా." బదులుగా ఆమె ఈ లోకంలోని కష్టాలన్నింటిని ఏమీ మాట్లాడకుండా సహించగలననే హామీ ఇవ్వగానే నేను కృతజ్ఞతతో విశ్వాసంతో ముగ్ధుడనై పోయేవాణ్ణి. మా ఈ ప్రణాళికలో అసలు మా ఇంటివాళ్ళు ఎవ్వర్నీ కలుపుకోలేదు. అనే విషయం జ్ఞాపకం రాగానే నేను అన్నాను. "నేను ఒక తమ్ముణ్ణి నా వద్దె ఉంచి చదివిస్తాను. అమర్‌ను మాత్రం కాదు. వాడు బుద్ధిలేని వెధవ. కుంవర్ అమాయకుడు. అలా ఉండి పోగలడు. ఇక ఈ ఇంటిని వదిలేసి అమ్మా, నాన్న మనతో ఏం ఉంటారు, అప్పుడప్పుడు తప్పకుండా వచ్చి వెళుతుంటారులే. అన్నయ్యపై ఉన్న

భారం కూడా తేలికైపోతుంది." ప్రభ మారుమాటాడ లేదు.

ఆ రాత్రి హృదయంలోని ఊహలు ఉన్ముక్తమై అధరాల స్వప్నరాగాలుగా ఉబికి రాసాగాయి. ఈ వర్తమానంలోంచి లేని భవిష్యత్తులోని బంగారు లోకంలోకి తీసుకెళ్ళడానికి మా రెండు ఆత్మలు తాదాత్మ్యం చెంది ఆ రాత్రి సప్త వర్ణాల వారధిని నిర్మించుకుంటున్నాయి. చేతిలో చెయ్యి కలిపి ఊపుకుంటు దానిపై నడుస్తు, మమ్మల్ని స్పష్టంగా చూసుకుంటున్నాం... ఆ రోజు ఆకాశమంతా వెలుగు పూలను వెదజల్లుతున్నది.

రేపు ఆదివారం నాడు నేను వెళ్ళి ఆపని ఏమిటో చూసుకుని అర్థం చేసుకుని ఆ తర్వాత ఇంటి వాళ్ళకు ఏదో విధంగా చెప్పాలని నిశ్చయించుకున్నాను. అయితే ఒక విషయం మాత్రం స్పష్టంగా చెప్పేస్తాను. దివాకర్ నేను ఇక ముందు చదువుతాననే షరతుపైననే ఉద్యోగం ఇప్పించాడని చెబుతాను. మేము నిద్రపోతుండగా అసలు నేను నాకు ఉద్యోగం ఇప్పించినతని గురించి ప్రభకు చెప్పనే లేదే అనే విషయం జ్ఞాపకం వచ్చింది. శిరీష్‌భాయ్ గురించి కూడా ప్రభకు చెప్పవలసి వుంది.

ఉదయం లేపగానే అన్నాను. "ప్రభ ఒక రోజు నువ్వు దివాకర్ ఇంటికి తప్పకుండా రావాలి. అతను ఎన్నోసార్లు చెప్పాడు." నేను ఆమెకు ఆ రోజు మేము సినిమాకు వెళ్ళిన సంగతి ప్రభ తల్లిగారింట్లో ఉన్నదన్న విషయం కిరణ్ గురించి కూడా వివరంగా చెప్పాను.

కిరణ్ ఎదుట పడాలనే ఊహతో ప్రభ సంకోచిస్తూ అన్నది "చూడు, నేను ఎలా రాగలను. ఇంటి పరిస్థితి చూస్తూనే ఉన్నావు కదా."

"నువ్వు నాతోపాటు వస్తున్నావ్. ఇంటి గొడవంతా అలానే ఉంటుందిలే. ఇప్పుడా తలనెప్పి ఎందుకు? తొందరలోనే అక్కడికి వెళ్ళాలి. శిరీష్ భాయ్ చెల్లెల్ని కూడా కలవాలి. ఒక రోజు."

"ఎవరూ?..." ఆమె ఆశ్చర్యంగా అడిగింది.

అప్పుడు నేను ఆమెకు శిరీష్ భాయ్ గురించి వివరించసాగాను. ఎంప్లాయ్‌మెంట్ ఎక్స్ఛేంజ్ మొదలుకొని ఇప్పటిదాకా జరిగిన విషయమంతా చెప్పాను. మళ్ళీ అన్నాను "నిజం ప్రభ, ఆ మనిషి ఆలోచనా సరళి అప్పుడప్పుడు నన్ను ఆశ్చర్యపరుస్తున్నది. ప్రతి అంశాన్ని చూసే ఆయన పద్ధతి చాలా భిన్నంగా ఉంది. ఆయన అసలు దేనిని ఆట్టే ఒప్పుకోరు. ప్రతి విషయాన్ని ఖండిస్తారు. మన సొంత చరిత్ర అనేది లేదని ఆయన అంటారు.

ఉన్నదంతా పురాణాలు వాటి ద్వారా మతమూ, మూఢ నమ్మకాలు కవిత్వం లోని భ్రమజాలం తప్ప అందులో నిజమనేది ఎక్కడా కనపడదనేది ఆయన వాదన. లేదా కిరాయి కవులు కొందరు రాజుల ప్రశస్తి కావ్యాలు రాసారని, వాటిలో అయిదు ఊళ్ళ రాజుని కూడా ధరణీశ్వరుడిగా వర్ణించారని ఆయన అంటారు. ఇక శాస్త్రాలు, స్మృతుల పేరు మీద మన దగ్గర ఉన్న వాటిలో పేర్కొన్న ఆచార వ్యవహారాలన్నీ మొదలే రాయబడ్డాయని ఆ తర్వాత మనుష్య సమాజం ఉద్భవించిందని... ఇక చెప్పు మనుష్యులే లేకపోతే ఆచార వ్యవహారాలు మొదట ఎలా వస్తాయి? వచ్చినా ఎవరికోసం ఇప్పుడు అసలు హిందూ, ముస్లిం, క్రిస్టియన్ ఏ మతం యొక్క అవసరం మనిషికి లేదు. ఇప్పుడు కావలసిన మతం ఒక్కటే, అదే మానవత..."

కాని నా మాట మధ్యలోనే తెగిపోయింది. ఎవరో తలుపును లాగి తన్నిన శబ్దమయ్యింది. మా మీద మెరుపు దాడి జరిగినట్టు అనిపించింది. గాభరాగా మేమిద్దరం లేచి సర్దుకునే సరికి కేకలు, అరుపులు వినపడుతున్నాయి. మొదట అసలు అకస్మాత్తుగా ఏం జరిగిందో అర్థం కాలేదు. కాని తర్వాత నాన్నగారి అరుపులు స్పష్టంగా వినపడసాగాయి. పొరుగువాళ్ళు, వాడలోని వాళ్ళు వింటున్నారనే ధ్యాస లేకుండా ఆయన పెద్దగా గర్జిస్తున్నారు. ప్రభ తన దుస్తులు సర్దుకుంటూ ఉంది. నేనేమో నన్ను సంభాలించుకుంటు మోకాళ్ళపై నిలుచుని కిటికీ తలుపు సందులోంచి బయటికి చూసాను. నాన్నగారు ఒకవైపు నిలుచుని గొంతు చించుకుంటున్నారు. "మేము కూడా ఒకప్పుడు వయస్సులోనే ఉన్నాం. కాని ఇలానా? రాత్రి లేదు పగలు లేదు ఎప్పుడు చూసినా పెళ్ళాం పక్కలో పడుకోవడమేనా? ఈ మాత్రం జ్ఞానం లేదు. ఇంట్లో పిల్లలూ, పెద్దలూ వున్నారు... వాళ్ళ గౌరవాన్ని కాపాడాలా? వద్దా? పది కావస్తున్నది. మరి దొరగారికి ఇంకా పొద్దు పోవడమనే లేదు. ఇంత సిగ్గు, శరం లేని బతుకులా? రాత్రంతా పకపకలు, ఇకఇకలు యవ్వనం మత్తులో ఎవరు కనపడతారు? లోకం ధ్యాస కాని ఎవరైనా చూస్తున్నారని కాని కళ్ళు ఉన్నాయా? ఇలాంటి గుడ్డితనం మండిపోను. మాట్లాడనప్పుడేమో పెండ్లామంటె ఏదో ఆడపులిలా భయపడడం, ఇక మాట్లాడడం మొదలు పెట్టగానే ఎప్పుడు చూసినా ఆవిడ చుట్టూ తిరగడం. ఇంటిల్లిపాది స్నానం, గీసం పనులన్నీ అయిపోయాయి. మరి ఇక్కడేమో ఆనందంలో తేలిపోతున్నారు."

మా ఇద్దరి మధ్య హఠాత్తుగా బాంబు పేలినట్టు మేము పరస్పరం

చూసుకోసాగాం. ఇప్పుడు ఏం చేయాలి? మళ్ళీ సందులోంచి చూసాను. నాన్నగారి ఉపన్యాసం నిరాటంకంగా సాగిపోతున్నది. "ఈ అడ్డగాడిద ధైర్యం చూడు పైగా - ఇంకా పై చదువులకు వెళతాడట. దొరగారు నిధిని దాచిపెట్టారు కదా? దొర నా కొడుకు ఎక్కడో."

అయితే రాత్రిపూటే చీర గురించి, నేను ఇక ముందు చదవాలనుకున్న సంగతి నాన్నగారికి చేరిపోయాయన్న మాట. బాగా అరచి, అరచి నాన్నగారు వెళ్ళిపోయిన తర్వాత తలుపుల్ని కాస్త తెరిచి ప్రభ భయపడుతూ, భయపడుతూ తొంగి చూసింది. ఆ తర్వాత ముడుచుకుని, ముడుచుకుని అతి జాగ్రత్తగా పిల్లిలా నెమ్మదిగా కిందికి వెళ్ళిపోయింది. నేనేమో అందరి కళ్ళ ఎదుటకు ఎలా వెళ్ళాలా అనే ధైర్యాన్ని కూడగట్టుకుంటున్నాను.

మేమేదో ఘోరమైన అనైతిక, అనుచితమైన నేరం చేస్తూ ప్రత్యక్షంగా పట్టుబడిపోయినట్టు మాకు అనిపించింది.

# ఏడు

రెండు రోజుల్లోనే నా పట్ల ఇంటి ప్రపంచమంతా మారిపోయింది. ప్రతి ఒక్కరి ప్రవర్తన కొత్త కొత్తగానే ఉంది. మొదట్లో కొంతలో కొంత నా అనుభవంలోకి వచ్చింది. కాని ఈ వ్యవహారం గురించి మొదట చెప్పింది ప్రభనే.

ఆ రోజు నేను ఆలస్యంగానే ఇంటికి చేరుకున్నాను. అనుమానాల భయంతో వణుకుతూనే నేను ఇంట్లో అడుగు పెట్టగానే నాన్నగారు ఎదురయ్యారు. ఆయన కూలివాడి తలపై కట్టెల మోపు మోయించుకు వస్తున్నారు. చేతి సంచిలో కూరగాయలు వేలాడుతున్నాయి. ఆయన అలవాటు ప్రకారం బయటికి కట్టెలో, గోధుమలో కొనడానికి వెళ్ళినప్పుడల్లా సంచి తప్పకుండా తీసుకు వెళ్ళేవారు. ఎవరో ఒక కూరగాయల వాడి దగ్గర చివరగా మిగిలిపోయిన కూరగాయలని చౌకగా తీసుకు వచ్చేవారు. ఆయన దినమంతా ఖాళీగా ఉంటారు కాబట్టి కర్రలు, గోధుమలు లేదా ఇంటి సామాను తీసుకు వచ్చేవారు. అసలు ఈ ఇంటి సామానంతా ఎవరు తీసుకురావాలా అనే విషయంపై తరచుగా మా అన్నదమ్ముల మధ్య జగడం జరుగుతుండేది. మాలో అందరికి మా చదువు ఎంతో ముఖ్యం అనిపించేది. సాహసుతో

వస్తూ, పోతూ ఉంటే క్లాసు పిల్లలు, లేదా ఉపాధ్యాయుడు చూసి ఏమను కుంటారో అని మాకు భయం వేసేది. ఇప్పుడు నాన్నగారిని చూసేసరికి నా ప్రాణాలు పైకెగిరిపోయాయి. గత కొన్ని రోజుల నుంచి నేను నిశ్శబ్దంగా అడుగులో అడుగువేస్తూ మిద్దె మీదికి వెళ్ళిపోయి అలా విడిగా ఉండి పోవడం అలవాటు చేసుకున్నాను. అందువల్ల మా ఇంట్లో వాళ్ళను బయటికి వెడుతూ, వస్తూ ఉన్నప్పుడో లేదా స్నానానికి, భోజనానికి కిందికి దిగుతున్నపుడు మాత్రమే చూడడం జరిగేది. ఇప్పుడు నాన్నగారు మళ్ళీ ఆనాటి కోపాన్ని వెళ్ళగక్కుతారేమోనని అనిపించింది.

కాని నన్ను చూడగానే ఆయన ఇలా అన్నారు. "ఏమిటీ సమర్ ఇంత ఆలస్యమా? కోడలు నీ కోసం తినకుండా కూర్చుని ఉంటుంది. తిన్న తర్వాత కావాలంటె షికారు తిరిగి రావచ్చు. అయినా చల్లబడిపోయిన భోజనం వంటికి పడుతుందా."

నాన్నగారి వాత్సల్యపూరితమైన స్వరాన్ని నేను విని ఎంతకాలమై పోయింది. ఇప్పుడు ఆయన మాట వినగానే ఆపాదమస్తకం రోమాంచితమై పోయింది. నేనైతె ఆయన చివాట్లు తినడానికే సిద్ధపడ్డాను. ఇప్పుడు ఆయన ఆత్మీయతా స్వరంతో మనస్సు భయంతో కంపించిపోయింది. దేవుడా, ఏమి జరుగబో తున్నదో? కాని త్వరగానే ప్రభ నాలోని భయాన్ని తొలగించేసింది. ఆమె చెప్పింది. "మనపట్ల ఇంటివాళ్ళు ఇప్పుడు ఉదారంగా వ్యవహరిస్తున్నారు." నేను ఉలిక్కిపడి అడిగాను "ఎందుకు? ప్రత్యేకించి ఏమైనా జరిగిందా?"

"లేదు, ప్రత్యేకించి ఏమీ జరుగలేదు. ఒక విధంగా ప్రతి విషయాన్ని గమనిస్తున్నాను. ఇంతకు ముందు అత్తయ్య, అక్కయ్య ఏ విషయాలపైన అయితే కలహించేవారో ఇప్పుడు కావాలని వాటిని చూసి చూడనట్టు ఉంటు న్నారు. ఇప్పుడు అత్తయ్య మాటి, మాటికి అంటున్నది. నువ్వేమయినా చేదో డుగా ఉంటె కష్టాలు తగ్గుతాయని... అలానే నా దగ్గర సరైన దుస్తులు ఉన్నాయో లేదోనని కూడా అడిగింది. అక్కయ్య పాపకోసం ఐస్క్రీం కొంటూ నన్ను కూడా తినమని వెంటపడింది."

నేను ఏమీ మాట్లాడకుండా ఊరుకున్నాను. మా ఇంట్లో జరిగిన మా మార్పును నేను అప్పటి నుండే గమనిస్తున్నాను. ఇంటివాళ్ళ ఈ మెత్తని వ్యవహారమే నన్ను విపరీతంగా భయపెడుతున్నది. చాలా సేపటిదాకా నేనేమీ మాట్లాడకపోయే సరికి ప్రభ నన్ను ఊపుతూ "ఏమిటీ ఏం ఆలోచిస్తున్నావ్?"

నేను గాఢంగా నిట్టూర్చి అన్నాను. "ఏమీ లేదు ప్రభ. ఇక నువ్వేచెప్పు, నేనిప్పుడే ఇంటికి ఆర్థికంగా ఏమీ ఇవ్వలేను అనే సంగతి మనవాళ్ళకు ఎలా నచ్చజెప్పాలో అర్థం కావడం లేదు. వీళ్ళేమో ఆశలన్నీ నాపై పెట్టుక కూర్చున్నారు. అసలు నేను అనేది ఏమిటంటే నా జీతంతో మనిద్దరి ఖర్చులు నెట్టుకు రావడమే కష్టం. అయితే ఆ రకంగానైనా మనం ఇంటిపై భారం కాదు కదా. మనం విడిగా ఉందాం. ఈ సారేమో బి.ఏ. చదువు, అదేమో నవ్వులాట కాదు కదా. అటు దివాకర్ ఏమో నేను బి.ఏ. చదివితేనే ఆ ఉద్యోగం చెయ్యాలని స్పష్టంగా చెప్పాడు. అతని నమ్మకాన్ని నేను నిలబెట్టకపోతే అతనికి కోపం రాదా?"

"ఇందులో కోపం రావాలసిన పనేముంది." ప్రభ నన్ను తరచి చూడాలని అడిగింది.

"అసలు నేను కేవలం ఉద్యోగం కోసమే కాదు ఈ పని చేస్తున్నది. ఇక ముందు చదవాలనే ఆ పనిలో చేరాను. ఒక్కొక్క పుస్తకం కొనాలంటె పదిహేను రూపాయలు. సరే పుస్తకాలు అంటావా దివాకర్ దగ్గర తీసుకుంటాను. అతనితో పాటు చదివితె విడిగా పుస్తకాల అవసరం ఏమీ ఉండదు. అయితే డెబ్బై అయిదు రూపాయలలో ఏమి మిగులుతుందో నువ్వే ఆలోచించు. ఇరవై దివాకర్‌కే ఇవ్వాలి. కాలేజి తెరవగానే అడ్మిషన్ మొదలైన వాటి కోసం ఇరవై ఆరు రూపాయలు చెల్లించాలి. ఇక నువ్వే చూస్తున్నావ్ కదా. నా బట్టలు ఎలా చివికి పోయాయో. కాలేజీకి తగిన విధంగా ఉండాలా వద్దా? కనీసం ఒక ప్యాంటూ, షర్టూ కొనాలి కదా. పైగా బూట్లు లేవు, కలం లేదు. షేవింగ్ చేసుకోవాలంటె అన్నయ్య రేజర్ ఉపయోగించాలి. అదో గొడవ. కష్టాలన్నీ ఇదే నెలలో వచ్చి పడ్డాయి. కాగితాలు, కాపీలు ఇవి అవి అటూ ఇరవై అయిదు ముప్పై రూపాయల దాకా ఎగిరిపోతాయి. నీకు ఒక చీరా, బ్లౌజు కూడా కొనాలని అనుకుంటున్నాను..."

"నువ్వు నన్ను ఎందుకు మధ్యలోకి లాగుతావ్. నా దగ్గర చాలా ఉన్నాయని చెప్పాను కదా... అవసరముంటె నేనే అడుగుతాను తెలిసిందా. ఇప్పుడు నాకేమీ అక్కరలేదు. మరుసటి నెల లేదా ఆపైన చూసుకోవచ్చు." ఈసారి ప్రభ ఏదో నాకు నచ్చజెప్పాలని కాకుండా నిజంగానే దిగులుగా అన్నది.

"సరే మొత్తంపై లెక్క నీ ఎదుటే వుంది. ఇప్పుడు చెప్పు. డెబ్బై

అయిదు రూపాయల్లో మిగిలింది. ఎంత? అందులో ఏది తగ్గించుకోవాలి. ఆ పైన ఇంటివాళ్ళకు ఏం సహాయం చేయాలి. మహా అయితే ఈసారి దివాకర్‌కు ఇవ్వను." మళ్ళీ వెంటనే జ్ఞాపకం వచ్చి అన్నాను. "ఇంతకూ కాలేజి ఎని మిదో తేదీనే తెరుస్తారు. నా డబ్బు ఏమో పదిహేను తారీఖున దొరుకు తుంది. మరి కొంత చేబదులు తీసుకోవలసిందే. మరి వీటన్నింటి అవసరం ముందే ఉంది కదా."

ఆ తర్వాత మేమిద్దరం మా కష్టాలు గురించి ఏకరువు పెట్టుకుంటూనే ఉన్నాం. నా ఆలోచనల్లో తప్పిపోతూనే నేను అన్నాను. "నాన్నగారు, అమ్మ, అన్నయ్య వీళ్ళంతా నా నుంచి ఆశిస్తున్నారు అనే సంగతి నాకు తెలుసు ప్రభ. సమర్ సంపాదిస్తున్నాడని వాళ్ళు నమ్ముతున్నారు కదా. కాని ఈ విష యాలన్ని వాళ్ళకు నేనెలా చెప్పను. ఒకవేళ చెప్పినా వాళ్ళు అర్థం చేసుకోరు. డెబ్బై అయిదు రూపాయల జీతమేనని అందరికి తెలిసిన ఏదో ఒక హుండి చేతికి చిక్కినంత మురిసి పోతున్నారు. ఇక నువ్వే చెప్పు. వీళ్ళందరికి నేనెలా నచ్చజెప్పాలి?" మళ్ళీ గాఢంగా నిట్టూర్చి చెప్పసాగాను. "ఇటు ఈ వెధవ రిజల్ట్స్ ఎలా ఉంటాయో మహా భయంగా ఉంది. ఇంతకు కాలేజిలో జాయిన్ కాగలనా, లేదా కోరికలన్ని మనస్సులోనే అణగారిపోతాయా?" నా సమక్షంలో అసలు తీరమే లేని ఒక చీకటి సముద్రం పరుచుకుని ఉంది.

ఆ రోజుల్లో వాతావరణమంతా రిజల్ట్స్, రిజల్ట్స్ అని మారుమ్రోగుతు న్నది. ఎటు చూసినా అటు ఇద్దరు ముగ్గురు కుర్రాళ్ళు కలువగానే తాము రాసిన ఆన్సర్ పేపర్స్ గురించి అంచనాలు వేసుకుంటున్నారు. ఉమానాథ్ తాను మార్కులు వేయించుకోవాలని ఎగ్జామినర్ దగ్గరికి వెడితే వాడిని మెడలు పట్టి గెంటివేసారట. మరి ఆ ఎగ్జామినరే బాలేశ్వర్‌కు మార్కులు వేసాడట - "ఎవడో వాడి మెడలు వంచే తాత దిగి వచ్చి ఉంటాడు!"

వాళ్ళ మాటలు వింటూ ముందుకు వెళ్ళి పోయేవాణ్ణి! ఇప్పుడు ఒక ఆత్మ విశ్వాసంతో 'చూద్దాం ఏం జరుగుతుందో?' అని తీర్మానించుకున్నాను. కానీ ఆ కుర్రాళ్ళ ఆదుర్దా పాపం ... ఎవ్వరి ఇంటి పరిస్థితి ఎలా వుందో ఏమో?

నేను ఉద్యోగానికి వెళ్ళడం ప్రారంభించాను. స్కూళ్ళు, కాలేజీలు ఇంకా తెరవలేదు కాబట్టి ప్రభకు సాధ్యమైనంతగా తక్కువ శ్రమ కలిగించాలని నా ఉద్దేశ్యం. ఆ తర్వాత ఎలాగూ తప్పదు కాబట్టి ఇబ్బందులు తప్పవు.

ఇప్పుడేమో ఉదయం పూట తినకుండానే వెళ్ళిపోవచ్చు. పదకొండు, పన్నెండు గంటలకు తిరిగి రాగలను. ఇకముందు అటునుంచె కాలేజీకి వెడుతుంటె పాపం ప్రభ ప్రతిరోజు మూడున్నర లేదా నాలుగు గంటలకు నిద్ర లేవవల సిందే. ఇప్పటికే పాపం ఇరవై నాలుగు గంటలు గానుగెద్దులా పనిచేస్తున్నది. ఉదయం నుంచి రాత్రి పదకొండు గంటల దాకా ఆమె ఖాళీగా ఉన్నట్టు ఎప్పుడూ చూడలేదు. అయినా ఎంతో జాగ్రత్తగా ఆమెకు తెలియకుండా పొద్దున్నే నేను లేచి కూర్చోగానే ఆమె ఎలా పసిగట్టేదో ఏమో కాని తాను కూడ లేచి కూర్చునేది. నేను అనునయించి పడుకోమంటె కాసేపు పడుకున్నట్టు నటించేది. నేను బయటికి వెళ్ళిపోగానే తాను తన పనిలో లీనమైపోతుం దని నాకు తెలుసు. నేను ఇలా త్వరగా లేవడం వల్ల ఆమె కూడా లేచి కూచోవలసి వస్తున్నదని ఎంతో బాధగా వుండేది. ఇంతకు ముందు కనీసం ఉదయం ఆరింటిదాకా పడుకునేది.

నేను పనిచేసే స్థలానికి చేరుకునే పద్ధతి కూడా చాలా ఆసక్తికరంగా ఉండేది. మా పట్నంలో రెండు స్టేషన్లు ఉన్నాయి. ఒకటేమో మా ఇంటి దగ్గరే ఉంది. మరొకటి నా ఉద్యోగ స్థలానికి పోవడానికి అనుకూలంగా వుండేది. ఉదయం ఒక బండి వచ్చేది. అది మధ్యలో ఎక్కడా ఆగేది కాదు. మహా అయితే అయిదు నిమిషాల దారి. రైలు బండి ఆగగానే కిందికి దూకేసి వైర్లు దాటి గబగబా బయటికి వచ్చి ఎంతో ధీమాగా ఏదో నేను రోడ్డుపైనే నడుచుకుంటు వెడుతున్నట్టు నటించేవాణ్ణి. మొదటి రెండు మూడు రోజులు నా పరిస్థితి చెప్పనక్కరలేదు. నేను ప్రభకు ఆ విషయమే చెప్పాను. నా గుండె అసలు నా చెవుల్లోనే మారుమ్రోగుతున్నట్టు కొట్టుకునేది. ట్రెయిన్‌లో కూర్చున్నప్పుడు తల తిరుగుతున్నంతగా గాభరా కలిగేది. ప్రతి నిముషం అటునుంచి టి.టి. వస్తాడేమోననే భయం కలిగేది. ఆ నల్లకోటు మనిషి గభాలున నా చెయ్యి పట్టుకుంటాడేమోనని చెమట్లు పోసేవి. కాని ఇదంతా రెండు రోజుల పరిస్థితి మాత్రమే, ఆ తర్వాత నేను తప్పించుకోడానికి రక రకాల ఎత్తుగడలు అవలంబించడంతో ధైర్యం పెరగసాగింది. రైలు బండి బయలుదేరే వరకు నేను ఎంతో తటస్థంగా అటూ ఇటూ తిరుగుతూ ఏదో మరో బండి కోసం ఎదురు చూస్తున్నట్టు లేదా ఏదో పని మీద నిలుచున్నట్టు నటించేవాణ్ణి. టి.టి.పై చూపులు ఆనించి బండి బయలుదేరగానే అతనికి చాలా దూరంగా వుండే పెట్టెలోకి ఎక్కిపోయేవాణ్ణి. బండి ఆగగానే అందరి

కంటె మొదలు ప్లాట్‌ఫాం పైకి దిగి, అక్కడే ఎప్పటి నుండో షికారు చేస్తున్నట్టు, నాకు ఆ బండితో సంబంధం లేనట్టు అటూ ఇటూ తిరిగేవాణ్ణి.

ఆ విధంగా ఈ రైలుబండి వినోదం సాగిపోయేది. అందువల్ల ఎంతో శ్రమను తప్పించుకునేవాణ్ణి. అలా కాని పక్షంలో పొద్దునే లేచి కాలినడకన నడిచి వెళ్ళడాన్ని నేను ఊహించుకోలేను. ఎండాకాలంలోనైతె ఏదో విధంగా నడుచుకుంటూ వెళ్ళిపోవచ్చేమో, కాని చలికాలంలో నా పాత బట్టల్లో చలిలో వణుకుతూ వెళ్ళడమంటె మహా కష్టమే. ఆ ఆలోచనే నాకు వణుకుడు పుట్టించేది.

ఇక నేను చేస్తున్నపని మొదట్లో ఆసక్తికరంగానే వుండేది. కాని తర్వాత, తర్వాత మాత్రం మనస్సంతా విసిగిపోయేది. ఉదయం అయిదు గంటల నుంచి పదకొండు గంటల దాకా తేమతో చల్లగా వుండే గరుకు కాగితంపైన విస్తరించిన సిరాలోని ప్రూఫుల్ని దిద్దుతూ అలా ఆరుగంటలపాటు పొడుగూ, అడ్డం గుర్తులు పెడుతూ ఉంటె తల గిర్రున తిరిగిపోయేది. ఇలాంటి పని మూలంగా ఇంతటి అలసట కలుగుతుంటె, ఈ కష్టాన్ని తట్టుకుని మరి కాలేజీకి వెళ్ళి చదువు సాగించగలనా అనే భయం నన్ను వెంటాడసాగింది.

మొదట్లో కొన్ని రోజులపాటు నేను ఎంతో ఉత్సాహంగా చేతికి వచ్చిన పేజీలన్నింటికి ప్రూఫులు దిద్దేసేవాణ్ణి. అది చూసి ప్రెస్సువాళ్ళంతా ఆశ్చర్యపడి పోయేవారు. ఈ మాత్రం పని పెద్ద కష్టమా అని అనిపించేది. ఏదో అలా చదివేసి తప్పున్న చోట గుర్తులు పెట్టడమే కదా. కాని మేనేజర్ ఆ తర్వాత ఆ పేజీల్లో ఎన్నో తప్పులున్నాయని తిప్పి పంపేవాడు. నేను ఎంతో జాగ్రత్తగా దిద్దితే కూడా మళ్ళీ తప్పులు ఇలా వచ్చాసాయేమిటి - ఏమి అర్థమయ్యేది కాదు. మెల్లిమెల్లిగా నా ఉత్సాహమంతా నీరుగారి పోసాగింది. ఒక్కొక్క అక్షరాన్ని మూలంతో సరిచూసి దిద్దేసరికి నా తల పచ్చి మట్టి ముద్దలా తయారయ్యేది. ప్రెస్సు యంత్రాల రణగొణ ధ్వని మధ్య గొంతు చించుకుని మరోవైపు నుంచి ఆజ్ఞలు ప్రతిధ్వనిస్తూ వుండేవి. 'నోట్ లైప్ ఉబికి రావడం లేదు ఎందుకు?' 'సిరా ఇప్పుడు ఎక్కువ పడుతున్నది.' 'నోరు తెరిచి ఏం చూస్తున్నావ్ కాగితం ఎక్కించు.' మేనేజర్ తన సిరా మరకలున్న ప్యాంటు జేబుల్లో రెండు చేతులు దూర్చి దగ్గరగా వచ్చి నేను ప్రూఫులు దిద్దుతూ ఉంటే చూస్తూ నిలబడేవాడు. ఆయన దగ్గర ఉన్నప్పుడు పరీక్ష హాలులో ఇన్విజిలేటర్ దగ్గరగా వచ్చి నిలుచున్నంత గాభరా కలిగేది.

ఆయన వెదుతూ వెదుతూ అనేవాడు. "మిస్టర్ మరి ఇంత మెల్లిగా ప్రూఫ్ దిద్దితే ఎలా? అక్కడ మెషిన్ ఖాళీగా ఉంది. ఇంకా కరెక్షన్ మరికొంత టైం లాగేస్తుంది. కాస్త మరింత జాగ్రత్తగా చూడండి. ప్రూఫులు దిద్దడమంటె చీపురుతో ఊడ్వడమన్నమాట! ఎన్నిసార్లు ఊడ్చినా, అన్నిసార్లు చెత్తా చెదారం ఎటునుంచో మళ్ళీ వస్తూనే వుంటుంది." ప్రెస్సులో ఎక్కడ చూసినా సిరా రంగు, ఇతరత్రా నల్లని మరకలు పరుచుకుని వుండేవి. మరోవైపు సుమేరా కూర్చుని నీళ్ళలో తడుపుతూ ఏదో దంచుతూ ఉండేవాడు. ఇంకోవైపు మెషి న్మ్యాన్ ఇటుకల పొయ్యి మీద సిరాను వేడి చేస్తూ వుండేవాడు. ఒక విధ మైన దుర్వాసనతో వాంతి వస్తున్నట్టు ఉండేది. యంత్రాల్లోంచి కారే తైలము జిడ్డు బట్టలను అంటుకునేది. సింధి హోటల్ నుంచి ఒక కుర్రాడు ఇనుపతీగ హ్యాండిల్లో అమర్చిన చాయ్ గ్లాసులు తీసుకువచ్చి ప్రతి పది నిముషాలకు ఎవరికో ఒకరికి చాయ్ ఇస్తూ ఉండేవాడు. లేదా మేనేజర్ దగ్గరికి అచ్చు పనుల కోసం వచ్చె కస్టమర్లకు టీ తెమ్మని సుమేరా అప్పుడప్పుడు ఆ కుర్రవాడిని కేక వేస్తుండేవాడు.

అయితే అక్కడ పనిచేసే వాళ్ళ ఉత్సాహాన్ని చూస్తూ ఉంటె విసుగు అనిపించేది కాదు. మొదట్లో అంతా కొత్త కొత్తగా ఉండేది. కాని త్వరలోనే నాకు బాగానే అలవాటై పోయింది. టైపును కేసుల్లోకి సర్దుతూ లేదా కంపోజ్ చేసుకుంటూ ఏదో అమ్మాయి ప్రేమ కథ, తమ పొరుగువాడి వ్యభిచార కథ కల్పించి లేదా సినిమాల కథలను అటూ ఇటూ జోడించి విచిత్రమైన కథ లను ఎంతో రసవత్తరంగా చెప్పుకునేవారు. అది సినిమా కథ కావచ్చు లేదా సొంత జీవితంలోది కావచ్చు, ప్రతి వాడి దగ్గర ఒకే ఒక విషయం. తమ తమ సెక్సు అనుభవాల వర్ణన. వాళ్ళలో ఒక కుర్రాడు తరచుగా నన్ను ఆకర్షించేవాడు. అతను సాధారణంగా ఏమీ మాట్లాడకుండా వుండేవాడు. ముఖం చూస్తే అమాయకుడిలా ఏదో మంచి కుటుంబం నుంచి వచ్చిన వాడిలా కనపడేవాడు. అతను వీళ్ళందరు తన స్థాయికి తగినవారు కాద న్నట్టు నిశ్శబ్దంగా వుండేవాడు. ముసలి మెషిన్మెన్లు చూడకుండా వది లిన సినిమాలు చాలా తక్కువే. ప్రతిరోజు వీళ్ళ కథలు ఇంటికి రాగానే విని పిస్తూ ఉండేవాడిని.

పగలు పన్నెండు గంటలకు తీవ్రమైన ఎండలో చెమటతో తడిచి ఇంటికి రాగానే ఆకలితో తల గిర్రున తిరిగేది. వెంటనే దాహాన్ని తీర్చుకోడానికి

రెండు గ్లాసుల నీళ్ళు తాగగానే చాలా సేపటిదాకా అన్నం తినాలనిపించేది కాదు. భోజనాన్ని పైకె తెప్పించుకునే వాణ్ణి. ప్రభ నా కోసం ఇంతసేపు ఆకలితో కూర్చోడం నాకు ఎంతో బాధగా ఉండేది. అందువల్ల మొదటిరోజే ఆమెతో అన్నాను. "ఏమిటీ మూర్ఖత్వం ప్రభ. ఇంత చదువుకున్న దానివి నా కోసం ఎదురుచూస్తూ ఒంటి గంటదాకా అలా కూర్చోవలసిన అవసరం ఏముంది. సమయానికి ఇంత భోంచేయ్. దినమంతా పనిచేస్తున్న దానివి."

"నేను సమయానికే తింటున్నాను. నీ కోసం ఇంతసేపు అలానే కూర్చున్నానని అనుకుంటున్నావ్. ఇంటి పనులతో తెమిలితే కదా." ప్రభ మూతి తిప్పుతూ వెక్కిరించేది. "మహా అందగాడివి కదా. నీ కోసం ఇంతసేపు కూర్చోడానికి. ఇక్కడ ఎవరూ భోజనానికి ఎదురు చూస్తూ కూర్చోరు."

"ఎదురు చూడకపోతే మొదటే ఎందుకు తినేయవు?" ఆమె చలాకీతనం చూసి నాకు సరదా వేసింది. "మహా అందాల భామ దిగింది. సరి చూసుకుంటె మీ ఇంట్లో వాళ్ళందరి కంటె నేనే అందగాడిని. మీ వాళ్ళంతా ఒక్కర్ని మించిన అడవి మనిషి మరొకరు."

"ఆగండి. మా ఇంటివాళ్ళ గురించి ఇంకా ఏమైనా అన్నారో జాగ్రత్త. ఏమీ అనకుండా ఉంటె తలకెక్కిపోతున్నారు." ఆమె తన కనుబొమలు ఎగురవేస్తూ కళ్ళు తిప్పింది.

"ఎవరేం చేసుకుంటారో నేనూ చూస్తాగా" నేను మరింత ఉడికించాను.

"అయితే నేను ఇక వెళ్ళిపోతాను. నువ్వు ఒక్కడివే ఇక్కడ కూర్చుని వాగుతూ ఉండు. అక్కడ అత్తయ్య, తోడికోడళ్ల చివాట్లు వింటూ కూర్చోవాలి. ఇప్పుడేమో ఈయన గారు అన్ని వాగేస్తున్నారు. నేనేనా పుణ్యానికి దొరికినదాన్ని." లేచి నిలబడి వెళ్ళిపోతూ గొంతు సరిచేసుకుంటూ అంతా పరిహాసంగా మార్చేసింది. మీ నాన్నగారు కేకలు వేసినపుడే నువ్వు వళ్ళు దగ్గర పెట్టుకుంటావ్."

నేను నచ్చ జెప్పాలనే ఉద్దేశ్యంతో ఆమె చెయ్యి పట్టుకున్నాను. "నాదేం పోయింది. ఆ వేళ సింధూరంలో స్నానమాడినట్టు ఎరుపెక్కి పోలేదా."

"అబ్బో అలానా. మీ గురించి చెప్పరేం. అలా వణికిపోయి నోట్లోంచి మాట వస్తేగా. ఇప్పుడేమో మహా గొప్పలు పోతున్నారు." ఆమె ఆ నాటి సంఘటనపై నవ్వసాగింది.

"సరేలే. అనవసరంగా ఏమిటి ఇదంతా. రా మనం భోంచేద్దాం." నేను

నిజంగానే ఆవిడ చెయ్యిని పళ్లెం వైపులాగి బలవంతంగా రొట్టెను ముక్కలు చేయించే ప్రయత్నం చేసేవాణ్ణి.

"వదలండి. నన్ను బతకనివ్వరా? ఎవరైనా చూస్తే ఇంట్లో నుంచె గెంటేస్తారు. అబ్బో ఒకేచోట కలిసి తింటున్నారు...!" ఆమె బయటికి తొంగి చూస్తూ అన్నది.

"సరేలే. నోరు మూసుకో. మాట్లాడకుండా తిను" నేను చీవాట్లు వేస్తూ అన్నాను. పాపం ఇంతసేపు నా కోసం ఎదురు చూసిన తర్వాత కనీసం తోడుగా కూర్చుని తినే సుఖాన్ని అన్నా పొందకపోతే ఎలా అని అనిపించింది. మేము అలా కలిసి డైనింగ్ టేబుల్ పక్క కూర్చుని తింటున్న భవిష్యత్ చిత్రపటం నా కళ్లముందు మెరిసింది. మరి ఆమె కిటికీలోంచి తొంగి చూస్తూ కాలేజీలో నాకు ఖాళీ పీరియడ్లు ఎప్పుడు ఉంటాయా అని ఎదురు చూస్తున్నది.

ఆమె ముఖంపై ఒక చిరునవ్వు దోబూచులాడింది. ఆమె మనసులో కూడా అలాంటి చిత్రమేదో తళుక్కుమన్నట్టుంది. ఆమె వెంటనే లేచి తలుపులు మూసి వచ్చింది. చిన్న పిల్లలా భుజాలు ఊపుకుంటూ పులకించి పోయింది. "తలుపులు మూసి వచ్చాను. మీతో కలిసి తినడం సిగ్గుగా ఉంది బాబూ..."

"కొడతాను సిగ్గు ఎగ్గు అని అన్నావంటె" ఆమె లేచి నిలుచోబోతుంటే లాగి మళ్ళీ కూర్చోబెట్టాను.

నేను ఎలాగోలా సెకండ్ డివిజన్‌లో పాసయ్యాను. కాని అమర్ నెంబర్ ఎక్కడా కనపడక పోయేసరికి ఇళ్ళంతా స్తబ్ధత ఆవరించింది. ఇంట్లోని ఆ దృశ్యం ఇప్పటికీ నా ఎదుటే ఉంది. అమర్ ఒక మూల కూర్చుని ఏడుస్తున్నాడు. ఇల్లంతా స్మశాన ప్రశాంతి ఆవరించి ఉంది. వాడు ఫెయిల్ అయ్యాడనే బాధ తీవ్రతలో నేను పాసయ్యాననే ఆనందం ఎవరికీ కలుగలేదు. వాడు మళ్ళీ మరో సంవత్సరం చదువాలనే భయంకరమైన విషయం అందరి కళ్ళ ఎదుట ఆడుతున్నది. నాన్నగారు పహిల్వాన్‌లా రెండు చేతులను ఛాతీపై ఉంచుకుని ఆవేశంగా అటూ ఇటూ తిరుగుతున్నారు. "అడ్డగాడిదని చదువరా చదువరా అని ఎంత మొత్తుకున్నాను. కాని ఈ వెధవలకు తీరిక ఎక్కడిది. ఒకడి పెళ్ళి చేస్తేనేమో చెయ్యి దాటిపోయాడు. రొమ్ము విరుచుకుని మహా చెప్పేవాడు 'నాన్నగారు మీకు ఎందుకు నేను ఏం చేసినప్పటికి

ఫస్ట్ డివిజన్ తెచ్చుకోకపోతే అడగండి.' ఇప్పుడు ఆ సెకండ్ డివిజన్‌ను తీసి నాకమనండి వెధవని. అయితే అమర్ జీ నువ్వు జాగ్రత్తగా వినుకో. నీపై డబ్బును నీళ్ళలా పారబోయడానికి నాకు చాత కాదు. నీకసలు షికా ర్లతో తీరిక దొరికితే కదా. చదువుపట్ల మనస్సు లగ్నం కావడానికి చదువా లనుకుంటె నీ పూచీపై చదువుకో. లేదా బిచ్చం ఎత్తుకో."

వదిన ఒక వైపు అమర్ లాలాజీ ఫెయిల్ కావడం పట్ల దుఃఖాన్ని ప్రక టిస్తూనే, సముదాయిస్తూనే మరో వైపు ఆమె అన్నగారితో ఇలా అన్నదని ప్రభ నాకు చెప్పింది "ఈ ఇంటి భాగోతం బాగానే ఉంది. ఒకరేమో రాత్రీ పగలు రెక్కలు ముక్కలు చేసుకుని ఈ మొద్దులను పోషించి చదివిస్తుంటే వాళ్ళకు ఆ ఒక్కడికి పెళ్ళాం పిల్లలు ఉన్నారన్న ఇంగిత జ్ఞానం కూడా లేదు. ఇక ముందు బతుకంతా మిగిలే ఉంది కదా." అప్పుడు అన్నయ్య ఆమెకు నచ్చజెప్పాడు. "నోరు మూసుకో. మన బతుకంతా కేవలం ఈ పని లోనే ఎద్దులా చాకిరి చేసి సంపాదించి ఈ గొయ్యిలో వేస్తూపోవడమే..." ఆ తర్వాత ఆయన ఏడ్చేసారు.

అన్నయ్య దుఃఖం నా అంతరాంతరాల్లోకి దూసుకుపోయింది.

ఇంటి వాళ్ళందరూ తిట్టినా, వ్యతిరేకించినా వినకుండా నేను దివాకర్‌తో పాటు వెళ్ళి ఎంతో కష్టం మీద కాలేజీలో నా పేరు రాయించాను. కాలేజీలో అడ్మిషన్ కోసం కుర్రాళ్ళు పడుతున్న అవస్థలు, తెచ్చుకుంటున్న రికమం డేషన్లు చూస్తూ ఉంటె అసలు పాస్ కావడం ఏమంత కష్టం కాదనిపిం చింది. ఏదో విధంగా అడ్మిషన్ అనే 'వైతరణి'ని దాటితే జీవితం సఫలమని ఆ వేళ అనిపించింది. కాలేజీ అడ్మిషన్ల వ్యవహారం చూస్తుంటే చివరికి ఫస్ట్ క్లాసు విద్యార్థులు కూడా ప్రిన్సిపాల్ గది నుంచి వైస్ ప్రిన్సిపాల్ గదిలోకి పచార్లు కొట్టడంతోనే సరిపోయేది. ఒకడేమో యం.పి. రికమండేషన్‌తో వస్తుంటె, మరి ఇంకొకడి వెంట మెజిస్ట్రేట్ స్వయంగా తన మనిషిని పంపిస్తున్నాడు. ఇప్పటికి ఒక్కొక్క క్లాసులో అరవైమంది చొప్పున ఉంటారని అలాంటి ప్రతి క్లాసులో నాలుగు సెక్షన్ల చొప్పున ఉంటాయని నమ్మకం. రాక్షసుడి ప్రేగు లాగా ఈ వరస పెరుగుతూనే వుంది. సైన్సు, ఆర్ట్స్, లెక్కన మొదట క్లాసు లను విభజించి మళ్ళీ ఎ, బి, సి, డి సెక్షన్లు చెయ్యాలి. నేను కూడా నా అడ్మిషన్ కోసం మూడు రోజులపాటు తిరుగుతూ వుండిపోయాను. అదే కాలేజీ పాత విద్యార్థిని కాబట్టి నాకు సీటు దొరికిపోయింది. కాని పాపం ఫస్ట్

ఇయర్ వాళ్ళ అగచాట్లు చూడాలి!

కాని ఆశ్చర్యం ఏమిటంటె మా ఇంట్లో నా అడ్మిషన్ గురించి చెలరేగిన తుఫాను, వ్యతిరేకత రెండు రోజుల్లోనే మటుమాయమై పోయింది. అసలు అమర్ ప్రవేశం గురించి చాలా ఇబ్బంది కలిగింది.

ఇప్పుడిక ప్రభకు అసలైన ఇబ్బంది మొదలయ్యింది. ప్రెస్సు నుంచి పదకొండు గంటలకు తిరిగి రాగానే నేను కాలేజీకి పరిగెత్త వలసి వచ్చేది. అటునుంచి మూడు గంటలకు గాని తిరిగి వచ్చేవాణ్ణి కాదు. మాకు ఆఖరి పీరియడ్ మూడు గంటలకే ఉండేది. ఇంకా నయం కాలేజీలో మిలట్రీ ట్రైనింగ్ మొదలు కాలేదు కనుక బతికిపోయా... లేకపోతే నాలుగు, నాలుగున్నర గంటల నుంచి ఏడున్నర దాకా పిప్పి వదిలేది. దానికి హాజరు కాకపోతే ఎనిమిది అణాల ఫైను. అప్పుడిక ఉదయం నాలుగున్నర గంటలకు ఇంటినుంచి బయల్దేరి ఎంతో కష్టం మీద రాత్రికి తిరిగి ఏడున్నరా లేదా ఎనిమిదికి మాత్రమే ఇంటికి చేరుకోగలను. తిండి సమస్య ఒకటి మరింత విషమ సమస్యగా మారింది. ప్రభ సలహా ఇచ్చింది. "నువ్వు అనవసరంగా ఈ విషయంలో ఎందుకు తలబాదుకుంటున్నావ్. పొద్దున్నే మూడు గంటలకు లేచి ఏదో ఒకటి నీ కోసం వండి పెడతానని చెబుతున్నాగా."

"నువ్వేమో రోజంతా పనిలో మునిగి ఉంటావు. పైగా మళ్ళీ ఇదొకటా. రాత్రి పదకొండున్నరకు పడుకుని ఉదయం మూడున్నర గంటలకు లేవగలవా. ఇంతకూ నీ ఉద్దేశ్యం ఏమిటి స్పష్టంగా చెప్పేయ్. నేనే నిన్ను చంపేస్తాను." నేను అలా పైపై కోపాన్ని చూపుతూ అన్నాను.

"అబ్బో, ఈ కాస్త పనిచేస్తే చచ్చిపోతానేమిటి? పైగా నేను పనిని ఉచితంగా చేస్తానా? ఇప్పుడే చెబుతున్నాను. దీనికి బదులుగా మొత్తం చెల్లించవలసి ఉంటుంది."

నేను ఆమె ఈ ధోరణిపై చెప్పిన తీరును చూసి ఎంతో మురిసిపోయాను. గద్గద కంఠంతో అన్నాను "చూడూ - బతికుంటె ప్రతిపైసా లెక్క గట్టి చెల్లించేస్తాను. నిన్ను సుఖపెట్టాలనే కదా ఇదంతా చేస్తున్నాను. లేకపోతే పొద్దున్నే నాలుగు గంటలకు లేచి రాత్రి పది గంటలదాకా పనిలో మునిగి పోతున్నానంటె ఏదో పిచ్చిపట్టి కాదు కదా." నేను అకస్మాత్తుగా సంభాళించుకుని అన్నాను "లేదు నువ్వు ఎట్టి పరిస్థితులలోను మూడు గంటలకు లేవనవసరం లేదు. ఒక పనిచేస్తే రాత్రికే ఏదైన వండి పెట్టేస్తే

సరిపోదా..."

"కాని పొద్దుటికల్లా బాగా చల్లబడి పోతుందే."

"ఏమీ చల్లబడి పోదు. ఉదయం పది గంటలకు ప్రెస్సులో తినేస్తాను. అంతసేపట్లో అది పాచిపోతుందా."

ప్రభ రాజీపడి పోతున్నట్టు నాకు అనిపించింది. అప్పుడు అన్నది "అయితే దినమంతా ఆ గిన్నెను మోసుకుంటూ తిరుగుతావా?"

"వెంటేసుకుని ఎందుకు తిరుగుతాను. అక్కడే ప్రెస్‌లో పెట్టి వచ్చేప్పుడు తీసుకువచ్చేస్తాను. చాలా దగ్గరేగా ఉంది."

కాని ఆమె వెంటనే ఆ మాటను పట్టించుకోకుండా అన్నది "అలా ఏమీ కాదండి. పొద్దున్నే లేచి వండుతానంటున్నాను కదా. వేడి వేడిగా తినివెళితే కొంచెం స్మార్ట్‌గా కనపడతారు. చల్లబడిపోయిన అన్నం తింటె మెదడు మొద్దుబారి పోతుందని అంటారు. దినమంతా బద్ధకంగా ఉంటుంది." మళ్ళీ వెంటనే ఏదో జ్ఞాపకం రాగానే ఉత్సాహంగా చెప్పింది. "అసలు చెప్పడం మరిచాను. వెంట టిఫిన్ తీసుకెళ్ళటట్టయితే నాలుగు పరాటాలు వేసి కట్టమని అత్తయ్య ప్రత్యేకంగా చెప్పింది. బయట మిత్రుల దగ్గర కూర్చుని తింటాడేమో మరి మామూలు రొట్టెలు ఏం బావుంటాయ్ అని కూడా అంది."

"అలానా ఇది నాకు తెలియదే" నేను కాస్త ఉదాసీనంగా అన్నాను. "ప్రభ ఇంట్లో, వాళ్ళ సంగతి నాకు బాగా తెలుసు. ఇదంతా ఎందువల్లనంటె నాకు పది, పదికొండుకు జీతం ఇస్తారు. కదా... లేకపోతే నేను కాలేజీ కోసం కుట్టించుకున్న బట్టలు, పుస్తకాలు, కాపీల ఖర్చు, కాలేజీ ఫీజు ఇవన్నీ ఊరికే వచ్చేసాయని అనుకుంటున్నావా? ఒక్కొక్క వస్తువు గురించి ఇంట్లో అడిగి ఉంటె హత్య జరిగి వుండేది హత్య తెలుసా... ఇప్పుడిక నువ్వే చెప్పు వాటిలోంచి నేను ఏమి ఇవ్వగలను. సరే ఒకపని చేద్దాం. నువ్వు ఏదో విధంగా పదినతో ఈ నెలకు సంబంధించిన మన ఖర్చుల జాబితా ఒకటి లెక్కగట్టి చెప్పగలవా?"

"అంటే వాళ్ళు నా తల పగులగొడితే నువ్వు విడిగా నిల్చుని తమాషా చూద్దామనా? నువ్వే నా చలాకీతనం చూపేవాడివి. అప్పుడు అమ్మ పళ్లు పటపట కొరుకుతూ ఏమంటుందో తెలుసా... మొగుడి రాబడి లెక్క జెబుతున్నది."

"అయితే నువ్వే చెప్పు ఎలా నచ్చ జెబుదామో? ఒకటి మాత్రం స్పష్టమే కదా. భోజనానికి తప్ప ఇంటివాళ్ళతో మనపై మరో ఖర్చు పెట్టిం

చడం లేదే. సరే చూద్దాం. ఇక ముందు ఏమవుతుందో" ఒక్కసారే అతి గాఢంగా నిట్టూర్చేసరికి వాతావరణమంతా ఆర్ద్రమైపోయింది.

కాసేపు నిశ్శబ్దంగా ఉన్న తర్వాత నేను తల ఆడిస్తూ అన్నాను "ప్రభ ఈ గొడవనంతా లాగి తన్నేసి వదిలించుకుంటె పీడా పోతుంది. రాత్రి పగ లనక ఇలా ఎలాంటి విశ్రాంతి లేకుండా ఎప్పుడు వీటి గురించే ఆలోచిస్తు ఉంటె మనకు మిగిలే సుఖం ఏమిటి? ఉదయం నాలుగు గంటల నుంచి రాత్రి పది గంటల దాకా పిచ్చివాడిలా అటూ ఇటూ పరిగెత్తడమేనా. ఏదో హాయిగా ఒక క్లర్కు ఉద్యోగం సంపాదించుకుని అరవై లేదా డెబ్బై రూపాయల జీతంతో సుఖంగా ఉండిపోతాం. ఉదయం పది గంటలకు వెళ్ళి సాయంత్రం పది గంటలకు ఇంటికి వచ్చేస్తాను. మహా అయితే ఫైళ్ళు కదా తీసుకురావలసి వచ్చేది."

ప్రభ ఎంతో సానుభూతితో నా మొహంవైపు చూసింది "కాని మన సమస్యంతా కేవలం డబ్బుతోనే కాదు కదా. ఆ మాత్రం ఇప్పుడు కూడా నువ్వు సంపాదిస్తున్నావు. మన కలలు ఉన్నతమైనవి అనేదే అసలు సమస్య, భవిష్యత్ పటం ఎంతో భిన్నంగా ఉంది."

"ఇదే కదా సమస్యలన్నింటికి మూలం, ఇంతకూ ఆ కలలు నా ఒక్క డివే కాదు కదా. ఇప్పుడు నువ్వే చెప్పు ఆ కలలని ఎక్కడికి తీసుకువె ళ్ళను. మనస్సు ఉంటె కలలు ఉంటాయి."

వెంటనే ప్రభ ఎంతో ప్రేమగా చీవాట్లు పెడుతున్నట్టు అన్నది "ఈ రోజు నువ్వు మరీ ఇలా మాట్లాడుతున్నావేమిటి. ఏహో కొన్ని ఇబ్బందులున్నాయి. అవి దూరమైపోతాయి. కలలు నిజమైతె వాటి సుఖాన్ని మనమే పొందుతాం కదా. వాటికోసం ఈ కాస్త కష్టపడడంలో తప్పేమిటి. మీ వెంట ఎవరు ఉన్నా లేకపోయినా నేను మాత్రం వున్నాను కదా." హామీగా తన చేతులను నా భుజాలపై ఆనించింది.

అప్పుడు నా హృదయం, ఆమె ఒడిలో తల పెట్టుకుని ఏడ్చేయాల న్నంతగా ద్రవించిపోయింది. ఈమె స్వర్గంలోంచి శాపభ్రష్టయై ఈ భూమి మీదికి కొంత కాలాన్ని గడపడానికి వచ్చిన దేవతలా కనపడింది. ఈమె నాలో ధైర్యాన్ని కూడగట్టకుండా ఉంటె నేను వీటినన్నింటిని ఈదుకు రాగలి గేవాణ్ణా. ఏనాటికి కాదు. ఏనాటికి కాదు. నేనెప్పుడో చెదిరిపోయి ఉండేవా డివి. బొంగురు పోయిన కంఠంతో నేను అడిగాను. ఇంతకూ ప్రభ ఒక విషయం

చెప్పు. ఈ కష్టాలు సమస్యలు నైరాశ్యం వల్ల నీ మనసు గాభరా పడదా. నేను నీతో అసలు మాట్లాడకుండా ఉన్న రోజుల్లో నిన్ను బాధ పెడుతున్నపుడు నీ మనస్సులో పరాజయ భావమనేది చోటు చేసుకోలేదా."

ప్రభ ఎంతో ఆత్మ విశ్వాసం నిండిన కంఠంతో బదులు చెప్పింది. "నేనా? నా గురించి నీకింకా తెలియదు. నాలో ఎంతో జీవన శక్తి ఉంది. ఈ కష్టాలను మించిన వాటితో కూడా నా మనస్సు వికలం కాదు. వివాహానికి ముందు ఆ తర్వాత ఏమవుతుందోనని ఎంతో భయంగా ఉండేది. ఎలాంటి కష్టాన్ని నేను భరించలేనేమోనని అనిపించేది. ఇప్పుడు వాటినన్నింటిని చూసిన తర్వాత బాధలంటె ఇవేనా. వీటితో ఇంతగా భయపడి పోవడమే మిటి అని అనిపించిది." ఆమె ఉపాధ్యాయురాలి భాష మాట్లాడుతున్నానేమో అనిపించి స్వయంగా సిగ్గుపడి కిందికి చూడసాగింది. ఆమె ముఖంపై ఒక తేజోవంతమైన ఉజ్వల అరుణకాంతి వెలువడి జ్యోతిర్మండలాన్ని నిర్మిస్తున్నట్లు నాకనిపించింది.

"లేదు ప్రభ నేనేమైనా ఓడిపోయాననుకుంటున్నావా. ఏదో ఊరికే అన్నాను. నువ్వు చూస్తూ ఉండు. నేను అన్ని చేస్తాను. నేను నీ కోసం ఏం చేస్తున్నానో, ఏం చేయగలనో ఇప్పుడే నీకు తెలియదు..." నేను రోమాంచితమైన చేతులతో ఆమె రెండు భుజాలను పట్టుకుని ఆమె ముఖాన్ని పైకి లేపాను. ఆమె వాలిన చూపులున్న మొహాన్ని చూసి ఒక విచిత్రమైన ఆలోచన మెదిలింది... ఒకవేళ ఈ లోగానే ఈమె తల్లి అయితే? అప్పుడు అనిపించింది, ఆమె నా మనస్సులోని ఎలా పసిగట్టిందో ఏమో అప్పుడే ఆమె ముఖం గులాబి వర్ణంలోకి మారిపోయింది.

# ఎనిమిది

అలసటకు కూడా ఒక విచిత్రమైన మత్తు ఉంటుంది. నా గది ఎదుట ఉన్న మిద్దెపైన ఒక చిన్న మంచం మీద నీటిపై ఉన్న నావలాగా పడుకుని ఉన్నాను. తల ఒక వైపు వేలాడుతున్నది. చేతులు విడిగా పడి ఉన్నాయి. మరి కాళ్ళు ఏమో నేలపై ఆని ఉన్నాయి. శరీరమంతా నిర్జీవమైపోయి అలా వేలాడుతున్నట్లు ఉంది. కింది నుంచి అందరూ మాట్లాడుతున్న చప్పుడు వినపడు

తూనే ఉంది... ఇక ఇప్పుడు అమర్ పెళ్ళిట.

నేను ఇంట్లో అడుగు పెట్టగానే పరిచయం ఉన్న కంఠం విని ఉలిక్కి పడ్డాను. ముందు గదిలోకి తొంగి చూసాను, మామగారు నా పెళ్ళి తర్వాత మొదటిసారి వచ్చారు. అదే ఆశ్చర్యం. ఆయనకి కోపం వచ్చిందేమో. కాస్త సంకోచించి పైకి వెళ్ళిపోయాను.

అప్పుడే కింది నుంచి కేక వినపడింది. "సమర్‌బాబూ నువ్వు నన్ను అసలు కలవనే లేదే..." నేను వచ్చేసాననే సంగతి ఆయనకు తెలిసినట్టు ఉంది. ఎంతో అయిష్టంగా లేచి కిందికి వచ్చేసాను. ఆయన ముందు గదిలోనే కూర్చున్నారు. బహుశా కోపం వల్ల లోపలికి రాలేదనుకుంటా. నేను వారికి పాదాభివందనం చేయగానే ఆయన నన్ను కౌగిలించుకుని దగ్గరే కూర్చోబె ట్టుకున్నారు. నాన్నగారితో మాట్లాడుతూ ఉండిపోయారు.

"విన్నారా ఠాకూర్‌గారు, ఏమి చెయ్యాలనుకుంటున్నారో మీరే స్వయంగా చూసి నిర్ణయించుకోండి. నా దృష్టిలో వున్న అమ్మాయి గురించి అంతా చెప్పాను. కాని అసలు విషయం ఏమిటంటె మనిషి మంచి చేయడానికి పోతే చెడుగా అర్థం చేసుకుంటున్నారు. సమర్ వివాహ సందర్భంలో అక్కయ్య మాటలు విన్న తర్వాత నేను అసలు ఎందులోనైనా మునిగి చావవలసింది." ఆయన నాన్నగారికి కోపంగానే సమాధానమిస్తూ అన్నారు.

నాన్నగారేమో ఒక మూల కూర్చుని మూతి తిప్పుతూ అగ్గిపుల్లతో చెవి లోని గులిమి తీస్తున్నారు. ఆయనేదో కావాలనే ఏదో చేస్తున్నట్టు కనపడు తున్నారు. చివరికి వేళ్ళతో చెవుల్ని జాడించి అన్నారు. "పోనివ్వండి చందన్ గారు. ఆడవాళ్ళ మాటలు పట్టించుకుంటారా ఎవరైనా. వాళ్ళకు ఏం పని వుందని - అలా నాలుక జారవిడిచి ఇటూ అటూ సాచి కొడుతుంటారు అంతే." ఆ తర్వాత ఆయన ఎంతో వినయంగా అడిగారు "అమ్మాయినైతే మీరు చూసే ఉంటారు. వంశము, మర్యాద ఎలా ఉన్నాయి? కాస్త వివరంగా చెప్పండి."

ఏ అమ్మాయి గురించి మాట్లాడుతున్నారో అర్థం కాక అలా వింటూ ఉండి పోయాను. మామగారు తన రెండు చేతుల్ని నెమిలిపింఛంలా చాచి అన్నారు "మీరు అమ్మాయిని చూసుకోండి. అమర్‌ను చూపించండి. అన్ని వివరాలు మీరే స్వయంగా మాట్లాడుకోండి. అమ్మాయి తండ్రి నాకు చెప్పి కూడా మూడు రోజులు గడిచిపోయాయి. మరీ వెంట పడుతుంటె గత్యం

తరం లేక ఇంతకంటె ఏం చేయగలసని వచ్చేసాను..."

"అది సరేనండి. అన్నీ బాగానే ఉన్నాయి కాని..."

ఇక నేను ఉండబట్టలేక అనేసాను. "నాన్నగారు ఎందుకు మీకీ తొందర. వాడేమో ఫెయిల్ అయ్యి కూచున్నాడు. ఇప్పుడిక పెళ్ళి చేస్తే మరోసారి ఫెయిల్ అవుతాడు."

"నువ్వు ఊరుకోవయ్యి. అర్థం చేసుకోకుండా మధ్యలోనే కలుగజేసు కుంటావేమిటి?" నాన్నగారు మందలించారు. "ఏదో ఇప్పుడే పెళ్ళి అయి పోతుందను కుంటున్నావా? కొన్ని సంవత్సరాల పాటు మాటా మంతి జరు గుతుంది తెలుసా. నా కళ్ళముందే అన్నీ జరిగిపోతే గంగస్నానం చేసినంత పుణ్యం. ఎవరికి తెలుసు. రేపు ఏమవుతుందో" ఆయన కంఠం రుద్ధమైపో యింది. సంభాళించుకుంటు తన ఎదుట ఉన్న హుక్కా పీల్చసాగారు. అంత కుముందే మామగారు గుడగుడమని హుక్కా పీల్చి ముందుకు జరిపారు. ఒక్కసారి పీల్చి అన్నారు. "పాస్ ఫెయిల్‌ది ఏముంది దాని కోసం జీవితం ఆగిపోతుందా. అయితే చందన్‌గారు, ఇందులో చెడుగా భావించవలసిన పనిలేదు. సమర్ పెళ్ళిలాగా ఏదో డొంక తిరుగుడు వ్యవహారం ఉండది పుడు. ఇచ్చిపుచ్చుకునే మాట స్పష్టం కావాలి."

నాన్నగారు అంత నిష్ఠూరంగా మాట్లాడేసరికి అవమానపు చేదు నన్ను కృంగదీసింది. కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి. నా మూలంగా కోరిక తీరింది. ఇప్పుడిక అమర్ పెళ్ళి చేస్తారు. ఏదో ఇప్పుడు ఇంట్లో గొడవ తక్కువ ఉన్నట్టు. మరో మనిషి ఖర్చును పెంచుకుంటారు. నిజమే ఎవరి పెళ్ళి ఆగదు. కాని సొంత కాళ్ళపై నిలబడ గలిగే శక్తి ఉండాలి కదా. కాని నేను మాట్లాడితే జోక్యం చేసుకోవడం నేరం అంటున్నారు. ఇప్పుడిక ఇచ్చిపు చ్చుకోవడాల గురించి మాట్లాడుకుని ఇక అస్తమానం దాని గురించే జగడం. ఎవరేం చెప్పినా, చేసినా వీళ్ళు ఏమైనా వింటారా దీన్ని గురించి మాట్లాడే అధికారం కేవలం వీళ్ళకే వుంది. మేము ఏమో మూర్ఖులం లేదా బలికోసం వెడుతున్న మేకలం. ఇంత వరకు నేను చచ్చాను. ఇప్పుడిక పాపం అమర్ వంతు. అప్పుడు అనిపించింది. ఇక అక్కడ కూర్చోవడం అనవసరం అని.

లేచి నిలుచోబోతుంటె మామగారు నా చెయ్యి పట్టుకుని కూర్చోబెట్టారు. "అరే, అరే కూర్చో బాబూ ఎక్కడికి వెడుతున్నావు. ఎంత సేపట్నుంది నేను నీ కోసం ఎదురు చూస్తున్నాను. అసలింతకి ఎక్కడికి వెళ్ళొచ్చావ్."

"కాలేజీకి వెళ్ళాను మామగారు." గొంతు సవరించుకుంటూ అన్నాను. ఇంతలో అమర్ అన్నయ్య కూతుర్ని తీసుకువచ్చి నాన్నగారి వడిలో వేసి తనకేమీ పట్టనట్టు వెళ్ళిపోయాడు.

మామగారు అన్నారు "అలానా కాలేజీకి వెడుతున్నావా. చాలా మంచి పనిచేస్తున్నావ్. బాగా చదువుకో బాబూ. విద్యయే నిజమైన ధనం." ఆయన ఎంతో ప్రసన్నంగా తల ఊపుతూ అన్నారు.

నేను ఏమీ మాట్లాడలేదు.

"అయితే అంతా బాగున్నట్టె కదా. చాలా నీరసంగా కనపడుతున్నావే మిటి. ఏమిటి సంగతి ఆరోగ్యాన్ని సరిగ్గా పట్టించుకోవడం లేదా." అంటూ ఆయన ఒక ఉద్దేశ్యంతో నవ్వారు. "ఇప్పుడు సంఘ్ (శాఖా) వాళ్ళ ఉద యపు పరేడ్‌కు వెళ్ళడం లేదా."

"ఉదయం తొమ్మిది గంటలకు గాని దొరగారికి పొద్దు పొడవదు. పగటి వేళకు పరేడ్‌కు వెడతాడా?" పాపాయిని ఆడిస్తున్న నాన్నగారు మెల్లిగా అన్నారు. అయితే ఆయన మాటలోని పరుషత్వానికి నేను తల్లడిల్లిపోయాను. పరోక్షంగా ఆయన ఆ రోజును జ్ఞాపకం చేస్తున్నారు.

వెంటనే తల విదిలించి "అవును, పొద్దున పది గంటలకు గాని లేవను." అని చెప్పాలని అనిపించింది. కాని ఏదో విధంగా నిగ్రహించుకుని అన్నాను. "లేదండి మామగారు అలాంటిదేమీ లేదు." "ఈసారి ఎండలు మరీ తీవ్రంగా ఉన్నాయి కదా. ఏమీ చేయడానికి ధైర్యం చాలడం లేదు."

"అవును నిజమే, అవును నిజమే" నాన్నగారికి హుక్కా గొట్టాన్ని అందిస్తూ మామగారు అన్నారు. "ఇప్పుడిక ఇంటి విషయం కొంత అయినా పట్టించు కోవాలి బాబూ, నువ్వు చేయవలసిన సహాయం గురించి ఆలోచించు. అమ్మా, నాన్నల పట్ల నీ కర్తవ్యం చాలా ముఖ్యమైనది. ఇప్పుడు నీకు యుక్త వయస్సు వచ్చింది. ఒక గృహస్థుడివి అయినావు. నీ చిన్న తమ్ముళ్ళని చదివించాలి. ఒక్క పెద్దవాడే ఎంత వరకని చేస్తాడు."

ఈసారి నాన్నగారు మళ్ళీ మధ్యలోనే అన్నారు. "ఇతనికి ఏమిటట చింత. ఆయన, ఆయన భార్య సుఖంగా ఉంటే చాలు. ఇక మిగతా ప్రపంచ మంతా ఏట్లో పోతే వాళ్ళకేం." మళ్ళీ ఆయనేదో పరుషమైన మాట అనబో తుంటె మామగారు ఆయన్ని ఆపి "మీరు ఊరుకోండి ఠాకూర్‌గారు, నేను మాట్లాడుతూ ఉంటే మీరు కలుగజేసుకుంటారేమిటి? అర్థం చేసుకోకపోవడా

నికి మరీ చిన్నపిల్లవాడేం కాదు కదా. చూడు బాబూ, నీ పెళ్ళి చేసారు నిన్ను చదివించారు. ఇంకా ఎంతవరకు తల్లితండ్రులపై ఆధారపడి వుంటావు. తల్లితండ్రులు లోకంలోని బాధలన్నీ భరించి ఎన్నో ఆశలతో తమ పిల్లలను చదివిస్తారు కదా?" ఆయన మళ్ళీ నన్ను దగ్గరగా లాక్కున్నారు.

నాన్నగారు తప్పకుండా మామగారి దగ్గర తన బాధనంతా వెళ్ళబోసు కుని వుంటారు. లేకపోతే మామగారికి ఎలా తెలుస్తుంది. అప్పుడే ఆయన నాకు నచ్చ జెప్పుతానని అని వుంటారు. ఇలాంటివన్నీ మొదలే ఒక పద్ధతి ప్రకారం అనుకోడం జరిగింది. ఒక విధంగా రెండు సంవత్సరాల తర్వాత మొదటిసారి ఇంటివాళ్ళు ఇంత ఆత్మీయంగా నాతో మాట్లాడి నచ్చజెబుతు న్నారు. ఇంటి వ్యవహారమంతా నాకు తెలిసే వున్నా ఈ ఆత్మీయత నన్ను ద్రవింపజేస్తున్నది. నా కళ్ళు చెమ్మగిల్లగానే నేను నిశ్శబ్దంగా నా కాలి బొట నవేలితో మోడాను అటూ ఇటూ జరుపుతూ వింటున్నాను.

"వివాహాలు అందరూ చేసుకుంటూనే వుంటాను బాబూ. కాని ఇక దానితో అన్నా తమ్ముళ్ళు, చెల్లెళ్ళను, తల్లితండ్రుల్ని వదిలివేస్తారా ఏమిటి? నాలుగు వంట పాత్రలున్న చోట పరస్పరం తగులుతూనే ఉంటాయి. ఆడవా ళ్ళది ఏముంది ఒక క్షణం ఇటూ ఒక క్షణం అటూ. బుద్ధిమంతుడైన మగాడు వాళ్ళ మాటలను పట్టించుకోకూడదు. దానికి నువ్వు మా కంటె ఎక్కువ చదువుకున్న వాడివి బాగా అర్థం చేసుకోగలవు. కోడళ్ళు మరో ఇంటి నుంచి వస్తారు. వాళ్ళ వంశాలు వేరు వేరు. అందువల్ల ఇక్కడి బంధుత్వా లతో వాళ్ళకేం పని. రక్తసంబంధం మీ అందరిది. అది విడిపొమ్మంటె పోతుందా? అందువల్ల బాబూ, ఇవన్నీ గృహస్థుల సమస్యలు, చాలా జాగ్రత్తగా ఆలో చించి అడుగువేయాలి." మామగారు, నా భుజాన్ని చేతితో నిమురుతున్నారు.

అప్పుడే నాలోంచి ఒక ఛీత్కారం లేచింది. "మామగారు మీకు తెలి యదు. మీకు తెలియదు. ఈ ఇంటి పరిస్థితి మీకు తెలిసి ఉంటె అమర్ పెళ్ళి ప్రస్తావనే తెచ్చేవారే కాదు." ఈ మాట చెప్పాలనుకున్నాను కాని ఒక నేర స్థుడిలా నా చూపులను నేలపై వాల్చి ఉండిపోయాను.

"నువ్వే చెప్పు అత్తా కోడళ్ళ గొడవలు ఏ ఇంట్లో ఉండవని పెద్ద పెద్ద లక్షాధికారుల ఇంటి పరిస్థితి కూడా నాకు తెలుసు. ఇంటింటా వున్నవి. మట్టి పొయ్యిలే కదా." మామగారు ప్రేమగా నా వీపును నిమురుతూనే వున్నారు.

ఎందువల్లనో నాకు ఇష్టం లేకపోయినా నా హృదయంలో కన్నీళ్ళు

పొర్లుకొస్తున్నాయి. పరిగెత్తి నాన్నగారి పాదాల ముందు పడిపోయి బాగా ఏడ్చి మన్నించమని అడగాలని అనిపించింది. నేను చేసిన అనవసరపు పనులు, శిష్టాచారానికి భిన్నమైనవి ఉంటె క్షమించమని అడగాలని అనుకున్నాను. ఇంతవరకు ఈ వ్యవహారాన్ని అంతా ఈ దృష్టిలో చూడనేలేదు. ఆయన పట్ల నా ప్రవర్తన నిజంగానే ఎంత నిర్లక్ష్యంగా అభ్యంతరకరంగా ఉందో అర్థం అయ్యింది. అతి కష్టం మీద ఈ మాత్రం అనగలిగాను. "మామగారు నేను ఇంకా చదవాలనుకుంటున్నాను."

"చదువుతానంటె ఎవరు చదివించరు బాబూ, కాని ఒక విషయం గమనించాలి. ఏదైనా ఇంటి పరిస్థితులను బట్టి చేయవలసి ఉంటుంది. 'దుప్పటి ఉన్నంత మేర కాళ్ళు చాపుకోవాలి.' మీ అన్నయ్యనే చూడు. తన బాధ్యత తను నిర్వహిస్తున్నారా లేదా? ఇంట్లో ఉన్నప్పుడు అన్ని ఆలోచించాలి బిడ్డా. ఇప్పుడు నువ్వు గృహస్త జీవితంలోకి ప్రవేశించావు. లోకం ఎలా నడుస్తుందో అర్థం చేసుకునే ప్రయత్నం చెయ్యి. భార్యను కాస్త అదుపులో పెట్టు. ఆమెకు ఒక పద్ధతి, మర్యాద నేర్పించు. ఒకవేళ ఇప్పుడే అతి ప్రేమతో నీ తల కెక్కించుకున్నావంటె ఇంకేమి నేర్చుకుంటుంది చెప్పు. అమ్మాయిలు నేర్చుకునేదంతా అత్తగారి ఇంటిదగ్గరే. తల్లిగారింట్లో గంతులు వేయడం ఆడుకోవడం తప్ప ఏం చెస్తారు."

ఆ విధంగా మామగారు తమ వెన్నెలలాంటి మెత్తని తేనెలాంటి తియ్యని మాటలతో ఆడదాన్ని ఎలా అదుపులో పెట్టాలో అనే ఉపాయాలు చెబుతున్నారు. ఈ సలహాలన్ని ఒక విధంగా నాపై ప్రభపై పెట్టిన ఆరోపణలను తిరిగి చెప్పడమేగాని మరొకటి కాదని నాకు తెలుసు. ఆయన మాటలను వ్యతిరేకించాలని చాలాసార్లు అనిపించింది.

"నువ్వు పూజా పునస్కారాలు ధర్మకర్మాలు అన్ని వదిలిపెడుతున్నావని మీ నాన్నగారు చెబుతున్నారు. ఏమిటీ చదువుకోవడం అంటె వీటినన్నింటిని మరిచిపోవడమేనా బిడ్డా. ధర్మకర్మాలను లోకులు వదిలేస్తే ప్రపంచం ఎలా నడుస్తుంది. చూడు మన పూర్వీకులను చూడు. ఎన్నెన్ని కష్టాలు ఎదురైన ఎంతో సంకటస్థితి ఎదురైన ఆ మహా వీరులు ప్రాణాలు అర్పించారు. కాని తమ ధర్మాన్ని (మతాన్ని) వదలలేదు. హకీకత్ రాయ్, బందా బహదూర్‌లను ఎన్నెన్ని చిత్రహింసలు పెట్టలేదు. మన మతంలోని శక్తి మూలంగానే ఈ రోజు ఇక్కడ నిక్షేపంగా కూర్చున్నాం. లేకపోతే పాకిస్తాన్‌లోనే లేదా

ఏదో చర్చిలోనో ప్రార్థనలు చేస్తూ వుండిపోయే వాళ్ళం. మా కంటె నువ్వు ఎక్కువ చదువుకున్నవాడివి. జర్మనీ వాళ్ళు మన దగ్గర నుంచి వేదాలను దొంగిలించారు కాబట్టి ఒకదాన్ని మించి మరో విలక్షణమైన వస్తువులను కని పెట్ట గలిగారని నీకు స్వయంగా తెలుసుననుకుంటాను. అరే, దొంగిలించి నువ్వు వంద రకాల వాటిని తయారు చేసుకోవచ్చు. కాని స్వయంగా తెలివి తేటలతో విమానాలు, రేడియోలు కనిపెట్టి ఉంటె వాళ్ళ నేర్పును అంగీక రించే వాళ్ళం." మన గత గౌరవాన్ని జ్ఞప్తికి తెచ్చుకోగానే ఆయన కళ్ళల్లో నీళ్ళు నిండిపోయాయి.

ఈ మాటలన్నింటికి నేను ఏమీ సమాధానం చెప్పాలోనని ఆలోచిస్తుం డగానే నాన్నగారు హఠాత్తుగా తమ తీవ్రమైన స్వరంతో అన్నమాట అక్కడి వాతావరణాన్ని ఛిన్నాభిన్నం చేసేసింది. "నువ్వు ఏ రాయికి నచ్చజెబుతు న్నావో చందన్? పెద్దలు అన్నారు. 'ఎవరికి నీ బోధ నచ్చుతుందో వాడికే బోధించు...' కోతికి బోధించావో అది ఇల్లంతా పాడుచేసి పోతుంది. ఇక్కడ నీ మాటల వల్ల ఏమీ ప్రయోజనం లేదు స్వామి. నీటి చుక్క నిలబడేదేం కాదు. గమ్మున అన్ని వింటాడు. తన భార్య చెప్పింది వాడి మనసులో కొచ్చింది మాత్రమే చేస్తాడు. అనవసరంగా నీ కాలాన్ని ఎందుకు వ్యర్థం చేసుకుంటావ్. వాడికి భార్య దగ్గరకు పోవడానికి కూడా ఆలస్యమవుతుందను కుంటాను." ఒక్క క్షణం ఊర్కుని మళ్ళీ అన్నారు. "వాళ్ళకు ఏది ఇష్టమో అదే చేసుకోనివ్వండి. మా నొసటి రాత ఎలా ఉంటె అలా జరుగుతుంది. ఇంత వరకూ అనుభవించలేదా."

మామగారు కూడా నాన్నగారు అలా అనుకోకుండా విస్ఫోటనం చెందగానే హతాశులైపోయారు. ఆయన ఊహించనిది జరుగుతున్నట్టు భావించారు. నా వీపు తట్టుతూ అన్నారు. "లేదండి మన సమర్‌బాబు ఏమైనా చిన్న కుర్రాడా అన్నీ అర్థం చేసుకోగలడు. కొంచెం కుర్రతనం అంతే. అవును కదా బిడ్డా? నాన్నగారిని క్షమాపణ కోరుకో బాబూ, ఆయన పెద్దవారు."

కట్‌మని స్విచ్ నొక్కి ఎవరో నమ్రతను మర్యాదను హృదయంలో పొర్లిన ఆర్ద్రతను ఒక్కసారే కలిపి మడత పెట్టినట్టు అనిపించింది. నాన్న గారి ఆ మాట నా గుండెను చీల్చివేసింది. గౌరవ మర్యాదలన్నింటిని ఒక తన్ను తన్నేసి ఏదో ఒక పరుషమైన మాట అనాలని మనస్సు అతలాకు తలం అయ్యింది. నాలుక తల్లడిల్లింది. ఇంతసేపు వినమ్రంగా దించుకున్న

తలను మొండిగా పైకెత్తి నిటారుగా నిలుచుని ఒక్కమాట మాట్లాడకుండా మిద్దె మీదికి వెళ్ళిపోయాను. అవును నేను అలాంటి వాడినే. ఏం చేసుకుంటారో చేసుకోండి?

మిద్దెమీద మధ్యలో నిలబడి బయటికి వెళ్ళిపోనా లేక మంచంపైన పడుకోనా అని ఆలోచిస్తున్నాను. అప్పుడే గదిలోంచి మార్చుకున్న బ్లౌజుకు బటన్ పెట్టుకుంటూ ప్రభ బయటికి వచ్చింది. కాసేపు అలా నిలుచుని చూసింది. ఆ తర్వాత దగ్గరగా వచ్చి అడిగింది. "ఏం జరిగింది?" నా కణత దగ్గర చెంపలను తాకి చూసింది. "ఒంట్లో బావుందా?" నేను ఏమీ మాట్లాడకుండా అలానే నిలుచుండి పోయాను. ఆమె మళ్ళీ అడిగింది. "మామ గారు ఏమని అంటున్నారు?"

"ఏమంటారు నా తల" అలా చికాకుతో అనగానే నా చూపులు ఆమె ముఖంపైకి వెళ్ళాయి. పాపం తాను ఏమి తప్పు చేసిందని నేను అనవసరంగా చిరాకు ప్రకటిస్తున్నాను. కనీసం ఆమెకు ఏమి జరిగిందో తెలియదు. కాస్త మెత్తబడి అన్నాను "పెళ్ళాన్ని ఎలా అదుపులో పెట్టాలో నచ్చజెబుతున్నారు. నాన్నగారే అదంతా చెప్పి ఉంటారని నాకు తెలుసు. ఆయన ముందు కూర్చుని అంతా వెళ్ళగ్రక్కి వుంటారు. నా ముఖం చూడగానే అంతా తెలిసిపోవడానికి ఆయన ఏమన్నా జ్యోతిష్యుడా? లేకపోతే రాగానే ఆయనకు ఇవన్నీ ఎలా తెలుస్తాయి."

ప్రభ స్నేహంగా నా భుజాన్ని తాకుతూ అన్నది "ఏదో మాట అన్నారని మీ మనసెందుకు పాడు చేసుకుంటారు. వెళ్ళి కాసేపు బయట తిరిగి రండి. మనసుకు ఊరట కలుగుతుంది. పెద్దవారు నచ్చజెప్పడం వాళ్ళ కర్తవ్యం."

"మహా వచ్చారు నచ్చజెప్పడానికి. అటువైపు ఎందుకు నచ్చజెప్పరు." కాసేపు ఆలోచించి మళ్ళీ అన్నాను "అది కాదు ప్రభ అసలు విషయం ఏమిటంటె నేను చాలా మెత్తటివాణ్ణి అని ప్రతివాడు నన్ను అణచిపెట్టాలని ప్రయత్నిస్తున్నారు. ఆయన అనునయంగా రెండు మాటలు చెప్పగానే నేను కరిగిపోయాను. నేను ఏం చేసానని నాన్నగారితో క్షమాపణ కోరుకొమ్మని మామగారు అంటున్నారు. జరిగిన తప్పేమిటో చెబితే, ఈ తప్పు చేసాను క్షమించండి నాన్నగారు అని అడగొచ్చు. నేను ఇంతవరకు నాన్నగారిని ఏమైనా అనరాని మాట అన్నానా. అసలు నేను అమర్యాదగా ప్రవర్తించక ముందే ఎప్పుడు చూసినా ఒకటే మాట. 'పెళ్ళాం నేర్పుతున్నది, పెళ్ళాం నేర్పు

తున్నది.' ఇంతకూ నువ్వు నాకు ఏమి నేర్పిస్తున్నావో చెప్పు. ఎవరో ఏదో చెబితే దాన్ని పట్టుకుని కాకుల్లా అరవడమేనా. ఇది ఎక్కడి నీతి? కోడలు ఇలా చేసింది, కోడలు అలా చేసింది అని ఎంతసేపటికి ఇదేనా. ఉదయం మూడు గంటలకు నిద్రలేచి పనిలో పడిపోతావ్. ఆఖరికి అన్నింటికి నువ్వేనా చచ్చేది. రాత్రి పన్నెండు గంటలకు గాని నిద్రపోవు. ఎదుటివాళ్ళకు కూడా ఏవో కోరికలుంటాయని వీళ్ళు ఎందుకు ఆలోచించరు. నువ్వు అయినా చెప్పు. ఈ ఇంట్లో ఒక్కరి కోసం మరొకరు ఆలోచిస్తున్నారా?"

"ఇదంతా సరే. ఇప్పుడు నువ్వు అవన్నీ ఆలోచించుకుని ఎందుకు గొణుగుతున్నావు. ఇంకా కొన్ని రోజుల మాటే కదా. ఎప్పటికీ ఇలానే ఉంటుందా?" ప్రభ నచ్చజెప్పింది.

నేను నా ధోరణిలోనే చెప్పసాగాను. "మహా చెప్పొచ్చారు మతం, ధర్మం గురించి. మొదట స్వయంగా అర్థం చేసుకోవడం మంచిది. మతం పేరు చెప్పి మనిషిని చంపేస్తున్నారు. ప్రపంచమంతా ఎటుపోతున్నదో చూడనిచ్చేది లేదు. అలా దేవాలయంలో కూర్చుని తాళాలు వాయిస్తు భజనచేస్తూ కూర్చుంటె వాటంతట అవే పనులన్ని పూర్తవుతాయి. భగవంతుడే చేసిపెడతాడు. ఏదైనా మంచిమాట చెబితే చాలు నాస్తికుడవని మింగేయడానికి వస్తారు."

ప్రభకు కూడా చిరాకు కలిగింది - "అయితే ఏమయిందని? అంటే అననివ్వండి. వెళ్ళి మీ పని చూసుకోండి. పెద్దవాళ్ళు, వాళ్ళకు అనే హక్కు వుంది. మన పెళ్ళి చేసారు కాబట్టి వాళ్ళకు ఆ మాత్రం హక్కు లేదా?"

నేను కాస్త కోపంగా అన్నాను - "మహా పొడిచేసారులే! ఇప్పుడు ఈ ఇంటి పరిస్థితి మహా బాగుందని, రెండో పెళ్ళి చెయ్యడానికి సిద్ధమవుతున్నారు. ఇప్పుడు అమర్‌గారిపై దృష్టి పడింది. ఒక చిల్లిగవ్వ సంపాదించే స్థోమత లేదు. వచ్చే ఆ కోడలు కూడా నీలానే ఒక్కొక్క పైస, సూది దారం కోసం తపిస్తూ చిరిగిన చీరల్ని కుట్టుతూ ఉంటుంది. ఒకడు సంపాదించడం మొదలు పెట్టాడని, నా పెళ్ళి చేసేసారు. మరి నేనేదో కాస్త చేసానో లేదో అపుడే మూడోవాడ్ని ఇరికిస్తున్నారు. రానున్నది తన తలరాతపై తానే ఏడుస్తుంది."

ఈసారి ప్రభ మనస్ఫూర్తిగా నవ్వింది - "ఇప్పుడే నీ పరిస్థితి ఇలా వుంటె ముసలి వాడివైనాక నిజంగానే నువ్వు వీళ్ళందరికంటే భయంకరంగా వుంటావు."

ఆమె మాట తీరుకు నేను కోపం మరిచి నవ్వేసాను. లాగి చెంపమీద

ఒకటి కొట్టి 'ఏమిటీ అనేస్తున్నావ్'అని అనాలనిపించింది. కానీ, మళ్ళీ నా గాంభీర్యాన్ని వెనక్కి తెచ్చుకున్నాను, "లేదు, ప్రభా! అసలు విషయం నాకు తెలుసు. ఈ రోజు పదకొండో తేది. వాళ్ళ లెక్క ప్రకారం నా జీతం వచ్చేసి ఉండాలి. నేనేమో ఒక్క దమ్మిడి కూడా ఇవ్వలేదాయె! మరి ఈ రోజు కూడా జీతం విషయం మాట్లాడక పోయెసరికి ఓపిక నశించింది."

"అవును నిజమే! నేనడగనే లేదు. డబ్బులు నిన్ననే దొరికి వుంటాయి కదా!" ఈసారి ఆమె నిజంగానే ఒక గృహిణిలోని పెద్ద మనిషి తరహాలోఅడిగింది.

నా నాలుక మళ్ళీ పరుషంగా మారింది. "ఆ ప్రెస్సు నా కొడుకులు ఏమీ ఇవ్వనే లేదు. దానికంటె ట్యూషన్లు చెప్పుకుంటే బాగుండేదేమో. ఆ నా కొడుకు పెళ్ళాం పిల్లలు చచ్చిపోను. ఆ పిచ్చి నా కొడుకు మనసులో ఏముందో ఏమిటో ఇటు అరవై ఒక్క రూపాయలు చేబదులు తీసుకున్నాను. మిగిలిన ఎనిమిది రూపాయలు తీసుకెళ్ళి నాన్నగారి చేతిలో పెడితే మనం వేరుశనక్కాయలు కొనాలన్న ఒక్క పైసా ఉండదు. ఏమిటీ పీడ. రేపు ఇవ్వకపోతే మాత్రం ఖచ్చితంగా అడిగేస్తాను. "నువ్వు ఏట్లో పడు నా డబ్బులు మాత్రం చెల్లించేయ్. నా దగ్గరా ఏమైనా నిధి పాతిపెట్టి ఉన్నదా? నీకేం దిగులు అటునుంచి ఇటునుంచి బోలెడంత వస్తున్నది. ఈ రకంగానే ఇచ్చే మాట అయితే నీ ప్రూఫు రీడర్‌ని నీదగ్గరే పెట్టుకో. ఇంకేదైనా పనిచూసు కుంటాను. ఏట్లో పోనీయ్ ఈ వెధవ ఉద్యోగం." వెధవ జేబులోంచి డబ్బు తీసి ఇస్తే కదా..."

ప్రభ ఈసారి కొంగుచాటు చేసుకుని ఒకటే నవ్వసాగింది. నా బాధను మరిపించాలని ఆమె అలా పైకి నవ్వుతున్నదని అనిపించింది. అప్పుడు అన్నది "ఏమిటి నువ్వు డెబ్బై ఏళ్ళ ముసలివాడిలా తిట్టేస్తున్నావ్. ఎవరైనా వింటె ఏమనుకుంటారు...." ఆమె నన్ను బలవంతంగా ముందుకు నెట్టేసింది. "వెళ్ళు, వెళ్ళు కాస్త బయటి గాలిలో షికారు కొట్టిరా. కాని త్వరగా వచ్చేయ్. నేను భోజనానికి ఎదురు చూస్తుంటాను."

నా మూర్ఖత్వంపై ప్రభ మాటలపై అప్పుడు నవ్వుతు వచ్చేసానన్న మాటేగాని వెంటనే నాన్నగారు, మామగారు అన్న మాటలన్ని మళ్ళీ కొత్తగా నా మెదడులో తిరుగసాగాయి. నాకు ఒక విషయం ఆలోచిస్తుంటె నిజంగానే ఆశ్చర్యం వేసింది. నాన్నగారు చీవాట్లు వేస్తూ చెప్పిన లేదా మామగారు తేనెలో చుట్టి చెప్పినా వాళ్ళ అభిప్రాయం ఒకటే. వాళ్ళ దృష్టి కోణంలో

తేడా ఏమీ లేదు. నాలుకలు మాత్రం రెండు.

అలా ఆలోచిస్తు నేను రోడ్డుపై తిరుగుతూ ఉండిపోయాను. అలా నాలో నేను మునిగి నడుస్తూ ఉంటె ఎవరో నా వెనకాలే వస్తున్నట్టు అకస్మాత్తుగా అనిపించింది. వెనక్కి తిరిగిచూస్తే దివాకర్ నిజంగానే గలగలా నవ్వేసాడు. అతని వెంట మరెవరో ఉన్నారు. అంతవరకు నేనతన్ని గుర్తించలేదు. నేను బాగా భయపడిపోయాను. దివాకర్ అన్నాడు "అసలు నువ్వు నడుస్తూ ఉంటె ఎక్కడికి వెడుతున్నావో ఎందుకు వెడుతున్నావో ఏమైనా ధ్యాస ఉందా? రెండు ఫర్లాంగుల నుంచి నీ వెనకాలే మేము నడుస్తున్నాం. ఏమిటీ నీలో నువ్వు గొణుక్కుంటూ నీలో నువ్వు చేతులు తిప్పుకుంటున్నావు. నీపై నువ్వే కోప్పడుకుంటు నిటారుగా నిలుచుంటున్నావ్. ఇంతకూ ఏమిటీ ఇదంతా."

నేను నిశ్చేష్టుడనై ఏమనాలో తెలియక జాగ్రత్తగా చూసాను. ఆ చీకట్లో నిలుచుని గమ్మున శిరీష్ భాయ్ సిగిరెట్ తాగుతున్నారు. ఆయన సిగిరెట్ దమ్ము లాగినప్పుడల్లా నిప్పు మెరిసి ఆయన కళ్ళ కింద మెరుస్తూ ఉన్నది. నేను వెంటనే నమస్కరించాను. వీళ్ళిద్దరూ అసలు ఎంత దూరం నుంచి నా వెనకాలే వస్తున్నారో అని ఆలోచిస్తుంటే నాకు చాలా ఇబ్బంది కలిగింది. ఈలోగా నాలో నేను ఏమేమి మాట్లాడుకున్నానో ఎలాంటి హావభావాలు వ్యక్తం చేసానో వీటన్నింటిని చూసి వీళ్ళు ఏమనుకున్నారో. ఏదో విధంగా తేరుకుని అన్నాను. "మీరు ఎక్కడినుండి వస్తున్నారు." ఏదో ఇబ్బందికరంగా నవ్వేసాను.

"అరగంట నుంచి నీ వెనకాలే వస్తున్నామని చెప్పాగా" నన్ను ఏడిపించాలని దివాకర్ అదే మాట అన్నాడు. "నీలో నువ్వు ఏమేం మాట్లాడుతున్నావో వింటూ వస్తున్నాం."

"అవును ఏదో చాలా గంభీరమైన సమస్యపై ఆలోచిస్తున్నావనే సంగతి నేను కూడా గమనించాను. ఏమిటా సంగతి? భారతీయ సంస్కృతిలోని ఏదైనా చిక్కుముడా?" అలా అని శిరీష్‌భాయ్ పెద్దగా నవ్వేసారు. ఆ తర్వాత నా గంభీరమైన ముఖాన్ని చూసి సానుభూతితో అడిగారు "ఏమిటి అంత క్లిష్టమైన సమస్య."

దివాకర్ అడిగి వుంటె బహుశా అప్పుడే కొట్టి పారేసి ఏదో చెప్పేవాణ్ణి. కాని శిరీష్‌భాయ్‌ని ఎంతో గౌరవిస్తాను కాబట్టి కొంచెం సంకోచిస్తూనే అన్నాను "మరి అంత ముఖ్యమైన విషయమేమి కాదు శిరీష్‌భాయీ, నా మనస్సులో

ఒక మాట దూరింది అంటే అది అలా తొలుస్తూనే ఉంటుంది."

"చూడండి. ఆత్మను కష్టపెట్టె ఏ మాటనైనా ఎప్పటికైనా ఎవరికో ఒకరికి చెప్పేయాలి. దాంతో మనపై దాని చెడు ప్రభావం తగ్గిపోతుంది. క్రైస్తవ ఫాదరీల సమక్షంలో చేసిన తప్పును ఒప్పుకోవడం అనే ఆచారం వెనుక బహుశా ఇదే భావం వుండి వుంటుంది. దానివల్ల మనస్సు తేలికవు తుంది." నా దగ్గరగా వచ్చి భుజంపై చేయి వేసి ఆయన అన్నారు. "అయితే నేను మీ వ్యక్తిగతమైన విషయాన్ని చెప్పమని కోరడం లేదు."

"వ్యక్తిగత విషయం అడిగినా ఇతను చెప్పినా ఏమీ ప్రమాదం లేదు" నా రెండో భుజంపై చెయ్యి పెడుతూ దివాకర్ అన్నాడు.

"కాని తప్పును ఒప్పించె ఈ పోలీసువాళ్ళ పద్ధతి మాత్రం నాకు నచ్చదు" శిరీష్ దివాకర్ మాటపై నవ్వేసారు.

వాళ్ళిద్దరు నా మాటకు బాధపడతారేమోనని నేను చెప్పాను. "ఏమీ లేదు. అంత ముఖ్యమైనదేమో కాదు లెండి." తుళ్ళి ఒక క్షణం ఆలోచించి అసలు విషయం చెప్పేసాను. "నీకు తెలుసుకదా దివాకర్. మా ఇంటి గొడ వలు ఎంత ఘోరంగా వుంటాయో. రోజు ఏదో ఒక గొడవ ఇంట్లో జరుగుతూ వుంటుంది. నా పెళ్ళి జరిగిందో లేదో ఇప్పుడు అమర్‌కు పెళ్ళి చేయాలట. ఏమైనా చెబితే ఎక్కడ ఉపదేశాలు పైగా."

శిరీష్‌భాయ్ అడిగారు. "మీరంతా ఒకచోటె కలిసి ఉంటారు కదా."

"చిన్నాన్న వాళ్ళ కుటుంబం విడిగా ఉంది. మేము కలిసే ఉంటాం."

"క్షమించండి. మీ కుటుంబానికి సంబంధించిన కొన్ని వ్యక్తిగతమైన విషయాలు అడుగుతున్నాను." అక్కడి నుంచి నడుస్తూ నడుస్తూ శిరీష్ భాయ్ చాలా సేపటిదాకా మా కుటుంబం గురించి ఒక్కొక్క విషయం అడు గుతూ పోయారు. నేను ఏమీ దాచకుండా చెబుతూ పోయాను. ఇక ఇంట్లోని గొడవలు తగాదాల గురించి ప్రసక్తి రాగానే, నా వివాహం జరిగిన మొదటి రోజునుంచే ఏ విధంగా కొట్లాటలు మొదలయినాయో నేను బాధగా అంగీక రిస్తూ చెప్పాను. ఆ తరువాత ప్రభ గురించి అడుగుతూ ఆమె ఎంత చదువు కుంది, స్వభావం ఎలాంటిది, ఆమె కలలు ఎలాంటివి, ఇంక ఇంట్లోని సమ స్యలు ఏమేమిటి - ఆయన ఒక డాక్టర్‌లా అడుగుతున్న ప్రశ్నలకు నాలో నేను బేజారెత్తి పోయినా, ప్రభ తెలివి తేటలు, చదువు, ఆమె కలల గురించి చెబుతూ ఉంటే నా మనస్సెంతో తేలికబడిపోయింది. కానీ, చివరలో ఆయన

అడిగిన ఒక ప్రశ్నకు నేను నిజంగానే సమాధానం ఇవ్వలేకపోయాను.

"సరే! ఇంతకూ మీ ఇష్టానుసారం ఈ పెళ్ళి జరగలేదు. అయితే ఇప్పుడు ఈ ప్రశ్నకు సరైన సమాధానం ఇవ్వండి. మీరు మీ భార్యను నిజంగానే ప్రేమిస్తున్నారా లేక భర్త కావడం మూలాన ఏదో బాధ్యత అనుకుంటున్నారా?" ఆయన సిగరెట్టు తాగుతూనే అడిగారు.

"నేను... నేను..." నేను తత్తరపాటుతో ఏం చెప్పాలో తెలియక నిజంగానే ఆ క్షణంలో, అసలు నాకు ప్రభపట్ల ఉన్న భావం, ప్రేమతో కూడినదా లేక చేసిన దానికి పశ్చాత్తాపమా లేదా ఆమె నిస్సహాయత పట్ల దయాభావమా అనే విషయం అర్థం కాలేదు. అయినా నన్ను నేను సంబాళించుకుని చెప్పాను - "నేను ఆమె కోరికపైననే చదువుతున్నాను. ఆమె లేకుండా వుంటే బహుశా ఈ పాటికే నేను ఎక్కడో ఒక చోట నూరు - నూట పాతిక రూపాయల జీతానికి క్లర్కు ఉద్యోగం చేస్తూ వుండేవాడిని. నేను బాగా చదివి ఒక మంచి ఉద్యోగం చేయాలని ఆమె కోరిక. ఆమె నా కోసం పడిన పాట్లు గురించి మీకు చెప్పలేను శిరీష్‌భాయ్! ఇప్పటికీ్కూడా ఉదయం మూడు గంటలకు లేచి వండి పెడుతుంది. మళ్ళీ రాత్రి పన్నెండు గంటల దాకా పని చేస్తూనే వుంటుంది."

మేం ముగ్గురం నిశ్శబ్దంగా ఉండిపోయాం. నేనేమో జవాబు వెతకసాగాను. అప్పుడే అకస్మాత్తుగా ఒక విషయం మనసులో మెరిసింది. ఇది శిరీష్‌భాయ్‌కి చెప్పేయాలనుకున్నాను. "ఆమె నాకోసం తనను తాను పూర్తిగా మరిచిపోయింది. ఆమెకు తనవనే సుఖదుఃఖాలు, ఆకాంక్షలు ఏవీ లేవు." మళ్ళీ అనిపించింది. ఇదంతా ఆవిడ వైపు నుంచి ఎందుకు చెప్పాలి అని! ఆవిడ పట్ల నాకున్న భావం ఏమిటో ఇది జవాబు కాదు కదా! అయినా ప్రభ గురించి నా మనస్సు వేగిపోయింది. నాలోని ఆవేదనను ఎలాంటి పదాల్లో వ్యక్తం చేయాలో అర్థంకాక ఆ అశాంతితో శిరీష్‌భాయ్ వైపు చూడసాగాను... ఆయన ఏమీ మాట్లాడకుండా ఆలోచిస్తూ ఒక్కొక్క అడుగు ముందుకు వేస్తున్నారు. ఏదో ఒక సమాధానం తప్పకుండా చెబుతారని నేను దాని కోసమే ఎదురుచూస్తూ వెంట నడుస్తున్నాను.

రోడ్డంతా నిర్మానుష్యంగా వుంది. మేము ఎటు వచ్చేసామో తెలియదు. జాగ్రత్తగా గమనించి వుంటే నేను అక్కడి ప్రదేశాన్ని గుర్తు పట్టేవాణ్ణి. కానీ, మాతోపాటు నడుస్తున్న ఎత్తయిన గోడలపై పెద్ద పెద్ద నల్లని అక్షరాల్లో

బూట్లు, దుస్తుల ప్రకటనలు చదువుతూ ఉండిపోయానేమో... అంతా ఏదో మంచు పొగలో చుట్టుకు పోయినట్టు అనిపించింది. ఎనిమిదిన్నర లేదా పావు తక్కువ తొమ్మిది అయుంటుంది. కురుస్తున్న వెన్నెల పాలతో నేల, ఆకాశం శుభ్రమైపోయాయి. బహుశా అందువల్లనేమో లైట్లు వెలిగించలేదు. ఈ శుక్ల పక్షం రోజుల్లో తరచుగా దీపాలు వెలిగించరు. విచిత్రమేమిటంటే వెన్నెల రాత్రుల్లో నేను ఎక్కడ వున్నా, ప్రభ ధ్యాస రాగానే ఆమె అలా ఒక మూల ముడుచుకుని కూర్చున్నట్టు - మరింత బాగా చెప్పాలి అంటే ఏడుస్తున్నట్టు కనపడేది. ఇపుడు కూడా మా మిద్దె మీది అదే దృశ్యం నా ఎదుట ప్రత్యక్ష మైంది.

"సమర్ బాబూ!" చివరికి శిరీష్‌భాయ్ ఏదో దూరం నుండి మాట్లాడు తున్నట్టు అన్నారు - "మీ సొంత విషయం లేదా దివాకర్‌కు సంబంధించింది - వీటన్నింటి వాస్తవిక స్థితి తెలుసుకోగానే, ఒక విషయం నాకు అర్థమవుతూ ఉన్నది - ఈ ఉమ్మడి కుటుంబ సాంప్రదాయాన్ని విచ్ఛిత్తి చేయాల్సిందే! ఇక మీ గురించి చెప్పాలి అంటే ఇప్పుడు మిగిలింది ఒకే ఒక మార్గం - మీరు స్వయంగా సజీవంగా ఉండాలనుకుంటే లేదా మీ భార్య సజీవంగా ఉండాల నుకుంటే, మీరిద్దరు వేరే కాపురం పెట్టవలసిందే! ఏదో విధంగా విడిగా వుండండి."

నేను ఏ మాత్రం ఊహించని ఈ సలహా వినగానే, కాస్సేపు ఏమీ తోచ లేదు. తత్తరపాటుతో అన్నాను - "మీ ఉద్దేశం ఏమిటో నాకు అర్థం కాలేదు, శిరీష్ భాయి."

"మీరు చెడుగా భావించవద్దు. కాని సమర్‌బాబు, నిజం చెప్పాలంటే - మీ భార్య ఆకాంక్షలన్నీ, మీ ప్రయత్నాలన్నీ మీ ఇంటి వాతావరణంలో నిస్స హాయంగా, కృంగికృశించి పోతాయి. ఒకటి తర్వాత మరొకటి కష్టాలు వస్తూనే వుంటాయి. మీరిద్దరు సుఖంగా నిద్ర పోవాలనే కలలు కంటూనే జీవితమంతా గడిపేస్తారు."

"అంటే మీరు ఉమ్మడి కుటుంబాన్ని వ్యతిరేకిస్తున్నారా?" అని అడిగానే కానీ ఒక విధంగా ఆయన చెప్పినదంతా నిజమేననిపించింది. మా సమస్యలు అనంతం! కానీ కుటుంబ వ్యవస్థ విషయంలో ఆయన ఆలోచన మాత్రం నా గొంతు దిగడం లేదు.

"అవును, అలానే అనుకోండి!" ఆయన తన మాటను నొక్కి పలు కుతూ అన్నారు "ఈనాటి ఆర్థిక పరిస్థితుల్లో ఉమ్మడి కుటుంబం నిలదొక్కు

కునే అవకాశం లేదు. ఒకవేళ పైకి అలా నడిచిపోయినా, లోలోపల ఎన్నో చిన్న చిన్న కుటుంబాల యూనిట్లు తయారవుతాయి. ఈ కాస్తా భావుకత్వం ఎలాంటి భయంకరమైన పరిణామాలకు దారితీస్తున్నదో మీరు ఆలోచించ లేదు! రాత్రి పగలు హైరానా పడుతూ, బాధపడుతూ, తగాదాలతో - జగడా లతో చస్తారే కానీ, ఒకేచోట కలసి వుండాలనే పట్టుదలతో వంశ ప్రతిష్ఠ అని, వేరుకుంపట్లు పెట్టుకోరాదని, తమ భావుకత్వం వెనక స్వార్థం సిగప ట్లతో ఎన్నెన్ని హత్యలు - ఆత్మహత్యలు, రోజూ జరిగిపోతాయో తెలుసా? ఈ గొడవంతా ఎందుకులే అని అనుకున్నా, దీని పరిణామాలు దేనితో పోల్చ లేనంత భయంకరంగా వుంటాయి."

"ఏ విధంగా?" ఆయన చెబుతూ ఆపిన తీరు చూసి నేను వెంటనే అడిగేసాను.

మేము, ఆయన చెబుతున్నదంతా జాగ్రత్తగా వింటున్నామని గ్రహించి, ఆయన మళ్ళీ వివరించారు - "ఉమ్మడి కుటుంబం అనే మాటలోని ఆదర్శం ఎంత గొప్పగా వున్నా, అందులో వున్న పెద్ద లోపమేమిటంటే - ఆ కుటుం బంలోని ఒక్క సభ్యుడి వ్యక్తిత్వం కూడా వికసించదు. కాలమంతా సమస్య లను సృష్టించి, మళ్ళీ వాటిని పరిష్కరించడంతోనే సరిపోతుంది. కొట్లా టలు, జగడాలు, వివాదాలు, అపార్థాలు, మనోవేదనలు - ఇవ్వన్నీ కలసి చివరికి వాతావరణమంతా గాలి పీల్చుకోలేని విషమ స్థితికి చేరుకుంటుంది. కారణం ఆర్థిక సమస్య మాత్రమేనని మీకు కూడా తెలుసు. ఫలితంగా మనం రెండు విధాలుగా విభజించబడతాం - బయట మన ఆర్థిక పరమైన పోరాటం, లోన మన కౌటుంబికమైన చిక్కుముళ్లు విప్పుతూ కూచోడం! సరళ స్వభా వులు, అమాయకులు వీటి మధ్య పిప్పి అవుతారు."

ఇంతసేపు వింటున్న దివాకర్ అకస్మాత్తుగా ప్రశ్నించాడు - "ఇదంతా వున్న పరిస్థితి. మరి పరిణామాలేవి?"

"మీ వ్యక్తిత్వానికి వికసించే అవకాశం వుండదని నేను మొదటే చెప్పాను కదా! మీ శక్తి యుక్తులకు, ప్రతిభా సంపన్నతకు సరైన దిశ కనపడదు. మరో విధంగా చెప్పాలంటే, మీ కాలాన్ని పనికి రాని వాటిలో ఇరికించి, మీ మేధ స్సును హృదయాన్ని కృంగిపోయేలా చేసి, చివరికి మీ కలల్ని నిజం చేసు కొనే స్థితిలో మిగల్చదు. చదువుకు, బౌద్ధికమైన, మానసికమైన వికాసానికి మీ దగ్గర శక్తి మిగిలి వుంటేకదా? మన దేశంలో మంచి మేధావులు రూపొం

దకపోడానికి ఇదొక ప్రధాన కారణం! ఏదో ఒకటి బట్టీయం వేసి, పాస్ కాగానే మనంత మించిన వాళ్ళు లేరని భావిస్తాము. ఏదైతే బట్టి పడతామో, అదే మరొకరి ఎంగిలి! ప్రపంచంలోని విజ్ఞానం, జ్ఞానం, తత్వ దర్శనం, సాహిత్యం మొదలైన రంగాలకు మనం ఇచ్చేది ఏమి లేకపోయినా, కనీసం వాటి వికాస పరిణామాలనైనా గుర్తించలేము, ఒక వేళ గుర్తించినా, కొంత తెలిసినా, అదంతా ఎవరో వాంతి చేసినదో, మింగి నములుతున్న ఎంగిలి విజ్ఞానమో లేదా యాభై సంవత్సరాల పాతదో తప్ప కొత్తదేమీ కాదు! చివరికి మనం, ఈ నిస్సహాయతను, అపజయాన్ని కప్పి పుచ్చడానికి, అసలు ప్రపంచంలోని విజ్ఞానాన్ని, తత్వాన్ని తెలుసుకొనే అవసరమేముందని బుకాయిస్తాము. ఈ జగత్తులోని జ్ఞానులందరికి మనమే ఆది పురుషులమని, ఎంతో ఈ ప్రపంచానికి దానం చేసామని గొప్పలు చెప్పుకుంటాము. ఇంకేముంది... పిడివాదుల సైన్యం ఒకటి తర్వాత మరొకటి తయారవుతుంది. అందువల్లనే, తమ్ముళ్ళారా - సూటి పరిష్కరమేమిటంటే, మీరు వేరే కాపురం పెట్టండి. ఇంటి వాళ్ళపట్ల మీరు అనుకున్న బాధ్యతలను పూర్తి చేయండి."

ఈ వ్యక్తి విశ్లేషణా ప్రతిభను చూసి నేను ఆశ్చర్యపడిపోయాను. విషయమంతా ఎంతో సులువుగా అర్థమైపోయింది. ఈ సూటి విషయం ఇంతవరకు నాకు ఎందుకు తట్టలేదు? అప్పుడే నాలో మెదిలిన ప్రశ్న అడిగేసాను, "తల్లి తండ్రులు ఎన్నో ఆశలతో తాము పిల్లల్ని పెద్ద చేసి, చదివించి వృద్ధాప్యంలో ఆదుకుంటారని నమ్మిన వారిపట్ల ఇది స్వార్థం కాదా? వంశాన్ని కాపాడుతారని ఆశిస్తే, చివరికి సమర్థులు కాగానే ఇలా విడిపోడం ఘోరమైన స్వార్థంకాదా, శిరీష్ భాయి?"

"అలా చూస్తే తప్పకుండా స్వార్థమే." నా ప్రశ్నకు ఆయన కాస్త సందేహించారు - "కాని పిల్లలని ఎదగనివ్వకుండా, వ్యక్తిత్వం పెరగనిచ్చి, ఉన్నతికి అవకాశాలివ్వకుండా, తమకే కట్టిపడేసే దానికంటే, వారి స్వయం వికాసానికి తోడ్పడి, మానసికంగా అది తమ బాధ్యతగా గుర్తింపచేయడం ఉత్తమం కాదా? అయితే ఒకరిద్దరే సంతానమైతే ఇదంతా పెద్ద సమస్యకాక పోవచ్చు! కానీ ఎంతోమంది సంతానం వుండే చోట ఉమ్మడి కుటుంబం ఒక అభిశాపంగా పరిణమిస్తున్నది. ఆ కుటుంబాల్లో ఆర్థిక ఇబ్బందులు పెరుగుతాయి. రాబడి మార్గాలు పరిమితంగానే వుంటాయి. ఇలాంటపుడు తల్లితండ్రులు, తమ పిల్లల ఆదాయంపై తమదే హక్కుగా భావిస్తారు.

భార్య, తన భర్త మరొకరికి కొడుకనే అంశాన్ని విస్మరించి, అతని రాబడిపై తనదే మొదటి హక్కు అని అంటుంది - ఈ గొడవంతా ఎందుకు? హాయిగా వేరే కాపురం పెట్టి, తల్లితండ్రుల పట్ల బాధ్యత నెరవేరుస్తూ, ఒకరిద్దరు తమ్ముడు లేదా చెల్లెల్ని మీతో వుంచుకుని పోషించండి. ఆ విధంగా తల్లితండ్రుల భారాన్ని తగ్గించిన వారవుతారు. వాళ్ళకు సమస్యలు వుండవు. అసలు ఇలా చేయగలిగితే, వ్యవహార అనుభవం రీత్యా బంధుత్వాలు అనుబంధాలు పెరుగుతాయని తెలుస్తున్నది. అన్నదమ్ములు ఆ తర్వాతైనా విడిపోవచ్చు కాని, ఎంతో గొడవ జరిగి, ప్రమాదాల్లో చిక్కుకొని, చివరికి మాటలు మానుకునే స్థితి రావడం మామూలే! తల్లితండ్రులే పిల్లలను యోగ్యులుగా తీర్చిదిద్ది, వారి శక్తి యుక్తులను పరీక్షించుకునే విధంగా సహాయపడాలి. అంతే కానీ, అందరూ కలిసే వుంటే బాగుంటుదనే సెంటిమెంటు మూలానా ఎంత నష్టం కలుగుతుందో, వాళ్ళకు తెలియదు."

ప్రభ కూడా ఇదంతా వింటే ఎంత బాగుండేది!

వెళ్ళగానే ప్రభకు ఈ విషయమంతా చెప్పాలనుకున్నాను. నాన్నగారికి ఇలా అని వివరించానంటే, శిరీష్‌భాయికి తిట్లు పడడం ఖాయం! "ఇలాంటి వన్నీ బోధిస్తున్న ఆ మిత్రుడెవరో నేనూ చూస్తాను! అలాంటి లఫంగీ దోస్తులతో ఇంత కంటే మరేం నేర్చుకుంటారు?"

మామగారు నిజంగానే మా ఇంట్లో తినకుండానే వెళ్ళిపోయారు.

# తొమ్మిది

ప్రభ పట్ల నా మనస్సులో ప్రేమ, ఆమె నిస్సహాయత, ఇతర ఇబ్బందుల పట్ల నా వైఖరి ఏమిటి? లేదా కేవలం నేను చేసిన దాని పట్ల పశ్చాత్తాపమా... ఆ క్షణంలో చెలరేగిన ఈ ప్రశ్న ఎప్పటిదాకా నా మనస్సును మధించేదో కానీ, అపుడే ఒక సంఘటన నా ప్రతి స్నాయువును వణికింపజేసింది. అపుడు అనిపించింది, ఎంతసేపటి నుండో నేనొక్కడినే నిలబడే ఉన్నానని, నా చుట్టుపక్కల ఎవరూ లేరని.

"ఈ రోజు మీరు చాలా పని చేసారు. ఇటు ఇవ్వండి మీ కాళ్ళు పట్టుతాను," అంటూ ప్రభ మంచం చివర కూర్చోగానే నా నిద్రమత్తు తొలగి

పోయి నా కాళ్ళను ముడుచుకున్నాను.

"లేదు, నా కాళ్ళు చేతులు ఏమీ పట్టక్కర్లేదు. నువ్వెళ్ళి విశ్రాంతి తీసుకో! ఈ రోజు కాస్త ఎక్కువ పని చేసినంత మాత్రాన ఏమయిపోయిందని! మరి నువ్వేమో దినమంతా పనిచేస్తూ వుంటావు కదా!" ఆకాశం వైపు చూస్తూ అడిగాను - "పదిన్నర, పదకొండు కొడుతున్నాదనుకుంటా. ఇప్పటికా వంటగది పని అంతా తెమిలింది."

"ఏం చెయ్యను! బావగారు ఇపుడు అన్నం తిన్నారు. ఎక్కడికో ఎవరితోనో వెళ్ళి వచ్చారట. నిజం చెప్పాలంటే ఆయన పట్ల నాకు జాలి కలుగుతున్నది. గోవులాంటి మనిషి. ఇంట్లో ఎవరితో మాట్లాడరు. లేదా సరదాగా ఉన్నట్టు కనబడరు. దినమంతా పని చేస్తూనే వుంటారు." మంచం చివర అలా కూర్చుని, కూర్చుని కిందికి వేలాడిన కాలును ఊపుతూ ప్రభ అన్నది - "వారికి భోజనం పెట్టాను. వంటగది శుభ్రం చేసాను. ఉదయానికి ఏర్పాట్లు చేసుకున్నాను. బాగా వేడిగా వుందని స్నానం చేసాను. . .

"అలానా! అందుకే ఈ రోజు మంచి శుభ్రమైన దుస్తులు వేసుకుని రాణి మున్నీలా వచ్చి కూర్చున్నావు. ఏదో కొత్త విషయం జరిగి వుంటుందని నాకూ అనిపించింది. మరీ సువాసన గుబాళిస్తున్నది. ఏ అత్తరు పూసుకున్నావు!" నేను ప్రభను దగ్గరికి లాక్కున్నాను.

ప్రభ సిగ్గు పడిపోయింది. మరో వైపు చూస్తూ అన్నది - "ఏదో కొంచెం అత్తరు దూది మిగిలిపోతే పెట్టుకున్నాను" తనను విడిపించుకుంటూ అన్నది. "ఈ రోజు నిజంగానే మీ పాదాలు వత్తాలని చాలా కోరికగా వుంది. మిద్దె మీదికి మీరు బాల్చల నిండా నీరు మోస్తూ వుంటే, ఇప్పుడు ఏదో పట్టుదలతో బోలెడన్ని బాల్చీలు అలా మోసేస్తున్నారని పించింది. రాత్రికి బాగా అలిసిపోవడం ఖాయం అనుకున్నాను."

నా పట్ల ప్రభకు ఎంత ధ్యాస! నేను స్పందించిపోయి ఆమె వీపుపై చేతితో నిమురుతు ప్రేమగా అన్నాను. "అది కాదు ప్రభ, ఈ వయస్సులో ఈ మాత్రం పనివల్ల అలసట కలిగితె నాన్నగారి వయస్సు వచ్చాక ఇక నేను ఏం చేయగలను? నువ్వు చూసావా ఈ రోజు కూడా ఆయన ఇరవై, ఇరవై సేర్ల గోధుమల సంచులను రెండు చేతుల్లో వేలాడేసుకుని బజారు నుండి తీసుకువస్తారు. . . ఈ రోజు ఎంతో వేడిగా ఉంది కదూ."

ఇవ్వాళ సాయంత్రం కాగానే నాకు ఎంతో వేడి అనిపించింది. అందు

వల్ల కింది నుంచి బాల్చీలలో నీళ్ళు మోసుకువచ్చి మిద్దెపై బాగా చల్లే సాను. మేము మా పడుకునే చోటును కొంచెం మరుగున ఏర్పాటు చేసుకున్నాం. నా గదికి అటు వీధి మలుపుకు ఉన్న మూల మధ్యలో కొంచెం ఖాళీ స్థలం మిగిలి పోయి ఉంది. అదే మేము పడుకోడానికి ఎన్నుకున్నాం. ఎవరైనా ప్రత్యేకంగా వచ్చి చూస్తే తప్ప మేము కనపడేవాళ్ళం కాదు. అన్నయ్య, వదిన మరో వైపున ఉన్న గదిలో ఉంటారు. కాని వాళ్ళు మాత్రం ప్రత్యేకంగా చాటు చేసుకోవలసి ఉంటుంది. అమర్, కుంవర్ అమ్మా, నాన్నలు అందరూ కలిసి మెట్ల పక్కగా వరండాలో పడుకుంటారు. ఈ రోజు నేను మొత్తం మిద్దె పై భాగాన్ని మాత్రమే కాకుండా దినమంతా ఎండలో వేడెక్కి పోయిన మంచాలపై కూడా బాల్చీల నిండా నీళ్ళు పోసేసాను. అందువల్ల చల్లగా ఉండే ఆ మంచాలపై ఒక దిండు మాత్రం వేసుకుని అలానే పడుకుని ఆకాశం వైపు చూస్తూ ఉండిపోయాను. ఆకాశం అంతా నక్షత్రాలతో నగిషీ చెక్కినట్టు ఉంది. అప్పుడప్పుడు ఏదో ఒక తార రాలిపడుతూ మంటలా ఒక గీత గీస్తూ మరో దళంలో కలిసిపోయేది. వాటిని చూస్తూ నేను ఆశ్చర్యంగా నా మనసులో అనుకుంటున్నాను - ఆ తార రాలిపడుతున్నపుడు ఒక క్షణంలా అనిపించినా, వాస్తవంగా చూస్తే తన సౌర మండలాన్ని మార్చుకునే యాత్రలో వేల కాంతి సంవత్సరాల సమయం పట్టి ఉంటుంది. అసలు పైన ఎలాంటి మనుష్యులు ఉంటారోనని చూడడానికి మనిషి ఈ నక్షత్రలోకానికి యాత్ర జరిపే ఏదైన ఒక పద్ధతి లేదా? అప్పుడు వెంటనే మనస్సులో చికాకు కలిగింది - మాకు ఈ ప్రపంచాన్ని గురించే సరిగ్గా తెలియదు. ఇక మొత్తం నక్షత్ర మండలం గురించి ఏం తెలుసుకుంటాం. ఆ రోజు శిరీష్ భాయ్ చెప్పిన మాట జ్ఞాపకం వచ్చింది. "ఈ ప్రపంచంలోని జ్ఞానానికి, విజ్ఞానానికి మనవంతు కొత్తదేమైన సమకూర్చగలిగే మాటను వదిలేద్దాం. అసలు ఇతరులు చేసిన దాని గురించి మనకు ఇంకా తెలియదు..."

ఇదంతా ఆలోచిస్తూ ఆలోచిస్తూ నేను అలానే నిద్రపోయాను. ఆ సుషుప్తావస్థలోనే నేను కింద నుంచి వినపడుతున్న వంట పాత్రల చప్పుడు, ఎవరు వచ్చి వెదుతున్నారు, వాళ్ళ మాటల్ని బట్టి లేదా ఇంటి పని ఎంత దాకా వచ్చింది అనే అంశాన్ని అంచనా వేసుకుంటున్నాను. మిద్దెపై మరో మూల వదిన, పాప పరస్పరం ఏమో మాట్లాడుకుంటున్నట్టు అనిపించింది.

దూరాన్నుంచి సినిమా పాటల అలలు అప్పుడప్పుడు వినపడుతున్నాయి. మేము విడిగా ఒక ఇల్లు కట్టుకున్నపుడు ఆ మిద్దెపై ఏ విధంగా పడుకుంటాం? కాని అక్కడ లాన్ ఉంటుందిగా.

"ఏమిటి ఆలోచిస్తున్నారు," ప్రభ తన మోచేతితో మెల్లిగా తాకి అన్నది. అంతే మెల్లిగా ఆమె చేతులు నా పిక్కలపైకి ఎప్పుడు చేరుకున్నాయో నాకు తెలియదు.

ఆమె మాట విని ఉలిక్కిపడి మేల్కొన్నాను. ఆవులిస్తూ అడిగాను. "నువ్వు అన్నం, వన్నం తిన్నావా లేదా?"

"తిన్నానేమో, మీకేమిటి?" ఆమె ఏదో ఫిర్యాదు చేస్తున్నట్టు అన్నది. ఆమె కంఠంలోని నిస్సహాయత, ఆత్మీయతకు కరిగిపోయి నేను అన్నాను. "అది కాదు ప్రభ. ఎందుకలా అనుకుంటున్నావ్. ఇక్కడి పరిస్థితులు ఏమిటో నీకూ తెలుసు నాకూ తెలుసు. నేనైతె మనిద్దరం ఎప్పుడు కలిసే భోంచే యాలని అనుకుంటాను. ప్రొఫెసర్ కాగానే మనకు విడిగా ఒక ఇల్లు దొరక గానే అప్పుడు చూడు. నీకు ఎలాంటి ఇబ్బంది కలుగకుండా చూస్తాను. ఈ ఇంట్లో ప్రతిసారి వచ్చి నువ్వు అన్నం తిన్నావా అని నేను అడగలేను. అలా అడిగానే అనుకో ఇక రేపటి నుండి కొత్త రాద్ధాంతం మొదలవుతుంది."

ప్రభ గలగలా నవ్వేసింది. "నేను ఏదో హాస్యానికి అన్నానులే. నేనైతె మీకంటె మంచి భోజనం చేసాను - పాయసం, పూరీ, హల్వా మీకు అందులో కొంచెమే దొరికింది. అయితే ఆ వంటకాలన్ని మీ కోసం చేసినవని అను కున్నారా?"

ఆ ప్రశాంతమైన రాత్రిలో ఆమె కిలాకిలా నవ్వులు ఎంతో ఆకట్టు కున్నాయి. వెన్నెలలోని చిన్న చిన్న గంటలు మోగి గాలి విసురుకు గణగణ మంటు ఎంతో దూరం వెళ్ళిపోయినట్లు అనిపించింది. ఆ వెంటనే మా ఇద్దరికి ఆ రోజు నాన్నగారు పెట్టిన గర్జనలు జ్ఞాపకం వచ్చాయేమో, ఆమె నవ్వు మధ్యలోనే ఆగిపోయింది. ఆ మాటను మరిపించాలని నేను అడిగాను. "ఏమిటండి, ఇంతకూ ఏమిటీ విశేషం ఎవరో పెళ్ళి జరిగిన ఇంట్లోంచి అవి వచ్చాయని అనుకుంటున్నాను."

మెల్లిమెల్లిగా నా పిక్కలను నిమురుతున్న ప్రభ నిజంగానే కాళ్ళు పడుతున్నట్లు అప్పుడు నాకు అనిపించింది. ఆమె చెయ్యిని పట్టుకుని అడిగాను. "ఇంతకూ ఈ రోజు నీకు ఏమనిపిస్తున్నది. ఇదంతా నాకు బావుండదని

నీకు చెప్పానా. అసలు నేనే నీ కాళ్ళు పట్టాలి. దినమంతా గానుగెద్దులా పనిచేస్తుంటావ్." మళ్ళీ వెంటనే మాటమార్చి అన్నాను "అయితే ఇంతకూ ఈ వంటకాలన్నీ ఎందుకు చేసినట్టు. మామగారు అమర్ కోసం సంబంధం ఖాయం చేసారా ఏమిటి?"

"లేదు, అది మాత్రం కాదు" ఎంతో తెలివిగా ప్రభ చెప్పింది. ఈ రోజు మేము వ్రతం పట్టాం. నేను, వదినా, పొరుగింటి అవస్థిగారి భార్య...? అప్పుడు నేను వెంటనే పరిహాసంగా అన్నాను. "అదా సంగతి. అందువల్లే ఇంతగా, పతిసేవ చేయాలనుకుంటున్నావ్. ఇంతకూ ఎందుకా వ్రతం దేవి."

"ఎందుకైతె మీకేమిటి. ఇవన్నీ ఆడవాళ్ళకు సంబంధించిన వ్యవహారాలు." నాకు కోపం వస్తుందేమోనని మళ్ళీ నచ్చజెప్పసాగింది. "నువ్వు బాగా చదువు. మంచి ఉద్యోగం చెయ్యి. అవన్నీ జరగాలంటే నేను కూడా ఏదైనా చేయాలి కదా."

ఆమె చేతులు నా కాళ్ళను వత్తుతూనే ఉన్నాయి. నాకు కూడా మెల్లి మెల్లిగా హాయిగా అనిపించి కాళ్ళను పక్కకు జరపాలని అనిపించలేదు. తల కింద మోచేతిని పెట్టుకుని ప్రభ వైపు ఒత్తిగిలి "ఇప్పటికే నువ్వు ఏమైనా తక్కువ పని చేస్తున్నావా ప్రభ, ఈ వ్రతాలు పూజా పునస్కారాలు ఎందుకు పైగా నీ ఆరోగ్యాన్ని కూడా జాగ్రత్తగా చూసుకుంటూ వుండు. ఇవన్నీ మొదలు పెట్టి జబ్బు పడ్డావంటె మందులకు కూడా నా దగ్గర డబ్బు లేదు."

ప్రభ తలతిప్పుతూ అన్నది, "బాగుంది. వ్రతాల వల్ల ఎవరైనా జబ్బు పడతారా? దాని మూలంగా ఆరోగ్యం ఇంకా బాగు పడుతుంది. ఉపవాసం ఉంటె ఎంత లాభమో నీకేం తెలుసు."

నేను కాస్త కటువుగానే అన్నాను "ఉంటాయేమో నాకు వీటిపై అసలు నమ్మకం లేదు. అసలు వింటూ ఉంటేనే చిర్రెత్తుకొస్తున్నది... వ్రతం అంటె బాగా తినాలి పళ్ళూ, పాలు, స్వీట్లు అప్పుడు ఏమైనా లాభం ఉంటుంది. దినమంతా కనీసం నీళ్ళు అయినా తాగకపోతే అది వ్రతమా, శిక్షా?"

ప్రభ మాట మళ్ళించాలని అన్నది. "ప్రతి రోజు వ్రతం ఎవరు చేస్తారు. ఎప్పుడైనా ఆరు నెలలకో సంవత్సరానికో ఒకసారి."

"ఆరు నెలలకా, లేదా సంవత్సరానికా అని కాదు. నాకైతె ఈ తతంగం పట్ల నమ్మకమే లేదు. అసలు వీటి పట్ల నీకు నమ్మకం వుందని ఎప్పుడూ చెప్పలేదే. నేను కూడా ఒకప్పుడు ఇవన్నీ నమ్ముతుండేవాణ్ణి. మందిరానికి

వెళ్ళేవాణ్ణి. వ్రతాలు ఆచరించేవాణ్ణి. కాని వీటిపట్ల ఇప్పుడు ఏమాత్రం విశ్వాసం లేదు." బహుశా శిరీష్, దివాకర్‌ల సంపర్కం వల్ల అలా జరిగి వుంటుందని నా మనస్సులో అనిపించింది.

ప్రభ గొంతు గాద్గదికమై పోయింది "నాకు కూడా నమ్మకం లేదు. కాని ఒకే ఇంట్లో ఉన్నపుడు మనకు ఇష్టం లేకపోయినా కొన్ని పాటించవలసి వుంటుంది. వదిన వ్రతం పూనితే నేను చెయ్యననుకో అప్పుడూ ఎంత గొడవ జరిగిపోతుంది. ఆమె ఒక మంచి ఉద్దేశ్యంతోనే మొదలుపెట్టి ఉంటుంది. ఇక దానికోసం నువ్వు ఏమీ తగాదా పడవలసిన పని లేదు." మళ్ళీ నాకు నచ్చజెబుతూ ఆవిడ అన్నది "వ్రతం ఒక సంకల్పాన్ని జ్ఞాపకం చేసుకునే సాకు మాత్రమే."

"సాకా పాడా ఏమిటీ బుర్ర లేనిపనులు" నాకు బాగా కోపం వచ్చే సింది. నాకు ఇష్టంలేని పనిచేస్తూ పైగా నాకు నచ్చ జెబుతున్నది. "నేను చెప్పాను కదా. వీటి పట్ల నాకు ఏమాత్రం నమ్మకం లేదని. రోజూ వళ్ళు కరిగిపోయేలా ఇంత కష్టపడుతూ పైగా ఇవన్నీ..."

అప్పుడే రెండు, మూడు కన్నీటి చుక్కలు చెంపల మీద నుంచి జారి నా పిక్కలను తాకినాయి. "మీకు చేతులు జోడిస్తాను. ఈ రోజు మాత్రం ఏమీ అనకండి. కావాలంటె రేపు అనండి."

అంతగా బతిమిలాడుతున్న ఆమె ధోరణి, ఆమె రోదన అకస్మాత్తుగా నాలో ఉప్పెనలా లెచింది. వెంటనే నేను ఆమెను నా రొమ్ము మీదికి లాక్కున్నాను. పాపం నా కోసం, నా భవిష్యత్తు కోసం దినమంతా పస్తులు ఉండి ఇప్పుడు నా చీవాట్లు తింటున్నది అని నా మనస్సంతా ఆవేదనతో నిండిపోయింది. ఇంతకూ ఆమె ఏదో చెడు ఉద్దేశ్యంతో చేయలేదు కదా. ఒక వేళ నిజంగానే ఎవరైనా నమ్మకం కొద్ది ఆ పనిచేస్తే ఈ మాత్రం సడలింపు ఇవ్వకూడదా. ఒకరికి ఉప్పు ఎక్కువ ఇష్టమైతె మరి ఒకరికి తీపి. నాకు తీపి ఇష్టమని చెప్పి ఎదుటి వాళ్ళకు కూడ అది బలవంతంగా రుద్దితే అది మంచిదా! నేను కూడా అప్పుడప్పుడు అతిగా ప్రవర్తిస్తాను.

ప్రభ అలా ఎంతసేపు ఏడ్చిందో నేను బుజ్జగిస్తూనే ఉండిపోయాను. "నేను ఏదో ఊరికే అంటే నువ్వు ప్రతిచిన్న విషయానికి తప్పుపడితే ఎలా ప్రభ. కొన్ని లోకులకు చూపడం కోసం చెయ్యవలసి ఉంటుందని నాకు తెలియదా?"

నా ఛాతీపై ఆనించిన ఆమె కణతలపై నుంచి జారుతున్న కన్నీటి బొట్లు, రొమ్ముపై పడుతూ, నా పక్క టెముకలకు గిలిగింతలు కలిగిస్తు న్నాయి. ఈ కన్నీళ్లు బాధ వల్లనో, దుఃఖంవల్లనో వస్తున్నవి కావు - ఇవి జీవి తంలోని సార్థకతకు, కృతార్థతకు చెందిన కన్నీళ్ళు! ప్రభ తన నోటి నుంచి వ్యక్తం చేయలేకపోతున్న ఉచ్ఛ్వాసమది. తన జీవితంలోని, అస్తిత్వంలోని ప్రతిశ్వాసను ఈమె, నాకే సమర్పించింది. నా కళ్ళు కూడా చెమ్మగిల్లిపో యాయి. ప్రభ శరీరంలోంచి వస్తున్న వట్టి వేరు సువాసన లాంటిది నా నర నరాన వ్యాపిస్తున్నది. ఇలాంటి భార్యను పొందినవాడు ఈ లోకంలో ఎందుకు సుఖంగా వుండలేడని ఆ క్షణం అనిపించింది. మసక చూపులతో పైకి చూసేసరికి ఆకాశమంతా చుక్కల గుంపులతో తళతళ మెరిసిపోతున్నది... అదే క్షణం మనస్సులో అనిపించింది. నా ఈ సుఖానికి సాక్షిగా ఉన్న తారలు మనసులో ఏమనుకుంటున్నాయో! ఈ నక్షత్రాల్లో కూడా ఏదో ఒకటి ఇలాంటి ఇంటి మిద్దెపై, దినమంతా అలిసొచ్చిన తరువాత, తన అలసిన జోడితో ఒకరిలో ఒకరు ఒదిగిపోయి, తమ శ్రమకు పరిహారం పొందుతున్నట్లు అనిపించింది. అది కూడా తనకు ఈ నేల అనే ఆకాశంపై కనపడుతున్న నక్షత్రాలలో ఈ భూమి కూడా ఒకటి... ఇదే సమయాన దానిక్కూడా నాలానే అనిపిస్తుండవచ్చు. అప్పుడే అకస్మాత్తుగా ఒక్క మెరుపుతో పాటు నాకు ఇలా అనిపించింది - ఈ తారలు నిండిన ఆకాశం, ఈ దిక్కులు, ఇవన్నీ మా ఆత్మకు, మా అస్తిత్వానికి చెందిన భాగాలేనని, అవి మేమేనని అనిపిం చింది. అప్పుడు నేను ప్రభ కణతలను చరుస్తూ మెల్లిమెల్లిగా ఆమె పెదవు లను, కళ్ళను ముద్దు పెట్టుకుంటూ - "లేదు ప్రభా! అలా ఏడవకూడదు. చూడు, ఇక ఏడవకూడదు."

పాపకు ఏమి బాధగా వుందో రాత్రంతా మేలుకొని ఏడుస్తూనే వుంది. హఠాత్తుగా అన్నయ్య కేకలతో నా కళ్ళు తెరుచుకున్నాయి. ఆయన వది నను కోప్పడుతున్నారు - "ఊరుకోకపోతే తీసికెళ్ళి వీధిలో పడేయ్! లేదా తీసుకెళ్ళిక్కడ నుండి. నాకు నిద్దరొస్తుంది నన్ను పడుకోనివ్వు!" నాన్న గారు కూడా మేలుకున్నారేమో. వదిన అమ్మ దగ్గరికి పాపను తీసుకెళ్ళి బుజ్జగిస్తున్నది. కాసేపు పడుకునే ప్రయత్నం చేసి నిద్రరాకపోతే నాలో నేను పైకి అనేసాను - "ఎంత టైమయిందో!"

ప్రభ కూడా మేల్కొన్నది. నేను పొద్దున్నే తొందరగా వెడతాను కాబట్టి

ఆమె కూడా త్వరగానే మేల్కొంటుంది. దిండు కింది నుంచి తన గడియారం తీసి చూపించింది - ఇపుడు ఒంటిగంటన్నర మాత్రమే!

"సరే పడుకో!" నేను నిశ్శబ్దంగా ఆకాశం వైపు చూస్తూండిపోయాను... సప్త ఋషులను, ధ్రువ తారను ఆకాశంలో గుర్తించే ప్రయత్నం చేస్తున్నాను. ఆకాశంలో ఒక మూల ఎటునుంచో పడుతున్న కాంతికి వెలుగు విరజిమ్మి, దాని నీడను మాత్రమే చూపుతున్నది. అక్కడ ఏరోడ్రోమ్‌లోని సెర్చ్‌లైటు పూర్వం అక్కడ తిరుగుతుండేదని నాకు జ్ఞాపకం వచ్చింది. ఆ విరజిమ్మే వెలుగు నాలికలు చీకట్లను చీలుస్తూ చీలుస్తూ వెళ్ళిపోతుండేవి. రైలింజను చప్పుడు, దూరం అవుతున్న దాని ఛక్! ఛక్! ఛక్! నాకు ఆనాటి రోజును జ్ఞాపకానికి తెచ్చింది. అప్పుడు నా గదిలో లాంతరు వెలుగులో కూర్చుని 'సొహరాబ్ ఎండ్ రుస్తుమ్' చదువుతున్నాను. అటు ఒక మూల ప్రభ అలిగి పడుకున్నది. ఇప్పుడు అనిపిస్తున్నది ఆ దినాలను ఎంత వెనక్కి వదిలేసి వచ్చానని...! వచ్చే సంవత్సరం ఈ ఎండాకాలంలోనే ఎక్కడ పడుకొని వుంటానో! మేము వేరే కాపురం పెడితే మా జీవితం ఎలా సాగుతుందో తెలియదు. శిరీష్ చెప్పిన మాటలను ప్రభకు తెలియజేయాలని నాకెంతో కోరికగా వుంది.

ప్రభ భుజాన్ని తాకుతూ అన్నాను - "నాకు నిద్ర రావడం లేదు ప్రభా!"

ప్రభ మేలుకునే ఉన్నదేమో బదులు చెప్పింది - "అయితే మాట్లాడండి. కానీ, మళ్ళీ నిద్ర పోయారంటే ప్రొద్దున్నే లేవడం చాలా కష్టం. చాలా రోజులయింది మీ స్నేహితుల గురించి చెప్పనే లేదు"

"ఎవరూ? దివాకర్ గురించా! నేను ఉత్సాహంగా అన్నాను. నిన్ను అతని వైఫ్ ఎప్పటినుంచో రమ్మంటున్నది. నువ్వేమో బయలుదేరవు. ఒక రోజు వెళదాం. ఇపుడు అక్కడే శిరీష్‌భాయ్ కూడా వున్నారు."

"ఈ శిరీష్ భాయ్ ఎవరు? అతనైతే కాదు గదా, ఎవరి చెల్లెలైతే..."

"ఆఁ! అవును! అవును! పాపం ఎంతో బాధ పడ్తున్నాడు. డాక్టర్లేమో ఆయన చెల్లెలి రోగం అసాధ్యమైనదంటున్నారు. నిన్న ఆయన చెప్పిన మాటలు విన్న తరువాత నా కళ్ళు తెరుచుకున్నాయి." ఎలాగూ నిద్ర రావడం లేదు కనక ప్రభకు ఆయన చెప్పిన విషయమంతా వివరించాలని నేను చెప్పడం ప్రారంభించాను - "దారి పొడుగునా మొదట మేము ఉమ్మడి

కుటుంబాల గురించి మాట్లాడుకున్నాము. ఆయన అందరూ కలిసి ఉండన క్కర లేదంటున్నారు. దాని వల్ల వ్యక్తిత్వ వికాసం జరగదని ఆయన అభి ప్రాయం. మనిషి తన ప్రతిభ, శక్తి యుక్తులను ఇతరులకు అందజేయలేడు. అదే కాదు, పరస్పరం కొట్లాటలు, తగాదాల మూలంగా ప్రతీకార భావంతో అతను తన కర్తవ్యాన్ని మరిచిపోతాడు. విడిగా వుండి, తన ఎదుగుదలతో పాటు, తన కర్తవ్యాన్ని నిర్వహించలేడా? అయితే, ఇపుడు నువ్వే చెప్పు, మనమంతా ఒకే చోట కలిసివుంటూ మన కర్తవ్యాన్ని నిర్వహిస్తున్నామా? పరస్పరం ఒకరి మధ్య మరొకరి అసహ్యం పెరగడం తప్ప... ఇపుడు కర్త వ్యమూ లేదు, సద్భావనా లేదు. విడిగా వుంటే ఒక బాధ్యతను నెరవేర్చా లనే ప్రయత్నమైనా వుంటుంది."

ప్రభ రెప్ప వాల్చకుండా ఆకాశం వైపు చూస్తూ వుంది, అన్నది - "ఆ మాట తప్పేమీ కాదు."

"సరిగ్గా ఇదే మాట నేను కూడా ఆయనతో చెప్పాను ప్రభ. ఆ విషయం సరైనదే అని నేను అన్నాను. కాని నా ఆత్మ అంగీకరించలేదు. అందులో ఏదో ఘోరమైన స్వార్థం ఉందనిపించింది. అప్పుడు ఆయన చాలాసేపటి దాకా సంస్కారాల గురించి చెబుతూ పోయారు. అసలు ఆత్మ అనే పేరు గల వస్తువు ఏది లేదని ఆయన అన్నారు. అభ్యాసము, ప్రభావము, సంప్రదాయము, అనుకరణ, ఇవన్నీ కలసి ఒక విధమైన సంస్కారాన్ని మనసులో పేర్చుతాయి. ఈ సంస్కారమే ప్రతి ఒక్క కొత్త పనిలో అడ్డు తగులుతూ ఉంటుంది. మన ఆత్మ ఆపుతున్నదని మనం అనుకుంటాం. అది ఆత్మకాదు తలుపు దగ్గర కట్టేసిన కుక్కగా మారిపోతుంది. కొత్తవ్యక్తి వస్తే మొరుగుతూ అటూ ఇటూ గంతులేస్తుంది. పరిచితులు వస్తే తోకాడిస్తుంది. మాంసం తినని వాడికి మాంసం తింటె ఆత్మ అడ్డు వస్తుంది. ఉల్లిపాయ తిననివాడికి ఆ ఉల్లి పాయ ఆత్మకు విరుద్ధం అనిపిస్తుంది. ఒక విధంగా ఇదంతా ఏమిటంటె మాంసము, ఉల్లిపాయలు తినేవాళ్ళకు ఆత్మ అనే వస్తువేది ఉండదని ఆత్మను కేవలం కొంతమంది మాత్రమే గుత్తకు తీసుకున్నారని లేదా ఆత్మ కేవలం సంస్కారాలకు రెండో పేరని అర్థమవుతున్నది. ఒకప్పుడు ఛాందసుడైన పండితుడి ఆత్మ కొళాయిలోని నీళ్ళు తాగాలంటె ఏడ్చేది. తన చేతులు కడుక్కోడానికి మట్టిని వెంటబెట్టుకుని తిరిగేవాడు. అంటె ఆ ఆత్మ పాతకాలంలోనే ఉండేదని అను కోవాలి. అసలు మన సాంప్రదాయ ప్రియత్వము కొత్తను అంగీకరించలేని,

సోమరితనానికి మూర్ఖత్వానికి మనం అంతరాత్మ అని పేరు పెడుతున్నాము. ఇవన్నీ సంస్కారాలు మాత్రమే. ఒకసారి సంస్కారాల నిజస్వరూపాన్ని గుర్తించగలిగితె మీరు మీ సంస్కారాలని మార్చుకోగలరు."

ప్రభ రెప్పవాల్చకుండా వింటున్నది, నేనేమో మోచేతిపై తల ఆనించి చెబుతున్నాను. వీలున్నప్పుడల్లా ఈమెకు విషయాలన్నీ విడమర్చి చెబుతూ ఉంటె ఎంత అయినా నేర్చుకోగలదని నాకు అనిపించింది. నాకు ఒక ఉద్యోగం దొరికితే కాస్త సమయాన్ని ఆమెకు కేటాయించి చదువుకూడా చెప్పగలను. ఇకముందు నా చుట్టుపక్కల ఉన్నవాళ్ళు బి.ఏ., యం.ఏ.లు చదివి వుంటారు. వాళ్ళ భార్యలు కూడా ఒకరికంటె ఒకరు ఎక్కువ చదివి ఉంటారు. అప్పుడూ ప్రభ వారి మధ్య తిరగాలి అంటె బాగా చదువవలసిందె. సరే కనీసం ఇలా ఇప్పటినుండె మానసికంగా తయారు చేయడం మంచిది. కాలేజీలో జాయిన్ కావలసి వచ్చినపుడు వెళుతుంది. ఈలోగా శిరీష్ భాయ్‌ని కలవాలని అనుకుంటె ఆమెలో కలిగే ఆ బెరుకు అనేది ఉండదు. ఇప్పుడు నేను ఆమె ఆలోచించుకోడానికి ప్రశ్నించడానికి కావలసినంత సమయం ఇచ్చాను. అప్పుడు ఆమె అన్నది. "వింటూ ఉంటే అన్నీ అర్థం అవుతున్నాయ్. కాని ఈ రోజే నన్ను ఎడమపైట వేసుకుని నోరు తెరిచి రోడ్డుమీద నా వెంట వెంట నడువమంటె మాత్రం నాకు ధైర్యం చాలదు."

ఆమెకు విషయం అర్థం అవుతున్నదని విని సంతోషించాను.

అప్పుడు అన్నాను "అలాంటప్పుడు ఆ సంస్కారాల సంగతి యధార్థం కదా. శిరీష్‌భాయ్ సంస్కారాలు లేదా అంతరాత్మ గురించి మంచి ఉదాహరణ ఇచ్చారు. మన మనస్సులో కూరుకుపోయిన సంస్కారాలు రైలు డబ్బాలో హాయిగా కూర్చున్న ప్రయాణీకులలా ఉంటాయని ఆయన చెప్పారు. క్రిక్కిరిసిన ఆ డబ్బాలోకి నువ్వు దూరాలని ప్రయత్నం చేస్తే లోపల ఉన్న ప్రతి మనిషి నిన్ను బయటికె నెట్టేస్తాడు. నువ్వు అసలు లోపలికే రాకుండా చేయాలని ప్రయత్నిస్తాడు. కాని ఎలానైనా వెళ్ళాలనే అవసరం ఉంది కాబట్టి తగాదాపడి ఎలాగోలా నువ్వు లోపలికి చొచ్చుకుపోతావు. ఒక్కసారి నువ్వు లోపలి వాళ్ళతో ఆమోదించబడగానే వ్యతిరేకత అంతా సమాప్తమవుతుంది. నువ్వు కూడా వాళ్ళలో ఒకడిగా మారిపోయి కాసేపటికి ఇంతకు పూర్వం నువ్వు ఘర్షణ పడి సంపాదించిన స్థలాన్ని ఒక గంట తర్వాత ఆ స్థలాన్ని వదిలి అటూ ఇటూ తిరిగినా అది మీ కోసమే సురక్షితంగా ఉండిపో

తుంది. అయితే ఇక్కడ ఒక ఇబ్బంది ఉంది. లోపలి వాళ్ళతో నువ్వు కలిసి పోగానే నువ్వు కూడా బయటి నుండి వచ్చె కొత్తవాళ్ళను వ్యతిరేకించడం మొదలు పెడతావు. ఇంతకు పూర్వం నీ పట్ల కూడా అలాగే జరిగిందనే విషయాన్ని నువ్వు బొత్తిగా మరిచిపోతావు."

కాని ప్రభ ఈ విషయంలో ఏమీ ప్రశ్నించకుండా ఒక్కసారే మాటను మార్చేసింది. "ఇంతకూ మీ శిరీష్‌భాయ్ అసలు ఏ విషయాన్ని ఒప్పుకుంటారు అని నాకు ఇప్పుడిప్పుడే అనిపిస్తున్నది. ఆయనతో కలిసి మాట్లాడాలని ఉన్నప్పటికి బెదురు కలుగుతున్నది. ఆయనతో నేనేం మాట్లాడగలను? నాకు నోటిమాట అయినా పెగులుతుందా."

"నోటి మాట ఎందుకు పెగలదు. నిన్ను నేను తప్పకుండా పరిచయం చేస్తాను." అని చెప్పి ప్రభ అడిగిన దానికి సమాధానం ఇచ్చాను. "సరిగ్గా ఇదే మాట నేను కూడా శిరీష్‌భాయ్‌ని అడిగాను. మీరు అన్నింటిని వ్యతిరేకిస్తున్నారు. ఇంతకూ మీరు దేనిని ఒప్పుకుంటారు. అప్పుడు ఆయన పెద్దగా నవ్వేసారు."

అప్పుడు ఆయన అన్నారు - 'భగవంతుడు, మతము, అంతరాత్మ, ఇంకా సంస్కారం, తరువాత మిగిలే వాటినన్నింటిని నేను నమ్ముతాను.' నేను అన్నాను - 'అంటే దేనినీ నమ్మరన్నమాట.' - అప్పుడన్నారాయన - 'ఒక వేళ ఈ నాలుగైదు పదాల నమ్మకమనే గుత్తాధిపత్యం వుంటే మాత్రం నేను దేనినీ నమ్మనని మీరర్థం చేసుకోవచ్చు.' నేను మళ్ళీ అడిగాను - "ఇదెలా సాధ్యం! ఒక నమ్మకమనేది లేకపోతే మనిషి వికాసం సాధ్యమా! అప్పుడు ఏ దిశలో వెడతాడు? అప్పుడంటారు. ప్రతి పరిస్థితిలో, ప్రతి చోట మనిషి వికాసం చెందుతూనే వుంటాడు. అతను పాతను వదిలి, కొత్తని గ్రహిస్తాడు - నమ్మడానికి ఈ మాత్రం చాలు. అసలు మనిషి కాళ్ళు ముందుకు వెళ్ళడానికే మలచబడినాయి. అందువల్లే కాబోలు, భూతానికి (గతానికి) పాదాలు వెనక్కి తిరిగి వుంటాయట. అంటే, గతంలో జీవించే మనిషి భూతమవుతాడన్న మాట! నిజం చెప్పాలంటే నువ్వు నమ్ముతున్న భారతీయ సంస్కృతి, భారతీయ గరిమ - ఇవన్నీ నాకు గతించిన జీవుల, భూతాల నాగరికతగా, సంస్కృతిగా కనపడుతున్నాయి. వీటన్నిటిపైనా విశ్వాసం తొలగిపోయింది." ఆ తరువాత ప్రభ, ఆయన ఒక పరుషమైన మాట అనగానే నా రక్తం మరిగిపోయింది. ఆయన పట్ల నాకు శ్రద్ధాభావం లేకపోతే,

ఆయన్ని అక్కడే లాగి కొట్టేవాణ్ణి. కానీ, గమ్మున వుండిపోయాను.

'ఏమిటీ?' ప్రభ కాస్త దిగులుగాను, ఉత్సుకతతోను అడిగింది.

"ఆయన అంటారు, సమర్ గారూ! అసలు మనమంతా ఆ అబద్ధాల కోర్లూ, మోసగాళ్ళు, దొంగలు, ఎవరైతే గతంలో జీవించేవారో, వారి సంతానమే! వాళ్ళకు తమ సామాజిక సమస్యల పట్లగాని, తమ కాలం గురించి కానీ, సరైన స్పృహ ఉండేది కాదు. లోకాన్నుంచి దూరంగా ఉంటూ, స్వయంగా తమ నుదుటిపై అక్షింతలు, చందనం పూసుకొని తాము ఎంతో మహనీయులమనుకుని తమ పూజ చేసుకునే వాళ్ళు. వారు ఎవరినైతే పూజిస్తున్నారో లేదా ఎవరినైతే హీరోలుగా భావిస్తున్నారో, వాళ్ళు ఇంతకు ఎలా మహనీయులు, హీరోలు అయ్యారో, మనమెప్పుడు ఆలోచించనే లేదు! వాళ్ళు నిజంగానే తమ రొమ్ము విరుచుకొని, తమ కాలానికి, సమాజానికి సంబంధించిన సమస్యలతో పోరాడి, చావుకు సిద్ధమై, తమ యుగపు సవాళ్ళకు, సమాధానం ఇచ్చారు, అంతేగానీ, అలా కూర్చుని, రామనామ సంకీర్తన చేసి వుంటే, వాళ్ళు హీరోలుగా మారేవాళ్ళు కాదు. అప్పుడు నేను మధ్యలోనే జోక్యం చేసుకొని అన్నాను - "ఏమైనా కానివ్వండి. మన పూర్వీకుల్ని ఈ విధంగా జ్ఞాపకం చేసుకోవడం ఏమీ బాగుండలేదు. వాళ్ళు ఏమైనా కావచ్చు, మంచివాళ్ళే!" వెంటనే శిరీష్‌భాయ్ అన్నారు - 'మీరు అలా భావిస్తున్నారేమో? కానీ నేనేమి ఎందుకు చెయ్యలేక పోయాను అని నన్ను నేను తిట్టుకుంటూ వుంటాను. మన ఈ పూర్వీకులు స్వయంగా, గోబర్ సంస్కృతికి చెందిన మ్యూజియంలే! మనం వారి సంతానం కాబట్టి పొట్టుతో చేయబడిన బొమ్మల సైన్యం మాత్రమే! వాటికి కాలిపోవడం మాత్రం తెలుసు లేదా వున్నచోట చెత్తా చెదారంతో నింపడం: అందువల్లే అవి బాగా కాలిపోయి, బూడిదగా మిగిలిపోతాయి. మనం ఏమీ చేయలేక పోయినా, కనీసం మనం కాలుతూనే, ఆ మంటల్లో మిగిలిపోయిన ఆ కొంచెం ఇనుమును, బంగారాన్ని, ఉక్కుగాను, మేలిమి బంగారంగాను తయారుచేస్తే చాలు - అనుకోకుండానే నేను, మధ్యలోనే నా మాట ఆపేసాను. శిరీష్‌భాయ్ ప్రభావం, నన్నెక్కడికి తీసుకు వెళుతుందో నాకర్థం కావట్లేదు. ఈ రోజుల్లో నెమ్మి ఒక విధంగా నా భాషలో ఆలోచించడం బొత్తిగా మానుకున్నాను. ఎప్పుడూ నా మేధస్సుపై ఆయనే వ్యాపించి వుంటాడు. బహుశా, ఆ ప్రభావాన్ని విశ్లేషిస్తూ అన్నాను - 'ఈ మనిషి కోపాన్ని చూసినప్పుడల్లా, నేను

కూడా ఆయనలానే ఎందుకు ఆలోచించడం లేదా అని ఆవేశం వచ్చేది. ఏదైనా విషయం నాలో ఇలాంటి అలజడినే ఎందుకు కలిగించదు? నేను ఎందుకు ఈ విధంగా జడ ప్రాయుడ్ని అయిపోతున్నాను? ఆయన పాపం, తన సమస్యల మూలంగా బాధపడుతూ ఉన్నందువల్ల కాబోలు ప్రతి విషయాన్ని వ్యతిరేకిస్తున్నారు! కానీ, కారణం ఏదైనా కావచ్చు - ఆయన మాట్లాడే సరళి నన్ను బాగా ఆకట్టుకున్నది. కాసేపు నిశ్శబ్దంగా ఉండిపోయి, నేను ఆయన హావభావాలను ఊహించుకున్నాను.

అలా వింటూ వింటూ, ప్రభ నిద్ర పోయిందని అకస్మాత్తుగా గమనించాను. పాపం, దినమంతా ఇంటి చాకిరి చేసిబాగా అలసిపోయినట్టు వుంది - పడుకోనిద్దాం అని మొదలు అనిపించింది. ఆ రోజు శిరీష్‌భాయి చెప్పినదంతా విని, తిరిగి వస్తున్నప్పటి మానసిక స్థితి స్ఫురణకు వచ్చేసింది. ఆ రోజు నేను, గతంలో నాదనేది అసలు ఏమీ లేదని అంతా మరిచిపోయాను. ఆ కొత్త మాటల ఒక్కొక్క పదం నా మెదడులో మార్మోగుతూనే వుంది. నా మెదడుగదులు వేలాది సంవత్సరాల నుంచి, గాలి ఆడకుండా, దుర్వాసనతో, దుమ్ము ధూళితో ఎటుచూసినా అల్లుకున్న సాలెగూళ్ళతో, పనికిరానివాటితో నిండినట్టు అనిపించింది. ఆ గదుల్లోని గాలంతా విషపూరితమై పోయింది. వాటిలోని స్తబ్ధత, ఏకాంతం తనను తానే మింగేస్తున్నట్టు వుంది. ఇప్పుడు ఆ గదుల తలుపులను బూటుకాళ్ళతో తన్ని - తన్ని తెరవగానే, మెల్లిమెల్లిగా అందులో ఆగిపోయిన గాలి, వేడి అంతా బయటికి వచ్చేస్తున్నట్టు వుంది. సంవత్సరాల తరబడి పేరుకున్న దుమ్మంతా ప్రచండ వేగంగా లేస్తున్నట్టు, తేనె తుట్టెను ఎవరో ఇటుకలతో లాగి కొట్టగానే నలువైపుల నుంచి జుమ్మున వస్తున్న ధ్వని - నేను ఇంట్లో అడుగుపెట్టగానే అనుకున్నాను - ఇప్పుడు నేనూ గత కాలంలో జీవిస్తున్న భూతాన్ని కాదు! నా మెదడు ఇప్పుడు లోకంలోని చెత్తా చెదారం ఏదీ లేకుండా శుభ్రంగా వుంది. అయితే ఇప్పుడిక ఈ ఖాళీ గదులను ఏ స్వప్నంతో అలంకరించను? భైరవి రాగంలా మార్మోగే ఏ స్వర్గ గీతాలవి? ఒకే తాళ-లయలపై మనమంతా చిన్నచిన్న చక్రాల్లా నడచి తీసుక రాదలచిన, ఏ విరాట్ యుగమది? ఆ యుగం ఎటు నుంచి రాబోతున్నది? మనం బతికుండగానే అది వస్తుందా? మనం నిజంగానే దాన్ని చూస్తామా? మనం నిద్రపోకుండా తపించిన రాత్రుల్లో కలలుగన్న ఆ యుగమేనా అది?

అదే యుగ పరివర్తనంలోని కుతూహలం అశాంతిని నేను ఇపుడు బాల్చీలలో నీరు నింపి మిద్దెపై చల్లుతూ, చల్లార్చుకుంటూ తృప్తి పడుతున్నాను. ఈ సమయంలో ప్రభకు అదంతా చెబుతూ లేదా లోలోపలే అదంతా పునరావృతం చేసుకుంటు అదే అశాంతికి లోనవుతున్నాను. అప్పుడిక ఏం చేయాలో అర్థం కాలేదు. ప్రభ నిజంగానే నిద్రపోయినట్లుంది. మంచం తాడులోని చిన్న పోగులాగి ఆమె చెవిలో తిప్పాలని మొదట్లో అనిపించింది. "నేనిక్కడ మేల్కొని ఉంటె మీరేమో హాయిగా నిద్రపోతున్నారా." ఆమె నడుముపై గిలిగింతలు పెట్టాలని అప్పుడే అనిపించింది. నడుము గిలిగింతలు పెడితె చెంగున ఎగురుతుందని నాకు బాగా తెలుసు. అయితే పెద్దగా అరిచేస్తుందేమోనని భయమేసింది. కాని మనసులోని కోరికను అణచుకోలేక వెంటనే ఆమె నడుములోకి వేలు చొప్పించి గిలిగింతలు పెట్టసాగాను. "ప్రభ, లేచి కూర్చో. నేను మేల్కొనే ఉన్నాను. నువ్వేమో మాట్లాడుతూ, మాట్లాడుతూ అలా నిద్రపోయావేమిటి."

"హాఁ, ఏమిటీ? ఏమైంది." ప్రభ ఒక్కసారే గంతేసింది. "నేనెప్పుడు పడుకున్నాను."

నేను మరింతగా గిలిగింతలు పెట్టాలనుకున్నాను. కాని అకస్మాత్తుగా ఆమె నడుముకు కట్టి ఉన్న ఏదో గోళిలాంటిది చేతికి తగిలింది. ఆ గోళిని వేలితో పట్టుకుని అడిగాను. "ఏమిటిది, ఏమిటిది ఇంతకూ."

"ఏమి లేదు... ఏమి లేదు వదిలేయ్." బెదిరిపోయిన ప్రభ వేడుకోలు స్వరంతో అన్నది.

"ఇప్పుడైతె అస్సలు వదలను. ముందు ఇదేమిటో చెప్పు నాకు..."

నేను దాన్ని గట్టిగా పట్టుకుని గుర్తించే ప్రయత్నం చేస్తున్నాను. ఏదో పోక చెక్కలాంటి వస్తువది.

"మీకు చేతులు జోడిస్తాను. వదిలేయండి. ఏమీ లేదు." నా చెయ్యిని తొలగించేందుకు ప్రయత్నిస్తూ అన్నది. "నేను మాత్రం వదల లేదు. భయం భయంగా ఆమె చెబుతున్న తీరు చూసి మళ్ళీ మళ్ళీ అడిగాను. అప్పుడు ఆమె చెప్పింది. "నాకు కడుపులో నొప్పి వస్తూ ఉంటుంది. అత్తయ్య చెప్పిన మందు ఇది."

ఆమె చెబుతున్నదంతా ఒక సాకు అని అర్థమవుతున్నది. నేను తీవ్రమైన స్వరంతోనే అన్నాను. "మందు తింటారు కాని ఇలా కట్టుకోరు. చెబు

తావా లేక లాగి తెంపేయమంటావా?"

"నా మీద ఒట్టు" ఆమె బతిమిలాడసాగింది.

నేను కోపంతో రెచ్చిపోయి మళ్ళీ అడిగాను. "ఇంతకు చెప్పవా?" అప్పుడు ఆమె భయంభయంగా విషయం చెప్పింది. "వదిన, అమ్మా కలిసి నాకు నమ్మకం లేదన్నా వినకుండా చీవాట్లు వేసి ఇది కట్టారు. వాళ్ళ సంతృప్తి కోసం ఇలా చేయక తప్ప లేదు."

నేను మధ్యలోనే జోక్యం చేసుకుంటు అన్నాను. "వాళ్ళ తృప్తి కోసం వ్రతం చేయవలసి వచ్చిందని నేను అర్థం చేసుకోగలను. కాని ఇదేమిటి అసలు ఏమిటో స్పష్టంగా చెప్పరాదా."

"వాళ్ళు అన్నారు... వాళ్ళు అన్నారు" ప్రభ తత్తరపాటుతో ఏదో చెప్పే ప్రయత్నం చేస్తున్నది.

"ఏమన్నారు. ఏమన్నారో ఎందుకు చెప్పవు?" ఇప్పుడు నిజంగానే నా కోపం గట్లు తెంచుకుంటున్నది.

"వాళ్ళు అన్నారు. సయ్యద్‌బాబా ధూపంతో అంతా సర్దుకుంటుంది." నేనేదో చెంపదెబ్బ కొడుతుంటె మోచెయ్యి అడ్డం పెట్టుకుంటు ఏదో విధంగా అన్నది.

ఇక నిగ్రహించుకోలేక ఆమె రెండు భుజాలను పట్టి ఊపుతూ అడిగాను. "ఏమిటి కడుపు నెప్పి తగ్గిపోయిందా. స్పష్టంగా అసలు విషయం ఎందుకు చెప్పవు. ఏదైనా జబ్బు ఉంటె నాకు చెప్పవచ్చు కదా."

ప్రభ నిజంగానే ఏడ్వసాగింది. "అవస్థిగారి భార్య తన పెళ్ళి జరిగిన నాలుగు సంవత్సరాలకు, సయ్యద్‌బాబా ధూపం వల్ల ఆమెకు ప్రమోద్ కలిగాడట..."

అసలు విషయం అర్థం కాగానే వెంటనే ఆమె భుజాలను వదిలేసి పిచ్చివాడిలా నవ్వసాగాను. "ఇదా విషయం అందుకోసమా ఈ వ్రతాలు, ఉపవాసాలు. సయ్యద్-పీర్, పూజలు, నడుముకేమో సయ్యద్ ధూపం, బట్టలకు అత్తరు పెట్టుకోడం." నేను పటాపటా నా పళ్ళు కొరుకుతు "కొడుకు కావాలా...? మనకే తినడానికి, కట్టుకోడానికి దిక్కు లేదు కాని ఇంకొకడా మన మెడకు..." అని ఒక్క ఉదుటున ఆమె నడుమునుంచి తాడును తెంచి వేసి వీధిలోకి గిరాటేసాను. ఇందాకా నేను నా కల్పనా లోకంలో గాలిలో ఆలోచిస్తున్నాను అన్నమాట. మరి యధార్థమేమో ఇలా ఏడ్చింది...

నా చేతకాని కోపంలో మరిగిపోతు నేను మంచం కోడుపై తల బాదు కోసాగాను. ప్రభ మోకాళ్ళ మధ్య తల ఆనించి ఏడుస్తున్నది. "నువ్వే చెప్పు... నన్ను ఏం చేయమంటావ్. దినమంతా నా ప్రాణాలు తోడేస్తు న్నారు... గొత్రాలు, గొత్రాలు అంటు మీ వదిన, అమ్మా ఒకటే గోల. వదిన నన్ను పాప దగ్గరికి కూడా రానివ్వదు. నా నీడ కూడా సోకనివ్వరాదట..."

తల బాదుకుంటు "నేను ఎంత ఒంటరిగాడినని" అనసాగాను. ప్రభ నా తోడుగా నిలుచోగలదని అనుకున్నాను. ఇదేమిటి... ఇదేమిటి... ఇదేమిటి. గణపతి మట్టి విగ్రహంతో ఆ రోజు వంట పాత్రలు తోమేసిన ప్రభయేనా ఈమె? మరిప్పుడు? ఈవిడపైన నేను ఎన్నెన్ని కలలు అల్లుకున్నాను...?

# పది

"పొద్దుటి నుండి ఇక్కడ కూర్చున్నావేమిటి? పనేమి లేదా. కాలేజీకి ఈ రోజు వెళ్ళక్కర లేదా" ప్రభ వచ్చి ఎంతో మార్దవంగా అడిగింది.

ప్రెస్సు నుండి తిరిగివచ్చిన తర్వాత నేను కాస్త ఉదాసీనంగా అలస టతో మిద్దె మీద కూర్చుని ఉన్నాను. గది చాటు ఉన్నందువల్ల కాస్త నీడగా ఉంది - ఏమీ మాటాడకుండా నిశ్శబ్దంగా ఎవరిని పలుకరించకుండా అక్కడే కూర్చుండిపోయాను. అక్కడే కూర్చుని ఒక ఉడతను పరిశీలనగా చూస్తూ ఉన్నాను. బాగా అలసిపోయిన నా మొహాన్ని చూసి ప్రభ దగ్గరగా వచ్చి నా మణికట్టును పట్టుకుని 'జ్వరం ఏమీ లేదే.' నేను ఆమె వైపు శూన్యదృష్టితో చూస్తూ ఉండిపోయాను. ఏమీ మాట్లాడాలని అనిపించలేదు. మొన్నటి సంఘ టన నా లోపలి ఏదో అంశాన్ని సమూలంగా కదిలించి వేసింది. ఇప్పుడు నా పరిసరాల్లో ఏదీ నిజమనిపించడం లేదు. నిజం, అబద్ధము అనేవి ఒక అంతు లేని వలలాంటివని అందులో నన్ను బంధించేసారని అనిపిస్తున్నది. ఒక ముడిని కోసేయ్యగానే మరొకటి ముందుకు వస్తున్నది - ఈ ప్రభ? చివరికి ఈమె కూడా అలాంటిదే? ఈవిడ నమ్మకంతో నా బంగారు భవిష్యత్తులోని కలలన్ని అల్లుకున్నాను? ఆమెను చూసినప్పుడల్లా నా మనస్సులో ఈ ప్రశ్నలన్ని మారుమ్రోగుతూ ఉంటాయి.

నిశ్శబ్దంగా నేను కింది వరండా వైపు చూస్తూ ఉండిపోయాను. కింద

చేతి గాజులు నిండిన మూట కనపడుతున్నది. గాజులు పగిలిపోకుండా రెండువైపులా లావాటి మురికి బట్టలతో జాగ్రత్త చేసారు. ఆకుపచ్చా, నీలం, ఎరుపు, పసుపుపచ్చా ఇలాగే రకరకాల రంగుల గాజుల మాలలని అక్కడే జాగ్రత్తగా పరిచిపెట్టారు.

గాజులు అమ్మే ఆవిడ కింది భాగంలో ఒకవైపు కూర్చుని ఉంది. వంగి చూస్తే తప్ప ఆమె కనపడదు. నీలి నీలి ఆకుల, పువ్వుల పచ్చబొట్లు వున్న ఆమె చెయ్యి మాత్రం కనపడుతున్నది. ఆ పచ్చబొట్టు చెయ్యి ఎవరికైతె గాజులు తొడుగుతున్నదో, ఆ చేతులు నిశ్చయంగా వదినవే. ఆమె బొటన వేలు వెనుక ఒక నల్లని మచ్చ ఉన్నది.

నా మౌనాన్ని చూసి బహుంశా ప్రభ గాభరాపడి పోయి ఉంటుంది. అక్కడే నేలపై కూర్చుని నా భుజంపై చెయ్యి వేసి అడిగింది "నువ్వు మాట్లాడవేమిటి నా మీద ఒట్టు. చెప్పు ఏం జరిగిందో. ఎవరితోనైనా పోట్లాడివచ్చావా?"

"ఏమీ లేదు." నా గొంతులోంచి పొడిపొడిగా ఆ మాట వచ్చేసింది. నేను కూర్చున్నవాణ్ణి అలానే కూర్చుండి పోయాను. తెరిచిన కనురెప్పలతో శూన్యదృక్కులతో చూస్తున్న వైపె అలా ఎగాదిగా చూస్తుండిపోయాను. హఠాత్తుగా ఇంత సేపటినుంచి అణిగివున్న ఒక ప్రశ్న మళ్ళీ లేచి నా ఎదుట నిలుచుండిపోయింది - ఇప్పుడు?... ఇక ఇప్పుడు జరిగేది ఏమిటి?..

"ఏదో మొత్తంపైన ఉంది." ప్రభ నాకు మరింత దగ్గరగా జరిగింది. తన లోలోపలి అశాంతితో నా చెయ్యిని కదిలిస్తు తొట్రు పడిన గొంతుతో వేడుకోలు స్వరంతో అడిగింది. "అదే విషయంపై ఇప్పటికీ కోపంగా ఉన్నావా?" ఆమె అర్థ నిమిలిత గులాబీ మొగ్గల్లాంటి నేత్రాల్లో కరిగిన వెన్నెలలాంటి నీళ్ళు తొణికిసలాడాయి. ఆమె అలానే అభ్యర్థనా పూర్వకంగా క్షమించమనే స్వరంతో నన్ను చూస్తూ ఉండిపోయింది. ఆమె ఆర్ద్రమైన కంఠాన్ని విని ఉలిక్కిపడి మెల్లిమెల్లిగా నా మెడతిప్పి ఆమెను చూసాను... అలా ఎగాదిగా చూస్తూనే కృంగిపోయిన కంఠంతో చెప్పాను "ప్రభా, నా ఉద్యోగం పోయింది."

"పోయిందా. ఎట్లా?" ప్రభ కూడా ఉలిక్కిపడి ఒక్కసారే హైరానపడి పోయింది. ఆమె కళ్ళ ఎదుట భవిష్యత్తులో రానున్న పరిణామాలన్ని ఆ ఒక్క క్షణంలో మెరిసినట్టున్నాయి.

అప్పుడే కింది నుంచి అమ్మ కేక వినపడింది. "కోడలా, ఓ కోడలా"

ఎంతో స్నిగ్ధమైన స్వరంతో ఆ కంఠం మళ్ళీ వినపడింది. "కాస్త కిందికి రా అమ్మాయ్."

జవాబుగా కొంచెం వంగి ప్రభ బదులు పలికింది "వస్తున్నాను అత్తయ్యా."

నేను ప్రభకు వివరించాను "అంతే ఊడిపోయింది. నేను పదిహేను రోజులు పని నేర్చుకున్నానని ఆ రోజులకుగాను జీతం ఏమీ లేదని ఆ వెధవ అంటున్నాడు. కాగితం మీద జీతమేమో డెబ్భై అయిదు అని వుంటుంది. కాని చేతికిచ్చేది అరవై. ఆ మాటపై నేను తగాదా పడ్డాను. పేరేమో పార్ట్‌టైం డ్యూటీ పని మాత్రం మొత్తంగా లాగడం, పైగా ఇదంతాను."

"ఏమిటీ ఎందుకలా జరగాలి. డెబ్భై అయిదు రాయించుకొని అరవై మాత్రమే ఇస్తాడా ఆ మొనగాడు. నువ్వు వెళ్ళి దివాకర్‌తో చెప్పొద్దా. అతని తండ్రికి ఆ యజమాని మిత్రుడే కదా." అలా అంటు ప్రభ నొసలు ముడుచుకుపోయి "ఇంత అన్యాయమా."

"అన్యాయమే మరి" బాధతో కూడిన చిరునవ్వు నా పెదాలపై ఆడింది. అప్పుడు గాఢంగా నిట్టూర్చి మెల్లిగా అన్నాను. "ఇప్పుడిక ఆయనతో ఏం చెబుతాం? చూద్దాం ఏదో ఒకటి చేయక తప్పదు కదా. చివరిసారిగా మళ్ళీ రేపు వెళ్ళి వస్తాను. పదిహేను రోజులదే కానివ్వు. ఆ వెధవ ఏదో ఇవ్వాలి కదా. ఆ జీతం ఆశతోనే బోలెడన్ని అప్పులు చేసాను. వాటిని ఎలాగైనా తీర్చాలి కదా."

మళ్ళీ కింద నుంచి అమ్మ గొంతు వినపడింది. "ఏమిటీ ఇంకా రాలేదు. ఏం చేస్తున్నావు అక్కడ. మళ్ళీ మాట్లాడుకోవచ్చులే. ముందు రా." ఆ పిలుపులోని మార్దవం, ప్రేమా నన్ను ఆశ్చర్యపరిచింది.

"ఏమిటీ సంగతి కిందికి వెళ్ళు. అమ్మ పిలుస్తున్నది ఎంతో సేపటినుంచి."

"నువ్వే చెప్పు ఏం చేయను. గాజులు పెట్టుకోమని పిలుస్తున్నది ఆమె. ఈ మధ్య నన్ను ఆమె ఎంతో ఇదిగా చూస్తున్నారు" ప్రభ కాస్త దిగులుగానే అన్నది.

"హుఁ, అలానా" నేను గంభీరంగానే, కాస్త కఠినంగానే అన్నాను.

"లేదు ప్రభ, గాజులు, గీజులు ఏమీ వద్దు. మనం ఎవ్వరికి అబద్ధపు ఆశలు కలిగించవద్దు. ఎవ్వరి నుంచి ఏమీ తీసుకోవద్దు..." నా ముఖం ఒక్కసారే భావ రహితమై పోయింది.

అమ్మ మళ్ళీ కేకవేయగానే గత్యంతరం లేక నిస్సహాయంగా నా వైపుచూసి

ప్రభ అయిష్టంగానే కిందికి వెళ్ళిపోయింది. నేను ఒకసారి ఆమెను చూసి మళ్ళీ అలానే ఏమీ అనకుండా చూస్తూ ఉండిపోయాను. సగం దూరం వెళ్ళి ప్రభ తిరిగి వచ్చి మెల్లిగా అన్నది. "చూడు, నువ్వేమీ చింతించవద్దు. ఉద్యోగం పోతే పోయింది. అంతగా తలబాదుకోవలసిన పని లేదు. నా దగ్గర గడియారం ఉంది. బంగారపు గాజులు ఉన్నాయి. చెవుల రింగులు ఉన్నాయి. ఆఖరుకి ఇవి ఏ రోజు పనికివస్తాయి. తర్వాత మళ్ళీ చేయించుకోవచ్చు. ఒక విధంగా అవి అన్ని ట్రంకు పెట్టెలో కదా మూసి వుంటాయి. ప్రతి రోజు వాటిని వేసుకోవలసిన అవసరం ఎవరికి ఉంటుంది. కాసేపట్లో వచ్చి తీసి ఇస్తాను. చదువు మాత్రం కొనసాగుతుంది... "మళ్ళీ వెనక్కి తిరిగి వెళ్ళి పోయింది... మరి ఎప్పుడైనా అని ఉంటె ఆమె మాటలను విని కృతార్థుడనై పోయేవాడిని. నా కళ్ళు చెమర్చేవి, కాని ఇప్పుడు మాత్రం అలా వినేసి ఏమీ ఆలోచించకుండా కూర్చుండిపోయాను."

కింది నుంచి అమ్మ ప్రేమతో వేస్తున్న చివాట్లు వినపడ్డాయి. "నీపై మాకు ఈ మాత్రం అధికారం లేదా. మన్‌హారిణ్, గాజులు వెయ్యి కోడలు పిల్లకు! ఎలాంటి గాజులు వేసుకుంటావో చెప్పు. నీకు ఇష్టం వున్నవి ఏరుకో." అంటె ప్రభ కిందికి చేరిందన్నమాట.

"లేదు, లేదు అత్తయ్య. నాకిష్టం లేదు. అత్తయ్య మీరు పైకి వెళ్ళి కావాలంటె చూసుకోండి. నా దగ్గర పెట్టెనిండా ఉన్నాయి."

"మరికొన్ని వేసుకుంటె ఏమైపోతుంది. అందరి దగ్గర ఉంటాయి. మరి మా పొట్ట ఎలా నిండుతుంది?" గాజులు అమ్మే ఆవిడ అలా అంటూనే గాజులను విప్పుతు గల గల శబ్దంతో చూపించసాగింది. ఆ తర్వాత చెదురు మదురు వాక్యాలు వినపడసాగాయి. "వీటితో ఈ రంగు బాగా నప్పుతుంది... ఈ ఎర్రెర్రని చేతులకు ఇవి ఎంత బాగున్నాయో."

"వేసుకోరాదా ప్రభ, వేషాలు కట్టిపెట్టి అత్తయ్య మాటలు విను." అది వదిన కంఠం.

ఒక్కసారే నిశ్శబ్దం వ్యాపించిపోయింది. ఇంకేమైనా మాటలు వినబడతాయోమోనని నేను నిరీక్షించసాగాను. ప్రభ వేసుకోదని నా నమ్మకం. ఇప్పుడు గాజులు తొడిగించాలనే ధ్యాస వచ్చింది వీళ్ళకు. ఇంతవరకు మరో మనిషి ఉన్నదనే సంగతే పట్టలేదు. నేను కొంచెం వంగి కిందివైపు చూసాను. అమ్మా, వదినా గాజులు వేసుకున్న తర్వాత ఎంతో ప్రసన్నంగా,

ఉత్సుకతతో ప్రభ వైపు చూస్తున్నారు. ప్రభనేమో మోకాళ్ళపైన కూర్చుని ఒక చెయ్యి గాజులావిడవైపు చాపింది. మరో చెయ్యి రెండో కాలి పాదంపై ఆనించి ఉంది. దానికి బోలెడన్ని గాజులు వేసి ఉన్నాయి. కింద అటూ ఇటూ విరిగిన గాజుల ముక్కలు పడి ఉన్నాయి. నొప్పితో ప్రభ తన మెడను మరో వైపు వంచుకున్నది. కళ్ళు మూసుకుని పెదాలు బిగపట్టి 'స్స్' మని మూలుగుతున్నది. రెండో చెయ్యితో ఆ కాలి బొటనవేలిని గట్టిగా పట్టుకుని మడచసాగింది.

వాడైన ఒక బాణం నా మెదడులోంచి దూసుకుపోయినట్టు అనిపించింది. "నేను వేసుకోవద్దు అని చెప్పినప్పటికి కూడా... హూఁ" నా ముక్కుపుటాలలోంచి బుసకొట్టి నేను ఒక్క ఉదుటున లేచి నిలుచున్నాను. పళ్ళు బిగపట్టి పెదాలు ముడుచుకున్నాను. దృఢంగా అడుగులు వేసుకుంటూ, కిందికి వెళ్ళిపోయి తిన్నగా గాజులావిడ దగ్గర నిలుచున్నాను.

ప్రభ గాజులు వేసేసుకున్నది. ధగధగలుగా రంగులతో రెండు చేతులపై గాజులు మెరుస్తున్నాయి. ఆమె నన్ను చూడగానే కరెంటు దెబ్బ తగిలినట్టు మొహమంతా పాలిపోయింది. ఏదో విధంగా సంభాళించుకుని బలవంతంగా నవ్వే ప్రయత్నం చేస్తూ "ఎలా ఉన్నాయో చూడండి. అత్తయ్య, అక్కయ్య ఇష్టంతో వేయించినవి." అప్పుడు ఆమె అమ్మా, వదిన ముందు నాతో ఎప్పుడూ మాట్లాడదనే విషయాన్ని మరిచిపోయింది.

నేను ఒక్క క్షణం ఆమె వైపు తీక్షణంగా, మరీ కోపంగా చూసాను. వెంటనే వంగి ఆమె రెండు చేతుల్ని పైకెత్తి పట్టుకున్నాను. భయంతో ప్రభ ఏం చేయాలో తోచక వణికిపోతున్నది. ఆ సమయాన నా చేతుల్లోకి ఏ రాక్షస శక్తి ప్రవేశించిందో నాకు తెలియదు. కసికొద్ది ఆమె రెండు చేతులను పరస్పరం ఢీ కొట్టి నా పిడికిళ్ళు బిగించి గాజులను ముక్కలుముక్కలు చేసాను. పటపటమని గాజులన్ని పగిలి నేలపై చెదిరిపోయినాయి. నేనేమో పిచ్చివాడిలా ముఖాన్ని పైకెత్తి గొంతు చించుకుని భీకరంగా అట్టహాసం చేసాను. ఏదో పురుగును పట్టుకుని నలిపి పారేసినట్టు ఆమె చేతుల్ని వదిలివేసాను. విరిగిన గాజుల ముక్కలన్ని నా అరచేతుల్లోకి, వేళ్ళలోకి దిగిపోయి రక్తం కారసాగింది. ప్రభ చేతుల్లోంచి రక్తం బొట్లు పడుతున్నాయి. ఆ కారుతున్న రక్తాన్ని చూసి నేను మరింత పెద్దగా నవ్వాను. ఆ తర్వాత అటూ ఇటూ చూడకుండా నిశ్చింతగా చేతులు ఊపుకుంటూ మిద్దె మీదికి వెళ్ళి

పోయాను.

గాజులావిడ, అమ్మా, వదినా అందరూ అలా కళ్ళప్పగించి చూస్తూ ఉండిపోయారు. వెనక్కి తిరిగి చూడకుండానే నేను ఆ విషయాన్ని గమనించాను.

నేనే ఏమైనా చెబుతానేమోనని నాన్నగారు అలా చాలాసేపు ఎదురు చూసారు. ఆఖరుకి ఇక లాభం లేదనుకుని ఆయనే రాత్రిపూట అడిగారు. "ఏరా సమర్, నువ్వు పది తారీఖునుంచే కదా పని చేయడం మొదలు పెట్టావు."

నేను నిర్లక్ష్యంగానే సమాధానమిచ్చాను. "నాన్నగారు నా ఉద్యోగం ఊడిపోయింది."

"అరే, ఆయన నిన్ను ఏమైనా ఇవ్వమని అడుగుతున్నారా, నీ ఉద్యోగం పోయిన సంగతి చెబుతావేమిటి?" అమ్మ జోక్యం చేసుకుని అన్నది.

నేను ఆవేశంగానే జవాబిచ్చాను. "స్పష్టంగా ఇవ్వమని అడగడం లేదు. కాని దాని అంతరార్థం ఏమిటో నాకు బాగా తెలుసు."

ఈసారి నాన్నగారు ఒక్కసారే రెచ్చిపోయారు. అలా గాలిలో చేతులు ఊపుతూ అన్నారు. "తెలిస్తే ఏం ఉరికంబం ఎక్కిస్తావా, మహా తెలుసట ఒక మాట అడిగానో లేదో తిన్నగా జవాబివ్వకుండా కరవడానికి వస్తున్నాడు. దారిలో ఉన్న కంపను చుట్టుకోవడం అంటే ఇదేనన్నమాట." తన నుదురును చేయితో కొట్టుకుంటు అన్నారు "నువ్వు ఏమిటో నాకు బాగా తెలుసురా కొడకా, మా చేతుల్లో పెరిగిన వాడివి సూటిగా అడిగే సరికి బెదిరిస్తావా? ఎన్ని దమ్ములో చూడు కుర్రాడికి. అరే, మేము మొదటి జీతాన్ని తీసుకు వచ్చి నాన్నగారికి ఇచ్చాము. ఆ పద్ధతి మర్యాదలు అన్ని ఏట్లో కొట్టుకు పోయాయి. పైగా సూటిగా అడగకూడదా అని బెదిరింపు ఒకటి. పనికిరాని వెధవ నిన్ను పెంచి పోషించి చదువు చెప్పించింది మా పరువు ప్రతిష్ఠను మంటగలపడానికా. అడిగితే కొట్టొచ్చేట్టు మాట్లాడుతావా. స్పష్టంగా మాట్లా డితేనేమో పిచ్చి కుక్కలాగా మొరుగుతావా."

నేను దుఃఖంతో నిగ్రహంగానే అడిగాను. "నాన్నగారు ఇంతకూ నేను ఏమన్నానని అంతగా విరుచుకు పడుతున్నారు."

"నువ్వు నాకు నీతులు చెబుతావా రాజకుమారా, మేము గుడ్డివాళ్ళమా, మాకు కనపడదా? కాస్త చదువు సంధ్యలు వచ్చాయి. పెళ్ళి చేసుకు న్నావు. ఇక తల్లితండ్రులు ఎందుకు. వాళ్ళు బొందలగడ్డకి, పొయ్యిలోకి,

ఏట్లోకి పోతే పీడా పోతుంది. నువ్వు మాత్రం నీ మత్తులో హాయిగా ఉండు బిడ్డా." అలా ఆయన అరుస్తూనే ఉండిపోయారు.

"అది కాదు నాన్న. మొదలే నేను పెళ్ళి వద్దన్నానా, అసలు మీరంతా బలవంతం చేసి..."

ఆ గొడవంతా విని ఇంట్లోని వాళ్ళంతా గుమికూడారు. భయపడుతూ ఒక మూల ఒదిగి అందరూ చూస్తున్నారు.

"పెళ్ళి... పెళ్ళి... పెళ్ళి" ఏం అనాలో తోచక నాన్నగారు ఎంతో ద్వేషంతో ఆ మాటల్నే అంటున్నారు. ఉద్రేకం వల్ల ఆయన వణికిపోతు న్నారు.

"నువ్వు ఇలా తయారు అవుతావని తెలిసి ఉంటె నువ్వు పుట్టగానే గొయ్యి తవ్వి పాతిపెట్టేసే వాళ్ళం. మీరు ఏమి ఉద్ధరించారని. చదివించి ఏనుగులా పెంచితే చివరికి మా రొమ్ములనె తొక్కుతావా. అవును కొడకా, ఇదేగా రీతీ, రివాజు. పూర్వీకుల పేరు మహా నిలబెడుతున్నావ్. ఇప్పుడిక రెక్కలు మొలిచాయి కదా. ఇంట్లో ఇప్పుడు ఇంకేం మిగిలిందని. అంతా మనిష్టం. ఇతరులు మొరిగితే మొరగనివ్వు. కుక్కలు మరి, తమంతట తామే నోరు మూసుకుంటాయ్ అలసిపోయి చివరికి.... "పొద్దున గాజులు వేయిస్తే దొరగారు వెళ్ళి వాటిని పగులగొట్టారు... ఇప్పుడు ఈ ఇంట్లో నీపై నీ భార్యపై హక్కు అసలు ఉన్నదా? నువ్వు సరాసరిన దేవుడి నోట్లోంచి ఊడిపడిన వాడివి. మేము నీ నోటికి ఎందుకు తగలాలని అనుకున్నాము. కుర్రాడు బుద్ధి మంతుడు అన్ని విషయాలు అర్థం చేసుకుంటాడని మేము ఆశిస్తే హాయిగా మంచి తిండి దొరుకుతుంటె ఇంటివాళ్ళ గురించి ఎందుకు ఆలోచిస్తావు. తమ చదువూ, తమకు కావలసిన బట్టలు భార్య అలంకరించుకోవడానికి కావలసినవి... ఇవన్నీ దొరుకుతుంటె ఇంకేముంది. ఎవ్వరో ఒకరు చెప్పనం తవరకు ఇలా తలకు ఎక్కి కూర్చుంటారు."

చివరికి ఉండబట్టలేక నేను అడిగాను. "నాన్నగారు, నేను నా భార్య కోసం తీసుకువచ్చిన అలంకార సామాగ్రి ఏమిటో చెబుతారా?"

"మళ్ళీ పైగా బదులు చెబుతావా, ఇంకా బదులు చెబుతావా?" నాన్న గారు కోపం పట్టలేక తడబడుతున్నారు. అకస్మాత్తుగా ఆ కోపంతో వణుకుతూ నా మీద విరుచుకుపడ్డారు. ఇంతలో అన్నయ్య, అమర్ వచ్చి ఆయనను అడ్డుకోసాగారు. నేను సంభాళించుకునే లోగానే ఆయన నన్ను తన్నుతూ,

గుద్దుతూ చెంపలు వాయిస్తూ... అలా వణికిపోతూ నన్ను కొడుతూనే, "తీసుకోరా, తీసుకోరా మళ్ళీ బదులు చెప్పు, మళ్ళీ బదులు చెప్పు చూస్తాను. ముసలివాడిని అయిపోయానను కుంటున్నావేమో. ఇప్పటికీ నిన్ను దారిలో పెట్టగలనురా. నువ్వు ఎంత చెయ్యి జారిపోయినప్పటికీ..." నేను అక్కడే అలా నిశ్శబ్దంగా కూర్చుని తన్నులు తింటూనే ఉన్నాను. కోపాన్ని అణచుకుంటు మసలిపోతున్నాను. ఒక్కమాట కూడా నా నోటితో మాట్లాడలేదు. అందువల్లనే కాబోలు నా ఈ మౌనం ఆయన కోపానికి ఆజ్యం పోసినట్టు అయ్యింది... నేను ఏ మాత్రం ఏడవలేదు, నన్ను నేను తప్పించుకునే ప్రయత్నమూ చేయలేదు. అటు నాన్నగారిని ఆపాలని ప్రయత్నిస్తున్న అన్నయ్య, అమర్ కూడా స్వయంగా భయంతో బాగా వణికిపోతున్నారు.

"వెళ్ళిపో నా ఇంట్లో నుంచి, వెళ్ళు! తొలగిపో నా కళ్ళ ఎదుట నుంచి వెళ్ళిపో... వెళ్ళి... ఎక్కడైనా బావిలో లేదా ఏట్లోనన్న పడి చావు. పనికిరాని వెధవ. నాకు మొదటినుంచే తెలుసు నీ వేషాలన్ని. ఇప్పుడు పైగా చదువుతున్నావాయే మరి..."

"ఇక ఊరుకోండి నాన్నగారు, శాంతించండి" అన్నయ్య నచ్చజెబుతూ అన్నారు. వాళ్ళు ఆయన్ని రెండు వైపులా పట్టుకుని మరోవైపు లాగుతున్నారు. కోపంతో ఆవేశం వల్ల ఆయన నోట్లోంచి నురుగలు రాసాగాయి. కళ్ళు బాగా చించుకుని, నోట్లోంచి తిట్లవాన కురుస్తూనే ఉంది. ఆడవాళ్ళందరు వస్తున్న ఏడుపును ఆపుకుంటు గుసగుసలాడుతున్నారు. "ఏమైంది ఇంతకూ?" ఒకరిద్దరు పొరుగువాళ్ళు కూడా వచ్చి నిలుచున్నారు.

"సరే నాన్నగారు ఇక నేను తప్పకుండా వెళ్ళిపోతాను" నేను దించిన తల పైకెత్తుతు భారంగానే అన్నాను.

ఆ మాట వినగానే ఆయన వాళ్ళను విదిలించుకుని నాపై మళ్ళీ విరుచుకుపడ్డారు. "ఇదంతా నాకు ముందే తెలుసురా... ఇదంతా కనపడుతూనే వచ్చిందిరా. ఒక అమ్మా, నాన్నకు పుట్టినవాడివి అయితే ఇప్పుడే వెళ్ళిపో. ఇప్పుడే వెంటనే కదులు నువ్వు ఎట్లానైనా పొయ్యేవాడివే కదా. రా నీకు దారి చూపిస్తాను... బయటికి పంపించేసేయండి. వీడి సామాను బయట పడేయండి. ఇద్దరికి వీడ్కోలు చెప్పండి. మాకు ఇక నుంచి వీళ్ళతో సంబంధం లేదు. మాకు ఏమీ కారు. పుట్టగానే చచ్చిపోయారని అనుకుంటాను. ఊఁ లేపండి బయటికి వెళ్ళండి. మీ సామానంతా సర్దుకోండి. మీ ఠికానా వెతు

క్కోండి... మీకు చేతులు జోడిస్తాను." అంటూ నాన్నగారు పెద్దగా తన అర చేతుల్ని కొట్టి జోడించారు. ఆ తర్వాత నా భుజం పట్టుకుని బలంగా ఊపుతూ అన్నారు "వెళ్ళండి దొరగారు, వెళ్ళండి, దయచేయండి. మా దగ్గర మీ కోసం ఎలాంటి స్థానమూ లేదు. మళ్ళీ ఈ ఇంట్లో అడుగుపెట్టావో ఖబర్దార్. మళ్ళీ వచ్చావో నా అంత చెడ్డవాడు మరొకడు వుండడు. ఎక్కడికి చస్తారో చావండి. రోడ్లపై పడండి... దున్నపోతుల్లా మేపడం మాకు వశంకాదు." ఈలోగా అన్నయ్య మిగతావాళ్ళు వచ్చి ఆయన్ని పట్టుకుని సముదాయిస్తు శాంతింపజేస్తూ మరోవైపు తీసుకు వెళుతున్నారు.

ఆడవాళ్ళందరూ నన్ను ఛీత్కారంతో చూస్తున్నారు. అమ్మ కోపంతో వచ్చి లాగి రెండు చెంప దెబ్బలు కొట్టింది. "నువ్వు నోరు మూసుకోరా సమర్, ఖబర్దార్ మళ్ళీ నోరు తెరిచావంటె. నాన్న ఎదుట నిలుచుని మాటకు మాట బదులు చెబుతావా? సిగ్గులేదు?"

ఇక నేను ఎవ్వరి మాటా వినకుండా తీవ్రంగా గర్జిస్తూ అన్నాను. "ఇక చాలు అమ్మా, స్పష్టంగానే వినాలనుకున్నాను. ఈ రోజు అన్నీ వినేసాను. ఈ నరకంలో ఉండాలని నాకేమీ లేదు. ఒక రాత్రి సుఖమా, పగటిపూటా శాంతి ఉన్నదా, అంతా ప్రయోజనం కోసం ఉన్న తల్లితండ్రులే. ఎక్కడైన ఉంటాను. బావిలో, ఏట్లో ఎందులోనైనా పడతాను. మళ్ళీ రేపు ఇక్కడ అడు గుపెడతానా. మీ రాజ్యమేదో మీరే ఏలుకోండి." అలా ఉద్రేకంతో, కోపంతో మనస్సులోని మాట అన్నానే కాని ఏదో - అనరాని ఘోరమైన మాట అనే సానని అనిపించింది. నాన్నగారితో అలా మాట్లాడవలసింది కాదు. మరొక విచిత్రమైన విషయం, ఈ సందర్భంలో నాకు అనిపించింది. రాముడు, సీత కూడా ఇలానే కొట్లాడి, తగాదాపడి ఇల్లు వదిలిపోలేదు కదా? ఈ మాట తట్ట గానే నాకు లోలోపల నవ్వు వచ్చింది.

నేను అమ్మతో అన్నమాట వినగానే నాన్నగారు మళ్ళీ వెనక్కి తిరగా లని ప్రయత్నించారు. కాని ఎవ్వరూ ఆయన్ని వదలలేదు. అందరూ కలిసి ఆయనను బయటి గదిలోకి తీసుకువెళ్ళిపోయారు. ఆ క్షణాన్నే నా మన సులో ప్రమాణం చేసుకున్నాను. పేవ్‌మెంటుపైన ఉంటాను. మురుయ్యలో, గొయ్యిలో, రోడ్డుపై ఎక్కడైనా ఉంటాను కాని ఇక్కడ మాత్రం ఉండను. ఇంకెక్కడైనా సరే మరెక్కడైనా సరే... పైన ఆకాశం కింద నేల, కాని ఈ నరకంలో మాత్రం ఇక నుండి వుండేది లేదు. బిచ్చమెత్తుకుంటాను, దొంగ

తనం చేస్తాను... ఈ లోకం చాలా విశాలమైనది...

ఇంటిల్లిపాది ఏక కంఠంతో నన్ను ఖండిస్తున్నారు. నా మూర్ఖత్వాన్ని చూసి తిడుతున్నారు. కాసేపటికి ఏడుపులు, అరుపులు అన్ని ఆగిపోయాయి... నేనేమో నిశ్శబ్దంగా మోకాళ్ళ మధ్య తల దూర్చుకుని అలా మౌనంగా కూర్చుండిపోయాను... మెదడులో ఒకే ఒక మాట మార్మోగుతున్నది. ఇక్కడ కాదు, ఇక్కడ కాదు ప్రపంచంలో మరో మూల... ఈ ధరిత్రికి చివర మరెక్కడైనా... ఇంకెక్కడైనా... ఒకే ఒక చిత్రం అలా మెరుస్తున్నది. అలా ముందుకే ఇనుప ట్రంకు పెట్టె మోసుకుంటు నేను వెడుతున్నాను. నా వెనకాలె ఒదిగి నడుస్తున్న ప్రభ... మరి బహుశా ఆమె వెనకాలే ఆపే ప్రయత్నంలో కుంవర్ (లక్ష్మణుడా!)...?

ఇనుపకడ్డీలపై కాలుతున్న కబాబులా నేను రాత్రీ, పగలు నిప్పులపై కాలుతూనే ఉన్నాను. విచిత్రమైన ఆలోచనలన్ని తొలచి వేస్తున్నాయి. ఒక్క నిముషం కూడ కన్ను మూతపడలేదు. కాని ఒక జడత్వం లేదా ఒక నిద్రావస్థ నన్ను ఆవరించాయి. నేను జాగృతి, సుషుప్తి మధ్య వేలాడుతున్నాను. నా గుండె స్థానంలో ఎవరో ఒక రాయి పెట్టినట్టు దాని బరువుతో నా శ్వాస ఆగిపోతున్నట్టు అనిపిస్తున్నది. గుండె జబ్బు ఎలా ఉంటుందో తెలియదు. కాని ఇప్పుడు నా హార్ట్ ఫెయిల్ అవుతుందేమోనని భయంగా ఉన్నది. శరీరమంతా చలనం లేకుండా ఏదో ఒక గుహలో బంధించబడిన మమ్మీలా ఉంది. ఏదో ఒక ఎంద్రకాయలాంటి వస్తువు తన వాడి ముళ్ళతో నన్ను పొడుస్తున్నట్టు నా తలలో తన మూతిని చొప్పించి బొట్టు బొట్టుస రక్తాన్ని పీలుస్తున్నట్టు ఎంతో బాధగా ఉంది. అలా తల్లడిల్లుతూ ఏడుస్తున్నప్పటికి దాని నిప్పుల్లాంటి కళ్ళ సమ్మోహన శక్తి నన్ను ఆకట్టుకుంటున్నది. క్రమంగా నన్ను తింటూనే ఉన్నది. ఒక విచిత్రమైన నా మానసిక స్తబ్ధతలో బొయ్యిమంటున్న ఒక అరుపు, అలాగే నన్ను నీటి ఉపరితలంపై పడుకోబెట్టి నా రొమ్ముపై కాలితో తొక్కుతూ ఉంటె నేను మునిగిపోతున్నట్టు అనిపిస్తున్నది. రాత్రంతా వాన కురుస్తున్నట్టు అనిపించి ప్రతిసారి ఉలిక్కిపడిలేచి వాన ఆగిపోతుందేమోనన్నట్టు కూర్చునేవాణ్ణి.

హఠాత్తుగా ఎవరో నన్ను తాకగానే నేను గాభరాపడి లేచి కూర్చున్నాను. నన్ను అలా తాకగానే, నేను ఆ వ్యక్తి సైగలవెంట వెనకాలే నడుస్తూ పోతానేమోనని అనిపించింది. ఎంతో కష్టం మీద కళ్ళు తెరచి ఎవరా అని

చూసాను. మణికట్టుకు పట్టీలు కట్టుకున్న చేతులతో భయపడుతూ, సంకో చిస్తు ప్రభ నన్ను తాకి మేల్కొలుపుతున్నది. "నాలుగు అయిపోయింది... ఈ రోజు వెళ్ళరా?"

అప్పుడు జ్ఞాపకం వచ్చింది. రాత్రంతా ప్రభ నా నుదుటిని నొక్కుతూ ఏదో మలాము పూస్తూ ఉన్న సంగతి. నేను వెంటనే లేచి కూర్చున్నాను. ముఖం కాళ్ళూ, చేతులు కడుక్కుంటూ ఉండగా ఈ రోజు అంతా ఇలా విచి త్రంగా ఉందేమిటని ఆలోచించాను. ఎవరో నన్ను మంత్రించి బంధించి వేసి నట్టు నా పనులన్ని చేసుకవెడుతున్నాను, నా ఇష్టానికి వ్యతిరేకంగా అన్నీ జరిగిపోతున్నాయి. ఈ కాళ్ళూ, చేతులు నావి కాదు అని ఎందుకనిపిస్తు న్నది... నేనేమో ఎంతో దూరం... చాలా దూరం ఒక ఎత్తైన స్థలానికి వెళ్ళి పోయినట్టు, అక్కడినుంచి వస్తువులన్ని మసకమసకగా, అస్పష్టంగా, అవా స్తవికంగా కనపడుతున్నాయని అనిపించింది. ఎవ్వరి పిలుపూ వినపడడం లేదు. ముఖం కడుక్కుంటు, కడుక్కుంటు అకస్మాత్తుగా నేను వెనక్కి తిరిగి అడిగాను. నిన్న రాత్రి వర్షం వచ్చిందా?

కింద వరండాలో మేమిద్దరం మాత్రమే ఉన్నట్టున్నాం. ప్రభ పొయ్యి ముట్టిస్తూ ఏదో సర్దుతున్నది. నిప్పుల్ని రాజేస్తూ ఆగి తానే అడిగింది మళ్ళీ "వర్షమా? ఎక్కడ పడింది వాన" ఆమె ఈ మాట వినగానే నాకు వెంటనే నిన్నటి విషయం జ్ఞాపకం వచ్చింది. అవును నేను ఈ రోజు ఈ ఇల్లు వది లేయాలి. ఈ ఇంటితో నాకు ఎలాంటి మోహబంధం లేదు. నేను ఇల్లు వెతు క్కోవాలి - మరెక్కడైనా - ఎంత కష్టమైనాసరే!

ప్రభ ఒక చిన్న అల్యూమినియం గిన్నెలో అన్నం పెట్టి టిఫిన్ కట్టేసి మంచంపైన పెట్టింది. అలవాటు ప్రకారం నేను దానిని తీసి జేబులో కుక్కు కున్నాను. కోటు వేసుకుంటూ ఉండగా మొదటిసారి నా అరచేతులు నొప్పి పెట్టసాగాయి - నిన్న గుచ్చుకున్న గాజు ముక్కల మూలంగా ఈ నొప్పి అనుకుంటా.

దీపం ఆర్పేసి ఒక్కొక్క అడుగే వేస్తూ కిందికి వచ్చేసాను. ఈ రోజు నా కాళ్ళు ఎందుకో వణుకుతున్నాయి - బూట్ల చప్పుడు కూడా కొంచెం విచిత్రంగానే ఉంది. కింది మెట్టుపైకి వచ్చి వెనక్కి చూసాను. నేను దిగు తుండగా ప్రభ చూస్తున్నదేమోనని అనుకున్నాను. కాని అక్కడ ఎవరూ లేరు. అప్పటికి అందరూ పడుకునే ఉన్నారు.

అప్పుడే బయట ఎవరో గొళ్ళెం కొట్టసాగారు. ఆ చప్పుడు వినగానే ఒక్క ఉదుటున ముందుకు అడుగు వేస్తున్న వాణ్ణి ఆగిపోయాను. నేనేదో హంతకుడిని అయినట్లు బయట పోలీసులు వచ్చి నిలుచున్నట్టు అనిపించింది. ఒక నిముషం ఏమి చేయాలో తోచలేదు. గాభరాగా నలువైపులా చూస్తూ అసలు తలుపులు తెరవాలా తెరవకూడదా అని అనుకున్నాను. ఆ తర్వాత తల వెనుక భాగాన్ని గోక్కుంటూ ముందుకు నడిచాను.

గొళ్ళెం కొడుతూ వెంటనే పెద్దగా కేక వినపడింది. "టెలిగ్రాం తీసుకోండి."

తలుపు తెరిచి చూడగానే ఎదురుగా ఎర్రరంగు సైకిల్ ఖాకీ యూనిఫాం వేసుకున్న వ్యక్తి చేతిలో టెలిగ్రాంతో... సంతకం పెట్టి ఆ టెలిగ్రాం తీసుకున్నాను. అతను సైకిల్ ఎక్కి వెడుతుండగా చూస్తూ నిలుచున్నాను. టెలిగ్రాం పైన నాన్నగారి పేరు ఉంది.

అప్పుడప్పుడే మసక వెలుతురు వ్యాపిస్తున్నది. టెలిగ్రాం కాగితాన్ని అటూ ఇటూ తిప్పి చూసిన తర్వాత అలానే లోపల అందచేయాలని అనుకున్నాను. మళ్ళీ ఏదో ఆలోచన వచ్చి స్థిరమైన చేతులతోనే కవర్ చించాను. గులాబీ రంగు కాగితంపై టైపు చేసిన చిన్న ముక్క అతికించబడి వుంది - "మున్నీ ఎక్స్‌పైర్డ్" (మున్నీ చనిపోయింది).

ఒకసారి చదివాను, రెండోసారి చదివాను, అయినా ఆ మాత్రం వాక్యానికి అర్థం ఏమిటో నాకు బోధపడలేదు. టెలిగ్రాం అనే కేక వినగానే అన్నయ్య, నాన్నగారు గాభరాగా లేచి కిందికి దిగి వచ్చేసారు. "ఎక్కడి నుంచి వచ్చింది. ఏం రాసి వుంది."

నేను ఎంతో అసహజంగా మెల్లిగా నవ్వి టెలిగ్రాం వాళ్ళ ముందుకు చాచి అన్నాను, "మున్నీ చనిపోయిందని రాసి ఉంది. ఆమెను చంపేసారని స్పష్టంగా లేదు."

ఆ టెలిగ్రాంకి ప్రతిస్పందన వాళ్ళపై ఎలా ఉందో గమనించకుండానే నేను బయటికి నడిచాను... స్పృహ తప్పిన వాడిలా అచేతనంగా. బహుశా ఇంటిల్లిపాది ఏడ్చి గుండెలు బాదుకుని ఉంటారు... ప్లాట్‌ఫాం ఎటువైపు వస్తుందో నాకు తెలుసు అయినా మరోవైపు సీట్లో కూర్చున్నాను. ట్రైయిన్ నడుస్తూనే ఉంది. నేను కిటికీలోంచి తల బయటికి పెట్టి అలా కళ్ళు తెరచి అప్పుడప్పుడే వ్యాపిస్తున్న పొద్దుటి వెలుగును చూస్తున్నాను - ఈ రోజు చాలా విచిత్రంగా ఉదయం అవుతున్నది.

నా మస్తిష్కంలో చీకటి వ్యాపించి ఉంది. ఎలక్ట్రిక్ స్టేషన్‌లో ఫ్యూజు ఎగిరిపోగానే అన్నీ ఆగిపోయి ఒక భయంకరమైన స్తబ్ధతలో మునిగిపోయి నట్లు నాలో కూడా స్తబ్ధత. ఆ క్షణంలో ఒకే ఒక చప్పుడు రైలు చక్రాల ధ్వని నా మెదడులో మారుమ్రోగుతూ, నరాలపై సుత్తిదెబ్బలు పడుతున్నట్టు చెవుల్లో పెండ్యూలం కొట్టుకుంటున్నట్టు - మున్నీ చనిపోయింది, మున్నీ చనిపో యింది, మున్నీని చంపేసారు, మున్నీని చంపేసారు.

ఒక భారీ శిథిలమైన గుమ్మటంలాంటి గబ్బిలం రెక్కతో చాచి కొట్ట గానే భయం పుట్టించే చప్పుడు మారుమ్రోగి, దాని ధ్వని, ప్రతిధ్వనులు ఆ స్తబ్ధత అలలుగా మారి ఒకదానిపై మరొకటి పొంగి పొర్లుతూ వాతావరణ మంతా వ్యాపించినట్టు... మళ్ళీ ఆ తర్వాత ప్రతీది మృత్యు స్తబ్ధతలో ముని గిపోతున్నది. మళ్ళీ అఖండమైన, అభేద్యమైన అంధకారం.

ఈ రోజు ఏమై పోయింది నాకు. నా నొసటిపై నేనే అరచేతితో రుద్దు కుని కాసేపు కొట్టాను.

అప్పుడే హఠాత్తుగా ట్రెయిన్ ఒక్క ఉదుటున ఆగిపోయింది. అటువైపు స్టేషన్ వచ్చేసింది. నేను ఇక్కడే దిగిపోవాలి, నేను ప్లాట్‌ఫాంపై దృష్టిసా రించి అలానే కూర్చున్న చోటనే కిటికీలోంచి నావైపు వున్న ప్లాట్‌ఫాంను చూస్తూ ఉండగా మధ్యలో మెరుస్తున్న మూడు రైలుపట్టాలు కనపడ సాగాయి. వాటిని దాటితేనే అటువైపు ప్లాట్‌ఫాం వస్తుంది. అప్పుడు చీకటి ఏమీ లేదు. కాని స్టేషన్‌లో మాత్రం లైట్లు వెలుగుతూనే ఉన్నాయి. ఎదురుగా ప్లాట్ ఫాంకు మరో చివర పనివాళ్ళు ఊడుస్తున్నారు. దుమ్ము గోళాకారంగా లేచి నలువైపులా వ్యాపించింది. ఊడుస్తున్న వాళ్ళు మూతిపై బట్ట కట్టుకు న్నారు. నేను దిగనవసరం లేదన్నట్టు అక్కడే కూర్చున్నాను. అప్పుడే రైలు కూత వినపడగానే ఇక్కడే దిగాలని హఠాత్తుగా స్ఫురణకు వచ్చింది. గభా లున తలుపు తెరిచి ఇటువైపు పట్టాలపై దిగిపోయాను.

ఆ ఖాళీ పట్టాలపై కాలు పెట్టగానే అటువైపు చూసాను. అవే పట్టా లపై మరో దిశ నుంచి, బహుశా ఢిల్లీ ట్రెయిన్ ఏమో వచ్చేస్తున్నది. దూరంగా ఉన్న రోడ్డు వంతెన కిందుగా ఒక పెద్ద ఇంజను ప్రతిక్షణం దగ్గరగా వచ్చే స్తున్నది - గుప్పు గుప్పున ఇంజన్ పొగ వదలగానే ఇనుపరైలు పట్టాలు కణకణమని కంపిస్తున్నాయి. భయంకరమైన దైత్యుడిలా అది దొర్లుతూ వచ్చే స్తూనే ఉంది.

వెంటనే నా లోపలి నుంచి ఒక భావం దూసుకొచ్చింది. ఒకవేళ నేను ఆ వస్తున్న ఇంజను ముందు పడిపోతే? ఆ ప్రశ్న మెదలగానే తుపాకి పట్టుకున్న పోలీసు సూపరెన్టెంటు చిత్రం నా ముందు మెరిసింది... ఎదురుగా గుర్రం వుంది... జీవితంలోని బాధలన్నింటికి విముక్తి ఇక్కడే... అప్పుడు నాకు అనిపించింది. ఒక అజ్ఞాత విద్యుత్ ఘాతంతో నేను ఇంజన్ ఎదుట పడిపోయాను, ఆ పట్టాలపై పడిపోయే ముందు క్షణంలోని అవిభాజ్యమైన ఖండంలో ఉన్న చైతన్యంపై పరుచుకున్న పొర సొంతం సాలిగూడులా మసకమసగ్గా - అకస్మాత్తుగా విచ్చుకోగానే కల చెదిరిపోగానే నేను మేల్కొన్నాను... నేను ఏమిటి ఇలా చేసాను? కాని అప్పటికె మంచులాంటి చల్లని పట్టాలకు అతుక్కుపోయాను. దూసుకువస్తున్న ఇంజన్ రెక్కలు నన్ను తాకుతున్నాయి... నేను పళ్ళు బిగపట్టి ఆ రెక్కల్ని పట్టుకున్నాను... ప్రభ అమాయకమైన మొహం నా కళ్ళ ఎదుట ఆడుతున్నది. కాని నేను ఇంజన్ కదలికతో పాటు కింద రాసుకుంటూ వెడుతున్నాను... ఒక క్షణం... రెండు క్షణాలు... నా చేతుల్లోని బలం నశించింది. నా పట్టు సడలింది. నేనేమో శక్తి కొద్ది అరవాలను కుంటున్నాను. 'ప్రభా...' నా తెరిచిన ముఖంపై నుంచి ధనధనమని ఇంజన్ భారీ చక్రాలు తిరుగుతూ వెళ్ళిపోయాయి.

అంతసేపు అలా ఊహించుకున్నదంతా ఒక సజీవమైన చిత్రంలా నా ఎదుటికి రాగానే, నిజంగానే నేను అది చేసేస్తానేమోనని అనిపించింది. కాని నేను నా కాళ్ళను పట్టాలపై నుంచి జరుపుకున్నాను. అప్పుడే రైలుబండి ముందుకు వచ్చి నిలుచున్నది. నా ఎదుట రెండు డబ్బాలు జోడించే చోటు ఖాళీగా ఉంది, రెండు డబ్బాలను షంటింగ్ చేయడానికి గాను ఉపయోగించే కొన్ని లావాటి తీగలు భారీ ఇనుపదిమ్మలు డబ్బాల మధ్య దూరాన్ని ఉంచడానికి పరస్పరం అల్లుకొని ఉన్నాయి. ఒక లాలాజీ కిటికీలోంచి మొహం బయటపెట్టి పళ్ళు తోముకుంటున్నాడు. నేనేమో ఆ రెండు రైలు బళ్ళ మధ్య ఏవో రెండు గోడల మధ్య నిలుచున్నట్టు ఉండిపోయాను.

అప్పుడే మనసులో ఒక ఆలోచన మెదిలింది - ఇప్పుడే రైలు డబ్బా హ్యాండిల్ పట్టుకుని పెట్టెలోకి వెళ్ళి కూర్చుంటె. మరుక్షణమే నేను బొంబాయిలో దిగి విదేశాలకు వెళ్ళె నౌకలో ఒడ కళాసిగా దుస్తులు వేసుకుని వెళ్ళిపోతున్నట్టు - కాని వెంటనే మళ్ళీ ఆ బొమ్మ మారిపోయి గోచి పెట్టుకుని గడ్డం పెంచుకుని కమండలం చేత బూని సన్యాసిగా మారిపోయినట్టు. ఆ

సన్యాసిగా నేను బాబా కాళీ కమిలి ఆశ్రమంలో కంబళి చుట్టుకుని పడుకు న్నట్టు, రిషికేష్‌లోని ఒక పెద్ద చెట్టు కింద నా కుటీరం ఉన్నట్టు... అప్పటికి ఎంతకాలం గడిచిపోతుందో ఏమో, అప్పుడు విధవ వేషంలో ఒక స్త్రీ ఒక ముసలావిడతో పాటు వచ్చి నిలుచుని వున్నట్టు... కాదు, నేను అక్కడి నదీ తీరాన స్నానం చేస్తూ ఉండగా ఒక స్త్రీని చూస్తాను. 'అరే ఈవిడ ప్రభ....' నేను ప్రభను గుర్తిస్తాను. కాని నన్ను మాత్రం ఆమె నా గడ్డం, లావాటి దుప్పటి మూలంగా గుర్తించలేదు... మళ్ళీ మరో దృశ్యం... జనం నన్ను చెప్పులతోను, లాఠీలతోను బాదుతున్నారు - స్నానం చేస్తున్న ఒక యవ్వ నవతి దగ్గరికి వెళ్ళి ఆమెను ప్రభ - ప్రభ అనే పేరుతో పిలుస్తున్నాను...

మళ్ళీ వెంటనే ఆ దృశ్యాలన్నీ కలగాపులగమైపోయి ఒక పెద్ద చిత్రం లోకి మారిపోతున్నాయి. వార్తా పత్రికలో నా ఫొటో అచ్చు వేసారు. "ప్రియ మైన కుమారా సమర్, మీ అమ్మ ఆరోగ్యం బాగా క్షీణించిపోయింది. నిన్ను ఒకసారి చూడాలనుకుంటున్నది."

ఎదురుగా ఉన్న రైలు కూతవేయగానే ఉలిక్కిపడి నా నిద్రావస్థలోంచి మేల్కొన్నాను. - ఎదుట ఉన్న ఇంజన్ చక్రం మెల్లిమెల్లిగా కదులుతున్నది. ఒకవేళ ఈ రెండు డబ్బాల మధ్య ఉన్న ఖాళీలోకి అకస్మాత్తుగా దూకే స్తేనో? లేదా గభాలున హ్యాండిల్ పట్టుకుని డబ్బాలోకి ఎక్కేస్తేనో?

అప్పుడే నా వెనక ఉన్న ట్రెయిన్ కూడా కదలసాగింది - రెండు రైలు బళ్ళు వ్యతిరేక దిశల్లో కదలిపోతున్నాయి. నేనేమో తీవ్రంగా చక్కర్లు కొడుతూ అలానే నిలుచుండిపోయాను... లోపల ఎవరో అస్తమానం అరుస్తున్నారు. దూకెయ్...! ఎక్కేయ్...! దూకేయ్...! ఎక్కేయ్...! గాభరాగా నేను పైకి చూశాను...! ఆకాశం సొంతం గిర గిర తిరుగుతూ ఉన్నట్టుంది!

(సమాప్తం!)

Laserset at Printofast. 114 Old Rajinder Nagar. New Delhi - 110060 and printed at J.J. Offset Printers, Wazirpur. Delhi - 110035